సంపుటి 12-సంచిక 9 - హైదరాబాద్
పేజీలు 84-వెల రూ. 30

# పాలపిట్ట

ISSN-2582-7294




మాసపత్రిక
అక్టోబర్ 2021



అసమాన నటుడు ఓంపురి



## మనకాలపు మేటి కథకుడు



పెన్నా 'అశ్రుధార' విశ్లేషణ



దర్భశయనం కవితలు



కోట్ల వనజాత కథ



ఆకెళ్ల మాణిక్యాంబ ఆత్మకథ

PALAPITTA

# పాలపిట్ట

మాసపత్రిక

ISSN 2582-7294

సంపుటి: 12 సంచిక: 9

**అక్టోబర్ 2021**

సంపాదకుడు

**గుడిపాటి**

సహ సంపాదకుడు

**డాక్టర్ రూప్‌కుమార్ డబ్బీకార్**

కవర్ డిజైన్

**వికర్ణ**

రిపోర్టర్

**నరేష్**

**చందా వివరాలు**

ఏడాది చందా: రూ. 350/-

మూడేళ్ళ చందా: రూ. 1000/-

జీవిత చందా: రూ. 5000/-

లేఔట్, డిజైన్: అక్షయ డిజైన్ స్టూడియో

Mobile : 9553371056

ప్రకటనలు, చందాలకు మరియు

(రచనలు, అభిప్రాయాలు పంపవలసిన చిరునామా)

**PALAPITTA**

# Flat No.2, Block 6,

MIG-2, APHB, Baghlingampally,

Opp. Sundaraiah Park Gate,

Hyderabad - 500044, Telangana, India.

Phone : 040 - 2767 8430

E-mail : palapittabooks@gmail.com

**Published at**

H.No.16-11-20/6/1/1,403,

Vijaya Sai Residency, Saleem Nagar,

Malakpet, Hyderabad - 500 036,

Telangana, India

## సంపాదకీయం



# క్రియాశీలత

సరిగ్గా వందేళ్ళ కిందట తెలుగునాట సాహిత్య, సాంస్కృతికోద్యమ నిర్మాణం కోసం వివిధ రూపాల్లో సన్నాహాలు ప్రారంభమయ్యాయి. తెలుగు భాష ఉన్నతికోసం, వ్యాప్తి కోసం ఉద్యమదీప్తితో పనిచేయడానికి అనేక సంఘాలు ఏర్పడుతూ వచ్చాయి. తెలంగాణనేల మీద ఆంధ్ర జనసంఘం, ఆంధ్ర మహాసభల వంటి సంస్థలు తెలుగు భాష కోసమే ఆరంభమై జనసామాన్యంలోకి వెళ్ళాయి. సాహిత్య, సాంస్కృతిక రంగంలో పునాదుల దగ్గర్నుంచి ఆరంభమైన పోరాటాలు ప్రజల్ని సకల పీడనల్నించి విముక్తం చేసే దిశగా కొత్తరూపు దాల్చాయి. వందేళ్ళ తర్వాత ఇవాళ మనం మరల తెలుగు భాష, సాహిత్యం ఉన్నతికోసం ఉద్యమస్ఫూర్తితో పనిచేయాల్సిన అవసరం ఏర్పడిందన్నది వాస్తవం.

మన చదువుల్లో తెలుగు మాధ్యమం క్రమంగా అంతరించిపోయింది. కనీసం డిగ్రీ వరకు ఒక పాఠ్యాంశంగా తెలుగు అమలు చేస్తే చాలనే దశకు తెలుగు భాషాభిమానులు, సాహిత్యాభిమానులు చేరుకున్నారు. ఉపాధి కోసం ఆంగ్లం అనే భావన స్థిరపడింది. ఆంగ్లంలో చదివిన వారందరికీ ఉపాధి వస్తుందా అనే ప్రశ్నకు సమాధానం లేదు. అయినప్పటికీ ఉపాధి కోసం ఆంగ్లచదువులు తప్ప మరో గత్యంతరం లేదని జనసామాన్యం భావిస్తున్నారు. ఈ వాస్తవాల నేపథ్యంలో ఒక భాషగా తెలుగును బతికించుకోడానికి, తెలుగు సాహిత్యం మనగలగడానికి ప్రభుత్వాలు, ప్రజలు, రచయితలు, కవులు, వ్యక్తులు, సంస్థలు ఏదో ఒకటి చేయడానికి మార్గాలు లేకపోలేదు. ఆ దిశగా ప్రయత్నిస్తే సానుకూల ఫలితాలు వస్తాయి.

ఇదివరలో జూనియర్, డిగ్రీ కాలేజీల్లో ప్రతి ఏటా కాలేజీ మ్యాగజైన్లు తీసుకువచ్చేవారు. ఇపుడు వాటి జాడ కనిపించడం లేదు. కొందరు ఉపాధ్యాయులు అక్కడక్కడ చొరవ చూపి పాఠశాలల పిల్లల చేత రాయించి వార్షిక సంచికలు తీసుకు వస్తున్నారు. అలాగే అరుదుగానైనా కొందరు కాలేజీ మాగ్యజైన్లు తీసుకు వస్తున్నారు. కానీ ప్రతి ప్రైవేట్, ప్రభుత్వ హైస్కూలు, జూనియర్ కాలేజీ, డిగ్రీ కాలేజీల నుంచి ఏటా ఒక వార్షికసంచికని తీసుకు రావాలి. దీనిని ఒక విధానంగా ప్రకటించి అమలు చేయాల్సిన బాధ్యత ప్రభుత్వానిది. ఈదిశగా ప్రభుత్వ పెద్దల్ని కదిలించడానికి సాహిత్యసంస్థలు, కవులు, రచయితలు పూనుకోవాలి.

ప్రభుత్వం ఒక విధాన నిర్ణయంగా ప్రకటించే వరకు ఎదురు చూడకుండా ఆయా విద్యాసంస్థలలో పని చేసే కవులు, రచయితలు, భాషాభిమానులు పిల్లల చేత రాయించి వార్షిక సంచికలు వెలువరించాలి. ఈ క్రమాన పిల్లల్లో చదివే అలవాట్లు పెరుగుతాయి. వారి చేత రాయించే పని పెట్టుకోడం వల్ల తెలుగు భాషపై అభిమానం, తెలుగు భాషపై ఒక పట్టు లభించడానికి ఆస్కారం ఏర్పడుతుంది.

విద్యా సంస్థల్లో భాషా సాహిత్యాలకు సంబంధించి వ్యాసరచన పోటీలు, ఉపన్యాస పోటీలు నిర్వహించడం, బహుమతులుగా పుస్తకాలు అందించడం ఉపయుక్తం. ప్రతి పాఠశాలలో లిటరరీ క్లబ్, స్టడీ సర్కిళ్ళు ఏర్పాటు చేయాలి. వీటి ఆధ్వర్యాన నెలకోసారి సమావేశాలు జరపాలి. పిల్లలచేత రాయించాలి. పుస్తక సమీక్షలు చేయించాలి. పుస్తకాల మీద వారితో మాట్లాడించాలి. తద్వారా అధ్యయనం అలవాటుగా మారుతుంది.

ఈరకమైన క్రియాశీలత భాషా సాహిత్యాల ఉన్నతికి మాత్రమే కాదు, సమాజంలో మానవీయ సంస్కృతి పాదుకోడానికి దారితీస్తుంది. మంచీచెడు తెలిసి, సంస్కారంతో వ్యవహరించే పౌరసమాజం రూపుదిద్దుకుంటుంది. అందుకని తెలుగు భాష, సాహిత్యాల ఉన్నతికి చొరవ చూపి క్రియాశీలకంగా పని చేయడం కవులు, రచయితలు, భాషాభిమానులు తమ బాధ్యతగా భావించాలి.

*palapittamag@gmail.com*

# ఉత్తరాలు




## ఒక రచయిత నిలువెత్తు చిత్రం

ఆచార్య జి.చెన్నకేశవరెడ్డి గురించి సెప్టెంబర్ సంచికలో చదివా. ఒక రచయితకు సంబంధించిన నిలువెత్తు చిత్రమిది అనిపించింది. అన్ని అంశాల్ని సమగ్రంగా వివరించడం బాగుంది. తెలుగులో పరిశోధకునిగా, తెలుగు అకాడమి పుస్తకాల ఎడిటింగ్‌లో, వాటిని సర్వసమగ్రంగా రూపు దిద్దడంలో వారు పోషించిన పాత్ర గురించి చదువుతుంటే అబ్బురమనిపించింది. అలాగే తెలుగు విశ్వవిద్యాలయం వారి విజ్ఞాన సర్వస్వాల కూర్పులో వారి పాత్ర చెప్పుకోదగింది. ముఖ్యంగా వారు రాసిన 'ఆధునికాంధ్ర గేయ కవిత్వం' మీద ఎం.నారాయణశర్మ రాసిన వ్యాసం ఎంతో విలువైంది. ఒక పరిశోధనా గ్రంథాన్ని సర్వసమగ్రంగా విశ్లేషించడం ఎలానో చెప్పడానికి ఇది ఒక నమూనాగా ఉపకరించే వ్యాసం. ఇంకా ఇతరులు రాసిన అంశాలు అనేకం డా.చెన్నకేశవరెడ్డిలోని విభిన్నకోణాల్ని తెలియజెప్పాయి.

*– మాదా కేశవదాసు, నరసరావుపేట*

## ఆ సంస్థతో అనుబంధం వాస్తవం

జూలై 2021 పాలపిట్ట లో వచ్చిన నా వ్యాసం పై "హైదరాబాద్ పాతనగర సంఘం –వాస్తవాలు" అంటూ సెప్టెంబర్ 2021 పాలపిట్టలోని లేఖలో "నవ్యసాహితి, ఉషస్సు, అభినవ కళా సాహితి లిఖిత పత్రికలు 1960 నాటికి వెలువడలేదు. 1969 తెలంగాణ ఉద్యమం తర్వాత నవ్య సాహితి లిఖిత పత్రిక ఆరంభింపబడి, ఉషస్సు రచయితలుగా పిలువబడ్డారు. ఈ రచయితలు హైదరాబాద్ పాతనగర రచయితల సంఘం గా ఏర్పడ్డారు" అని, "ఈ సంఘం ఏర్పడేనాటికి హరనాథ్, గొట్టిపర్తి యాదగిరిరావు లు ఆ సంఘ సభ్యులు కాదు సంఘం నిర్వహించిన సభల్లో, కార్యక్రమాల్లో పాల్గొనలేదు" అని రాసారు ఇవి నా వ్యాసం లో దొర్లిన అవాస్తవాలుగా రాసారు. ఇవి అవాస్తవాలుకావు. హరనాథ్ 'కవనరేఖలు' పుస్తకానికి "పాతనగరం – పేగుబంధం" అని మిత్రవాక్యం రాసిన చింతపట్ల సుదర్శనం గారి పీఠిక నుండే ఈ సమాచారం తీసుకునిరాసాను. "1972 లో హైదరాబాదు పాత నగర రచయితల సంఘం పెద్ద ఎత్తున సభలని నిర్వహించ డం జరిగింది. ఈ కాలం లోనే సంఘపరంగా కాక, వ్యక్తిగతంగా సాహిత్యకృషిని ఆరంభించిన కొద్దిమంది లో హరనాథ్ ఒకడు" అనీ, "తన ప్రాంతం పట్ల, తాను ఓనమాలు నేర్చుకున్న ప్రదేశం పట్ల ఏర్పడ్డ అనుబంధాన్ని కొనకంటా కాపాడుకోవటం అందరివల్లా అయ్యే పని కాదు. ఆ పని హరనాథ్ వల్ల అయ్యింది. ఆ అనుబంధం కారణంగా తను రాసిన అన్ని కవితలూ పాతనగర రచయితల సంఘం ప్రచురణగా తీసుకువస్తున్నాడు. హైదరాబాదు పాత నగర రచయితల సంఘం ఉనికిని, పాతనగరంలో ఒకనాడు ఉద్యమంగా సాగిన రచనా వ్యాసంగాన్ని సదా గుర్తు చేసే నిజాయితీపరుల్లో కూడా హరనాథ్ ఒకడు" అనీ, "పాతనగర కవీ, మిత్రుడూ హరనాథ్ కవితలు, గేయాలు దీర్ఘ కవితా కలిసి 'కవనరేఖలు'గా హైదరాబాద్ పాతనగర రచయితల సంఘం ప్రచురణగా మీ ముందుంచు తున్నాం. మిత్రవాక్యం బదులు మిత్రవ్యాసం రాసినట్లున్నాను" అనీ దీన్ని "మా సంఘ కవి ప్రచురణ ని పరిచయం చేయాల్సిన బాధ్యత ని పూర్తి చెయ్యడం మాత్రమే!" అనీ రాసారు. ఈ అభిప్రాయాలను ఆధారంగా చేసుకొని నేను ఆ వ్యాసంలో హరనాథ్ గారికి పాతనగర రచయితల వేదికతో ఉన్న అనుబంధాన్ని ప్రస్తావించాను. నాటి సభల్లో "ఆయా సభల్లో హరనాథ్ తమ గళాన్ని వినిపించే వారు" అని మాత్రమే రాసాను. కాకపోతే "నవ్య సాహితి, ఉషస్సు, అభినవ కళా సాహితి వంటి లిఖిత పత్రికలు 1960 వరకు తెలుగు కవులకు స్ఫూర్తిదాయ కంగా వస్తుండేవి" అనే మాటలో పొరపాటు జరిగింది. 1969కి బదులుగా 1960 అని వచ్చింది. ఇది నా కంపోజింగ్ మిస్టేక్, పాలపిట్ట వారిది కాదు. కాబట్టి పాఠకులు 1969 లోనే హైదరాబాద్ పాతనగరం నుండి లిఖిత పత్రికలు వెలువడినట్లు చదువుకోవాల్సిందిగా కోరుతున్నాను.

*– కొండపల్లి నీహారిణి, హైదరాబాద్*

## ఆ రోజుల్ని గుర్తు చేస్తున్న సీరియల్

ప్రభాకర్ జైని 'సమర్థుని జీవయాత్ర'లో షేర్‌మార్కెట్ గురించే గాక, ఒకనాటి హైదరాబాద్ జీవితం గురించి చెప్పడం ఆసక్తికరంగా వుంది. కంప్యూటర్లు లేని కాలంలో షేర్‌మార్కెట్ వ్యవహారాలు, షేర్ల కొనుగోళ్ళు, అమ్మకాలు ఎలా ఉండేవో సరిగ్గా చెబుతున్నారు. అలాగే హైదరాబాద్‌లోని సినిమాహాళ్ళ ప్రస్తావన, స్కూటర్ మీద ప్రయాణాల గురించి చదువుతుంటే పాతిక, ముప్పయ్యేళ్ళ కిందటి రోజులు గుర్తుకొస్తున్నాయి. నిజంగా ఒక స్కూటర్ ఉండటం ఆ రోజుల్లో ఎంతో లగ్జరీనే కాదు, గొప్ప సౌకర్యం. అది కొందరికే లభించే భాగ్యం. మధ్యతరగతి బతుకుల గురించే గాక సాంఘీ వంటి వ్యాపారస్థుల బతుకు, భయాలు ఎలా ఉంటాయో బాగా చెప్పారు. చదివిన కొద్దీ చదవాలనిపిస్తుంది. సమర్థుని ప్రయాణం ఎలా మలుపు తిరుగుతుందోనని ఉత్కంఠగా ఉంది.

*– ఎం.విల్సన్, జగ్గయ్యపేట*

## విభిన్నపార్శ్వాలని చిత్రించిన కథ

సెప్టెంబర్ సంచికలో అమృతలత కథ 'స్వయంవరం' అనేక అంశాలని చర్చకు పెట్టింది. స్త్రీల వ్యక్తిత్వం, కులమత రాజకీయాలు, పెళ్ళి విషయంలో ఎన్ఆర్ఐ పురుషుల ధోరణి, మీడియా ధూర్త లక్షణాలు... ఇలా అనేక అంశాల్ని ఒక అమ్మాయి పెళ్ళి నేపథ్యంలోంచి చెప్పడం బాగుంది. ఒకే కథలో ఇన్ని కోణాల్ని చెప్పడం విశేషం. కథనం ఆసక్తికరంగా వుంది. సంభాషణలు బాగున్నాయి. ప్రభాకర్ జైని, అమ్జద్, గన్నవరపు నరసింహామూర్తి సీరియల్స్ కూడా బాగున్నాయి. సంచిక చేతికి రాగానే ఈ సీరియల్స్ చదువుతున్నాను.

*– ఎం.సురేందర్, వరంగల్*

## గమనిక

సెప్టెంబర్ 2021 సంచికలో డా.జి.చెన్నకేశవరెడ్డి ప్రొఫైల్ (59వ పేజీ)లో అవార్డుల శీర్షిక కింద రసమయి సంస్థ కాళోజీ నారాయణరావు పురస్కారం 2009 అని ఉన్నది. దీనిని 'రసమయి సంస్థ సినారె సాహితీ పురస్కారం–2019' గా చదువుకోవలసిందిగా పాఠకులకు మనవి.

*– ఎడిటర్*

## సూచనలు చేయండి

పాలపిట్ట సంచికలో వచ్చే విభిన్నాంశాలపై మీ అభిప్రాయాలు పంపించండి. రచనల గురించి మీరు ఏమనుకుంటున్నారో వాటిని నిర్మొహమాటంగా మాకు రాయండి. ఈమెయిల్ కూడా చేయవచ్చు. పత్రిక పురోభివృద్ధి కోసం మీ సూచనలు కూడా రాసి పంపించవచ్చును.



## మన కాలపు మేటి కథకుడు – హరికిషన్‌తో ఇంటర్వ్యూ పేజీ: 36

*కథారచయితగా, సంకలనకర్తగా, సంపాదకునిగా, ప్రచురణకర్తగా అనేక ప్రయోగాలు చేసిన మనకాలపు మేటి కథకుడు హరికిషన్.*

కరోనా కాలంలో వంద రోజుల్లో వంద కథలు చెప్పి వేలాదిమంది పిల్లలకీ, తల్లిదండ్రులకీ చేరువ అయిన హరికిషన్ సాహిత్యరంగాన ఏకవ్యక్తి సైన్యం. తనకు తానే ఒక సంస్థ. అనేక సంస్థలు చేయలేని పని చేసి చూపిస్తున్న అతని కృషి వల్లనే రాయలసీమ కరువు కథలు, రాయలసీమ స్త్రీల కథలు, రాయలసీమ ప్రేమ కథలు వెలుగు చూశాయి. పని తప్ప ప్రచారం పట్టని హరికిషన్‌తో ప్రముఖ రచయిత జి. ఉమా మహేశ్వర్ సంభాషణ.

ISSN 2582-7294

## విషయసూచిక

### వ్యాసాలు

పేజీ నెం





సాలూరి రాజేశ్వరరావు గారి స్వరసరోవరంలో అలా మదిని సేదతీర్చే సుస్వరాలు ఎన్నో. వారి స్వరవనిలో నడయాడే మణిమయూరాలు మరెన్నో. వారు చేసిన స్వర ప్రయాణంలోకి అలా ఒక్క సారి తొంగి చూస్తే మనసును సున్నితంగా మీటే వీణా మృత రాగాలు, మురళీగానాలు, సితార్ వాదనలు, పియానో కదలికలు వంటి ఎన్నో నాద సమీరాలు ముచ్చటగా తారస పడతాయి..*ప్రత్యేక వ్యాసం– పేజీ: 58*



*అసమాన నటనా ప్రతిభతో ఎన్నో పురస్కారాలను, అవార్డులను అందుకున్న ఓంపురి హిందీ, మరాఠి, పంజాబీ, మలయాళం, తెలుగు భాషలతో పాటు పలు ఇంగ్లీష్ సీరియళ్ళలో, సినిమాల్లో కూడా నటించారు. 1982లో 'ఆరోహణ్', 1984లో 'అర్ధ్ సత్య' చిత్రాలకు గాను ఆయన జాతీయ ఉత్తమనటుడు అవార్డులు అందుకున్నారు. 1990లో భారత ప్రభుత్వం నుంచి 'పద్మశ్రీ' పురస్కారం పొందారు. ఎనిమిది సార్లు ఫిలింఫేర్ అవార్డులు అందుకున్నారు.*

*...సినిమా వ్యాసం – పేజీ: 16*

### సీరియల్స్



### పజిల్



### కథలు



ఇంకా ఈ సంచికలో...అన్నవరం దేవేందర్, వైద్యం భాస్కర్, ఈతకోట సుబ్బారావు, పాపినేని శివశంకర్, మంజుల సూర్య, వనిపాకల లచ్చారెడ్డి, డాక్టర్ కావాడి ఎల్లయ్య, భవానీ దేవి...కరిపె రాజ్‌కుమార్, సిహెచ్. ఆంజనేయులు, దర్భశయనం శ్రీనివాసాచార్య, మంచికటి, పుట్టి గిరిధర్, రాకేష్ భవాని, కె.హరనాథ్, వెల్మల జయపాల్ రెడ్డి, శిఖామణి మొదలయిన వారి కవితలు, సమీక్షలు, సాహిత్యవార్తలు...



# బావా! ఎప్పుడు పోయెదవీవూ...

– కోట్ల వనజాత కథ

"ఏం చెప్తరో నాకు తెలియదు. చెప్పేది అయిపోగానే ముప్పై రెండు పండ్లూ బైటపెట్టి నవ్వాలి. అట్లా కాస్త వెరైటీ ముచ్చట్లు చెప్పుకొని సరదా పడదాంరా" అన్నాను గోముగా నా నలుగురు మిత్రులతో.

మేమంతా స్కూల్ ఏజ్ నుండి ఫ్రెండ్స్. ఎవరికి దొరికిన ఉద్యోగాల్లో వాళ్లం స్థిరపడి రిటైరైన వాళ్లం. మేమంతా ఒకే సంవత్సరం స్కూల్లో చేరినందుకేమో మా పంతులుగారు మాకందరికీ ఇంచుమించు కొద్దితేడాతో వయస్సు నిర్ణయంచేసి రికార్డుల్లో నమోదు చేశారు. ఐదు నెలల్లో వరుసగా ఐదు గురం రిటైరైనం. అది మా పంతులుగారి చలవే. ఉద్యోగాల్లో మా హోదాలేమున్నా అప్పుడప్పుడూ మేమంతా కలుసుకొని గ్లాసులు గలగల లాడించే వాళ్లం. ఈ మధ్యకాలంలో మొదట నేను రిటైరైన రోజు పార్టీ చేసుకున్నాం. చివరగా నిన్న రిటైరైన వాడు మధు. ఈ రోజు పార్టీ చేసుకోవాలని ఆ రోజే నిర్ణయించుకున్నాం గనక ఈ చల్లని సాయం కాలమిలా.

"అయితే మనం రిటైరైన వరుస క్రమంలో చెప్పుకుందాం. మన సరదా సరదా ముచ్చట్లు" అన్నాడు ప్రకాశం మధ్యలో రిటైరైనవాడు.

అట్లా అయితే నేనే మొదలు చెప్పాలి.

"అయితే ఒక కండిషన్. మీరు మెల్లగా తాగినా, స్పీడ్‌గా తాగినా ఒకరు ముచ్చట మొత్తం చెప్పిన తర్వాతనే నెక్స్ట్ రౌండ్‌కు వెళ్లాలి. ఒకేనా?"

"ఓ ఎస్" అన్నారంతా.

నేను చెప్పడం మొదలుపెట్టాను.

"కొత్తగా ఉద్యోగంలో చేరిన రోజు... కొత్త ఆఫీసు, కొత్త కొత్త మనుషులు, కొత్త పరిస్థితులు. భయభయంగా వెళ్లాను ఆఫీస్‌కు. సెక్షన్ అలాట్ చేసి ఫలానా సూపరింటెండెంట్‌కు రిపోర్ట్ చెయ్యమన్నారు. ఆ సెక్షన్ వెతుక్కుంటూ వెళ్లాను. జాయినింగ్ రిపోర్టిచ్చాను. ఆ ఆఫీస్‌లో సెక్షన్లు ఎక్కువ. సూపరింటెండెంట్‌లూ ఎక్కువ. అందుకే వాళ్లను షార్ట్‌కట్‌లో 'సూప్'లు అనేవాళ్లు. మా సెక్షన్ 'సూప్' పెద్దావిడ. ఓ యాభై పైనే వయస్సు. ఓ నలభై ఏళ్ల వయసుండే ఇద్దరు సీనియర్ అసిస్టెంట్‌లు. ఓ ముప్పై ఏళ్లుంటే ఒక టైపిస్ట్. ఓ పాతికేళ్ల జూనియర్ అసిస్టెంట్‌ను నేను. ఒక పెద్ద టేబుల్‌కు 'సూప్'తో పాటు నలుగురూ నాలుగువైపులా కూర్చోవాలంటే అందులో ఎవరో ఒకరు కాస్త ఇరికి కూర్చోవాల్సొచ్చేదే. కాని ఇద్దరు సీనియర్ అసిస్టెంట్‌లలో ఒకరు రామదాసు, ఇంకొకరు విజయలక్ష్మి. ఉప్పు, నిప్పు. ఇద్దరూ ఏకకాలంలో ఎప్పుడూ సెక్షన్లో ఉండేవాళ్లుకారు. విజయలక్ష్మి ఏ రోజూ సమయానికి ఆఫీసుకొచ్చేదకాదు. ప్రతిరోజూ పదకొండు దాటాల్సిందే. ఉండే సెలవులన్నీ లేట్ అటెండెన్స్‌లోనే కట్. ఎప్పుడో ఒకరోజు ఆవిడ పదిన్నరకు ఆఫీసుకొస్తే ఇవాళ హైద్రాబాద్‌లో ప్రళయమొస్తుందని రామదాసు వెక్కిరించేవాడు, ఆమె




వినేటట్టు 'సూప్'తో.

"మీరే చెప్పండి మేడమ్! నేనన్నది నిజమా కాదా?" అప్పటికే ఏదో విషయం 'సూప్'తో మాట్లాడుతున్నవాడిలాగా.

"ఏంటి నీ మొకం. నువ్వు చెప్పేది ఆవిడ వినేది... బేగంబజారులో చవగ్గా ఐదు రూపాయలకు కిలో ఉల్లిగడ్డలిస్తున్నారట.. వెళ్లి తెచ్చుకో. మరీ ఆనందం పట్టలేకపోతే అందరికీ టీ తాగించు" అని సవాల్ చేసేది.

అదేం వినపడనట్టు బయటకు వెళ్లిపోయే వాడాయన.

ఈవిడ కాసేపు సెక్షన్‌లో కూర్చుని పనిచేస్తే 'సూప్'కు తలనొప్పో, జలుబో వచ్చేటంత సోది చెప్తూనే ఉండేది. ప్రతిరోజూ ఒకటే టాపిక్. మా అమ్మాయి వర్షంలో తడిసిందనీ, జలుబు చేసిందనీ, పాలు కూడా తాగలేదనీ, అంతలా జలుబు చేసిందనీ... ఆవిడ కూతురు తుమ్మేదో లేదో గానీ ఈవిడకిక్కడ తుమ్మీ తుమ్మీ అందరికీ చిరాకు తెప్పించేది. హడలుగొట్టేది. ఇంతలో ఎవరో చీరలు అమ్ముతున్నారనో, చిక్కీలు అమ్ముతున్నారనో, ఇంకో సెక్షన్‌లో దూరి అక్కడే లంచ్ చేసి ఏ మూడు గంటలలో ఒకసారి అలా సెక్షన్‌లోకి తొంగిచూసి 'సూప్' ఏవో కితకిత పెట్టి పనేమీ లేదనిపించుకొని పారిపోయేది.

ఆమె అటు వెళ్లగానే ఇటొచ్చి కూర్చునేవాడు రామదాసు. ఇంటి నుండి ఎప్పుడు ఫోనొస్తుందా అని చూసేవాడు. అప్పుడు సెల్‌ఫోన్లు లేవు కదా. ఇంటి నుండి వాళ్లావిడ సెక్షన్‌లో లాండ్‌లైన్ ఎక్స్‌టెన్షన్‌కు ఫోన్ చేస్తే, అది కట్ చేసి ఇక్కడి నుండి ఆయన ఇంటికి ఫోన్ చేసి మొదలుపెట్టాడంటే... కూరలో ఎన్ని మిరపకాయ లేసావ్? ఎంత కరివేపాకేసావ్‌తో మొదలుపెడితే వున్న ఒక్కగానొక్క కొడుకు స్కూల్ నుండి వచ్చేదా ఫోన్ లైన్లోనే వుండి...

'ఏం నాన్నా! పిప్పర్‌మెంట్ బిళ్లలు కొనుకున్నావా? చిన్న రంధ్రాలున్న బిళ్లలా, పెద్ద రంధ్రాలున్న బిళ్లలా' అని ఆరాలు తీస్తూ అడిగేవాడు. అవతల వాడేం చెప్పేవాడో గానీ చిన్న రంధ్రాలున్న పిప్పరమెంట్‌లే కొనాలని హి... హి... అని వెకిలి నవ్వు నవ్వేవాడు.

ఒకరోజు విజయలక్ష్మి లేట్‌గా వస్తూనే ఆ విషయం మరిపించాలన్నట్టు "రాత్రంతా మా అమ్మాయికి ఎంత జలుబో తెలుసాండీ..." అని దీర్ఘం తీసింది.

"ఆహా! రాత్రి మీ రాంనగర్‌లో కురిసిన వర్షపు జల్లు మీ అమ్మాయి జలుబుదేనటగా" అన్నాడు కిచకిచ వెకిలినవ్వు నవ్వుతూ.

"మూసుకోరా పినాసోడా. ఇంకాసేపైతే మీ ఆవిడ ఇంటి పనంతా చేసుకొని ఫోన్ పట్టుకుని కూచుంటుందిగా... అక్కడి నుంచొచ్చిన ఫోన్ కట్ చేసి ఇక్కడ నుండి తగులుకో. చిన్న రంధ్రాలూ, పెద్దరంధ్రాలూ మరిచిపోకురోయ్" అని ఈసడించు కొనిపోయింది.

నేనొకరోజు 'సూప్'ను అడిగాను, "ఏంటి మేడమ్ ఈ గోల? ఎలా భరిస్తున్నారు" అని.

మేడమ్ నవ్వేసి వీళ్లిద్దరూ ఒకేరోజు ఆఫీస్‌లో చేరారయ్యా. చాలా కలుపుగోలుగా ఉండేవారు. ప్రేమ పెళ్లి వరకు వెళ్లారు. ఆ క్రమంలో ఇద్దరూ ఒకసారి సినిమాకెళ్లారు. విజయలక్ష్మి బాల్కనీ టికెట్‌లు

తీసుకోమంటే ముందు కుర్చీల టికెట్‌లు తీసుకున్నా డట. పోలేమ్మని ఊర్కుని సినిమా అయ్యాక ఏదైనా మంచి హెూటల్‌కు వెళ్దాం అన్నదట. రెండు గట్టి సమోసాలిప్పించి, టీ తాగి వెళ్దామన్నాడట. ఈ పినాసోడు నాకొద్దని మంచి ఆఫీసర్ సంబంధం వస్తే పెళ్లి చేసుకుంది తనకు నచ్చినట్టుగా.

ఒకే ఆఫీస్ కనుక ఎన్నిసార్లు సెక్షన్లు మార్చినా ఈ పిల్లుల పోరు మాత్రం అందరికీ సరదా కాలక్షేపంలాగా నడుస్తూనే వుందని నవ్వేసింది 'సూప్'.

చెప్పడం ఆపి చూసానందరినీ. బాగుందన్నట్టు చూసారు.

నా తరువాత కృష్ణ... రెవెన్యూలో రిటైర్డ్ తాహ సిల్దార్. తను మొదలుపెట్టాడు.

నేను రెవెన్యూ ఇన్‌స్పెక్టర్‌గా పనిచేసే రోజులు... తాహసిల్ ఆఫీస్‌కు ఎదురుగానే పోలీస్‌స్టేషన్. అది పోలీస్ సర్కిల్ ఆఫీస్ కూడా. అందుకే సిఐ కూడా అక్కడే ఉండేవాడు. ఎప్పుడూ పోలీస్ స్టేషన్ వరండాలో కుర్చీలో కూచుని తాహసిల్ ఆఫీస్‌వైపే చూస్తుండేవాడు. అతని తీక్షణమైన చూపులు చూస్తే నాకు లోపల జంకుగా వున్నా బైటికి మాత్రం బింకంగా వుండేవాడిని. ఒకరోజు ఏదో లాండ్ ఎంక్వయిరీకి వెళ్లొస్తూ... స్కూటర్ పార్క్ చేస్తుండగా స్టేషన్‌లోంచి కానిస్టేబుల్ పరుగెత్తుకొచ్చి 'పెద్ద సార్ పిలుస్తున్నార'న్నాడు.

"పెద్ద సారెవరూ? సిఐగారేనా?" అడిగాను.

ఔనన్నాడు.

నిజం చెప్పొద్దూ... పోలీస్‌స్టేషన్ లోపలికెళ్తుంటే ఏదో బెరుకుగా అనిపించింది. ఇతర డిపార్ట్‌మెంట్‌లలో ఎంత పెద్ద ఉద్యోగం చేసినా పోలీస్‌స్టేషన్‌కు మాత్రం ఎవరూ ఇష్టంగా వెళ్లరని మా సహచరులు అనే మాటలు గుర్తుకొచ్చినయి. వెళ్లాను.

దర్పంగా కుర్చీలో కూర్చుని "ఓయ్! గిర్దావర్, నాకొక యాభై కేజీల చక్కర ఇప్పించు ఏదన్నా కంట్రోల్ షాపులో. మా అమ్మాయి పెళ్లుంది వచ్చే వారం" అన్నాడు రెండువైపులా మీసం నిమురు కుంటూ.

"సరే... చూస్తాను" అన్నాను.

ఒక నిమిషం నిలబడ్డాను, ఆ కంట్రోల్ ధరకన్నా డబ్బులిస్తాడేమోనని. వెళ్లమన్నట్టు చూశాడు. వచ్చేశాను.

నాకుగా నేను ఎవ్వరినీ ఏదీ అడగను. అలాంటిది బోడి చక్కర కోసం ఎవరినైనా ఎందుకడుగుతానూ... అయినా పెళ్లో పేరంటమో ఉంటే అయ్యే ఖర్చులో బోడి చక్కర ఖర్చెంత? ఒక్క చీరో, ఒక్క పాంటో తక్కువ కొనుక్కుంటే పోయే. మిన్నకుండిపోయేను. రెండు మూడు రోజులయ్యాక కనపడ్డం మానేసినోడు

నిజం చెప్పొద్దూ... పోలీస్‌స్టేషన్ లోపలికెళ్తుంటే ఏదో బెరుకుగా అనిపించింది. ఇతర డిపార్ట్‌మెంట్‌లలో ఎంత పెద్ద ఉద్యోగం చేసినా పోలీస్‌స్టేషన్‌కు మాత్రం ఎవరూ ఇష్టంగా వెళ్లరని మా సహచరులు అనే మాటలు గుర్తుకొచ్చినయి.




పదిహేను రోజులయ్యాక అదే స్టేషన్ వరండాలో కుర్చీలో కూర్చుని కనిపించాడు. గుర్రుగా చూస్తున్నాడు నావైపు. నేను చూడనట్టే నటించా.

వారం రోజుల తర్వాత ఆ ఊర్లో ఒక అనాథ మతిస్థిమితంలేని ఆడమనిషి చెరువుగట్టు దగ్గర చనిపోయిన స్థితిలో కనిపించింది. యథావిధిగా రెవెన్యూ అధికారుల సమక్షంలో పోలీసు పంచ నామాకు పిల్చారు. తాహసిల్దారుకు ఏదో పనుండి నన్ను వెళ్లమన్నాడు. మామూలుగా ఇలాంటి కేసుల్లో పంచువులు, సాక్షులు, స్థానిక కర్మచారులే వుంటారు.

మరికొన్ని రోజులకు మేడం దగ్గర పనికోసం ఒకతనొచ్చాడు. మేడమ్ చూస్తుండగా అతనితో మాట్లాడాను. అప్పటికే అతని ఫైల్ సంతకమయి వెళ్లిపోయింది. నాకు తెలుసు. అయినా అతనితో మాట్లాడి మేడంకు ఒక బాటిల్ తెచ్చివ్వమని, నేను దాచిపెట్టిన ఖాళీబాటిల్ చూపించాను.

కానీ ఆ సీఐ నా మీద కక్షకొద్దీ నాచేత సాక్షి సంతకం పెట్టించాడు.

అక్కణ్ణుంచి వచ్చేస్తుంటే, "గిర్దావర్ గారూ... ఈ చనిపోయినావిడ ఎవరో, ఎక్కడి మనిషో, ఎందుకీ ఊరొచ్చిందో కాస్త ఎంక్వయిరి చేసి పెట్టుకోండి. సాక్ష్యం చెప్పడానికి పనికొస్తుంది" అన్నాడు.

గుండెలు బద్దలయినయి నాకు. 'ఊర్కె అర కింటాలు చక్కర బయటి దుకాన్ల కొనుక్కొచ్చైనా ఇవ్వకపోతిని గదరామరికొన్ని రోజులకు మేడం దగ్గర పనికోసం ఒకతనొచ్చాడు. మేడమ్ చూస్తుండ గా అతనితో మాట్లాడాను. అప్పటికే అతని ఫైల్ సంతకమయి వెళ్లిపోయింది. నాకు తెలుసు. అయినా అతనితో మాట్లాడి మేడంకు ఒక బాటిల్ తెచ్చివ్వమని, నేను దాచిపెట్టిన ఖాళీబాటిల్ చూపించాను. దేవుడా. చచ్చిపోయిన పిచ్చామె వివరాలను నేనెవర్నడగాలి? ఒళ్లొకసారి జలదరించింది. ఆ రోజు రాత్రి ఫుల్లు జ్వరం. అదే టైఫాయిడ్ అయి మూన్నెళ్లు లీవు పెట్టుకోవాల్సొచ్చింది. ఎన్నోసార్లు నిద్రలో కల వరించానట 'చక్కరిప్పించి వుంటే బాగుండేది' అని.

మూన్నెళ్లయ్యాక వేరే మండలానికి పోస్టింగ్ తీసుకుని వెళ్లాను. ఎలక్షన్స్ డిక్లేర్ అయినయి. ఎక్కడికక్కడ టెలిఫోన్ ఎక్స్చేంజీలు పేల్చేస్తున్న కాలం. ఎస్.పి. ఆఫీస్‌ల నుండి మండలాల్లో పోలీస్‌స్టేషన్ లకు సమాచారం ఇచ్చే వైర్‌లెస్‌సెట్‌లే గతి. తాహసిల్దార్ ఆఫీస్ నుండి ఒకరు వెళ్లి పోలీస్‌స్టేషన్ లో సెట్‌కాన్ఫరెన్స్‌లో వివరాలు రాసుకొని రావాలి.

సాయంత్రం ఐదైంది. సెట్‌కాన్ఫరెన్స్ మొదలైంది. ఐదున్నరకు గాలీ వానా మొదలైంది. మాటిమాటికీ కరెంట్ పోవడం. సెట్‌కాన్ఫరెన్స్ ఆగిపోవడం. ఇంతలో ఏడు గంటలకు కరెంటొచ్చింది. మళ్లీ సెట్‌కాన్ఫరెన్స్ నడుస్తుండగా బైట పోలీస్ జీపొచ్చి ఆగింది. టకటక బూట్ల చప్పుడుతో ఐదారుమంది పోలీసులు గబాగబా లోపలికొచ్చారు. డిఎస్‌పి గారొచ్చారని హడావిడి చేశారు. ఎవరబ్బా మీ డిఎస్‌పి అని లోపలికొస్తున్న మనిషిని చూద్దును గదా... అంతకుముందు నాకు తగులుకున్న సీఐ. ఇప్పుడు డిఎస్‌పి అయ్యాడన్నమాట. నన్ను కొరకొరా మిరమిరా చూశాడు.

పావుగంట బాగా ఒత్తిడికి లోనయ్యా. అందు లోనూ వర్షంపడ్డ సాయంకాలం బాగా ఒత్తుగా 'ఒంటి'కొస్తుంది. ఇంక ఆపుకోవడం నావల్లకాదని, బైటికొచ్చి పోలీస్‌స్టేషన్ ఆవరణ లోపల వైపు ఒక మూలలో నిలబడి బరువుదించుకుంటున్నా. ఇంక వెళ్లిపోవడానికి బైటికొచ్చిన డిఎస్‌పి నేను చేస్తున్న పని చూసి, ప్రభుత్వ కార్యాలయాన్ని అపవిత్రం చేసినందుకు అదేదో యాక్టు కింద నన్ను అరెస్టు చేసి రేపు కోర్టులో ఫైన్ కట్టించి వదిలేయమని ఎస్ఐకి సూచనలిచ్చి కదలబోయాడు. నేను స్పృహతప్పి పడిపోయాను. ఆ రాత్రి మళ్లీ ఫుల్లు జ్వరం. టైఫాయిడ్ తిరగబెట్టింది. నిద్రలో ఒకటే

కలవరింతలు 'అరకింటాల్ చక్కర కొనిస్తే పోయేదని' పిచ్చి పిచ్చిగా. మా ఆవిడ పూనుకొని కలెక్టర్‌ను కలిసి నా గొప్పతనమంతా చెప్పింది. మళ్లీ ట్రాన్స్‌ఫర్, పోలీసుల గోల లేకుండా హాయిగా కలెక్టర్ ఆఫీస్‌కి.

అందరం గట్టిగా నవ్వేశాం. బాగుందన్నా.

* * *

మూడో రౌండు...

ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ ప్రకాశం మొదలుపెట్టాడు.

అప్పుడు నేను విజిలెన్స్ డిపార్ట్‌మెంట్‌కు డిప్యుటేషన్‌కు వెళ్లిన రోజులల్లో... మా ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ స్టోర్ కీపర్ మీద వచ్చిన ఆరోపణలపై ఎంక్వయిరీ చేయడానికి అడవిలోని గ్రామాలకు వెళ్లాలని నిర్ణయించుకున్నాం. డిపార్ట్‌మెంట్ ఎంగేజ్ చేసిన కార్లో నేనూ, పోలీస్ డిపార్ట్‌మెంట్ నుండి ఒక ఎస్ఐ, దారి చూపించడానికొక ఫారెస్టు గార్డు, డ్రైవర్‌తో కలిపి నలుగురం బయలుదేరాం. స్టోర్‌ల నిర్వహణ గురించి ఎస్ఐ అడిగారు.

''మామూలుగా మా శాఖలో కొంత డబ్బు అడ్వాన్స్‌గా డిపార్ట్‌మెంట్ స్టోర్ కీపర్‌లకిచ్చి అడవిలో వాళ్లకు కావలసిన లుంగీలు, అంగీలు, ఆడవాళ్లకు చీరలు, బీడీలు, అగ్గిపెట్టెలు, బట్టల సబ్బులు, ఒంటి సబ్బులతో సహా ఉప్పు, పప్పుల కాడ్నుంచి అందిస్తారు. అవి వాళ్లకు అమ్మిన తర్వాత దానికి ప్రతి ఫలంగా అటవీ ఉత్పత్తులుగా గానీ, నగదుగా గానీ చెల్లిస్తారు" చెప్పాను.



గవర్నమెంట్ సప్లయ్ చేసే రేషన్ బియ్యం, కిరోసిన్ కూడా వాళ్లే అమ్మాలి. అట్లా కిరోసిన్‌ను బ్లాక్ మార్కెట్లో అమ్ముకుంటున్నాడనే ఆరోపణల మీద ఎంక్వయిరీకీ ఇప్పుడు టీంగా బయలుదేరాం. అడవిదారిలో మొత్తం పద్దెనిమిది కిలో మీటర్లు వెళ్లాలి. ఫారెస్ట్ చెక్‌పోస్ట్ దగ్గర రిజిస్టర్‌లో సంతకం చేసేటప్పుడు చూస్తే స్టోర్‌కీపర్ మేం వెళ్లాలనుకున్న చెంచు గ్రామం వెళ్లాడు. అప్పటికీ ఉదయం పదిన్నరే. రాత్రి కొద్దిగా వర్షం పడింది. దాంతో అడవిలో ఆకులన్నీ కలిసిన మెత్తటి మన్ను కారు టైర్లను రెండువైపులకూ సాగదీస్తుందని వాపోతున్నాడు డ్రైవర్.

స్టోర్‌కీపర్ అడవి గ్రామంలోనే దొరుకుతాడులే. నిదానంగా వెళ్లమన్నాం. అలా పన్నెండు కిలోమీటర్లు వెళ్లామో లేదో స్టోర్‌కీపర్ టూ వీలర్ మీద మాకెదురొస్తున్నాడు. ఫారెస్టు గార్డు అతన్ని గుర్తుపట్టి ఆపాడు.

"అప్పుడే వెళ్లిపోతున్నావేం" అని అడిగాడు.

"రాత్రి కురిసిన వర్షానికి చెంచులంతా గడ్డలేరుకోవడానికి అడవికెళ్లారు. ఒక్కణ్ణి గ్రామంలో ఎందుకని తిరిగొస్తున్న" అని చెప్పాడు.

"మేం స్టోర్ ఇన్‌స్పెక్షన్‌కే వస్తున్నాం పద" అన్నాం.

"సార్! ఎలుగుబంట్లు తిరుగుతున్నయ్, రాలిన కాయలు తినడానికి" భయపడుతున్నట్లు చెప్పాడు.

"మనం కార్లోనే వెళ్దాం పద" అని ఎస్ఐ అతన్ని కారెక్కించాడు.

ఇంకో మూడు కిలోమీటర్లు వెళ్లిన తర్వాత రాత్రి పడిన వర్షానికి చిన్న నీటిపాయం రోడ్డుకు అడ్డంగా పారుతోంది.

"నేను ముందే చెప్పానుగా సర్, ముందుకెళ్లడం కష్టమని" వెనక్కి పోదామన్నట్లుగా అన్నాడు స్టోర్‌కీపర్.

ఎస్ఐ అడిగాడు, ''ఇక్కడ్నుంచి ఇంకెంత దూరముంటుంది నీ స్టోర్?"

"ఐదు కిలో మీటర్లు సార్" అన్నాడు.

"మూడు కిలోమీటర్లుంటది సార్" అన్నాడు ఫారెస్ట్ గార్డ్.

''నడిచి వెళ్దాం'' అన్నా కాసేపాలోచించి.

''సార్... ఎలుగుబంట్లు తిరుగుతున్నాయి" అన్నాడు మళ్లీ స్టోర్‌కీపర్ రాముడు.

ఫారెస్ట్‌గార్డ్ అక్కడే కొన్ని గట్టి కట్టెలు ఏరి తుడిచి తలొకటీ చేతికిచ్చాడు, అవి పట్టుకొని నడవమని. ఏ ఎలుగుబంట్లూ రావన్నాడు.

"వస్తయి సార్" అన్నాడు రాముడు.

"ఓసీ... నీ దుంపతెగా. ఎలుగుబంట్లు రాకపోతే నువ్వే వేషం వేసుకొచ్చేటట్టున్నవ్" అన్నడు ఎస్ఐ గట్టిగా.

అందరం గట్టిగా నవ్వాం. కారు అక్కడే వదిలి డ్రైవర్‌తో సహా ఐదుగురం బయలుదేరాం. అరగంటలో చేరుకున్నం స్టోర్ దగ్గరికి. ఆ గ్రామంలో పట్టుమని పదిళ్లు లేవుగానీ కొన్ని చెంచు గ్రామాలకు కేంద్రమయిన స్టోర్ మాత్రమక్కడే వుంది.

ప్రతి ఇంట్లో మనుషులున్నారు. స్టోర్ దగ్గర చూస్తే ఇద్దరు ముగ్గురు ఆడవాళ్లు సరుకుల కోసం వచ్చి వున్నారు. వాళ్లు స్టోర్‌కీపర్‌ను చూసి ఆనందంగా కిలకిల నవ్వారు. స్టోర్ తాళం తెరిచి వాళ్లకు సరుకులిచ్చేలోపు నేను వాళ్లతో మాట కలుపుదామని వాళ్లతో బియ్యం ఇస్తున్నాడా అని అడిగాను.

"బియ్యం బువ్వ బువ్వ ఇస్తడు" అన్నారు.

"కిరోసిన్ ఇస్తున్నాడా" అడిగాను

"ఆ..." అన్నారు వాళ్లు అర్థం కానట్టు.

"కిరోసిన్... కిరోసిన్" అన్నాను.

వాళ్లు అర్థం కానట్టు మొకం పెట్టారు.

మళ్లీ అడిగాను "కిరోసిన్... కిరోసిన్" అని.

వాళ్లూ దూరంగా జరిగి అదోలాగ నవ్వుకుంటూ వెళ్లిపోసాగారు.

"ఇగో... గడ్డినూనె ఇస్తున్నడా అని అడుగుతున్నడు సారు" గట్టిగా అన్నడు ఫారెస్టుగార్డు వెనుకనుండి.

"గడ్డినూనె..." అన్నాడు అర్థం అయ్యేటట్టు చెప్పాలని.

వాళ్లేం మాట్లాడకుండా దూరం పోతున్నరు.

"ఇగో... గబ్బునూనె ఇస్తున్నడా అని అడుగుతున్నరు సారూ" మళ్లీ రెట్టించాడు.

ఇప్పుడర్థమైనట్టుంది వాళ్లకు. లేదన్నట్లు అర చేతిని అడ్డంగా ఊపుతూ వెళ్లిపోయారు వాళ్లు.

ఫారెస్టు గార్డు "మనం మామూలుగా మాట్లాడినంత వేగంగా మాట్లాడితే వీళ్లకు అర్థం కాదు సార్" అన్నాడు తనకున్న అవగాహనతో.

''కొన్ని ప్రాంతాల్లో కిరోసిన్‌ను 'గడ్డినూనె, గబ్బునూనె' అని అంటరు సార్" వివరించాడు.

ఇట్లా కాదని... స్టోర్‌కీపర్‌కు చెప్పాను, "నిన్నేమీ అనము. నీ మీద ఏ రిపోర్టూ రాయము. వీళ్లకొచ్చే కిరోసిన్ అంత ఏం చేస్తావో చెప్పు"

మొదట నసిగినా చివరికి విషయమంతా కక్కేసాడు. "కిరోసిన్‌ను ఈ అడవి మనుషులేం చేస్కుంటరు సార్. ఎప్పుడన్నా ఈ ఫారెస్టువాళ్లు కావాలని అడిగితే వాళ్లకోసం ఎప్పుడన్నా ఓ ఇరవై లీటర్లదాకా ట్యాంకర్ వాడి దగ్గర పోయించుకొని మిగిలిన కోటా వాళ్లకే ఇచ్చేస్తుంటా" అన్నాడు.

అందుకు ప్రతిఫలంగా వచ్చేది ఖర్చులకే సరిపోతుందన్నాడు. అదే రాసిమ్మన్నాం. అతని స్టేట్‌మెంట్ సాక్ష్యంగా అతని మీద పకడ్బందీగా రిపోర్టు తయారుచేసి ఉన్నతాధికారులకు పంపిస్తే... అనుమతి లేకుండా నట్టడివికి అధికారులను తీసుకుపోతవా అని ఫారెస్టు గార్డుకు మెమో ఇచ్చారు. ఇట్లా కాదని ఇంకా పైస్థాయికి ఫిర్యాదు చేస్తే స్టోర్‌కీపర్‌కు బదిలీ తప్ప ఎలాంటి నష్టం జరగలేదు. ఫారెస్టుగార్డు ఫోన్ చేసి తనకు మెమో ఇవ్వడానికి రాముడు ఎంత 'బరువు' పెట్టాడో చెప్తే విని ఆశ్చర్యపోవడం, 'ప్చ్' అనుకోవడం నావంతయ్యింది. చర్యకు ప్రతిచర్య అనేది మిస్‌ఫైర్ అయినందుకు

బాధపడ్డాను.

అందరికీ గుండె బరువెక్కింది.

''నాలుగోరౌండ్‌లో నవ్వించరా శివుడూ'' అన్నాన్నేను.

“ఆ... నాదేముందిరా. సర్వీసు చివర్లో రికార్డ్ అసిస్టెంట్‌గా ప్రమోషన్ తీసుకుని రిటైరయ్యానుగానీ నా సర్వీసులో చాలా భాగం నాల్గోతరగతి వాడినేగా” అని నిట్టూర్చాడు.

“అబ్బో... నాల్గోతరగతి ఉద్యోగం చేశానని తప్పించుకోబోకు. నీకు తెలుసా? నేను పనిచేసే జిల్లాకు ఒకసారి ముఖ్య కార్యదర్శి టూర్ ప్రోగ్రామొచ్చింది. జిల్లాలో అధికారులకు ఒకటే టెన్షన్. ఎవరికి వాళ్లు ఆయన దగ్గర మంచి మార్కులు కొట్టేయాలనీ, తర్వాత పోస్టింగ్‌లో ఉప యోగపడాలని. ఆ వచ్చే ఆయన ఇదివరకు ఈ జిల్లాలో కలెక్టర్‌గా పని చేసినవాడు. ఆయన దగ్గర పనిచేసిన వాళ్లెవరన్నా వున్నారారా అని ఆరా తీసి నేడో రేపో రిటైర్మెంట్‌కు ఉన్న ఆఫీస్ సబార్డినేట్‌ను పట్టుకున్నారు.

ఆయనకేమిష్టం అని అడిగితే “ఆ... సారు తిండి గురించి పెద్దగా పట్టించుకోరుగానీ ఫలానా పాన్ అంటే ఇష్టం” అని చెప్పాడు. అంతే జిల్లా పెద్దలకు రొట్టె విరిగి నేతిలో పడింది. అగో... అంత ముఖ్యమైంది తెలుసా నాల్గోతరగతి ఉద్యోగం అని శివుణ్ణి ఉత్సాహపరిచాను.

శివుడు మొదలుపెట్టాడు.

“ఒక కొత్త మేడం. కొత్త కొత్తగా ఉద్యోగానికొచ్చి చిన్నబంగళాలో దిగారు. అమ్మగారు చిన్నది గనుక ఎవరన్నా పెద్దవయసు అటెండర్‌ను రాత్రిళ్లు బంగళాలో ఉంచాలని కోరింది. అప్పుడు నన్ను అమ్మగారి రక్షణ కోసం అక్కడ వేశారు. ఫోన్లు అటెండ్ కావడం, అమ్మగారికి విషయం చెప్పడం, రేపటి ప్రోగ్రాంలో చేర్చుకోవాలని చెప్పడం నా పని. ఓ పది వరకో పదకొండు గంటల వరకో అయితే ఫర్వాలేదుగానీ అర్ధరాత్రి దాటిందాకా సెల్ ఫోన్లో మాట్లాడుతూ, టీవీ చూస్తూ తెల్లారి పొద్దుపోయాక లేచేది. మనకట్లా ఆగలేం కదా. పదకొండు గంటలకల్లా పడుకునేవాడిని.

“నేను పడుకోకముందే నువ్వు పడుకుంటున్నావ్, తాగుతున్నావా?” అందొక రోజు సీరియస్‌గా.

నాక్కోపం వచ్చిందిగానీ పోనీలెమ్మని ఓపిక పట్టాను. ఒకసారి, రెండుసార్లు, మూడుసార్లూ... అదే మాటన్నది. ఆడమనిషి తొందరపడకూడదనుకున్నా. ఒకరోజు తనకోసం వచ్చిన వాళ్లెవరో ఏదో అడుగుతుంటే చెప్తున్నా. ఆమె చూసింది. ఆరోజు కూడా పదకొండు గంటలకే నిద్రపోయా. తెల్లవారి పనికోసం నా దగ్గరకొచ్చిన వాళ్ల దగ్గర డబ్బులడుక్కొని తాగుతున్నావంది. మనసు చిన్నబుచ్చుకున్నా. పోనీలే 'చిన్నపిల్ల' అనుకుని పూర్కున్నా. ఇంతలో ఒకరోజు 'న్యూ ఇయర్ డే' వచ్చింది. అమ్మగారి ఫ్రెండ్స్ చాలామందొచ్చారు. పన్నెండు కాగానే అదేదో పచ్చరంగు బాటిల్‌ను పొంగించి అందరూ తాగి తెల్లవారుజాము నెప్పుడో పడుకున్నారు. తెల్లారిచూస్తే బంగళా బీభత్సంగా ఉంది. పనిమనుషులూ, వాచ్‌మన్, నేనూ అందరం గంటలకొద్దీ కష్టపడి శుభ్రం చేశాం. అప్పుడొక పచ్చఖాళీబాటిల్ పక్కకు పెట్టాను.

మరికొన్ని రోజులకు మేడం దగ్గర పనికోసం ఒకతనొచ్చాడు. మేడమ్ చూస్తుండగా అతనితో మాట్లాడాను. అప్పటికే అతని ఫైల్ సంతకమయి వెళ్లిపోయింది. నాకు తెలుసు. అయినా అతనితో మాట్లాడి మేడంకు ఒక బాటిల్ తెచ్చివ్వమని, నేను దాచిపెట్టిన ఖాళీబాటిల్ చూపించాను.

మరుసటిరోజు పదిగంటలకు మేడం ఆఫీస్‌కు బయలుదేరుతుండగా వచ్చి 'షాంపేన్' బాటిల్ చేతికిచ్చి 'థాంక్స్' అన్నాడు.

మేడమ్ నాకేసి కొరకొర చూసింది.

“అవును మేడం. మీరెట్ల ఎవర్నేమీ అడుక్కోరో మేం కూడా అడుక్కోం మేడం” దిమ్మతిరిగిపోయింది మేడంకు.

'సారీ' అన్నది నాకు మాత్రమే వినపడేటట్టు.

పెండింగ్‌లో వున్న నా రికార్డ్ అసిస్టెంట్ ప్రమోషన్ ఫైలు తనే క్లియర్ చేసింది తర్వాత. తొందరగా కళ్లు తెరవడమే అధికారుల్లో గొప్పతనం.

* * *

ఐదో రౌండ్ ఇక అందరికీ బలవంతమే.

“షార్ట్ ఎండ్ స్వీట్‌గా చెప్పరా మధూ” అన్నాను.

“షార్ట్ ఎండ్ స్వీటా...చెప్తా” అన్నాడు చప్పరిస్తూ.

ఒకడు అడ్డంగా సంపాయిస్తున్నడు ఉద్యోగంలో.



ఒకటి కొంటున్నడు, రెండు కొంటున్నడు, పది కొంటున్నడు. అన్నీ అమ్మి ఒకటి 'పెద్దది' కొంటున్నడు. అలా పది పెద్దవి అమ్మి ఇంకా పెద్దది కొంటున్నడు. ఇంకా పెద్దది... పెద్దది కొంటున్నడు.

ఆఖరి రిటైర్మెంటు దగ్గరికొచ్చింది.

పెద్దఎత్తున ఎదిగిపోయి బంజారాహిల్స్‌లో పెద్దపెద్ద లగ్జరీ అపార్ట్‌మెంట్‌లు కట్టి ఒక మల్టీప్లెక్స్ కట్టి కిరాయిలకి ఇచ్చుకొని సుఖంగా బతకాలని నిండు పళ్లెం ముందు ఆకలితో కూర్చున్న వాడిలా గున్నాడు.

అప్పటివరకు ఒక చిన్నదైన సొంత ఇంట్లో ఉన్న వాడు ఆ రోజు రిటైర్మెంట్ తీసుకొని బంజారాహిల్స్ అపార్ట్‌మెంట్‌లో అంగరంగ వైభోగంగా గృహప్రవేశం చేశాడు. ఇప్పటిదాకా బావమరిది పేరుమీదున్న మల్టీప్లెక్స్ ఈ అపార్ట్‌మెంట్ తన పేరు మీదకు మార్చుకునేదే తరువాయి. రిజిస్ట్రేషన్ ఆఫీస్‌కు పోదాం పదన్నాడు బావమరిదితో.

అప్పటివరకూ చిన్న ఇల్లుతప్ప మిగిలిన యవ్వారలన్నీ బామ్మర్ది పేరుమీదనే నడిచినయి. ఈ రోజు కాదు రేపన్నాడు బామ్మర్ది.

రేపు అడిగితే ఎల్లుండన్నాడు. రిజిస్ట్రేషన్ ఆఫీస్‌కు రాడూ. ఈ ఇంట్లోంచి పోవట్లేదు.

కోపంగా “మీ ఇంటికెళ్లిపో” అన్నాడు బామ్మర్దిని.

“బావా! నువ్వు మీ ఇంటికెప్పుడు పోతవు” అన్నడు కిచకిచ నవ్వుతూ.

బావకు భూమి బద్దలయింది. తనింటికి పోయి వచ్చిన పెన్షన్ తినుకుంట బతికిండు.

“బావా! ఎప్పుడు పోయెదవీవూ” అన్నాడు మధు రాగయుక్తంగా.

ఐదో పెగ్గు ఎవ్వరం తాగలే. అందరం మధు నెత్తిన అభిషేకం చేసినం.

***రచయిత్రి సెల్: 9440233261***

# శబ్దం

శబ్దం అంటే చెవులను తాకే తరంగం
నిశ్శబ్దం మనసులోని ప్రవహించే మౌనం
కనిపించే లయలన్నీ మూసి తెరిచే నయనాలు

తల్లివేరుది నిశ్శబ్ద క్రియాశీలతనే
చెట్టు మీద పువ్వు శబ్దమై నిలిచింది
మట్టిలోని కదలికలే ఫల పుష్ప వికసనలు

ప్రాతః కాల వెలుగురేఖ ఒక శబ్దచిత్రం
నల నల్లని సాయం సమయం నిశ్శబ్ద వర్ణం
పగలూ రాత్రుల్లు కాలచక్రపు అచ్చులు

అల్లుకున్న అక్షరాల గళం
పద శబ్దరూపం
ఆలోచనల సిరాసారం
నిశ్శబ్దంగా సాగే వాక్యం

***- అన్నవరం దేవేందర్***

కవితా విమర్శ — గోపగాని రవీందర్

# జీవనయానపు ఆవిష్కరణలే అన్నవరం కవితలు

మనిషి కదలికనే నాగరికతకు మూలం. ఉన్న చోటునే ఉంటుంటే వైవిధ్యభరితమైన జీవనాన్ని జీవించలేక పోతాము. అందుకే మనం చూసిన ప్రాంతమే కావచ్చు, దాన్ని మళ్ళీ మళ్ళీ సందర్శించడం వలన వినూత్న ఆలోచనలకు దారులు వేస్తుంటాయి. అందుకనే ఎవరైన యాత్ర కథనాల రచనలు చేస్తే ఇష్టపడుతుంటాం. యాత్రికుడైన కవి, రచయితల రచనలు అలరిస్తాయి. వాటిని అధ్యయనం చేయడం వలన మనలోని దృష్టికోణం పదును తేలుతుంది. అందుకే ఉన్నచోటు నుండి కదులుతుండాలి. ఆ కదలికల్లోని మార్పులను రికార్డు చేసే రచనలను చదువుతుండాలి.

తెలుగు సాహిత్యంలోని కవులు తమకు ఇష్టమైన ప్రాంతాలను సందర్శిస్తూ కవిత్వమై వర్షించిన వారున్నారు. కవిత్వంలో వారిది అందెవేసిన చెయ్యి. డా.ఎన్. గోపి, కె.శివారెడ్డి, వాడ్రేవు చినవీరభద్రుడు, యాకూబ్, దర్భశయనం శ్రీనివాసాచార్య వంటి కవులు తమ కవిత్వంలో సందర్శించిన వివిధ ప్రాంతాల వైభవాన్ని అక్షరాల్లో బంధించి మనకు



కానుకలుగా అందించారు. కొందరు చాలా ప్రాంతాలు తిరుగుతూనే ఉంటారు కాని వాటిని అక్షరాల్లో బంధించలేరు. ఆ అనుభూతులను మనం గ్రహించలేక పోతాం. మనం ఇంటి నుండి బయటికి వచ్చామంటే చాలిక యాత్రికులమైనట్టే. మన చూపులు పరిసరాలను నిశితంగా పరిశీలన చేస్తూనే ఉంటాయి. ప్రతి ప్రయాణాన్ని ఒక అద్భుత కవితగా మలుస్తున్న ఆత్మీయ కవిమిత్రులు అన్నవరం దేవేందర్. ఆయన కవిత్వం నిండా స్ఫూర్తివంతమైన ప్రయాణపు అనుభూతుల అంశాలే నిండి వున్నాయి. వైవిధ్యంతో కూడిన కవితలతో 'గవాయి' కవిత్వ సంపుటిని తన పన్నెండవ పుస్తకంగా మనకు బహూకరించారు.

మనుషులను కలువడం ముఖ్యం అనుకుంటారు మానవీయులు. గురువులను, బంధువులను, స్నేహితులను, శ్రేయోభిలాషులను సమయం చిక్కినప్పుడల్లా కలుసుకొని తనవితీరా ముచ్చట్లను పంచుకోవాలను కుంటాము. అట్లా తమకు తాము ఉత్తేజితులు కావడానికి, ఇతరులకు భరోసాను కల్గించడానికి దోహదం చేస్తాయి అటువంటి ప్రయాణాలు. అట్లాంటి ఒకనాటి 'ఒక ప్రయాణం' అనుభవం కవిత్వమై మనతో ముచ్చటపెట్టింది. ఈ కవితలో కవి ఆత్మీయతను, ఆందోళనను కూడా గ్రహిస్తాము. 'పయనం ఆలోచనల తీగ పారకం/ కలిసి ప్రవహిస్తే మనసంతా పూలవాన/దారి పొడుగునా కళాత్మక కబుర్లు' అంటూనే కరీంనగర్ నుండి సిరిసిల్లా వరకు బహుభాషా కోవిదులు నలిమెల భాస్కర్ గారితో కలిసి చేసిన ప్రయాణం లోని దిగులు దృశ్యాన్ని ఇలా చెప్పుతున్నారు. 'కండ ఖండాలైన కొండ తునుకలు/లారీలకు లారీలు ఎదురవుతున్నయి/కరిగిపోతున్న గుట్టలు, విలవిలలాడిన నలిమెల/ భూమి పుట్టిన్నాటి గుట్టలు కదా!/వెయ్యితరాలుగా చెక్కుచెదరని కొండలు/ఈ ఇరవై ఏండ్ల నుంచే మాయమవుతున్నయి/సారు గొంతు ఆవేదనల జీర స్వరం'. మనం కూడా ప్రకృతిని విధ్వంసం చేస్తున్న తీరుకు కలతపడకుండా ఉండలేము. మిడ్‌మానేరు నీళ్ళ పరవశంను, మునిగిన పల్లెల వ్యథలను, రంగినేని ట్రస్ట్‌లో మోహన్ రావు గారిచ్చిన అతిథ్యం తీరును పలుపలు విధాలుగా వర్ణించారు.

'తనకు తాను నిత్యం పరితపించి/జాజు రాతల నినాదమైన వాడు/విప్లవాన్ని కలగన్న రేణ ఆయన' అంటూ ఉద్యమకారులైన చైతన్య ప్రకాశ్‌తో ఉన్న అనుబంధాన్ని గుర్తుచేసుకున్నారు. 'కొండాపూర్ ఆయన వూరు/నెత్తురు కారుతున్న పల్లెల ఎతలను/ జెండాలుగ ఎగరేసిన కవి' అని కొనియాడారు. సిరిసిల్ల అంటేనే ఎవరికైన జ్ఞప్తికి వచ్చేది చేనేతకు ప్రసిద్ధి అని. అక్కడి వాడవాడ దృశ్యాలను, ఆ చేనేత కార్మికుల దుస్థితులను కళ్ళకు కట్టినట్లుగా వర్ణించారు. 'సిరిసిల్ల ఊరంతా/రంగురంగుల నూలు పోగులు/ఆరేసిన ఇంద్రధనుస్సులు'. విద్యానగర్‌లో కవిత్వ తీగలతో ఎగబారిన గూడులో సాహిత్య దీపంతో విరాజిల్లుతున్న తెలంగాణోద్యమ కవి జూకంటి జగన్నాథం గారిని కలుసుకున్న వైనాన్ని వివరించారు. ఒక రోజులో తిరిగిన దారులను, కలిసిన ఆత్మీయులను మననం చేసుకుంటూ సాగిన 'ఒక ప్రయాణం' కవితలోని ముగింపు వాక్యాలు మరింత ఉత్తేజంగా వ్యక్తీకరించారు.

*'ప్రయాణం మనకొక వికాసం/ కడుపులున్న ముచ్చట్ల కలబోత/కండ్లకొక పసందైన దృశ్యం/ పారుతున్న కలాలకు కడుపార సిర/ సహవాస యాత్రనే జీవనోత్సాహం'*

అప్పుడప్పుడు మనం ఇతర ప్రదేశాలకు వెళుతుంటాము. ఆ విశేషాలను, అద్భుత దృశ్యాలను అన్నవరం కవిత్వంలోనే ఆవిష్కరిస్తారు. మనసులోని భావాలకు అందమైన పదాల కూర్పుతో ముచ్చట్లు చెప్పుతున్నట్టుగానే ఆయన కవిత్వం ఉంటుంది. 'జన్నారం' కవితలో కవ్వాల్ అభయారణ్యం అనుభూతిని ఇలా అక్షరీకరించారు. చ్చమైన తెలంగాణ పదాలతో అల్లిన ఈ కవితా పాదాలు ఆకట్టుకుంటాయి.

'పారుతున్న వాగునీళ్ళల్ల చేపల సంగీతం
మండల సాటున పిట్టల కిచకిచ ముచ్చట్లు
జింకలు కుందేల్ల పరుగు పరుగుల తరంగాలు
చెట్ల పొదల కెల్లి నెమల్ల ఆటల అలికిడి
పువ్వులు పువ్వులై లేస్తున్న సీతాకోక చిలుకలు
కవ్వాల్ అరణ్యమే అద్భుత జీవావరణం
అడవిలోనూ అదృశ్య అడుగులు
ఆదివాసులకే తెల్సిన అడుగుజాడలు
నడిచే వారికే ఎరుకున్న తొవ్వలు'

ఈ సంపుటిలోని 'ఆకాశ యానం' కవితలో విమానంలో నుండి ఆకాశంలో కనిపించే మేఘాలను కవి తన నిత్య అనుభవాల్లో చూసిన వాళ్ళ పనులతో పోలుస్తూ వర్ణిస్తారు. 'గొల్ల మల్లవ్వ కోదండ్లు సల్ల చిలికినంక/పెద్ద పెద్ద ఎన్న ముద్దలు ఆరబెట్టినట్లు/ దూదేకుల మైబెల్లి దూది ఏకీ ఏకీ/ఆకాశం నిండా పరిచి ఎండబెట్టినట్లుగ/సర్వల జువ్వ జువ్వ పాలు పిండంగనే/మొగులంతా పాల నురుగు పొంగి పొర్లినట్లు'గా అందమైన ఉపమానాలతో అల్లిన ఈ కవిత మనల్ని ఆకట్టుకుంటుంది. మనం కూడా కాసేపు ఆకాశంలో పయనించినట్లుగా అనుభూతి చెందుతాము.

తమిళనాడులో తిరిగిన ప్రదేశాలను, దర్శించుకున్న దైవ క్షేత్రాలను గూర్చి తనదైన కోణంలో 'తమిళ నేల' కవితలో రాశారు. అందులో 'నలుపు ఒక విస్మృత వర్ణం/అది అల్లనేరండ్ల మెరుపు సౌందర్యం' మని ఆ ప్రాంత ప్రజల గూర్చి వివరిస్తారు. వాళ్ళ ఆహారపు అలవాట్లను, వాళ్ళ దేవాలయాలను, వాళ్ళ ఆకారాలను, వాళ్ళు ధరించే



బట్టలను, వాళ్ళ భాషను, వాళ్ళ స్నేహమాధుర్యాన్ని, అక్కడి పోరాటాలను ఈ కవితా పాదాలలో గుర్తు చేస్తున్నారు.

*'శ్రీరంగం మధురై ఆలయ ఆలయమూ*
*కన్ను మిన్ను గానని శిల్ప రమణీయ సౌందర్యం*
*అక్కన్నే రామానుజుడు కొందరి చెవుల్లోంచి*
*అందరి చెవుల్లోకి ఒంపిన మంత్రోపదేశం*
*పెరియారు రాముడు తిరువల్లూరుల*
*ప్రతాపం అక్కన్నుంచే తమిళ నేలంతా*
*వెలిగిన సామాజిక సమానత'*

కవిత్వమంటేనే ప్రజారాజకీయాలు. ప్రజల వైపు నుండి మాట్లాడే గొంతునే కవిత్వం. కవులందరు ఏదో ఒక ధిక్కారంకై రచనలు చేస్తుంటారు.వాళ్ళు, వీళ్ళు అనే భేదాలు లేకుండా మనమంతా ఒక్కటే అనే భావాల్ని చెప్పటానికి పూనుకుంటారు. చరిత్రలో జరిగిన అన్యాయాలను అర్థం చేసుకుంటూనే దగాపడిన సామాన్యుల వైపున నిలబడే తెగువ కవులకు ఉంటుందని ప్రత్యేకంగా చెప్పవలసిన అవసరం లేదు. 'గవాయి' కవితలోని అంతరార్థంను గ్రహిస్తే చాలు ఈ దేశం మనదేనని, వలస వచ్చిన వాళ్ళం మనం కాదని, ఇక్కడి మూలవాసులము మనమేనని తెలుసుకుంటాం. కవి వ్యక్తం చేసిన అభిప్రాయాల పట్ల ఎవరికి అభ్యంతరం ఉండక పోవచ్చు.

*'తల్లి కడుపుల ఎల్లిన మాయ*
*ఇంటి పెరడులోనే ఇంకి పోయింది*
*ముంతల కోసం పురావస్తు తవ్వకాలు తవ్వకో*
*బొడ్డుతాడు కోసిన కొడవలి లిక్కి*
*అంటిన నెత్తురు మరకలకు చిలుం పట్టింది*
*మిన్నుకు మన్నుకు తెలుసు*
*పుట్టుక చావు అన్నీ ఈ జీవాత్మలోనే*
*అవును భారతదేశం మా యొక్క మాతృభూమి*
*భారతీయులందరం పక్కా సహోదరులం*
*మేము ఆవుల మేపుకోనీకి*
*ఏ వింధ్య పర్వతాలు దాటి రాలేదు'*

కరోనాకాలంలో వలసకార్మికులు పడిన కష్టాలను తలుచుకుంటే కళ్ళపొంటి కన్నీళ్ళు ఆగవు. గ్రామాల్లో ఉపాధి లేక నగరాలకు, పట్టనాలకు వలస వచ్చిన కోట్ల మంది వెతలను కళ్ళార చూసినాము. నా అన్న వాళ్ళు లేని నగరాల్లో చచ్చుట కంటే పుట్టిన ఊళ్ళల్లో చనిపోతే దగ్గరివాళ్ళైన ఉంటారనే బలమైన ఆశలతో ఊళ్ళవైపు పయనించిన వాళ్ళ తీరని బాధలకు చలించని మానవులు లేరు. లాక్‌డౌన్‌తో ప్రయాణ సాధనాలు బందుపెడితే కాలినడకన వందల కిలోమీటర్లు నడిచి స్వంత గ్రామాలకు చేరుకున్న వాళ్ళను చుశాము. ఆ దు:ఖభరితమైన కథనాలకు చలించిన కవులు, రచయితలు కవితల్లో, కథల్లోని అక్షరాల్లోకి తెచ్చారు. 'ఊరి దిక్కు' కవితలో 'బొటన వేళ్ళకు పొక్కౌతుల దెబ్బలు/నల్లారం పసరు రాసుకున్న గాయాలు/నల్లని రోడ్ల మీద నెత్తుటి జాడలు/కన్న ఊరి దిక్కే మనసు గుంజుడు/రొట్టె పెంకా పగిలిపోయింది/నిలువ నీడా కూలిపోయింది/రెండు రెక్కలు నిలిచి పోయినయి/నక నకల ఆకలి దుక్క పెడుతుంది/ ఊరికి చేరేదాక నడకనే నడక/ఏమన్నా అయితే మా దేహాలన్నా చేర్చండి/పుట్టిన చోటే పునర్జీవనం'.

ఎండనక వాననక, పగలనక రాత్రనక 44వ జాతీయ రహదారి మీద నడుస్తున్న వాళ్ళ ఆకలిని తీర్చడానికి పెర్కిట్ వద్ద మిత్రుడు, సామాజిక కార్యకర్త గంగారెడ్డి, కొద్ది మంది సహృదయ ఉపాధ్యాయులు కలిసి వలసకార్మికులకు లేదనకుండా భోజనం పెట్టిన మానవీయతను 'ఎన్‌హెచ్44' కవితలో కొనియాడారు. మేడ్చల్‌లో రింగు రోడ్ దగ్గర, బాల్కొండ ఇంకా ఇతర ప్రాంతాలలో అంగన్‌వాడి అక్కల వంటలను చూసిన కవి తెలంగాణ ప్రజలు పోరాటంలోనే కాదు సహాయమందించడంలో కూడా ముందుంటారనే కవితా వాక్యాల్లో అభినందనీయంగా వ్యక్తం చేశారు.

'ఎవల పొట్ట వాళ్ళు నింపుకోవడమే కాదు
కాలే కడుపుల కోసం కదులుతున్న ఆ తండ్లాట
దారెంట ముప్కాల్, బాల్కొండ ఊర్లల్ల
అంగన్‌వాడి అక్కల బహిరంగ వంటిల్లు
చపాతీ కూర అన్నం నీళ్లు నిరంతర సరఫరాలు
అలసిన డొక్కలకు ఆ పల్లెల అమృతధార
తెలంగాణ మంటే తెగించిన పోరాటమే కాదు
వితరణ చేసే అన్నదాన శిబిరం..'

మొత్తం 46 కవితలున్న ఈ సంపుటిలో ఏ కవితను చదివిన కూడా దాని ప్రాధాన్యత ఏమాత్రం తక్కువగా లేదు. అందరికి అన్ని నచ్చకపోవచ్చు. కవి తన దృష్టిలోకి వచ్చిన సమకాలీన అంశంపై రాయకుండా మాత్రం లేదు. రైతుల ఉద్యమం నుండి తయారవుడు దాక విస్తృతంగా రాశారు. నిశితమైన పరిశీలనతో 'కడియాలు, సౌందర్యం, వరినాట్లు, మరణ సంక్రమణం, అసంత అసంత, నిశ్చల నగరం, కాలం బహురూపులది, విత్తన చౌరస్తా, స్త్రీలు-పూలు, వడపోత, అల్లిబిల్లి' వంటి కవితలు కవి ఆలోచనలకు దర్పణాలు.

తరాలు మారుతున్న కొద్ది మనుషుల్లోని గుణాలు కూడా మారుతున్నాయి. ఒకప్పుడు సామూహిక జీవనం కనిపించేది. ఇప్పుడు ప్రపంచీకరణతో, అంతర్జాలంతో మనుషులు విడివిడిగా బతుకుతున్నారు. ఆత్మీయ అనుబంధాలను, మమతాను రాగాలను కలిగి ఉండాలనే తపనతో కూడిన కవిత్వమిది. 'పట్టింపు' కవితలో 'మనిషికి మనిషి మీద పట్టింపు పుట్టుకతోనే/అహంకారం పెరిగితేనే అది విరిగిపోతది/మమకారం కొనసాగితేనే జీవనోత్సాహం' మన్నారు. ప్రయోజనకరమైన జీవన యానపు ఆవిష్కరణలైన అన్నవరం 'గవాయి'లోని కవితలను ఒక్కసారైన చదవాల్సిందే..!

***రచయిత సెల్: 9440979882***

# బతుకమ్మ పాట



బంగారు మా తల్లి బతుకమ్మ
తెలంగాణ తల్లి బతుకమ్మ
మీ సంబురాలు మహా వరం
గడప గడపకు బంధువైనవు
తడవ తడవకు మదిలో మెదిలేవు
బతుకమ్మ ॥ బంగారు ॥

గునుగు తామర తంగేడు పూలు
గుమ్మడి పూల సప్తవర్ణములు
మట్టి నుండి మట్టిలోనికి చేర్చు
మానవీయత మర్మం తెలుపు
ఆడపడుచుల ఆనంద హేళ
అందరు నీ వాళ్లను దీవించే
మా బతుకమ్మ మా బతుకమ్మ ॥ బంగారు ॥

మా బ్రతుకుకు బాసటయినవు
ఉద్యమాలకు ఊపిరయినవు
కష్ట సుఖాలలో తోడై నిలిచినవు
ఐకమత్యమై వెల్లివిరిసినవు
దుఃఖం బాపే ధన్యజీవివి
నీవు లేనిదే మేము లేములే
మమ్మేలు మా బతుకమ్మ
మా బతుకమ్మ ॥ బంగారు ॥

గుండె చప్పుడై కొలువు తీరినవు
తెలంగాణ సంస్కృతిని చాటినవు
రంగు రంగుల పూలు తెచ్చినము
ఆట పాటలతో నిన్ను కొలిచినము
నీ భయమే మా ధైర్యము
బంగారు తల్లి బతుకమ్మ
మా బతుకమ్మ ॥ బంగారు ॥

***- వైద్యం భాస్కర్, సెల్ : 6305871912***

# అమ్జద్ కొత్త సీరియల్ నవల - 5వ భాగం

# రాజీ యే గెలిచింది!?



(గత సంచిక తరువాయి)

ఠంచన్‌గా ఏడుగంటలకు కాలింగ్ బెల్ నొక్కాను. గుర్ఖా వెంటనే బయటికొచ్చాడు, పెద్ద ఇనుప గేటులో అమరి ఉన్న చిన్న గేటులో నుంచి. నా పేరు చెప్పాను. ఓ సెల్యూట్ లాంటిది కొట్టాడు. చిరు నవ్వు తో "గోపాల్ జీ!" అంటూ లోనికి ఆహ్వానించాడు.

ఇంట్లోకి ప్రవేశించడానికి మరో విలువైన, నగిషీలు చెక్కబడిన విలువైన కలప తలుపుల ద్వారం. గుర్ఖా ఇంటర్కామ్ నొక్కి "అమ్మా... గోపాల్ జీ!" అని అన్నాడు.

కొన్ని క్షణాల్లో వయసు మళ్ళిన ఒకావిడ తలుపు తెరచి "రండి! గోపాల్ గారు" అంటు అధునాతన ఫర్నీచర్ తో అందంగా ఇంటీరియర్ డెకొరేషన్ చేయ బడిన హాలు లోనుంచి ఓ గదిలోకి తీసుకెళ్ళింది.

"దయచేయండి... గోపాల్ గారు!" అని చెబుతూ సోఫా సెట్‌లో కూర్చోమన్నట్లు సైగ చేసి వెళ్ళి పోయింది. ఆమె ఇంటి పని మనిషియేమో... అర్థం గాలేదు? కాని నా రాక వీళ్ళందరికి నా పేరుతో సహ తెలిసి ఉన్నట్లుంది.

కొన్ని క్షణాల తర్వాత చిరు నవ్వులతో ఖరీదైన ఫారెన్ స్వీట్ సెంట్ సువాసన వెదజల్లుతూ ఓ లేడీ ప్రవేశిస్తూనే "ఐ ఆమ్ వెరీ సారీ మిస్టర్ గోపాల్ టు కీప్ ఆన్ యు వెయిటింగ్!" అని అంది, వేస్ట్రన్ స్టైల్ ఉచ్చారణ.

"నో ప్రాబ్లం!" అని భుజాలెగరేస్తూ లేచి నిలబడి రెండు చేతుల్తో నమస్కారం పెట్టాను.

"ప్లీజ్ సిట్ డవున్!" అంది తను కూర్చొంటూ.

నన్ను బాగా పరికించి చూస్తూ, రిలాక్స్ అవుతు న్నట్లనిపించింది.

"మీ వారు ఎవరు మీతో రాలేదా?" అడిగింది.

"ఇఫ్ యూ లైక్... మీ...తీసుకొస్తాను!" ఎలాంటి బిడియం లేకుండా చెప్పాను.

"సారీ! నా లైక్ కాదు ఇంపార్టెంట్! విజ్జికి మీరు నచ్చాలి అంతే...!" అంది కిలకిలా నవ్వుతు.

"ఐ మీన్ అదే నా ఉద్దేశం!" తడుముకోకుండా జవాబు చెప్పాను, నవ్వు జత చేస్తు.

మీ సి.వి. చూశాం. మరి కొన్ని వివరాలు ఖాన్ గారి ద్వారా, హోమూద ద్వారా తెలిశాయి. మీరు గాక మరో నలుగురిని ఇంటర్వ్యూ చేశాం. వాళ్ళు మాకు నచ్చలేదు బి ఫ్రాంక్లీగా" ఆమె గొంతు చాలా బాగుంది.

"మీ గురించి చెప్పండి...ఐ మీన్ విజ్జి గురించి" అని అన్నాను.

"నా పేరు మంజు...మంజుల. విజ్జికి నేను అంటీ నవుతాను. ఐ మీన్ విజ్జి నాన్న గారికి నేను ఓన్లీ సిస్టర్ని. విజ్జి కూడా ఓన్లీ డాటర్! కెనెడియన్ సిటీజన్. నేను కూడా...! మై బ్రదర్...అదే విజ్జి ఫాదర్...మిస్టర్ సంపత్ కెనడాలో పెద్ద బిజినెస్ మ్యాగ్నెట్! సో... మీలాంటి యంగ్, టాలెంటెడ్, ఎక్స్‌పీరియన్స్‌డ్ ఫెలో కోసం ఇండియా కొచ్చాం. సంపట్ పెళ్ళి సంబంధం ఓ.కె. అయితే కన్యదానం కోసమే ఇండియా రాగలడు. మా వదిన అపోలో హాస్పిటల్‌లో అడ్మిట్ అయి ఉంది రెండు వారాల నుంచి. ఆమెకు హై బి.పి. విజ్జి అక్కడికే వెళ్ళింది తన అమ్మను చూడడానికి. విజ్జితో మొబైల్‌లో మాట్లాడాను. మీరు వచ్చినట్లు తెలిపాను. సో...శీ ఈజ్ ఆన్ ద వే!" అంది క్లుప్తంగా.

> ***అమ్మాయి అందంగా ఉంటుంది. ఏకైక కూతురు. బ్యాంక్‌లో ఆమె పేరున ఫిక్స్ డిపాజిట్ పదిలక్షలున్నాయి. శంషాబాద్‌లో ఓ బంగ్లా ఉంది. అది కూడా పసుపు-కుంకుమ కింద వస్తుందట! చదువు మాత్రం ఇంటెర్మీడియేట్. ఇంటిపనులు, వంటపనులల్లో దిట్ట!!***

"మీరు నెట్ లో కూడా ప్రయత్నించారా?" అడగ కూడని ప్రశ్న అనుకున్నాను అడిగాక!

"ఆ ఫీల్డ్ లో మా కంతగా నమ్మకం లేదు!?" అందమైన తన భుజాలెగురవేస్తూ అంది.

ఓ గాజు ట్రే లో రెండు గ్లాసుల్లో ఫ్రెష్ ఆరెంజ్ జ్యూస్ తో వచ్చింది, నన్ను లోనికి ఆహ్వానించిన ఆవిడ. తెచ్చిన ట్రే టేబుల్ మీద పెట్టి వెళ్ళిపోయింది.

"మీరు ...మ్యారీడా!?" అని అడిగాక గుండె వేగం పెరిగింది.

"యస్... వన్స్!" అంది ఈజీగా! జూస్ గ్లాస్ నాకందిస్తూ.

నా గుండె యధాస్థితికొచ్చింది.

"యూ...మీన్!" నసిగాను ఆమె నుంచి గ్లాసు అందుకొంటు.

"ఐ ఆమ్ డైవర్స్ డ్!" అనంది.

ఎందుకో ఆమె నుంచి ఆ మాట వింటే నా మీద మెరవని ఓ ఉరుము పడినట్లైంది. అందా ల...సౌందర్య రాణుల పోటీలలో గెలుచుకొచ్చె అన్ని రకాల గుణాలున్న మంజుల డైవర్సా...!"

''ఐ ఆమ్ సారీ మంజుల'' అని అన్నాను కలుపుగోరుతనంగా.

"ఇట్స్...ఓ. కె ...నో ప్రాబ్లమ్!" అంది చిరు నవ్వుతో.

"మీరెప్పటి వరకు ఉంటారిక్కడ?" కుతూహలం గా అడిగాను.

"విజ్జికి పెళ్ళయిన రెండో వారంలో విజ్జితో వెళ్ళి పోతాను. ఆ తర్వాత అబ్బాయికి వీసా పంపిస్తాం రెండు వారాల్లో'' అనంది. నాకు కావల్సిన సమాధానం కాదది. అందుకే మళ్ళీ అడిగాను.

"ఐమీన్...మంజుల గారు...!" నా మాటను పూర్తి గాక ముందే అందుకొని అంది, "నో నీడ్...గారు... మంజుల అనండి చాలు!'' అంది గ్లాసు నోట్లో పెట్టుకొంటూ.

''...అదే...మరిమీరు...ట్రై చేయట్లేదా ఫర్ మ్యాచింగ్స్...!"

"నాకు నచ్చిన మ్యాచింగ్స్ చాలా ఉన్నాయి టోరెంటోలో. కాని సమపట్ కు నచ్చట్లేదు. ఇండియన్ బ్యాగ్రావుండ్ ఉండాలి. తెలుగు కల్చర్ కావాలంటు న్నాడు... విజ్జి సంబంధం ఖాయమైనాక... చూ స్తాను!" అంది చిరునవ్వుతో.

ఇంతలో మంజుల మొబైల్ మ్రోగింది.

గుర్ఖా కబురందించాడు అమ్మాయి వచ్చిందని.

మంజుల సోఫా లో నుంచి లేచి నిలబడి, "విజ్జి వచ్చింది. తీసుకొస్తాను" అని వెళ్ళింది.

మంజుల హైట్ బాగానే ఉంది. ఆరోగ్యకరమైన శరీరాకృతి.

విజ్జి సంబంధం ఖాయమైతే నా జీవితం 'కేక్ వాక్' యే అని మనసు చెప్పసాగింది.

విజ్జి, మంజుల నవ్వులు గట్టిగా వినిపిస్తున్నాయి హాల్లోంచి.

గదిలోకి వస్తూనే, "హాయ్! గోపాల్!! హావ్ డు యు డు?" అంది.

''హెలో! గుడ్ ఈవనింగ్. ఐ ఆమ్ ఫైన్.



*ఎదురెదురుగా ఉన్న సింగిల్ సోఫాలో నాన్న, రాఘవయ్యగారు కూర్చున్నారు. అలాగే ఎదురుగా ఉన్న డబుల్ సోఫా సెట్లో నాన్నగారి వైపు అమ్మ అదే సోఫా లో రాఘవయ్యగారి వైపు వారి భార్య కూర్చుంది. వారి కెదురుగా ఉన్న మరో డబుల్ సోఫాసెట్ లో నేను సింగల్‌గా కూర్చున్నాను. ఈ సోఫాసెట్ చతురస్రాకారంలో అమర్చబడి ఉంది.*

థాంక్యు!" అని నీరుకారిపోయాను!?

"గోపాల్...మీట్ టు మై స్వీట్...విజయ... విజ్జి!" అంది మంజుల నాతో.

స్వీటియా...నా బొందన! నోట్లో పట్టరాని కారపు బజ్జీ...శోకిస్తూన్న మనసులో నాకు నేనే ఓదార్చుకునే పదాలు వెదుకుతున్న! స్వయం ఓదార్పు కన్న మించిన ఓదార్పు లేదు. ఓరీ భగవంతుడా ఏమిటీ పరీక్ష! ... చివరికి నన్ను నాలో దాచుకొని మర్యాదగా విజ్జితో షేక్ హ్యాండ్ చేశాను. అది హ్యాండా? స్టైన్లెస్ స్టీల్ రాడా!

నా ప్రక్కనే వచ్చి కూర్చుంది విజ్జి...విజయ. గగుర్పాటుగా ఉంది నాకు ఆమె వొళ్ళు తగులుతూన్నప్పుడల్లా. పైగా ఆవిడ గారి రెండు చేతుల్లో పింక్ పాంథర్! బక్కీ (రాకేష్) గాడు గుర్తు కొచ్చాడు విజయ చేతిలో ఆడుతున్నది పింక్ పాంథర్ కోతి కాదు... రాకేష్...బొంతపురుగు.

నా ముఖ కవళికలు మంజుల గమనిస్తూనే ఉంది. ఆమెకు మంచి సైకాలజీ పట్టు ఉన్నట్లుంది! గ్రహించేసినట్లుంది. నా కైతే గ్రహణం పట్టేసినట్లుంది.

కొన్ని నిమిషాల తర్వాత "మీరు మాట్లాడు కోండి..మళ్ళీ కలుద్దాం!" అని లేచాను.

"ఓ.కే" అంటూ మంజుల కూడా లేచింది సోఫా సెట్ లో నుంచి. విజ్జీ లేవలేక లేచింది సోఫా సెట్ లోనుంచి, భారీ శరీరంతో.

ఏ మాటకామాట చెప్పుకోవాలి! టోరంటో లో మీరేంజేస్తున్నారని గేటు వరకు సీ ఆఫ్ చేయడానికొచ్చిన మంజుల నడుగగా, "ఐ యామ్ అనస్థీటిస్ట్!" అంది చిరునవ్వుతో.

మంజులను చూశాక ఆమె అందం ఎక్కించిన, అనస్తిషియాకే నేను స్పృహ కోల్పోయానులా అనిపించింది ఇంటికి చేరుకొంటూండగా.

***

యధాప్రకారం, చాలా రోజుల తర్వాత అమ్మ నాన్నగారి కోడ్ లను డీకోడ్ చేసి చెప్పింది. గుండె గొంతుకలో ఇరుక్కుంది, నాన్నగారి కెంపనీలో డ్రగ్స్ ఏరియా సేల్స్ మేనేజర్ గారి ఏకైక కూతురిని చేసుకొమ్మనగానే! నాన్నగారందించిన వధువు వివరాలు అమ్మగారి ద్వారా అయిష్టంగా నా చెవుల్లోకి వెళుతున్నాయి.

అమ్మాయి అందంగా ఉంటుంది. ఏకైక కూతురు. బ్యాంక్‌లో ఆమె పేరున ఫిక్స్డ్ డిపాజిట్ పదిలక్షలున్నాయి. శంషాబాద్‌లో ఓ బంగ్లా ఉంది. అది కూడా పసుపు–కుంకుమ కింద వస్తుందట! చదువు మాత్రం ఇంటెర్మీడియేట్. ఇంటిపనులు, వంటపనులల్లో దిట్ట!! లాస్ట్ బట్ వన్...నాకంతగా రుచించలేదు. ఇంటర్మీడియటేనా!

"ఏమిట్రబ్బాయ్! మాట తేల్చలేదు? నాన్న గారొచ్చే వెళ్లయింది. విషయమేమిటో నాంచకు! తేల్చేశేరాబ్బాయి!" అంటు వేధించసాగింది అమ్మ.

"ఇల్లు హైదరాబాద్‌లో ఉంటే బాగుండేది! అద్దెకిచ్చుకోవచ్చును" అని నసుగుతూ తిరిగి పడుకున్నాను నిద్ర రాకున్నను! రాత్రి తొమ్మిది దాటింది...రాత్రి రెండు జాములైంది. మూసిన కన్నులు తెరవకపోయిన, తెరచిన కండ్లలో కనిపించి నట్లుగా చిరునవ్వులతో మంజుల.

మనిషి మనసు కోతిలాంటిదో...ఆలోచన కోతి లాంటిదో...లేక కోతిలాంటివాడో...? డార్విన్ థియరీ నెమరువేసుకొంటూండగా ఎప్పుడు నిద్రపట్టిందో...?

ఉదయం తొమ్మిది గంటలకల్లా బర్రు బర్రున ఓ ముగ్గురాడవాండ్లు, ఓ వయసు మళ్లిన వాడు, మరో కుర్రాడు లాంటి పెద్దమనిషి కారులో ఇంటిమీది కొచ్చేశారు, ఓ చిన్న దండయాత్రలా.

నాన్న గారెప్పుడో పెందరాళ్లే వెళ్లిపోయారు.

ఆరా తీయగా వచ్చిన వాళ్లు ఏరియా మేనేజర్ గారి తాలుకు వాళ్లు. నన్ను చూడడానికొచ్చారు! హైదరాబాద్‌లో ఇరవై లక్షల విలువగల ఇల్లును కొనిపిస్తాం అని అంటున్నారు. ఇదెక్కడి గొడవరో అని బాత్రూం లో ఓ సాడ్...సోలో సాంగ్ లాంటిది షెవర్ కింద గొణుక్కొంటూ...అమ్మాయిని చూడటానికి వెళ్లాల్సిందిపోయి అబ్బాయిని చూడడం మొదలైంది!? పాయే కాలం వచ్చింది అని అంటుంటారు. ఇందుకనే కాబోలు అనుకొంటూ తయరయ్యాను.

అమ్మ లోలోన నవ్వుకొంటున్నట్లు నేను అర్థం జేసుకోక పోలేదు. ఏదో ఒకటి మాట్లాడాలి కాబట్టి... పైగా సభ్యత కలిగిన వాణ్ణి. వాళ్లందరిముందు ఓ

అరగంట సేపు కూర్చొని, వారితో కలసి అమ్మ చేసిన టిఫిన్ తిని బయట పడ్డాను.

"నేను అమ్మాయిని చూడందే ఏమి చెప్పలేను!" అని అమ్మకు ఓ హెచ్చరికలాంటిది చేసాను.

"అలాగేలేరా! అమ్మాయి బాగుంటుంది! మీ నాన్నగారు చూశారంట ఎన్నోసార్లు"అంటు నవ్వుతూ సమాధానం చెప్పింది అమ్మ.

ఈ గండం గడిచేదెలా అనుకొంటు నా బైక్ బయటికి తీసి, ఆఫీస్ వైపు వెళ్లాను ఇంకా ఆఫీసుకు టైం కాకపోయిన!

అమ్మాయిల కొరత లేదని అమ్మ ఎప్పుడు చెప్పుతూనే ఉంటుంది. సిరిసంపదలతో తులతూగుతూ ఆదర్శవంతమైన భర్త కోసం ఎదురుచూసే అమ్మాయిల కొరత కూడా లేదని నేను కూడా అమ్మతో చెప్పుతుంటాను. నాలో ఏమి తక్కువుందని? గొప్పగా చదువుకున్నాను. మంచి ఉద్యోగం చేస్తున్నాను. స్వంత ఇల్లు ఉంది. ఒక్కగానొక్క కొడుకుని. రాబోయే అమ్మగారికి తోటికోడళ్లు, మరదలుల్లాంటి గొడవలు లేవు అని అమ్మతో గారం చేస్తూ అడపదడపా చెప్పుతూండేవాడిని.

ఇదంతా విని ఓ సారి అమ్మ అంది, "నువ్వసలు పేరాశాలకు లొంగిపోయావోయ్!" నవ్వుతూ, "మీ నాన్న చూడు! ఓ చిల్లిగవ్వ కట్నం లేకుండా నన్ను చేసుకున్నాడు!!"

అలా ఆలోచిస్తూ ఆఫీసు వైపు వెళుతుంటే ఓ చోట ట్రాఫిక్ సిగ్నల్ వల్ల కొద్దిగా ఆగాల్సొచ్చింది. మా పర్సనల్ మేనేజర్ ఎందుకో గుర్తుకొచ్చాడు. ఎదురుగా కనిపిస్తున్న పాత సినిమా అడ్వర్టైజ్ బోర్డ్ ను చూడగానే. అది 'మైనే ప్యార్ కియా' సినిమా బోర్డ్. అందులోని బుగ్గల భాగ్యశ్రీని చూస్తే అతడు గుర్తుకొచ్చాడు. అంటే...ఆమె మరదలు సంధ్య గుర్తుకొచ్చింది!?

ఓ సారి ఉన్నట్టుండి నా ప్రమోషన్ గురించి తన ఆఫీసు గదిలో మాట్లాడుతూ, "ఆఫీసు వదిలాక మా ఇంటికి వెళ్దాం. ఏంజేస్తుంటావ్ సాయంత్రం పూట?" అంటూ నా సమాధానం కోసం ఎదురు చూడకుండానే తనింటికి ఫోన్ జేసి చెప్పాడు మేము వస్తున్న సంగతిని!

వెళ్లక తప్పలేదు. టీ కని తీసుకెళ్లి బోలెడు పిండివంటలతో కడుపునిండా తినిపించి, కడుపుబ్బ నవ్వించి, చివరికి తన మరదలను పరిచయం చేశాడు! అతడి మరదలు పుత్తడి బొమ్మలా ఉంది. ఇరవై ఏండ్లు ఉండి ఉంటాయి. చూపులని ఇట్టే ఆకర్షించే మోహం.

పిచ్చాపాటి కబుర్లయ్యాక, సెలవు తీసుకొని వెళుతుండగా "ఎలా ఉందోయ్ మా మరదలు పిల్ల?" అని చనువుగా అడిగాడు మా పర్సనల్ మేనేజర్, నా భుజాలపై తన కుడి చేతిని పెడుతూ ఆప్యాయతగా!

***కనుల నిండుగా అమ్మాయిని చూసాక అమ్మ మొహం వికసించింది తామర పువ్వులా. నా పక్కన వచ్చి కూర్చుంది అమ్మ. నా వైపు చూసి ముసి ముసి నవ్వులు నవ్వసాగింది. అమ్మ మొహంలో వికసించిన నవ్వు తేట తెల్లమైంది నాకు. అమ్మాయి నా కెదురుగా ఉంది. ఒక్క మాటలో చెప్పాలంటే 'దివి నుంచి భువికి దిగొచ్చిన పారిజాతం' లా ఉంది!***

"గుడ్!" అని అన్నాను అప్రయత్నంగా.

"అయితే మీ వాళ్లను పంపించు మరి!" అతని మొహం వికసించింది నా జవాబుతో. నా గొంతులో పచ్చి వెలక్కాయ పడినట్లైంది.

ప్రమోషన్ కింద తన మరదలను నా కంట పెడుదా మనుకొంటున్నాడు ఆ ఘనుడు. ఏదో పల్లెటూరులో ఓ పదెకరాలున్న వాళ్ల చేతుల్లోకి నేనెలా చిక్కుతాను!?

వెనుకాల కార్ల, స్కూటర్ల హారన్ మోతలతో ఉలిక్కిపడి, ఎదురుగా గ్రీన్ లైట్ కనిపించగానే పర్సనల్ మేనేజర్ నా ఆలోచనల్లోంచి కనుమరుగైపోయాడు.

తరచుగా ఆఫీసుకు లేట్‌గా వచ్చేవాణ్ణి చూసిన మా ఆఫీసు బంట్రోతు నవ్వుతు, "తబియత్ ఠీక్ హై న సాహెబ్!" అని పలకరించాడు.

సాయంత్రం ఆఫీసు వదలగానే తిన్నగా ఇంటికి చేరుకొన్నాను. ఈ రోజు ఎందుకో ఒంట్లో బడలికగా ఉంది. డాబా మీది కెళ్లి కూర్చోవాలి హాయిగా వేపచెట్టు గాలి పీలిస్తూ అని అనుకొంటూ ఇంట్లోకి అడుగు పెట్టాను.

అమ్మ ప్రేమగా చిరునవ్వుతో ఆహ్వానించింది.

నా కంప్యూటర్-మెదడు గిర్రున తిరిగింది. ఏదో జరిగిపోయిందని నా కనుమానం వేసింది.

"త్వరగా స్నానం చేసిరా! నీకు కాఫీ పోస్తాను. నాన్నగారు రానున్నారు. కొన్ని నిమిషాలక్రితమే నీ కోసం ఎదురు చూస్తూ...మేనేజర్ రాఘవయ్య గారికి ఫోను చేయడానికంటు బయటికెళ్లారు" అనంది అమ్మ.

"రాఘవయ్య గారికా! వారికెందుకు?" రాగం తీస్తూ అడిగాను.

"ఎందుకేమిట్రా? మనం వారమ్మాయిని చూడడాని కెళుతున్నాం!" తొందరపెడుతుంది అమ్మ. అమ్మాయినై ఉంటే అప్పుడే కండ్లవెంబడి పటపట కన్నీళ్లు రాలేవి!

నా నోటమాట పడిపోయింది.

నాన్న సూటు-బూటులో హుందాగా కూర్చున్నాడు ఆటోలో. అమ్మ ఎప్పటిలా సాధారణంగా తయారైంది ఎలాంటి డాబు-దర్పం లేకుండా.

నేను స్నానం చేశాను. కాని గడ్డం కుడా గీసుకోలేదు కావాలని. నాన్న అది గమనించి అమ్మకు సైగ చేయడం నా కనుకొనుల్లోంచి గమనించాను.

"ఏమిట్రబ్బాయ్! నీ ఈ వేషం?" అని అంది అమ్మ, నాన్న సైగను బలపరుస్తున్నట్లు.

"మనం అమ్మాయిని చూడడానికెళ్లుతున్నాం! మన టీవి చూపించడనికి కాదుగా!" అమ్మతో చెబుతూ, నాన్న నా వైపు చూస్తూండగా బలవంతంగా నవ్వు తెచ్చిపెట్టుకున్నాను. ఆటోలోని వివ్యూ అద్దంలో చూసుకొంటే నా మొహం ఆముదం తాగిన మొహంలా ఉంది.

మా ఆటో రాఘవయ్య గారి ఇంటి ముందుకు ఆగగానే వారింట్లో పరుగులు మొదలయ్యాయి. పెళ్లయ్యాక మొదటిసారి అల్లుడు ఇంటికి వచ్చినట్లు చేయసాగారు సపర్యలు.

హాలులో కూర్చున్నాం అందరం. రాఘవయ్య గారిని ఇంతకుముందు ఎన్నోసార్లు చూశాను. మా ఇంటికి కూడా ఎన్నో సార్లు వచ్చారు. కాని ఎప్పుడూ తన కూతురును వెంట తీసుకోరాలేదు. కేవలం సతీమణితోనే వచ్చేవారు.

హాలు అందంగా అధునాతనంగా అమర్చబడింది. ఖరీదైన ఇంటీరియర్ డెకరేషన్. టీ.వి, వి.సి.ఆర్ ఓ స్టాండ్ పై మరోచోట కంప్యూటర్. చిన్న అద్దాల బీరువాలో కొన్ని కొత్తపుస్తకాలు. మధ్యలో ఫారెన్ డెక్.

ఎదురెదురుగా ఉన్న సింగిల్ సోఫాలో నాన్న, రాఘవయ్యగారు కూర్చున్నారు. అలాగే ఎదురుగా ఉన్న డబుల్ సోఫా సెట్లో నాన్నగారి వైపు అమ్మ అదే సోఫాలో రాఘవయ్య గారి వైపు వారి భార్య కూర్చుంది. వారి కెదురుగా ఉన్న మరో డబుల్ సోఫాసెట్ లో నేను సింగల్ గా కూర్చున్నాను. ఈ సోఫా సెట్స్ చతురస్రాకారంలో అమర్చబడి ఉన్నాయి.

రాఘవయ్య గారి తాలుకు మరో ఇద్దరు ఆడ వాళ్ళు, నడివయసులో, మాటిమాటికి రాఘవయ్య తోను, వారి భార్యతోను వినీ వినిపించ కుండా వారి చెవుల్లో మాట్లాడుతు హాల్లోనుంచి అక్కడే ఉన్న గదిలోకి, గదిలోనుంచి హాల్లోకి కాలు కాలిన పిల్లిలా తిరగసాగారు.

నాన్న, రాఘవయ్యగారు, అమ్మ, మిసెస్ రాఘవయ్యగారు కబుర్లలోకి దిగారు. నేను హాల్లో అమర్చ బడిన సామాన్ల వైపు, నా కెదురుగా ఉన్న నిలువుటద్దంలో చూడసాగాను, చేసేదేమిలేక!

అలా కొన్ని నిమిషాలు గడిచాయి!

పండ్లు, ఫలహారాలతో ఓ యువతి రెండు చేతులతో ఓ ట్రే పట్టుకొని, నిండుగా కప్పుకొన్న పవిటతో మా మధ్యలో ఉన్న చిన్న గ్లాసు-టేబుల్ మీద పెట్టి, "తీసుకోండి అన్నయ్యగారు" అంటూ ఓ నవ్వు నవ్వి తుర్రుమంది.

అన్నయ్యగారని ఎవరిని అందామె? నాకర్థం

కాలేదు. రాఘవయ్యగారు గాని నాన్నగారు గాని ఆమెను పట్టించుకోలేదు! వాళ్లు తమ ఆఫీసు గొడవ లోనే ఇంక పడి ఉన్నారు.

రాఘవయ్యగారి భార్య మాత్రం అమ్మతో ఇంతకు క్రితం అమ్మాయిని చూడటానికై వచ్చిన వాళ్ల గురించి మట్లాడుతుంది. అబ్బాయి నచ్చిన వాళ్ల వంశం, గౌరవ-మర్యాదలు నచ్చక ఒప్పుకోలేదట!

ఘనకార్యం చేసిందనుకున్నాను.

కాసేపు తర్వాత నిండుగా పవిటకప్పుకొని వచ్చి, తిరిగి వెళ్లేటప్పుడు గాలిలో కెగిరించిన పవిటావిడ మరో యువతితో పాటు తమ మధ్యలో ముస్తాబై ఉన్న అమ్మాయిని నడిపించుకొంటూ తీసుకొచ్చారు. ఆమె చేతిలో విలువైన గ్లాస్-ట్రే. అందులో గాజు కప్పుల్లో నాలుగు టీలు. దించిన తల ఎత్తకుండా వచ్చి ఆగిందామ్మాయి మధ్యలో ఉన్న చిన్న టేబుల్ దగ్గర, రాఘవయ్య గారి సోఫాను దాటుకొంటు. అమ్మ లేచి ఆమె చేతిలోని ట్రే అందుకొని, టేబుల్ మీద పెట్టి తను కూర్చున్న చోట్లో ఆమెను పట్టుకెళ్లి కూర్చుండ బెట్టింది. కనుల నిండుగా అమ్మాయిని చూసాక అమ్మ మొహం వికసించింది తామర పువ్వులా.

నా పక్కన వచ్చి కూర్చుంది అమ్మ. నా వైపు చూసి ముసి ముసి నవ్వులు నవ్వసాగింది. అమ్మ మొహంలో వికసించిన నవ్వు తేట తెల్లమైంది నాకు.

అమ్మాయి నా కెదురుగా ఉంది. ఒక్క మాటలో చెప్పాలంటే 'దివి నుంచి భువికి దిగొచ్చిన పారి జాతం' లా ఉంది!

"తీసుకొండి...తీసుకొండి...బాబు ఈ టొమాటొ బజ్జీ టేస్ట్ చూడు..!" రాఘవయ్య గారి మర్యాదలు మళ్లీ మొదలయ్యాయి.

"సావిత్రి! అబ్బాయికి ఓ ప్లేట్లో ... పెట్టి ఇయమ్మ!" రాఘవయ్యగారు తమ కూతురిని ఉద్దేశించి చెప్పా రు. అక్కడే రాఘవయ్యగారి భార్య కూర్చున్న సోఫాకు వెనుకాల నిలబడి ఉన్న యువతి ముందుకొచ్చి, ఒక్కొక్క ప్లేటు తీసి అందులో తెచ్చిన రకరకాల పిండివంటలు అమర్చి పెడుతూండగా రెండో యువతి ఒక్కొక్కరికి ప్లేట్ అందించసాగింది.

సావిత్రి మాత్రం వణుకుతున్న చేతుల్తో నా కందించసాగింది. ముందుకెళ్లి నేనే ఆమె చేతిలో నుంచి ప్లేటు తీసుకొన్నాను.

ఆమె కండ్లు ప్రశాంత సరోవరం లోని తామర మొగ్గల్ని గుర్తుకు తెచ్చాయి. పెదవులు అప్పుడే విచ్చుకొన్న గులాబిరేకుల్లా ఉన్నాయి. మొహం చంద్రబింబం. ఆమెను చూస్తూంటే కనురెప్పలు కొట్టడం మరచిపోయేలా ఉన్నాను. నిగ్రహించు కొన్నాను.

అమ్మ నన్ను గమనిస్తున్నట్లు గ్రహించాను.

వీళ మాటల్లో టీ చల్లారి పోతూందని బెంగపడ సాగాను. చల్లారిన టీ తాగడం అంటే వేప నూనె బలవంతంగా తాగిస్తున్నట్లనిపిస్తుంది. ఫ్లాస్క్ కూడా లేదు!? నేనే చొరవ చేసుకొని టేబుల్ దగ్గరి కెళ్లి టీ కప్పు అందుకున్నాను.

అందరు నా వైపే చూశారు.

"ఏమిటీ బాబు! అప్పుడే టీ కొచ్చావ్? ఇంకా పండ్లు కూడా తీసుకో లేదు!" అంది రాఘవయ్యగారి భార్య నొచ్చుకొంటు.

"పర్లేదులెండి!" అన్నాను ముక్తసరిగా, ఆర్టిఫీషి యల్ నవ్వుతో.

"తొందరేమి లేదోయ్! రాఘవయ్యగారిల్లు, మనిల్లు ఒకటే...!" నాన్నగారు చెప్పారు. నాన్న గారి గొంతులో ఠీవి!

"మరే...మరే...!" ఆనందంతో ఉప్పొంగుతూ చెప్పారు రాఘవయ్యగారు నా వైపు చూస్తు. నాన్న గారి కామెంట్‌కు రాఘవయ్యగారు ఉబ్బితబ్బిబై పోయారు. నాలో ఎలాంటి మార్పు రాలేదు.

ఎలాగో తెచ్చిన సరంజామను తినేశాం అనిపిం చాం మొహమట పడుతునే. నాన్నగారిలో మాత్రం ఎలాంటి మోహమాటం లేదు. అమ్మ మాత్రం కొసిరి కొసిరి పెడుతూంటే ముసి ముసి నవ్వులతో తింటు మోహమాట పడసాగింది.

"పదండి అలా మేడమీది కెళ్లుదా!" అని అన్నారు రాఘవయ్యగారు.

సావిత్రి తప్ప అందరం లేచాం సోఫా సెట్ లోనుంచి.

"నువ్వెక్కడి కెళతావోయ్! ఓ రెండు నిమిషాల్లో వస్తాం!!" నాన్నగారి మిత్రుని అదలింపు. వారి డిప్లొమాసీ నాకు అర్థంగాక పోలేదు!

"అమ్మాయి సావిత్రి! అబ్బాయికి వేడీ వేడి కాఫీ ఇవ్వు!" రాఘవయ్యగారు వాత్సల్యపూర్వకంగా చెప్పారు.

యువతులిద్దరు వంటింట్లోకి పరుగెత్తారు అక్కణుంచి. ఖాళీ కప్పులు, ట్రే వగైర వగైరాలు టేబుల్ పై నుంచి తీసుకొని.

కావాలని మమ్మల్నిద్దరిని హాలో వదిలేస్తున్నా రని... ఆ రెండు నిమిషాలకు నిర్వచనం కనీసం అరగంట అయిన అవుతోందని అర్థం జేసుకొన్నాను.

ఈ సంబంధాన్ని వదిలించుకోవడానికి నేను, పట్టుకోవడానికి నాన్న ప్రయత్నాలు మొదలైయ్యాయి.

సావిత్రి బెదురుతూ బెదురుతూ కూర్చుంది సింగిల్ సోఫా సెట్లో, రాఘవయ్యగారు కూర్చున్న చోట్లో. నేను మాత్రం నా సీటు మార్చ లేదు. కాని కొంచెం ఒరగా కూర్చొని ఆమె వైపు చూడసాగాను.

ఏదో ఒకటి మాట్లాడాలి కాబట్టి ...ఇలాంటి విషయాల్లో మొగాళ్లు ఫస్ట్ కాబట్టి...మొదలెట్టాను.

"మీ పేరు?" అడిగాను చిరుమందహాసంతో.

"సావిత్రి...!"

"సావిత్రి గణేషనా?" అడిగాను నవ్వుతూ.

*(ఇంకా వుంది)*

# గరమ్ చాయ్



ఎన్నాళ్ళయిందో...
ఆ చలువరాతి పలకని పలకరించి
నాలుగు చేతుల్లో ని ..
నాలుగు చాయ్ కప్పుల్ని
మనసు విప్పి ఆస్వాదించి
నాలుగు రెళ్ళు ఎనిమిది కాళ్లు చుట్టూ చేరి
గుండెల్ని ఆ టేబుల్ పై పరిచి
తోక లేని పిట్టల్లా కబుర్ల సద్ది విప్పుకొని.

రోజంతా నిస్పృహల ఆకాశంలో గిరికీలు కొట్టి
సాయంత్రం అయితే చాలు
హోటల్ చెట్టు నీడలో వేడి పొగల కచేరి
పుడిసెడు కన్నీళ్లు
ఉపశమన విచికిత్సకి రెండు చిరునవ్వులు.

నిజం ........
ఇంత మహోన్నత ప్రకృతి వైద్యశాల
దేశంలో ఎక్కడుంది?
ఇది ప్రపంచ మతాల కూడలి
ఇరుకు తొలగిన హృదయాల వేదిక
ఇక్కడ వేలాడే గంటలు లేక పోవచ్చు
పరవశింపజేసే అగరొత్తుల ధూపం
ఉండకపోవచ్చు
ఇవి పిడికెడంత మానసిక శాంతి దేవాలయాలు
ఆకాశం ఆవిష్కరించని విశ్వవిద్యాలయాలు ఇవే
చర్చోపచర్చల న్యాయస్థానాలు
గుండె రక్తం లా గరమ్ గరమ్ గా
మనుషుల మనసులు సంగమించే రచ్చబండలు
నులి వెచ్చని చలిమంటలా
అందరి తగవులు తీర్చే పంచాయితీలు
శాసన సభల్ని పార్లమెంటుల్ని
ఎడం కాలితో తన్నే
ప్రపంచ మేధావుల కమ్మని గ్రంథాలయాలు!

**- ఈతకోట సుబ్బారావు,**

**9440529785**



# అసమాన నటుడు ఓంపురి

***అసమాన నటనా ప్రతిభతో ఎన్నో పురస్కారాలను, అవార్డులను అందుకున్న ఓంపురి హిందీ, మరాఠీ, పంజాబీ, మలయాళం, తెలుగు భాషలతో పాటు పలు ఇంగ్లీష్ సీరియళ్లు, సినిమాల్లో కూడా నటించారు. 1982లో 'ఆరోహణ్', 1984లో 'అర్ధ్ సత్య' చిత్రాలకు గాను ఆయన జాతీయ ఉత్తమనటుడు అవార్డులు అందుకున్నారు. 1990లో భారత ప్రభుత్వం నుంచి 'పద్మశ్రీ' పురస్కారం పొందారు. ఎనిమిది సార్లు ఫిలింఫేర్ అవార్డులు అందుకున్నారు. 1976 లో మరాఠి చిత్రం 'ఘాశిరామ్ కొత్వాల్' తో కెరీర్ ప్రారంభించిన ఓంపురి సినీ జీవితంలో 'ఆక్రోష్, ఆరోహ్, సద్గతి, తమస్, అర్ధ్ సత్య, జానే భీ దో యారొన్, బవ్నీ భవాయ్, మిర్చి మసాలా, ధారావి వంటి చిత్రాలు గొప్ప సినిమాలుగా నిలిచిపోయాయి. అనేక మంది గొప్ప నటీనటులతో, టెక్నీషియన్లతో కలిసి పనిచేసిన ఈయన తెలుగులో 'అంకురం' సినిమాలో నటించారు.***

ఓం ప్రకాష్ పురి 18 అక్టోబర్ 1950 వ సంవత్సరం హర్యానా లోని అంబాలలో జన్మించారు. అతను ఆరు సంవత్సరాల వయసులో ఉన్నప్పుడు, రైల్వే ఉద్యోగి అయిన అతని తండ్రి రాజేష్ పూరి సిమెంట్ దొంగతనం ఆరోపణలపై జైలుకు వెళ్ళాడు. దీంతో వారి కుటుంబం నిరాశ్రయులుగా మారింది. పూరీ సోదరుడు వేద్ ప్రకాష్ పూరి రైల్వే పోర్టర్‌గా పనిచేస్తూనే, స్థానిక టీ షాపులో పనిచేశాడు, సమీపంలోని రైల్వే ట్రాక్‌ల నుండి బొగ్గును సేకరించి తన కుటుంబాన్ని పోషించాడు. వేద్ ప్రకాష్ పని చేస్తూనే తమ్ముడు పురి చదువు కొనసాగింపచేశాడు. పురి ప్రాథమిక విద్య తర్వాత, థియేటర్ యాక్టింగ్ నేర్చుకోవడానికి ఢిల్లీలోని నేషనల్ స్కూల్ ఆఫ్ డ్రామాలో చేరాడు. తన తోటి విద్యార్థి అయిన నసీరుద్దిన్ షా ప్రోత్సాహంతో 1973లో పుణెలోని ఫిల్మ్ అండ్ టెలివిజన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇండియా లో చేరి అక్కడ నుండి నటనలో పట్టభద్రుడయ్యాడు. ఓంపురి మొదటి సినిమా పిల్లల సినిమా అయిన "చోర్ చోర్ చుప్ జా", "కల్లా కల్లా బాచిట్కో" లలో నటించారు. ఓంపురి జీవితం గడవడానికి కొన్నాళ్ళు స్టూడియోలలో కూడా పనిచేశాడు.

## ప్రధాన స్రవంతి చిత్రాలలోకి ప్రవేశం

ఓంపురి 1976లో కె.హరిహరన్, మణికౌల్ దర్శకత్వంలో రూపొందిన మరాఠీ చిత్రం "ఘాశిరామ్ కొత్వాల్" చిత్రం ద్వారా ప్రధాన స్రవంతి చిత్రాలలోకి ప్రవేశించాడు. 1977 లో 'భూమిక', 1978 లో 'అరవింద్ దేశాయ్ కి అజీబ్ దస్తాన్', 1979 లో 'షాయద్', 1980 లో ఆక్రోష్ లో బాధితుడైన గిరిజనుడు పాత్రలో నటించి, విమర్శకుల ప్రశంసలు అందుకున్నాడు. 1982 లో 'డిస్కో డాన్సర్', 'జిమ్మీ మేనేజర్', 'అర్ధసత్య' లో పోలీసు ఇన్స్‌పెక్టర్ గా నటించగా, దీనికి ఉత్తమ నటుడిగా జాతీయ చలనచిత్ర పురస్కారం అందుకున్నారు. 1996 లో వచ్చిన 'మాచిస్' చిత్రం కథ 1980 లో పంజాబ్ రాష్ట్రంలో జరిగిన ఆపరేషన్ బ్లూ స్టార్, ప్రధాన మంత్రి ఇందిరాగాంధీ హత్య, సిక్కు వ్యతిరేక అల్లర్ల కారణంగా పంజాబ్‌లో హింసాత్మక తిరుగుబాటు ఫ్లాష్‌బ్యాక్‌ల వరుసలో ఈ కథ సాగింది. 1997 లో గుప్త్ చిత్రం లో మళ్లీ కఠినమైన పోలీసు పాత్రలో నటించారు. 2003 లో 'ధూప్'లో అమరుడైన సైనికుడి ధైర్యవంతుడైన తండ్రిగా, 1999లో కన్నడ చిత్రం 'ఏకె 47' లో కఠినమైన పోలీస్ ఆఫీసర్‌గా నటించాడు, నగరాన్ని అండర్ వరల్డ్ నుండి



సురక్షితంగా ఉంచడానికి ప్రయత్నించే పాత్రలో కనిపిస్తారు. ఈ సినిమా కమర్షియల్‌గా హిట్ సాధించింది. ఈ సినిమాలో పురి నటన చిరస్మరణీయం. కన్నడ డైలాగ్‌ల కోసం పురి తన స్వంత స్వరాన్ని అందించాడు. ఇదే సంవత్సరం లో విజయవంతమైన బ్రిటీష్ కామెడీ-డ్రామా చిత్రం 'ఈస్ట్ ఈజ్ ఈస్ట్'లో నటించాడు. ఈ సినిమాలో పురి ఉత్తర ఇంగ్లాండ్‌లో మొదటి తరం పాకిస్థానీ వలసదారుడిగా నటించాడు. 2009 లో పూరి అత్యంత ప్రశంసలు పొందిన గాంధీ చిత్రంలో అతిథి పాత్రలో నటించారు. 1990ల మధ్యలో, పురి ప్రధాన స్రవంతి హిందీ సినిమాలో పాత్రలను పోషించగా, ఆ పాత్రలు సినీ విమర్శకుల కంటే మాస్ ప్రేక్షకులను ఎక్కువగా ఆకర్షించాయి. వాణిజ్య హిందీ చిత్రాలలో అతని ముఖ్యమైన పాత్రలలో ఓ మై గాడ్, ద్రోహకాల్, ఇన్ కస్టడీ, నర్సింహ, ఘాయల్, మృత్యుదండ్, ఆస్థ, హే రామ్, ప్యార్ తో హోనా హి థా, ఫర్జ్, గదర్, లక్ష్య, దేవ్, రంగ్ దే బసంతి, యువ, సింగ్ ఈజ్ కింగ్, మేరే బాప్ పెహ్లే ఆప్, బిల్లు, క్యుంకి, దబాంగ్, భాజీ, ఖాప్, బజరంగీ భాయిజాన్, ఘాత్, ఘాయల్, రోడ్ టు సంగమ్, 2011 లో భారతీయ యాక్షన్ చిత్రం డాన్ 2 తదితర చిత్రాలలో పురి నటన అత్యంత ప్రశంసలు అందుకుంది.






*- పొన్నం రవిచంద్ర*
*సీనియర్ జర్నలిస్టు,*
*సినీ విమర్శకులు.*
*సెల్: 9440077499*

## ఓంపురి అందుకున్న పురస్కారాలు



1981 లో ఆక్రోష్ చిత్రానికి ఫిల్మ్‌ఫేర్ ఉత్తమ సహాయ నటుడు అవార్డు
1981 లో అరోహన్ చిత్రానికి 29 వ జాతీయ చలనచిత్ర అవార్డులలో ఉత్తమ నటుడి అవార్డు
1983 లో అర్ధ సత్య చిత్రానికి 31 వ జాతీయ చలనచిత్ర అవార్డులలో ఉత్తమ నటుడు అవార్డు
1984 లో అర్ధ సత్య చిత్రానికి కార్లోవీ ఇంటర్నేషనల్ ఫిల్మ్ ఫెస్టివల్లో ఉత్తమ నటుడు అవార్డు
1998 లో మై సన్ ది ఫెనాటిక్ చిత్రానికి బ్రస్సెల్స్ ఇంటర్నేషనల్ ఫిల్మ్ ఫెస్టివల్ ఉత్తమ నటుడు
1990 లో భారతదేశ నాల్గవ అత్యున్నత పౌర పురస్కారం "పద్మశ్రీ" ప్రదానం
2004 లో బ్రిటిష్ ఫిల్మ్ ఇండస్ట్రీకి సేవల కొరకు బ్రిటిష్ సామ్రాజ్యం యొక్క ఆర్డర్ ఆఫ్ ఆనర్ ఆఫ్ ఆఫీసర్
2009 లో ఫిల్మ్‌ఫేర్ లైఫ్‌టైమ్ అచీవ్‌మెంట్ అవార్డు
2015 లో ప్రయాగ్ ఇంటర్నేషనల్ ఫిల్మ్ ఫెస్టివల్ లో లైఫ్ టైమ్ అచీవ్‌మెంట్ అవార్డు

---

పురి ప్రధాన స్రవంతి చిత్రాలతో పాటు ప్యారలల్, ఆర్ట్ చిత్రాలలో నటించాడు. 1980లో ఆక్రోష్, భవానీ భవాయ్, 1981 లో టెలివిజన్ సినిమాలైన సద్గతి, 1982లో ఆరోహన్, 1983 లో అర్ధ సత్య, 1986లో మిర్చ్ మసాలా, 1987 లో తమస్, 1992లో ధారావి, 1997 లో చాచీ 420 వంటి కళాత్మక చిత్రాలలో దర్శకుడు శ్యామ్ బెనగల్, గోవింద్ నిహలానీ, అమ్రిష్ పూరి, నసీరుద్దీన్ షా, స్మితా పాటిల్, షబానా అజ్మీ లతో కలిసి నటించారు.



### బ్రిటీష్ చిత్రాలలో...

1990వ దశకంలో పురి బ్రిటీష్ చిత్రాలలో నటించి సినీ విమర్శకులచే శభాష్ అనిపించుకున్నారు. 1991 లో 'సామ్ అండ్ మి', 1995 లో 'బ్రదర్స్ ఇన్ ట్రబుల్', 1997 లో 'మై సన్ ది ఫెనాటిక్', 1998 లో 'సచ్ ఏ లాంగ్ జర్నీ' 1999 లో 'ఈస్ట్ ఈజ్ ఈస్ట్', 2001 లో 'ది పెరోల్ ఆఫీసర్', హ్యాపీ నౌ, ది జూ కీపర్, ది మిస్టిక్ మస్సెర్, 2003 లో 'కోడ్ 46', 2010 'వెస్ట్ ఈజ్ వెస్ట్' 2014 లో 'ది హండ్రెడ్ ఫుట్ జర్నీ' 2016 లో 'ఏ మిలియన్ రివర్స్' లాంటి అనేక చిత్రాలలో నటించి జాతీయంగా, అంతర్జాతీయంగా ఖ్యాతి గడించారు.



### హాలీవుడ్ సినిమాలలో

1992 లో ఓంపురి పాట్రిక్ స్వేజ్ సరసన 'సిటీ ఆఫ్ జాయ్', 1994 లో 'వోల్ఫ్' తో పాటు 'జాక్ నికల్సన్', 1996 లో 'ది ఘోస్ట్ అండ్ ది డార్క్ నెస్', మొదలైన హాలీవుడ్ సినిమాలలో నటించారు. 1982 లో వాల్ కిల్మర్ సరసన. మహాత్మా గాంధీ జీవితం ఆధారంగా రిచర్డ్ అటెన్‌బరో దర్శకత్వంలో రూపొంది అంతర్జాతీయంగా ప్రశంసలు పొందిన 'గాంధీ' చిత్రంలో అతిథి పాత్రలో నటించారు. 2005 లో 'ది హ్యాంగ్‌మన్' చిత్రంలో, 2007 లో 'చార్లీ విల్సన్ వార్' లో జనరల్ జియా-ఉల్-హక్ పాత్రలో కనిపించాడు, ఇందులో టామ్ హాంక్స్, జూలియా రాబర్ట్స్ నటించారు.




### ఇతర భాషల చిత్రాలలో

ఓం పురి హిందీ, ఇంగ్లీష్ చిత్రాలతోపాటు భారత్ లోని ఇతర భాషలైన కన్నడ, మలయాళి, బెంగాలీ, పంజాబీ, గుజరాతీ తెలుగు భాషా చిత్రాలలో నటించారు. కన్నడంలో 1977 లో "తబ్బలియు నీనదే మగనె", 1999 లో 'ఏ కె 47' చిత్రంలో కఠినమైన పోలీస్ ఆఫీసర్‌గా నటించాడు. అతను నగరాన్ని అండర్వరల్డ్ నుండి సురక్షితంగా ఉంచడానికి ప్రయత్నించాడు. ఇది పెద్ద కమర్షియల్గా హిట్ అయింది. ఈ సినిమాలో పూరి నటన చిరస్మరణీయమైనది. 2002 లో 'ధృవ'లో నటించారు. పురి కన్నడ డైలాగ్‌ల కోసం అతను తన స్వరాన్ని అందించేవాడు. ఓంపురి కన్నడ చిత్రాలతో పాటు, పంజాబీ చిత్రాలలో కూడా నటించారు. 1980 వ దశకంలో 'చాన్ పర్దేశి', 1986 లో 'లాంగ్ డా

## చావంటే భయంలేదు

*"నాకు చావంటే భయంలేదు లకానీ అనారోగ్యానికి గురవడం అంటే భయం. ఆరోగ్యం పాడై మంచాన పడి ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో పక్కవారిపై ఆధారపడే వారిని చూసినప్పుడల్లా నాకూ అదే పరిస్థితి వస్తుందేమోనన్న భయం ఉండేది కానీ చావంటే భయం లేదు. చావును కూడా ఎవరూ ముందే వూహించలేరు. ఎప్పుడో ఒకప్పుడు నిద్రలో కన్నుమూస్తాం. ఓంపురి నిన్నరాత్రి 7.22 నిమిషాలకు కన్నుమూశారు.. అన్న వార్త ఉదయం ప్రజలకు తెలుస్తుంది" అంటూ ఆయన ఒక ఇంటర్వ్యూలో చెప్పారు.*





లిష్కర' అనే రెండు అత్యంత విజయవంతమైన చిత్రాలలో నటించిన పురి తొమ్మిది సంవత్సరాల తరువాత 2005లో 'బాఫీ', 2008లో గురుదాస్ మాన్ రూపొందించిన 'యారియాన్' లో నటించారు. 2013 లో "జట్ట్ బాయ్స్ పుట్ జట్టన్ దే", సమస్యలో భాజీ 2015 లో లెదర్ లైఫ్, బునియాద్ సినిమాలో నటించారు. మలయాళం లో 1988 లో పురవృతం, 2016 లో ఆడు పులియట్టం సినిమాలలో నటించారు. అయితే ఆడుపులియట్టం తమిళంలో "షెన్‌బాగా కొట్టై" పేరుతో, తెలుగులో 'మాతంగి' పేరుతో డబ్ చేయబడింది.

### తెలుగు 'అంకురం' చిత్రంలో

ఓం పురి 1992 లో తెలుగులో రూపొందిన అంకురం చిత్రంలో గిరిజన



నాయకుడైన సత్యం పాత్రలో నటించారు. పోలీసులు విప్లవకారుడిగా ముద్ర పడ్డ సత్యాన్ని పట్టుకోలేక అతని భార్యను అరెస్ట్ చేసి ఆచూకీ కోసం వేధిస్తారు. దీనిని సహించలేని గిరిజనులు పోలీసులపై దాడికి ప్రయత్నిస్తారు. అయితే డాక్టర్ మిత్ర వారిని నిలవరిస్తాడు. ఒక శాడిస్టు పోలీసు అమానవీయ చర్యలతో సత్యం భార్య బిడ్డకు జన్మ ఇచ్చి చనిపోతుంది. దాంతో ఆవేశపడిన గిరిజనులు ఆ పోలీసుని చంపేస్తారు. దీనికి ప్రతిగా గిరిజనులకు అండగా నిలిచిన డాక్టర్ మిత్రను పోలీసులు చంపుతారు. సత్యం బిడ్డతో పారిపోతుండగా రైల్వే స్టేషన్‌లో పట్టుకుంటారు. ఇదే ట్రైన్‌లో భర్తతో వెళ్తున్న సింధూర చేతిలో బిడ్డను పెట్టి, ఆ బిడ్డకు పాలు తెస్తా అని సత్యం దిగేస్తాడు. రైలు దిగిన సత్యంను పోలీసులు అరెస్ట్ చేసి తీసుకెళ్ళిపోతారు.

ఆ బిడ్డను ఏమి చేయాలో తెలియక సిందూర ఇంటికి తీసుకెళ్తుంది. కానీ బిడ్డను ఇంటికి తీసుకెళ్లాక సింధూర అవమానాల మధ్యే ఆ పాప ఆలనా పాలన చూసుకుంటూ సత్యం ఆచూకీ కోసం ప్రయత్నిస్తుంది. అడ్డంకులు ఎదురయిన వాటికి నెరవక ధైర్యంగా ముందుకు సాగి ఆత్మవిశ్వాసంతో సింధూర సత్యం కోసం వెదుకుతుంది. పౌరహక్కుల నాయకుడైన లాయర్ రావు సహాయంతో సత్యం కోసం కోర్టులో కేసు వేసి, సత్యం ఉండే ఊరేదో తెలుసుకుని రావుతో పాటు సత్యం ఉండే గిరిజన ప్రాంతానికి వెళ్తుంది. సత్యం విప్లవకారుడని ముద్ర పడ్డ గిరిజన నాయకుడని తెలుసుకుంటుంది. చివరికి అతి కష్టం మీద కోర్టుకు సూర్యం వచ్చేలా చేస్తుంది సింధూర. అప్పటికే పోలీస్ చేతుల్లో దెబ్బలు తిన్న సత్యం నిజాలు బయట పెట్టి కోర్టు లోనే కన్ను మూస్తారు. అప్పట్లో జరిగిన కొన్ని యధార్థ సంఘటనల స్ఫూర్తితో రూపొందిన ఈచిత్రంలో గిరిజన నాయకుడైన సత్యం పాత్రలో ఓం పురి, సింధురగా రేవతి అద్భుతంగా నటించారు. శరత్‌బాబు, హరిప్రసాద్, బాలయ్య తదితరులు నటించిన సినిమాకు సి.ఉమామహేశ్వరరావు అద్భుతమైన దర్శకత్వ ప్రతిభను జోడించి రూపొందించారు.

### బుల్లితెరపై ఓం పురి నటప్రస్థానం

సినిమాలతోపాటు తమస్, మిస్టర్ యోగి, సీ హాక్స్ మొదలైన టీవీ షోలలోనూ ఓం పురి నటించారు. హిందీ నవల ఆధారంగా గోవింద్ నిహాలనీ



1987 లో తెరకెక్కించిన టెలివిజన్ ఫిల్మ్ 'తమస్' నటనకుగానూ ఓం పురి విమర్శకుల ప్రశంసలు అందుకున్నారు. పాపులర్ హిందీ టీవీ సీరియల్ 'కక్కాజి కహీన్' లో ఎప్పుడు పాన్ నములుతూ ఉండే కక్కాజీ పాత్రలో నటించారు. రాజకీయ నాయకులపై పేరడీగా ఈ పాత్రను రూపొందించారు. 'మిస్టర్ యోగి' సీరియల్‌లో ఆయన అద్భుతంగా నటించారు. సూత్రధారిగా ఓం పురి తన నటనలో వైవిధ్యాన్ని చూపారు. "భారత్ ఏక్ ఖోజ్" అనే షోను ఓం పురి నిర్వహించారు. ప్రథమ ప్రధాని జవహర్ లాల్ నెహ్రూ రచించిన 'ది డిస్కవరీ ఆఫ్ ఇండియా' అనే పుస్తకం ఆధారంగా 53 ఎపిసోడ్‌లుగా ఈ షోను నిర్వహించారు. దూరదర్శన్‌లో వచ్చిన డిటెక్టివ్ సీరియల్ 'జాసూస్ విజయ్' లోనూ ఓం పురి కనిపించారు. ఈ సిరీస్‌ను ప్రజెంట్ చేయడంతోపాటు.. ప్రతి ఎపిసోడ్ చివరన ఆయన ఎయిడ్స్, హెచ్ఐవీ గురించి జనాలకు అవగాహన కల్పించేలా ప్రచారం చేశారు. నీ ఛానెల్‌లో 2004-05 మధ్య కాలంలో వచ్చిన 'ఆహత్' అనే సిరీస్‌లో రెండో సీజన్లో ఆయన నటించారు. 'యాత్ర, సీ హాక్స్, అంతరాల్' అనే సీరియళ్లలోనూ ఆయన కనిపించారు. లైఫ్ ఓకే ఛానెల్లో వచ్చిన 'సావ్‌ధాన్' అనే క్రైమ్ షోలోనూ ఆయన నటించారు. హిందీ టెలివిజన్ తెర మీదే కాకుండా బ్రిటిష్ టీవీ సిరీస్‌లోనూ ఓం పురి నటించారు. ఐటీవీ నెట్‌వర్క్ నిర్మించిన 'ది జువెల్ ఇన్ ది క్రౌన్' లో 'మిస్టర్ డి సౌజా' అనే పాత్రలో ఆయన కనిపించారు.

### వివాహబంధం

నటుడు "అన్న కపూర్" సోదరి రచయిత 'సీమా కపూర్'ని 1991 లో వివాహం చేసుకున్నాడు, అయితే వారు ఎనిమిది నెలల తర్వాత విడాకులు తీసుకున్నారు. తదనంతరం ఓంపురి తిరిగి 1993 లో జర్నలిస్ట్ 'నందిత' ని వివాహం చేసుకున్నాడు, వారికి 'ఇషాన్' అనే కుమారుడు జన్మించాడు. 2009 లో నందిత తన భర్త జీవిత చరిత్రను "అన్‌లైక్లీ హీరో-ది స్టోరీ ఆఫ్ ఓం పురి" అనే పేరుతో రాసింది. అయితే కొన్ని రోజుల తర్వాత ఓంపురికి, ఆయన రెండవ భార్య నందితకు మధ్య విభేదాలు నెలకొన్న నేపథ్యంలో నందిత ఆయన నుంచి విడిపోయి ముంబైలోని ఫ్యామిలీ కోర్టును ఆశ్రయించింది. ఓం పురికి ముంబైలోని ఫ్యామిలీ కోర్టులో ఎదురుదెబ్బ తగిలింది. నందిత పిటిషన్ విచారణ చేపట్టిన కోర్టు ఆమెకు అనుకూలంగా తీర్పునిచ్చింది. నందితాకు భరణం కింద ప్రతినెలకు 1.25 లక్షల రూపాయలు, కుమారుడు ఇషాన్ కు 50 వేల రూపాయలను చెల్లించాలని కోర్టు తీర్పునిచ్చింది. అంతేకాకుండా వైద్య, విద్య ఖర్చుల కోసం, నందితా కోసం చెల్లిస్తున్న ఇన్సూరెన్స్ ప్రీమియం, మెడిక్లెయిమ్ పాలసీలు, విద్యుత్, టెలిఫోన్ బిల్లులు, సొసైటీ మెయింటెనెన్స్ చార్జీలను చల్లించాలని ఓంపురి ని ఆదేశించింది. అనంతరం ఓంపురి 6 జనవరి 2017 న, తన 66 వ ఏటా ముంబై లోని అంధేరిలోని తన నివాసంలో గుండెపోటుతో కన్నుమూసారు.

### చనిపోయిన తర్వాత విడుదలైన చిత్రాలు

ఓం పురి కన్నుమూసిన తర్వాత 2017 లో 'వైస్రాయ్ హౌస్', ఘాజీ దాడి, ట్యూబ్ లైట్', పులి, మిస్టర్ కబాడీ, 2018 లో ది గాంధీ మర్డర్, గుల్ మకాయ్ తో పాటు, పాకిస్తానీ చిత్రం లోడ్ వెడ్డింగ్ చిత్రాలు విడుదలయ్యాయి. పురి నటించిన చివరి చిత్రం 'ఓం ప్రకాష్ జిందాబాద్'. మరాఠీ భాషలో తెరకెక్కిన ఈ చిత్రం 18 డిసెంబర్ 2020లో విడుదలైంది. రంజిత్ గుప్తా దర్శకత్వంలో తెరకెక్కిన ఈ చిత్రంలో కుల్‌భూషణ్ కర్బాందా, జగదీప్, శ్వేతా భరద్వాజ్ ముఖ్యపాత్రల్లో నటించారు. ముందుగా ఈ చిత్రానికి 'రామ్ భజన్ జిందాబాద్' అనే టైటిల్ అనుకున్న, ఓంపురి పై గౌరవంతో 'ఓం ప్రకాష్ జిందాబాద్'గా పేరు మార్చి విడుదల చేసారు. మొత్తంగా చనిపోయిన మహానటుడికి ఇది నిజమైన నివాళి అంటూ అభిమానులు చెప్పుకున్నారు.

*(18 అక్టోబర్ ఓంపురి జయంతి సందర్భంగా..)*

# ఋణగ్రస్తం

దారిని పోతూ పోతుంటే
ఎన్నిసార్లో ఈ కుంట నా దప్పిక తీర్చింది
ఎప్పుడూ ఇందులో తట్టెడు పూడిక తీసింది లేదు
వేలసార్లు అన్నం ముందు కూర్చున్నా
నేల పలకమీద బీజాక్షరాలు దిద్దినవాడికి
మనసారా నమస్కరించింది లేదు
ఈ నది నా కోసమే ప్రవహిస్తుంది దయగా
ఇంత చక్కని చుక్కల పూలతోట
నన్ను చూసే గుబాళిస్తుంది
ఈ ఆకుపచ్చని గొడుగులన్నీ
నా తల మీదనే విచ్చుకొన్నాయి
కొమ్మలని చూసేటప్పుడు
కాండం గుర్తుకు రావాలి గదా
కాండాన్ని పరికించేటప్పుడు
మూలం జ్ఞప్తికి రావాలి గదా
వేల మైళ్ళ జీవనయానంలో
కాలి కింద నేలతల్లిని తలుచుకోవాలి గదా
మట్టి లేనిదే మనిషి లేడని తెలుసు
అయినా -
అన్నిటినుంచీ స్వీకరించటమే తెలిసింది
ఎవరో అంటున్నారు నీరవంగా -
మరి ఇవ్వటం మాటేమిటి శివా!



నిజమే
ఏ నల్ల చీమనీ తొక్కలేదన్నదే తృప్తి
ఏ ప్రవాహాన్నీ విషపూరితం చెయ్యలేదు
ఎదటి కంటిలో ఎప్పుడూ పొడవలేదు
ఏ కన్నీటి చుక్కకీ కారణం కాలేదు
ఎందరో సమున్నత సాధకులు
అక్షర సరస్సులో ఈతలు నేర్పారు
అక్షరాల్లో అవనినీ ఆకాశాన్నీ చూపించారు
ఆకాశంలో అరణ్యాల్నీ అర్ణవాల్నీ దర్శింపజేశారు
కాళ్ళకి మొక్కేలోపు కన్పించక దాటిపోయారు
దేని కోసం ఎప్పుడూ తపించకుండానే
ఈ అపార సంపద లభించింది
ఈ సమస్తానికీ ధన్యవాదాలు చెప్పటమొక్కటే
మిగిలిపోయింది
ఎవరో చెపుతున్నారు మౌనంగా -
శివా! ఓ శంకర్!
ఎప్పటికీ నువ్వు ఋణగ్రస్తుడివే

***- పాపినేని శివశంకర్***

 **ఒకతరం మహిళల జీవితచిత్రం**

# ఆకెళ్ళ మాణిక్యాంబ ఆత్మకథ

నేను పుట్టిన ఊరు పశ్చిమ గోదావరి జిల్లా నెగ్గిపూడి అని పల్లెటూరు. మార్టేరు అని కూడా అంటారు. రెండు ఊళ్ళు కలిసే వుంటాయి. ఇప్పుడు అందరికీ మార్టేరు అంటేనే తెలుస్తుంది. మా అమ్మకి నేను మూడవ సంతానం. మా అక్క, అన్న, తరువాత నేను. ఆ రోజుల్లో పుట్టింట్లో రెండు పురుడ్లు పోసేవారు. కాని నా పురుడు కూడా అక్కడ ఎందుకయిందో తెలీదు.

నేను పుట్టగానే నా ఏడుపు వినకూడదని మా మామయ్యని ఊరికి పంపించారట. మా ఇంటికి వెనకాల మెయిన్ స్ట్రీట్, పెద్ద కాలువ లాకులు వుండేవి. మా అమ్మకి నొప్పులు వస్తున్నప్పుడే మామయ్యని లాకులు దగ్గరికి పంపించి, విజయవాడలోని మామయ్య వాళ్ళ అత్తవారింటికి పంపించారు. అప్పట్లో బస్సులు బాగానే వుండేవి. అలా బస్సులో పంపేరుట.

మా తాతగారింటికి పక్కనే చిన్న కాలువ వుండేది. దాన్ని చించినాడ కాలువ అనేవారు. అమ్మమ్మ వాళ్ళు ఆ చించినాడ కాలువలోనే స్నానం చేసి, బిందెతో నీళ్ళు భుజం మీద పెట్టుకుని తీస్కొని వచ్చి వంట చేసేవారు. ఇంకొక్క బిందె నీళ్ళు తాగటానికి తెచ్చేవారు. వానలకు బురద నీళ్ళు వస్తుంటే గుడ్డతో వడపోసి, ఇందుపకాయలు అని అవి నూరి వేసేవారు. బురద కిందకి వెళ్ళి మంచి నీళ్ళు పైకి వచ్చేవి.

ఇల్లు ఒక భాగం వంట, భోజనాలకి హాలు, దాని పక్కన సామాను గది వెనకాల ఇల్లు, మరలా వీధిలోకి ఇంకొక ఇల్లు, మధ్య సందు వుంటుంది. ఏ ఇంట్లో అయినా ధాన్యం బస్తాలు, వసారా, మరలా దంచుకోవడానికి ఒక వరండా. మట్టి నేలలే కాబట్టి అందులోనే ఒక దంచుకునే రోలు గొయ్యి తీసి పెట్టి నేలతో సమానం చేసేవారు. ఆ వసారాలో పనివారు నలుగురు ఆడ వాళ్ళు వచ్చి ధాన్యం దంచి, బియ్యం చేసి అందులో నుంచి నూకలు, మెత్తని తవుడు, బరకగా వుండే ఊక... వేటికవి వేరు చేసేవారు. ఆ పనులకి గాను ధాన్యం కొలుచుకుని వెళ్ళేవారు.

అలా బియ్యం దంచిన రోజంతా హడావుడే. ఆ వర్కర్లకి మజ్జిగ, చెంబులతో మంచినీళ్ళు ఇవ్వడం, ఆ పనులన్నీ పర్యవేక్షించుకోవడం చూసుకోవాలి. సాధారణంగా పెళ్ళయిన ఆడపిల్ల ఇంట్లోనే వుంటే పని చెయ్యనిచ్చేవారు కాదు. కోడలు వుంటే ఎంత పనైనా కోడలు చెయ్యాల్సిందే. అందుకని పుట్టింట్లో వున్న ఆడపిల్లకి విశ్రాంతి అన్నమాట. అత్తవారింట్లో అలసిపోయి వచ్చినందుకు.

సరే మా అమ్మ నన్ను, మిగతా పిల్లల్ని తీస్కుని ఎప్పుడూ అత్తవారింటికి వెళ్ళిందో తెలీదు. కాని, మా నాన్న ఆ రోజుల్లో (అంటే 1930 – 40 ల మధ్య బ్రిటీష్ వారు ఇంకా పాలిస్తున్న కాలం) మద్రాస్‌లో ఎఫ్.ఎ. చదువుకుని, ఆ పరీక్షలవగానే ఓవర్సీరుగా వుద్యోగంలో చేరేరుట. పక్కన తువాలు వేసుకుని బంట్రోతు, మా నాన్నకి తలపైన టోపీ చాలా టిప్‌టాప్‌గా అంటే హంగామాగా వుండేవారుట.

*ఆత్మకథలు సామాజిక చరిత్రలో అంతర్భాగం. ఈ మాట ఆకెళ్ళ మాణిక్యాంబ గారి జీవితకథకి అక్షరాలా వర్తిస్తుంది. ఇది ఒక తల్లి ఆత్మకథనే కాదు ఒక సమాజ స్వరూపాన్ని దర్శింపజేసే చారిత్రక జీవన పటం. 87 ఏళ్ళ వయసులో మాణిక్యాంబ గారు తన జ్ఞాపకాలను తలపోసుకుంటూ అనేక విషయాల్ని అందించడం నడుస్తున్న చరిత్రకు విలువైన చేర్పు. గత మూడుతరాల మహిళల బతుకులోని బహుళ పార్శ్వాల్ని ఆర్ద్రంగా చిత్రించారు. ఆడవారి బతుకు మగవారి అదుపాజ్ఞల్లో నడవటం సహజంగా భావించే సామాజిక, సాంస్కృతిక వాతావరణం క్రమంగా మారిన వైనానికి గల మూలాలు ఎక్కడున్నాయో చెబుతుందీ ఆత్మకథ. ఇటీవలనే పుస్తకరూపంలో వెలువడిన ఈ ఆత్మకథలోని ఓ అధ్యాయం 'పాలపిట్ట' పాఠకులకు ప్రత్యేకం.*

వుండేది. కావిటి పెట్టెలు అని చెక్కతో చేసిన పెట్టెలు, చాలా గట్టిగా, ఎలుకలు కొరకలేనంత గట్టిగా వుండేవి. అందులో ముఖ్యమైన వస్తువులు వుండేవి. అప్పట్లో అటకలు వుండేవి. అటక మీద ఊరగాయల జాడీలు మడిగా పెట్టుకునేవారు. వాతావరణానికి పాడైపోకుండా మూతికి గుడ్డలు కట్టి వుంచేవారు. ఎప్పుడూ రెడీగా ఒక నిచ్చెన దానికి వేసి వుంచేవారు.

15 రోజులకు సరిపడా పచ్చడి చిన్న జాడీలలో తీసుకుని విడిగా పెట్టేవారు. 15 రోజులకు అయిపోతే మరలా అమ్మమ్మో, తాతో మడి కట్టుకుని నిచ్చెన మీదుగా అటక ఎక్కి ఆ పచ్చడి తీసేవారు. కింద ఒకరు ఆ పచ్చడిని అందుకునేవారు. ఆ పచ్చడి కిందకు తీయాలంటే ఇవాళ ఖాళీ లేదనో, మడి నుంచి బయటకు వచ్చేశామనో ఒకటి రెండు రోజులు లేట్ అయ్యేది.

మా నాన్నకి స్వంత వూళ్ళో 12 ఎకరాలు మాగాణి పొలాలు వాటాగా వచ్చేయి. ఇటు మా నాన్న తల్లి మాణిక్యాంబ గారికి ఎనిమిది మంది కొడుకులు, ముగ్గురు కూతుళ్ళు వున్నారు. ఇద్దరు కూతుళ్ళు భర్తలు పోయి పుట్టింట్లో వుండేవారు. మూడవ కూతురు భర్తతో వుండేది. అంటే మాకు మేనత్తలు అవుతారన్నమాట.

మా పెద్దత్తయ్య మా బామ్మగారింట్లో, చిన్నత్తయ్య ఒక అన్నదమ్ముల ఇంట్లో వుండేవారు. ఆ రోజుల్లో భర్త చనిపోతే, ఆయన పేరుమీదున్న ఆస్తిని భర్త తరపున అన్నతమ్ముళ్ళకి, వారు లేకపోతే చనిపోయిన వ్యక్తి పినతండ్రి, పెద తండ్రి పిల్లలకి (అది కూడా మగపిల్లలకి మాత్రమే) వెళ్ళేది. మగమహారాజు అనే పేరు వచ్చింది అందుకే అయి వుంటుంది.

ఈ భర్త పోయిన ఆడవాళ్ళు, ఎవరైనా బంధువుల ఇళ్ళలో వుండి, వాళ్ళ పిల్లల్ని చూసుకుంటూ, ఇంట్లో వంటపని చేసి, పప్పులు రుబ్బుతూ కాలక్షేపం చేసేవారు. భర్త వున్న ఆడవాళ్ళు ఈ వితంతువులతో పనులు చేయించుకుంటూ దర్జాగా కూర్చుని ఆర్డర్లు ఇస్తూ వుండేవారు. రాత్రిళ్ళు పిల్లల్ని వీరి దగ్గరే పడుకోబెట్టి, పిల్లల ఆలనా పాలనా అప్పజెప్పేవారు.

అలాగే మా అమ్మ తరపున తాతగారికి కూడా ఇద్దరు వితంతు చెల్లెళ్ళు వుండేవారు. పెద్దావిడని పెద్ద మామ్మ, చిన్నావిడని చిన్నమామ్మ అనేవాళ్ళం. పెద్దమామ్మ మా అమ్మతో పిల్లల్ని పెంచడానికి వచ్చింది. చిన్న మామ్మ మామయ్యతో వండి పెట్టడానికి వెళ్ళింది. అట్లాగే మా నాన్నగారి చెల్లెలు కూడా మా అమ్మ పోయినప్పుడు మా నాన్నదగ్గరకు ఒక సంవత్సరంలో వచ్చింది. ఆవిడకు కాస్త నోరెక్కువ. అందుకని తర్వాత మా నాన్న దగ్గర లేదు.

నా చిన్నప్పుడు మా నాన్న వుద్యోగం రాజమండ్రిలో. మా పెద్ద మామ్మ (అమ్మ మేనత్త వితంతువు), అమ్మ, పిల్లలు వుండేవారం. నాన్నకి కేంపులు వుండేవి. అప్పుడు మా అమ్మకి ఇంకో పిల్ల పుట్టింది. కామేశ్వరి అని, మా పెద్దమామ్మ పేరు పెట్టారు.

మా నాన్నమ్మ పేరు మాణిక్యాంబ గారు. మా నాన్న పేరు వెంకట రమణయ్య. ఎనిమిదవ సంతానం. ఆయన అన్నగారు సూర్య ప్రకాశరావుగారు. ఈయన మా నానమ్మ గారి ఏడవ సంతానం. గుంటూరులో పోలీస్ ఆఫీస్‌లో హెడ్ గుమాస్తాగా చేసేవారు.

మా పెదనాన్న (సూర్యప్రకాశరావు) గారికి పిల్లలు పుట్టి పోయేరు. ఆ రోజుల్లో గుంటూరులో మలేరియా జ్వరాలు ఎక్కువగా వుండేవి. ఆ జ్వరం వలన ఒకసారి రెండు మూడు నెలలు లీవు మీద మా నాన్నగారింట్లో వుండి వెళ్ళారు.



ప్రకాశరావుగారు వున్న టైంలో మా అమ్మ, పెద్ద మామ్మ, అక్క, అన్న, కామేశ్వరి అండగా వున్నారు. ఆ సమయంలో మా పెదనాన్న సూర్య ప్రకాశరావు గారు నన్ను దగ్గరికి తీస్కుని, తనే అన్నం తినిపించి, తన దగ్గరే పడుకోబెట్టుకుని బాగా ప్రేమగా వుండేవారుట. మాణిక్యాంబని నేను తీస్కుని వెళ్ళి పెంచుకుంటా అనేవారట.

మా అమ్మ "మాణిక్యాంబ అయితే, అమ్మ కావాలి, నాన్న కావాలి అని ఏడుస్తుంది. కామేశ్వరిని తీస్కుని వెళ్ళి పెంచుకోండి" అనేదిట. మా పెద్దమ్మని పెదనాన్నని మా అమ్మ చాలా మర్యాదగా చూసి పంపించేదట.

ఆ తరువాత మా అమ్మ మేనత్త, పెద్ద మామ్మ అనే ఆవిడ పక్షవాతం వచ్చి వారం రోజులు స్పృహ లేకుండా వుండి, చనిపోయింది.

ఆ రోజుల్లో వేటికీ సరైన మందులు లేవు. నా తరువాత అమ్మాయి కామేశ్వరి చనిపోయింది. అప్పటికి రెండు సంవత్సరాలు వుంటాయేమో ఆ పిల్లకి. ఆ తరువాత నేను ఒకసారి ఆడుకుంటూ స్పృహతప్పి పడిపోయానట. ఆ సమయంలో మా జవాను అప్పారావు, చుట్ట కాల్చుకుంటూ బయట కూర్చుని వున్నందున, నన్ను పట్టుకుని ఆ చుట్ట పెట్టి మొహం మీద, మెడ మీద, గుండెల మీద వాతలు పెట్టేడట. ఆ వాతలకి తెలివి వచ్చింది. అప్పటి నుంచి నేనంటే అందరికీ ఎంతో ప్రేమ, భయం. ఎక్కడ ఏమి వచ్చి పడిపోతానో అని.

ఆ తరువాత మా నాన్న డిస్ట్రిక్ట్ బోర్డు ఇన్‌స్పెక్టర్ (లైసెన్సు) జాబ్‌తో రామచంద్రాపురం వెళ్ళారు. అక్కడ కూడా ఈ అప్పారావే మానాన్న దగ్గర

ఇప్పుడు గర్భిణీ స్త్రీలకి ఏడో నెలలో అనుకుంటా వాతం రాకుండా ఇంజక్షన్లు ఇస్తున్నారు. అప్పుడు ఆ ఇంజక్షన్లు ఇంకా రాలేదనుకుంటా. ఆ వాతం వల్ల ఒళ్ళు చల్లబడిపోయి, ఏవేవో ఇంజక్షన్లు ఇచ్చి, అవి పని చేయక డాక్టర్లు లాభం లేదని చెప్పారు. అప్పుడు మా నాన్న నీకు ఏమైనా కోరిక వుందా అని అడిగేడుట. పిల్లల్ని జాగ్రత్తగా చూసుకోండి. ఆడపిల్లలందరికీ బంగారు గాజులు,
గొలుసులు చేయించండి అని చెప్పి కళ్ళు మూసిందట. సరే ఆ బాడీని మా మామయ్య గారింటికి తీసుకువచ్చారు.

వుండేవాడు. మా అమ్మకి మళ్ళీ కాన్పు వచ్చింది. ఇంట్లో వంట పని, పిల్లల్ని చూసుకోవడం అంతా ఆవే చూసుకునేది. పురుడు వచ్చేక నడుం బిగించుకోడానికి ఎనిమిది గజాల చీరలు గ్లాస్కో క్లాత్, లైట్ కలర్స్‌లో చిన్న చిన్న చారలు, గళ్ళు వున్నవి రెడీ చేసి బీరువాలో పెట్టుకుంది. బెనారస్ పట్టు చీరలు పెట్టుకుంది. మా అమ్మకి పుట్టింటివారు ఏమంటే అవి పంపేవారు.

మా నాన్న పెత్తనమంతా మా అమ్మకే ఇచ్చేవారు. ఆయనకి 12 ఎకరాల భూమి వుంది. మంచి వుద్యోగం వుంది. ఆయన ఫ్రెండ్స్ తాసీల్దారుగారు, ఇంజనీరుగారు, హెల్త్ ఆఫీసర్‌గారు. ఎక్సైజ్ ఆఫీసరు గారు ఇలా వుండేవారు. మంచి పలుకుబడి వుండేది.

తిరణాల, ఇ.జి.డి.టి. తీర్థం, అంతర్వేది తీర్థం, కోటిపల్లి తీర్థం ఇలాంటి వాటికి మా నాన్నకి లైసెన్స్ ఇనస్పెక్టరుగా డ్యూటీ వుండేది. కుటుంబాన్ని తీసుకుని వెళ్ళేవారట. మా అమ్మ అక్కడ ఇంటికి కావలసిన ఇత్తడి గిన్నెలు, బొమ్మలు అవీ కొని తీస్కుని వెళ్ళాం. అంత మంచి సమయంలో మా అమ్మకి పురిటి నొప్పులు వచ్చాయి. మరి ఏమి జరిగిందో ఆ వూళ్ళో మంచి ఆస్పత్రి కూడా లేదనుకుంటాను. ఇంజనీరుగారు కారు పంపారు.

ఆ కారులో మా అమ్మా, నాన్న, నేను వున్న గుర్తు. మరి అక్క, అన్న వున్నట్లు గుర్తులేదు. మా అమ్మకి చాలా పొడవు జుట్టు, బర్మా ముడి అని అప్పటి ఫ్యాషన్. అది వేసుకునేది. ఆ రోజు కారులో నొప్పులు పడుతూ పెద్ద జుట్టు కిందకి జారి వెనకాల సీటులో కూర్చున్నట్టు లీలగా గుర్తు.

మా మామయ్య రాజమండ్రిలో ప్రాక్టీసు పెట్టి అక్కడ వున్నారు. మా చిన్న మామ్మ, అమ్మ మేనత్త, మామయ్య ఫ్యామిలీతో వుండి వండి పెడుతూంది. మా అమ్మని అక్కడ క్రిష్టియన్ ఆసుపత్రిలో చేర్పించారు. అది చాలా పేరున్న హాస్పిటల్. ముత్తమ్మ హాస్పిటల్ అనో, ఏమో అనేవారు. అక్కడ మా అమ్మ ప్రసవించింది. మగపిల్లవాడు పుట్టేడు.

ఇప్పుడు గర్భిణీ స్త్రీలకి ఏడో నెలలో అనుకుంటా వాతం రాకుండా ఇంజక్షన్లు ఇస్తున్నారు. అప్పుడు ఆ ఇంజక్షన్లు ఇంకా రాలేదనుకుంటా. ఆ వాతం వల్ల ఒళ్ళు చల్లబడిపోయి, ఏవేవో ఇంజక్షన్లు ఇచ్చి, అవి పని చేయక డాక్టర్లు లాభం లేదని చెప్పారు. అప్పుడు మా నాన్న నీకు ఏమైనా కోరిక వుందా అని అడిగేడుట. పిల్లల్ని జాగ్రత్తగా చూసుకోండి. ఆడపిల్లలందరికీ బంగారు గాజులు,

గొలుసులు చేయించండి అని చెప్పి కళ్ళు మూసిందట. సరే ఆ బాడీని మా మామయ్య గారింటికి తీసుకువచ్చారు.

పిల్లవాడిని మామయ్య గారింటికి తీస్కుని వచ్చేరు. తల్లి పాలు లేవు కాబట్టి గొల్ల భామ పాల డబ్బా తెచ్చి నీళ్ళు కలిపి పట్టించేరు. అప్పుడు ఈ గ్లాస్కో డబ్బాలు అవీ లేవు. నాలుగు రోజులకి పిల్లవాడు కూడా కన్నుమూశాడు. అమ్మమ్మ, తాత, మా పెదనాన్న ప్రకాశరావు గారు అందరూ వచ్చేరు. అప్పుడే నన్ను మా పెద్దనాన్న తీసుకుని వెళతానన్నారట. కాని చిన్న పిల్ల, ఫిట్స్ మళ్ళీ మళ్ళీ వస్తే ఆయన భార్య చూసుకోలేకపోతే కష్టమని ఆపేరుట.

పిల్లల్ని తీసుకుని మా నాన్న మళ్ళీ రామచంద్రాపురం వచ్చి ఆయన పెద్ద సోదరిని (భర్త పోయిన ఆవిడ) తీసుకుని వచ్చి, ఈ పిల్లల్ని కంటికి రెప్పలాగా చూసుకుంటూ రెండో పెళ్ళి కోసం పిల్లల్ని వెతుక్కున్నాడు.

ఆ టైంలో నాకు మా నాన్నే అన్నం పెట్టాలి. స్నానం చేశాక మా నాన్నే బొట్టు పెట్టాలి. ముఖానికి పౌడరు రాయాలి. ఆ బొట్టు గుండ్రంగా రాకపోతే తుడిచేసి, మళ్ళీ పౌడరు రాసి బొట్టు పెట్టాలి. అప్పుడు చీపుళ్ళ పైన అంచు గుండ్రంగా వున్నవి వుండేవి. దానితో సగ్గుబియ్యం మాడ్చి లేహ్యంలాగా చేసి, ఆ పుల్లని లేహ్యంలో ముంచి ఇలా అంటించి, తీసెయ్యాలి. ఆ బొట్టు సరిగ్గా రాకపోతే పెద్ద ఏడుపు. అమ్మలేని బెంగ అది. నోటితో చెప్పుకోలేక పోవడం.

నేను ఏడిస్తే ఆ రోజు మా నాన్న క్యాంపు మానేసేవాడు. నేను ఎదురుగా శకునం రావాలి. అట్లా నాకు ప్రాముఖ్యతనిచ్చి అపురూపంగా పెంచారు. మూడు నెలల కల్లా మా నాన్నకి దూరపు చుట్టాలలో అమ్మాయి దొరికింది. ఒక రోజు వెళ్ళి పెళ్ళి చేసుకుని ఆవిడని ఇంటికి తీసుకుని వచ్చేడు. ఆవిడకి ఫిట్స్ జబ్బు వుందని తర్వాత తెలిసింది. చాలా రకాల మందులు ఇప్పించి 15 రోజులకొకసారి, నెల రోజులకొకసారి వచ్చేట్లు చూశాడు.

ఆవిడకి ఏ రోజు ఫిట్స్ వస్తుందో లక్షణాలను బట్టి ముందుగానే తెలిసేది. పడుకోబెట్టేవాడు. మా అమ్మ వస్తువులన్నీ పెట్టాడు. మా అమ్మ మనసు పడి కొనుక్కున్న చీరలన్నీ ఇచ్చేడు. ఈవిడ అయినా, మొదటి భార్య అయినా ఆయనకి సమానమే కదా. ఆ ఫిట్స్ వలన ఐదు సంవత్సరాలు పిల్లలు పుట్టలేదు. మా పిన్ని వాళ్ళ అమ్మమ్మని తెచ్చి పెట్టుకుంది. పొయ్యి దగ్గర పడిపోతే ప్రమాదమని ఆవిడని తీసుకుని వచ్చారు. పెళ్ళయిన ఐదు సంవత్సరాలకి ఆవిడకి గర్భం వచ్చింది. ఈ లోగా మా అమ్మమ్మా తాతగారింట్లో కొన్ని రోజులు, నాన్నగారితో కొన్ని రోజులు వుండేవాళ్ళం. మా అన్నయ్య మాత్రం అక్కడే వుండేవాడు. తాతగారింటికి చదువు పోతుందని వచ్చేవాడు కాదు. బంట్రోతు అప్పారావు మా అమ్మ వున్నప్పటి నుంచి విశ్వాస పాత్రుడు. అమ్మమ్మ అని నోటినుంచి రాగానే మమ్మల్ని అమ్మమ్మ గారింటికి తీస్కుని వెళ్ళేవాడు.

మా నాన్న మాత్రం ఎక్కువగా అమ్మమ్మ గారింటికి రాలేదు. వస్తే మా నాన్న ఏడుపు, అమ్మమ్మ ఏడుపు. అందుకని వచ్చేవాడు కాదు. మేం పెద్దయ్యాక కూడా మీ అమ్మ ఎంత బాగా చూస్కునేదో? ఎక్కడి సామాన్లు అక్కడ పడి వుంటున్నాయి. చూసేవాళ్ళు ఎవరు? మీ అమ్మ పోయేక నేను పూజలు మానేశాను. మనసులోనే రామ రామ అనుకుంటున్నాను. ఎంత శుభ్రంగా పూజలు చేసేది. ఇల్లు ఎంత నీట్‌గా పెట్టుకునేదో అని కళ్ళు తుడుచుకునేవాడు.

మా పిన్ని పురిటికి వెళుతుందనే వార్త విని మా పెదనాన్న పిల్లల్ని అర్జంటుగా తీస్కుని వచ్చెయ్యమని టెలిగ్రాం ఇచ్చాడు.

ఈలోగా మా అమ్మమ్మగారింట్లో వున్నప్పుడు స్మాల్‌పాక్స్ అంటే మశూచికం అంటారు. అది మా అక్కకి కొంచెం ఎక్కువగా, నాకు కొంచెం తక్కువగా, మా మామయ్య కూతురికి ఎక్కువగా, మా పిన్ని కొడుక్కి మధ్యమంగా వచ్చింది. ఇంక మా నాన్న, పెదనాన్న గిలగిల లాడేరు, ఏమైపోతామోనని.

# మాణిక్యాంబ గారిది ధీర మనస్తత్వం

'జీవనది ఆరు ఉపనదులు' – ఒక తల్లి ఆత్మకథ ఇది. మా ఆకెళ్ళ రవిప్రకాష్ తల్లి మాణిక్యాంబ గారు రాసినది. ఎనభై ఏడేళ్ళ వయసులో బాల్యజ్ఞాపకాల్ని ఆ తరంలోని కుటుంబాలు ముఖ్యంగా స్త్రీల గురించి సంసార జీవితంలో తను పడిన శ్రమనీ అనుభవాల్నీ నిరాడంబరంగా గుదిగుచ్చిన పుస్తకం. ఆ మధ్య శైలజ కాళ్ళకూరి గారి తల్లి శేషమ్మ గారు 'చదువు తీర్చిన జీవితం' ఒక సామాన్య మహిళ ఆత్మకథగా రాశారు. ఆత్మకథ రాయాలంటే గొప్పవారై ఉండి సమాజంలో పేరుప్రతిష్టలు పొందినవారు మాత్రమే రాయాలనే స్థితి నుండి సాధారణ గృహిణులు, సామాన్య వ్యక్తులు కూడా ఆత్మకథలు రాసే ప్రయత్నం సంతోషకరమైన విషయం. ఒక పరంపర కొనసాగాలి. ఒకప్పుడు మరాఠీలో సామాన్యుల అనుభవాలు ఆత్మకథలుగా వచ్చాయి.

ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా సంసారకూపంలో మునిగి పోయిన వారి వెతల కథలే ఆనాడు. కోడలు వచ్చిందంటే పనిమనిషిని మాన్పించడం ఆస్తికి సంబంధించిన స్త్రీలకు ప్రాముఖ్యం లేకపోవడం భర్త పోయిన స్త్రీలు పుట్టింట్లో అగచాట్లు పడటం ఎనభై ఏళ్ళ నాటి సమాజంలో భిన్న పార్శ్వాల్ని మాణిక్యాంబగారు తనదైన శైలిలో చెప్పారు. జీవితంలో అనుభవించిన సంఘర్షణల్ని ఏ విధమైన ఫిర్యాదులు లేకుండా ఎవర్నీ నొప్పించకుండా చెప్పారు. ఆడపిల్లలు ఆరుగురూ తమ తల్లితో అనుబంధాన్ని వివరించారు. రవూఫ్, గుడిపాటి ముందు, వెనుక మాటలు రాశారు.

ఆడవారి బతుకులు మగవారి అధీనం లోనే. ఉమ్మడి కుటుంబం లోని బాధ్యతలు ఎంతో ఒత్తిడి కలిగిస్తుందనే సత్యం తెలుస్తుంది. మాణిక్యాంబగారు మగపిల్లవాడి కోసం ఎదురుచూసి ఆరుగురు ఆడపిల్లల్ని కన్నారు. ఏడవవారు రవిప్రకాష్. ఆడపిల్లలని వివక్ష చూపించకుండా వారందరి చదువుకు ప్రాధాన్యం ఇవ్వడం మాణిక్యాంబ గారి ముందుచూపుకు నిదర్శనం. ఆరుగురూ కూడా అత్యున్నత విద్యావంతులవ్వడం విశేషం. తను నడిచి వచ్చిన దారి కంటే భిన్నమైన సుఖవంతమైన బతుకుబాటలో వారంతా కుదురుకోవడం మాణిక్యాంబ సాధించిన సాఫల్య ఫలశ్రుతిగా చెప్పుకోవచ్చు.

మాణిక్యాంబగారు తమ ఇంటిని అద్దెకుంటున్నవారి నుండి స్వాధీనం చేసుకోవడంలో గొప్ప చొరవ చూపించారు.

ఆనాటి తరం సంప్రదాయాల్ని ఆడవారి మధ్య ఉండే పొరపొచ్చాల్ని క్రమశిక్షణాయుత జీవన క్రమంలో ఎంతమాత్రం తొట్రుపడని ధీర మనస్తత్వం మాణిక్యాంబ గారిది. నేటి తరంలో కుటుంబ బంధాలు వేరు. అత్తా కోడళ్ళ సంబంధాలు వేరు. ఎంతమాత్రం ఒకరి మీద మరొకరి పెత్తనం కుదరదు. ఒకరి మీద ఆధారపడకుండా ఎవరి బతుకుల్లోనూ తలదూర్చకూడదనేది మాణిక్యాంబ గారి అభిప్రాయం. ఎవరి జీవనయానాన్ని వారే నిర్మించుకోవాలని ఈ పుస్తకం సందేశం ఇస్తుంది. ఈ పుస్తకం చదవడం ద్వారా ఒకనాటి సామాజిక చరిత్ర తెలుసుకునే అవకాశం కలిగింది.

**(ఒకతల్లి – ఆరు ఉపనదులు – రచన: ఆకెళ్ళ మాణిక్యాంబ, పేజీలు: 192, వెల: రూ. 100, ప్రతులకు: నవోదయ బుక్‌హౌస్, హైదరాబాద్,92474 71361 పాలపిట్ట బుక్స్, సెల్: 9848787284, అనేక ప్రగతి శీల పుస్తక కేంద్రం, విజయవాడ, సెల్: 92472 53884)**

***– దాట్ల దేవదానం రాజు, 94401 05987***

అభిప్రాయం

# సరళంగా జీవించే కళ

*ఆకెళ్ళ మాణిక్యాంబ గారి ఆత్మకథ చదివిన వెంటనే తన స్పందనని వారి కుమారుడు ఆకెళ్ళ రవిప్రకాష్‌కు తెలియజేసిన ప్రముఖ కవి* ***అంగలకుర్తి విద్యాసాగర్*** *గారి స్పందన 'పాలపిట్ట' పాఠకుల కోసం...*



శుభోదయం రవి ప్రకాష్. 23 (సెప్టెంబర్) న మీ అమ్మగారి ఆత్మకథ "జీవనది ఆరు ఉపనదులు" పుస్తకం అందుకున్నాను. థాంక్స్. టైటిల్ నన్ను ఆకట్టుకున్నందున వెంటనే చదివేసాను.

అమ్మ ఆత్మకథ ప్రత్యేకమైనది. దీని వ్యక్తీకరణ మౌఖిక సంప్రదాయం & సంభాషణ శైలిలో ఉంది. ఆమె ఉత్తమ పురుష లో వివరిస్తున్నప్పటికీ, ఇది దగ్గర వ్యక్తులతో సంభాషణ రూపంలో ఉందనే చెప్పాలి. ఆమె జీవితాన్ని జరిగే సంఘటనలకు లోబడి గడిపింది. గౌరవంగా సరళంగా జీవించే కళ ఆమె స్వభావంలో ఇమిడి ఉంది.

మహిళగా ఆమె కు చుట్టూ ఉన్న ప్రతీదీ సమస్య గానే పరిణమించింది. ఇతరులలో తాదాత్మ్య భావాన్ని రేకెత్తించే ఆమె సామర్థ్యం ద్వారా వివిధ వర్గాలను ఆకర్షించే నేర్పుతో ఆ సమస్యలన్నింటిని ఓర్చుకుని అధిగమించింది. 6 మంది బాలికల తల్లిగా నిరంతర విమర్శ ను తట్టుకుని జీవితాన్ని గడపడం అనేది సామాన్యం కాదు. ఆమెకు తనపై విశ్వాసం ఉంది ఎందుకంటే ఆమెకు వనరులు కొంచమే ఉన్నా కానీ ఉన్న వనరులతో పరిస్థితిని నిర్వహించగల నిబ్బరం కూడా ఉంది. నిరాశ తో ఇతరులను బాధపెట్టడం లేదా నిస్సహాయత తో ఇతరులపై ఫిర్యాదు చేయడం వంటివి ఆమె లో ఇసుమంత కూడా లేవు. ఆరుగురు ఆడపిల్లల తల్లి తన బాధ్యతలను ఆనందంగా స్వీకరించడం, ప్రతి ఒక్కరినీ ఒక ప్రత్యేక స్థాయి కి చేరుస్తానని తనకు తాను వాగ్దానం చేసుకోడం ఆ కలల్ని సాకారం చేసుకోడం ఇవన్నీ ఒక ఎత్తు అయితే ఆమె జీవితంలోకి కొడుకు రాక అతని ప్రేమను పొందడం అతను ఉన్నత శిఖరాలు అందుకోడం ఇది మరో ఎత్తు.

ఆమె శాశ్వత నది అయితే 6 మంది సోదరీమణులు ఆమె ఉపనదులు అయితే, ఎల్లప్పుడూ ప్రవహించే స్వచ్ఛమైన నీటిలో తారాడిన కొడుకు అదృష్టవంతుడు

వారు తమ ప్రేమ, ఆప్యాయతలను చాటుకోవడానికి అతన్నీ వెలుగు తో నింపేరు.

అమ్మ పట్టుదల విశేషమైనది. ప్రతి కొత్త రాకతో తలదించుకునే బదులు ఆమె అదనపు బాధ్యతను భరించే మార్గాన్ని కనుగొంది. ఏదేమైనా, తన జీవితాంతం ఆమెకు అండగా నిలిచిన ఒక పెద్ద నాన్న – ఎటువంటి పరిస్థితినైనా నిర్వహణా చాతుర్యంతో నిర్వహించే ఆమె సామర్థ్యంపై పూర్తి విశ్వాసం కలిగిన భర్త ఉండటం ఆమెకు అదృష్టం. ఆమె భగవంతునిలో లీనం అవడానికి మార్గాలు కనుగొన్నప్పటికీ, తన దైనందిన బాధ్యతల్ని నిర్లక్ష్యం ఎన్నడూ చేయకపోడం ఇదీ ఆమె వ్యక్తిత్వంలో ముఖ్య పార్శ్వం. లేకపోతే ఆమె మొత్తం 7 మంది పిల్లలను విజయవంతమైన సాధకులుగా ఎలా స్థిరపరచగలదు? మహిళలు వంటగదిలోకి ప్రవేశించడాన్ని నిషేధించాలని సమాజాన్ని ప్రపంచాన్ని ఇప్పుడున్న దానికంటే మెరుగైన ప్రదేశంగా మార్చడానికి ఆమె చేసిన తనవంతు ప్రయత్నం నిజమైన సంస్కరణ. అందులో సందేహం లేదు. అందుకే నా అభిప్రాయంలో స్త్రీవాదులు అందరూ తప్పక చదవాల్సిన పుస్తకం ఇది.

ఆవిడ భర్త ఆమెపై చూపిన నమ్మకం అద్భుతం. ఆయన కుటుంబాన్ని నడపడానికి ఆమెకు స్వేచ్ఛ నివ్వటమే కాదు శారీరకంగా మానసికంగా ఆమె కోసం ఎల్లప్పుడూ తపన పడుతూనే ఉన్నాడు.

ఆర్థిక భద్రత కల్పించే తండ్రి తన సొంత వ్యవహారాలు చూసుకుని & పిల్లల గురించి అన్ని నిర్ణయాలు తీసుకునే స్వేచ్ఛను తల్లికి ఎంత మంది మగవాళ్ళు ఇవ్వగలరు. ఈ రోజుకీ ఇస్తున్నారు?

87 ఏళ్ల వయసులో ఆమె తన కథను వివరించిన తీరు ఆ అనుభవాలన్నీ ఈ మధ్య జరిగినట్టు మన మధ్యే ఈ మనుషులు తిరుగుతున్నట్టు రచించిన శైలి లోనే ఈ ఆత్మకథ గొప్పతనం అంతా ఉందని నా భావన. ఎంత మంది రచయితలు ఇలా రాయగలరు తెలుగులో?

తనకు సహాయం చేసిన వారందరికీ ఆమె కృతజ్ఞతలు తెలుపుకుంది. తనను ఇబ్బంది పెట్టడానికి ప్రయత్నించిన వారందరినీ దయతో కరుణ తో క్షమించిన ఆమె ప్రస్తుత తరానికి మార్గదర్శి గా నిలిచింది.

ఆమె తెలివితేటలకు జీవితం పట్ల ఆమెకు గల ఆదరణకు ఆత్మీయత కు నా అభినందనలు. ఇంత అద్భుతమైన తల్లిని కలిగి ఉన్నందుకు మీకు & సోదరీమణులందరికీ హృదయపూర్వక అభినందనలు. అటువంటి ఆదర్శవ్యక్తిని ప్రపంచానికి పరిచయం చేయడానికి ఈ పుస్తకాన్ని తీసుకువచ్చినందుకు మీకు రెట్టింపు అభినందనలు. గొప్ప పుస్తకాలు చదవడం జీవితాల్ని మార్చేసే అనుభూతి.

దయచేసి నా హృదయపూర్వక అభినందనలు, ప్రణామాలను అమ్మకు తెలియజేయండి. ఆమె మంచి ఆరోగ్యం, సంతోషంతో శతాబ్ద కాలం అసాధారణ జీవితం గడపాలని నేను మా కుటుంబం మనసారా కోరుకుంటున్నాము

***– అంగల కుర్తి విద్యా సాగర్,*** ఐ.ఏ.ఎస్.(రి)

మలయాళ మూలం : సతీష్ బాబు, పయ్యన్నూర్
తెలుగు సేత : ఎల్.ఆర్. స్వామి



# పిన్ని

కొట్టుగదిలో, ఒక పాత ట్రంక్ పెట్టెలో కొన్ని పాత వస్తువులు దాచి వుచింది అమ్మ. ఫ్రేమ్ విరిగి, మచ్చలు నిండిన ఒక పాత ఫోటో వాట్లో ఒకటి. ఓణి వేసుకొని అందంగా నవ్వుతూ నిలబడిన ముగ్గురు ఆడపిల్లల ఫోటో అది. ఎడం చేతివైపు చివర నిలబడిన ఆడపిల్ల పోలికలు ఇప్పటికీ మా అమ్మ ముఖం మీద కనబడుతాయి. ఇన్ని సంవత్సరాలు గడచినా ఒక అపూర్వ వస్తువుగా ఆ ఫోటోను కాపాడుకుంటూ వస్తోంది మా అమ్మ. ఆ ఫోటో ఒకటే కాదు ఇంకా ఎన్నో ఉన్నాయి ఆ పెట్టెలో. అవన్నీ అమ్మ చిన్ననాటి తీరాలను గుర్తు చేసే వస్తువులు! ఒక యెర్ర చుక్కల లంగా, రంగు వెలసిన మూడు నాలుగు రిబ్బన్లు, ఒక చెక్క కుంకుమ డబ్బా వగైరాలు వాట్లో కొన్ని.

ఒక రోజు, ఒక ముఖ్య సమాచారం కోసం పాత పత్రికల్లో మునిగి తేలుతున్నప్పుడు హఠాత్తుగా కనబడింది ఆ ట్రంక్ పెట్టె. అలమార కింద అరలో, ఎవరికీ అంత సులువుగా కనబడని రీతిలో లోపలకి తోసి దాచి వుంచిన ఆ పెట్టె నా కంట పడింది. ఆత్రుతగా ఆ పెట్టె బయటికి లాగేను. పెట్టె తెరవగానే దర్శనమిచ్చిన ఆ ఫోటో చూసి ఆశ్చర్యపోయాను.

మా అమ్మకి పదహేడు పద్దెనిమిది వయసు ఉన్నప్పుడు తీసిన ఫోటో లా కనబడింది అది. ముగ్గురు అక్కచెల్లెళ్ళు కలసి తీయించుకున్న ఫోటో అది.

ఎనిమిదేళ్ళ వయసులో వున్న పిన్నియే నాకు గుర్తు. ఎందుకంటే పిన్ని తన ఎనిమిదో ఏట చనిపోయిందని అమ్మ చెప్పగా విన్నాను. హఠాత్తుగా చనిపోయిందట! మరణానికి కారణం ఏమిటని, ఎన్ని సార్లు అడిగినా అమ్మ చెప్పలేదు. పిన్ని గురించి నేను ఏం అడిగినా జవాబు ఇచ్చేది కాదు అమ్మ. బహుశా పిన్నిని గుర్తు చేయటం అమ్మకి బాధ కలిగిస్తుందేమోనని అనుకున్నాను. అది కన్నీటిలో తడిసి ముద్దైన ఒక జ్ఞాపకం కావచ్చు అమ్మకి. అందుకే ఎక్కువ ప్రశ్నలు వేసేవాడ్ని కాదు. అయినా అచ్చం అమ్మ ముఖమే కలిగిన, బంగారు రంగులో వున్న, పూల మనసు గల ఒక పిన్ని నా మనసులో తిష్ఠ వేసి కూర్చుని వుండేది, ఆ ఫోటో చూసినంతవరకు.

ఆ ఫోటో నా ఊహాచిత్రాన్ని పూర్తిగా ధ్వంసం చేసింది. అమ్మ పక్కనే నిలబడివున్న ఆ యువతి ఫోటో పిన్నిది కాదని నమ్మడానికి శతవిధాలుగా ప్రయత్నించేను. అమ్మకీ పిన్నికీ మధ్య చిరునవ్వుతో కనబడిన ఆమె, అమ్మ స్నేహితురాలు కావచ్చు. అమ్మతో కలసి పదోతరగతి చదివి వుండవచ్చు.

అమ్మని అడిగి తెలుసుకోవాలని అనుకున్నాను, ఒక సారి. కాని అడిగితే అమ్మ ఏం అనుకుంటుందేమోనని భయపడి అడగలేదు. తను ఎవరికీ కనబడకుండా దాచిన పెట్టె తీసి చూసినందుకు దెబ్బలాడవచ్చు కూడా. ప్రతి ఒకరికీ తనవైన కొన్ని రహస్యాలు 'గుప్తత' వుంటాయి కదా ! అవి అలాగే గోప్యంగా ఉండాలనే అనుకుంటారు ఎవరైనా. మనసులో పొంగిన కుతూహలపు బుడగలను పొడిచి నిర్వీర్యం చేసినా, అవి మళ్ళీ మళ్ళీ పుంచుకొని ఎదిగి మనసును మొత్తం ఆవరించింది.

పెద్దమ్మను కానీ, మామయ్యని కానీ, తాతగారిని కానీ, అడగాలనుకున్నాను. పరీక్షలు అవగానే మామయ్య ఇంటికి వెళ్లాలని ఎప్పటినుంచో అనుకుంటూనే వున్నాను. తాతగారిని చూసి సంవత్సరాలు గడిచాయి. అతడు అమ్మకి వ్రాసే ఉత్తరాల్లో ఎక్కువగా మా గురించే వ్రాసేవారు – నా గురించీ, నా చెల్లి అరుణ గురించీ. అతనికి సొంత కూతురికన్నా మనవడూ మనుమరాలు ఎక్కువై పోయారని అనుకునేవాళ్ళు అందరూ.

కొంత వరకు అదే నిజం కూడాను. తాతగారికి అత్యంత ప్రీతి పాత్రులం మేమే. ఎంతో దూరంలో వుండారు తాత గారు. అయినా, అనుకోకుండా అనుకోని సందర్భాల్లో కూడా తాత గారు పంపిన గిఫ్ట్ అందేదీ మాకు. ఎప్పుడూ పని ఒత్తిడిలో వుండేవారు నాన్న. అందువల్ల రైలు ఎక్కి బస్సులు మారి మామయ్య ఇంటికి తీసుకొని వెళ్లగలిగేవారు కాదు. కాని పెద్దవాడై పోయాను కనుక ఈ సారి పరీక్షలు అయిపోగానే తాత గారి ఇంటికి వెళ్లాలనీ తాతగారి ప్రేమ తాలూకు చల్లతనం ఆస్వాదించాలనీ నిర్ణయించాను. అప్పుడు పిన్ని గురించి తాతగారిని అడగవచ్చు – అమ్మ ఆ ఫోటో ఎందుకు రహస్యంగా దాచివుంచిందని కూడా, అప్పుడు అడగాలని అనుకున్నాను.

నన్ను పరీక్షా జ్వరం పట్టుకున్న రోజుల్లో, ఒక సారి పెద్దమ్మ వచ్చింది, పెద్దనాన్నతో కలసి. వాళ్ళు ఏవేవో తీర్థయాత్రలు చేస్తూ మధ్యన మా ఇంటికి వచ్చారు; అప్పుడు సంధ్య వేళ – కాషాయవస్త్రమూ రుద్రాక్ష మాల ధరించిన వాళ్ళు రాగానే స్నానం చేసి దేవుళ్ళతో కూర్చున్నారు. పిల్లలు పుట్టని ఒక దాంపత్య జీవితపు చీకటి ప్రపంచంలోకి నెట్టబడిన వాళ్ళకు వెలుగుగా మిగిలినవి, ప్రార్థనలు మాత్రమే. ఆ ప్రార్థనలు ద్వారా పిట్టల గొంతులాంటి ముద్దు మాటలు నిండిన, లేత ఏడుపులు నిండిన, ఒక ప్రపంచం వాళ్ళకోసం సృష్టించుకున్నవారు వాళ్ళు. ఒక తీర్థయాత్రనుంచి మరో తీర్థయాత్రకి ప్రవహించటమే వాళ్ళ బ్రతుకు. కానీ నా పట్ల అరుణ పట్ల అపార ప్రేమ ఉండేది వాళ్ళకు. వాళ్ళు ఎప్పుడూ అది దాచలేదు కూడా. మమ్మల్ని సొంత బిడ్డలుగానే అనుకునేది పెద్దమ్మ.

ప్రార్థనలు ముగించిన తరువాత ప్రశాంతమైన మనసుతో నా గదిలోకి అడుగు పెట్టింది పెద్దమ్మ. రాత్రి వేళ – నా ఎదుట పాఠ్యపుస్తకాల చీకటి – ఆ చీకట్లో అక్షరాల కోసం వెతికే నన్ను చూసి నవ్వింది ఆమె.

"పరీక్షాజ్వరం బాగా ముదిరినటుందే – బాగా నీరసించావు" పెద్దమ్మ అంది.

నేను పుస్తకాలను మరిచాను; పరీక్ష ఉందని కూడా మరిచాను. సంవత్సరాల తరువాత చూస్తున్నాను పెద్దమ్మను.

"చదువుకో – లేవకు. కింద కనబడలేదు కనుక పైకి వచ్చాను అంతే" – పెద్దమ్మ మళ్ళీ అంది.

"నేను నీ గురించే ఎదురు చూస్తున్నాను,పెద్దమ్మా. ఎంత కాలమైంది నువ్వు వచ్చి–"

"ఏవేవో పనులు ఇబ్బందులు–"

"పెద్దమ్మా, నిన్ను ఒక మాట అడగాలి"

"అడుగు"

"పెద్దమ్మా, మా పిన్ని–" గది బయటికి నడిస్తూ అడిగేను.

ఆ మసక వెలుతురులో కూడా పెద్దమ్మ ముఖకవళికలు మారటం గమనించాను. ఆమె ముఖం మీద కాంతి మసకబారింది; అస్పష్టత తన నీడలు పరిచాయి, ఆ ముఖం మీద.

"పిన్నియా ?" కంగారుగా అడిగింది పెద్దమ్మ. "పిన్ని గురించి ఏం తెలియాలి నీకు?"

ఏం అడగాలని తెలియక ఒక నిమిషం పెద్దమ్మను అలా చూస్తూ నిలబడిపోయాను. కొన్ని





క్షణాలు తరువాత నా మనసులో వెలిగింది ఆ ప్రశ్న.

"పిన్ని ఎనిమిదేళ్ళకే చనిపోయిందా?"

ఆ ప్రశ్న విని ఆమె షాకుకు గురైందని తోచింది.

బహుశా ఆ ప్రశ్న అడుగుతానని ఆమె అనుకోలేదు కాబోలు ! ఆ మాటకు వస్తే పిన్ని గురించిన ఊసు ఎత్తుతాననే ఊహించి వుండదు.

"అదంతా నీకెందుకురా, ఇప్పుడు ?" ఆమె ముఖం తిప్పుకొని అంది. "గతం గత :"

ఆ విషయం గురించి మాట్లాడడం ఆమెకి ఇష్టం లేదని అర్థమైంది. మాట్లాడకుండా మేడ మెట్లు దిగాం.

అమ్మకీ పెద్దమ్మకీ బాధ కలిగించే ఆ విషయం గురించి మరోసారి వాళ్ళతో మాట్లాడకూడదనే నిర్ణయానికి వచ్చాను. ఇతరుల బాధల్లో దిగి వెతకకూడదు కదా ! పిన్ని చనిపోయింది. చనిపోయింది అనేదే ముఖ్యం. చనిపోయినప్పుడు ఎనిమిదేళ్లు అయితేనేమిటీ? పదహారేళ్లు అయితేనేమిటీ ? పట్టించుకోవలసిన విషయం కాదు, అది.

అలా అప్పుడు అనుకున్నాను కాని, అది పట్టించుకోవలసిన విషయంగా మారింది, తరువాత. ఐదు పరీక్షలు ముగిశాయి. ఆరో పరీక్ష – లెక్కల పరీక్ష రెండో పేపర్ కి రెండు వారాలు సమయం ఉంది అనగా, ఇంటిలోకి చొరబడింది ఒక మెరుపు తీగ. ఇల్లు మొత్తం కదిలింది ఆ మెరుపుకి. తాత గారు స్నానాల గదిలో పడిపోయి చనిపోయారనే వార్త అందరికీ షాకు ఇచ్చింది.

మామయ్య ఇంటికి చేరుకున్నాను. నా ఆలోచనలు, అప్పుడు, తాత గారితో పాటు ఏవేవో ఆకాశాల్లో తిరుగుతూ వుండేవి. తాత గారితో ఏవేవో మాట్లాడాలని అనుకున్నాను. కాని, నా పరీక్షలు అయిపోయినంతవరకు నా గురించి వేచి వుండలేదు తాత గారు.

తెల్లగుడ్డ కప్పుకొని, దీపం కుందిలో వెలిగే వత్తి సాక్షిగా, ఉదోత్తుల పొగ సమర్పించిన పవిత్రతను ఆస్వాదిస్తూ నన్ను చూసి నవ్వుతూ పడుకున్నాడు తాత. పక్కనే నిలబడ్డారు మొద్దుబారిపోయిన అమ్మ, పెద్దమ్మ, అరుణ, మామయ్య పిల్లలు కూడా. మామయ్యలు ఏవేవో మాట్లాడుకుంటున్నారు గొంతు తగ్గించి. ఆడవాళ్ళపక్కనే ఏడుస్తూ నిలబడవలసిన వాడ్ని కాదు, కదా నేనని అనిపించి నాన్న వద్దకు వెళ్ళి నిలబడ్డాను.

ఎవరెవరో వచ్చి తాతను చూసి వెళ్ళారు. వాళ్ళలో, తాతగారంత పెద్దాయిన ఒకరు పెద్ద మామయ్య వద్దకి వచ్చి అడిగేడు. "ఆ పిల్లకి కబురు పంపలేదా?"

పెద్దమామయ్య బదులు పలకలేదు; పెద్ద మామయ్యే కాదు అక్కడ వున్న ఏ ఒకరూ పెదవి విప్పలేదు.

"కబురు చెప్పకపోవటం సరి కాదు. కబురు పెట్టండి. చనిపోయిన శరీరానికి విద్వేషాలు కోపాలు ఉండవు" .

పెద్ద నాన్న, పెద్ద మామయ్య ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. చివరికి పెద్దమామయ్య తన కొడుకుని పిలిచి ఎవరికో టెలిగ్రాం ఇవ్వటం గురించి మాట్లాడడం విన్నాను.

చితి అరింది. నిప్పు వేడి తగ్గింది. నేను పెద్దమామయ్య కొడుకుని సమీపించాను, ఆ టెలిగ్రాం గురించి అడగాలని.

"అంటే నీకు ఈ విషయాలు తెలియవన్న మాట"! ఆశ్చర్యంగా అన్నాడు అతడు.

"నువ్వు బలే అమాయికుడిలా ఉన్నావే. ఢిల్లీకి పంపాం టెలిగ్రాం. నీ పిన్నికి. అయినా ఆమె ఇప్పుడు కదిలి వస్తుందని నేననుకోవటం లేదు. అంతా బాగున్నప్పుడే తిరిగి చూడని ఆమె –"

అతన్ని ఎవరో పిలిచారు. ఆలోచనలు మరిగాయి నా మనసులో. అమ్మ రహస్యంగా దాచి వుంచిన ఫోటో, ఆ ఫోటోలో కనబడిన



పదహారేళ్ళ పిన్ని – పిన్ని గురించి అడగగానే పెద్దమ్మ కళ్ళలో కనబడిన కంగారు, వగైరాలు నా మనసుని సొంతం చేసుకున్నాయి. తాత గారు చనిపోయారనే సంగతి మరిచిపోయాను నేను. తాత గారు లేకపోవటం వల్ల చీకటి నిండిన ఆ ఇల్లు, పరిసరప్రాంతాలు నా ఎదుట లేనట్లు అనిపించింది.

తాత పోయాక మూడో రోజు మధ్యాహ్నం ఒక కారు వచ్చి ఆగింది ఇంటి ముందు. నల్లకళ్ళద్దాలు పెట్టుకున్న ఒక ఆమె కారునుంచి దిగింది. ఆమె కట్టుకున్న నల్ల చీర తాలూకు పట్టు అంచులు మెరిసాయి. ఆమె వెనుక దిగింది ఒక ఆడపిల్ల, చుడీదార్ వేసుకొని. ఇంచుమించు ఆ పిల్లకి నా వయసు ఉంటుందని అనిపించింది.

మొద్దుబారిన ఇల్లూ, పరిసర ప్రాంతాలు – ఎవరూ నోరు విప్పలేదు. వచ్చిన ఆవిడ కళ్ళద్దాలు తీసి కర్చీఫ్‌తో కళ్ళు వత్తుకుంటూ వాకిట్లోనే నిలబడింది. నా మనసు పిన్నిని వెతికే పనిలో పడింది. వచ్చిన ఆవిడ ముఖాన్ని ఫోటోలో కనబడిన ముఖంతో పోల్చాను.

కాసేపు పోయాక మెల్లగా మెట్లు ఎక్కి ఇంట్లో అడుగు పెట్టింది ఆమె – ఆమె వెనుక కొంత కంగారుగా ఆ పిల్లకూడా. మామయ్యలు అసలు పెదవి విప్పలేదు. నాన్నగారు చదువుతున్న పేపర్లో తల దూర్చాడు.

లోపల ఏడుపులు రాలి పడి చెదరిన సవ్వడి వినబడింది. నేను మెల్లగా లోపలికి అడుగు వేసేను. వచ్చిన ఆమెను దగ్గరగా కూర్చోపెట్టుకొని మాట్లాడుతున్నారు అమ్మ, పెద్దమ్మకూడా –

"నీకు, ఇప్పుడైనా, రావాలననిపించింది కదా" అమ్మ అంది.

అమ్మ కళ్ళలోనుంచి గోదారి దూకింది.

"ఎన్నేళ్ళు గడిచాయే నిన్ను చూసి" అమ్మ నిట్టూర్చింది.

"నీకు మేమంతా పరాయివాళ్లం అయిపోయాం కదూ"

"అది కాదక్కా" –వచ్చినావిడ ఏదో చెప్పాలని మొదలు పెట్టారు. కాని తలుపు వద్ద నిలబడ్డ నన్ను చూసి, కాబోలు ఆగిపోయారు.

"బాబూ ఇలా రా" అమ్మ నన్ను పిలిచింది.

దగ్గరకి వెళ్ళేను. కాని అప్పటికే మరో ఏడుపు తుంపరలో తడిస్తున్నారు వాళ్ళు.

"బాబూ, ఇదే నీ పిన్ని. చనిపోయిందని అనుకున్న పిన్ని" –ఏడుస్తూనే అంది అమ్మ.

దగ్గరగా వచ్చి కూర్చోమంది పిన్ని; కూర్చున్నాను. నా తల నిమురుతూ అడిగింది పిన్ని– "సింధు కన్నా ఆరు నెలలు పెద్దవాడు కదా వీడు?".

పిన్ని పక్కనే కూర్చున్న పిల్ల – సింధు నన్ను చూసి ఒక చిరునవ్వు నవ్వింది.

"అరుణ కనబడలేదే –"

*పెద్ద నాన్న, పెద్ద మామయ్య ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు. చివరికి పెద్దమామయ్య తన కొడుకుని పిలిచి ఎవరికో టెలిగ్రాం ఇవ్వటం గురించి మాట్లాడడం విన్నాను.*
*చితి అరింది. నిప్పు వేడి తగ్గింది. నేను పెద్దమామయ్య కొడుకుని సమీపించాను, ఆ టెలిగ్రాం గురించి అడగాలని.*

అరుణను వెతుకుతూ వెళ్లింది అమ్మ. అమ్మ ముఖం మీదనుంచి సంతోషం ఉట్టిపడుతున్నట్లు అనిపించింది. చేయి జారిపోయిన చెల్లి దొరికిందనే సంబరంలో వున్నట్లు తోచింది. అందరూ కలసి పిన్నినీ పిన్ని కూతురునీ ఇల్లంతా తిప్పారు . ప్రతి గదిలోకీ తీసుకొని వెళ్ళేరు . ఏవేవో కథలు చెప్పుకుంటునే వున్నారు వాళ్ళు.

"నాన్న బ్రతికి వుండి వుంటే ఈ ఇంటి గుమ్మంతోక్కేదా, ఇది ?" మామయ్య అన్నాడు.

"ఎంత బాధ పెట్టింది నాన్నని – ఇప్పుడు అదంతా మరిచిపోయి అందరూ కలసి, దాన్ని అందలం ఎక్కిస్తున్నారు."

"అదంతా ఇప్పుడెందుకు?" నాన్న అతన్ని స్వాంతన పరచడానికి ప్రయత్నించాడు. "గతం గత:" తను అప్పుడు చేసింది తప్పని దానికే, ఇప్పుడు అనిపించవచ్చు – నేరస్పృహ వుండవచ్చు. వచ్చినప్పుడు మనం దూరంగా వుంచకూడదు కదా".

అది నిజమే అని తోచింది నాకు కూడా. నేరం చేసినదాన్ని అనే భావం పిన్ని ప్రతి కదలికలోను, మాటలో కూడా ప్రస్ఫుటంగా కనబడింది.

రోజులు గడిచిన కొద్ది పిన్ని గురించిన వివరాలు తెలిసాయి. హైస్కూలులో చదివే రోజుల్లో పిన్ని ఊరి పెద్ద నంబూదిరి కొడుకుని ప్రేమించటం, ఆ ప్రేమని ఆసరాగా తీసుకొని అతడు మా కుల పెద్ద అయిన తాత గారికి దెబ్బ కొట్టడానికి ప్రయత్నించటం, చివరికి పిన్ని అందరినీ వదిలేసి పారిపోవటం –

చివరికి భర్తతో పాటు ఢిల్లీ వెళ్ళి, ఒక పెద్ద కంపెనీలో ఉన్నత ఉద్యోగస్థురాలిగా మారటం – ఉమ్మడి ఆస్తిలో వాటా కోసం కేసు పెట్టటం, పిన్ని వాటా నంబూదిరి అధీనంలోకి వెళ్ళటం – అంతా ఒక కథలా అనిపించింది విన్నప్పుడు.

అయినా పిన్నిని అసహ్యించుకోలేక పోయాను నేను. తాత పోయారనే వార్త అందగానే పరిగెత్తు కొని వచ్చింది కదా, పాపం!

"ఆయినకి సెలవు దొరక లేదక్కా – లేకపోతే వచ్చేవారు" అని కూడా అంది పిన్ని. ఆ తరువాత సింధుతో చెప్పింది – "వీడే నీ అన్నయ్య కథలు వ్రాసే నీ అన్నయ్య. నీకు చెప్తువుంటాను కదూ"

పరీక్ష వచ్చి నన్ను మా ఊరికి తీసుకొని వెళ్లిపోయింది.

ఒక రోజు పిన్ని, మా ఇంటికి వచ్చింది, సింధుతో. ట్రైనులో వచ్చారు వాళ్ళు.

"ఒక సారి మూకాంబిగా క్షేత్రం దాకా వెళ్ళి రావాలి అక్కా.మొక్కు చెల్లించాలి" పిన్ని అంది, అమ్మతో. "మళ్ళీ ఎప్పుడు వస్తానో, ఏమో–"

నన్ను కూడా రమ్మంది పిన్ని, తోడుగా.

టికెట్ కొన్నది పిన్నియే. పెరుగుతున్న ఖర్చులు గురించే మాట్లాడింది పిన్ని, ట్రైన్లో, బస్సులో కూడా.

గుడి చాలా రద్దీగా వుండేది. దర్శనం చేసుకొని బయటికి వచ్చాం. తిరిగి ఊరు వెళ్లడానికి ట్రైన్ కానీ, బస్సు గానీ దొరకలేదు.

ఒక మంచి లాడ్జిలో డబుల్ రూం దొరికింది. ఒక పరుపు అదనంగా గదిలో వేస్తానని లాడ్జ్ మేనేజర్ ఒప్పుకున్నాడు కూడా. ముగ్గురు ఉన్నాం కదా. అయినా మరో సింగల్ రూం కూడా కావాలని అడిగింది పిన్ని. నేను ఆశ్చర్యంగా చూసేను ఆమెను. ఎందుకో ఇంకో గది !

తాళాలు తీసుకొని గది వైపు నడుస్తున్నప్పుడు నన్ను దగ్గరగా పిలిచి గొంతు తగ్గించి అంది పిన్ని. "సింధు చిన్న పిల్లయేం కాదు కదా– పెళ్లీడుకు వచ్చిన అమ్మాయి. సింగల్ రూం నీ కోసమే".

అంటే –?

*అనువాదకుని సెల్: 99490 75859*



## ఖాళీ కాగితం

కాగితం పొలం బీడువారింది
భావతుంపరలు లేక
ఆలోచనల మేఘాలు అటకెక్కినాయి
కొత్తదనమే లేక
అందుకే గ్రీష్మతాపంలా బుర్రవేడెక్కినా
అకాలవర్షాలు కూడా లేక అల్లకల్లోలం అవుతోంది
అక్షరబీజాలు సాక్షాత్కరించక
గుండె గదిలోన మనసు పొరల్లోన
నిక్షిప్తమవుతుంటే
గొంతు వేణువును దాటి కలంతో చెలిమిచేసి
నాట్యమాడించదేమిటా అని
ఖాళీ కాగితం రెపరెపలాడుతోంటే
మనసు పరిపరివిధాల వ్యథచెందుతోంది
తెలియట్లేదు తలపులన్నీ
మొలకలుగా మారుటెలాగో
కలుపుతీయనవసరం లేని
సేంద్రీయ వనాలను సృష్టించడం ఎలాగో
ఆ పచ్చటి పొలాల్లో అక్షరాల విరుల సిరులు
పాఠకుల ఉచ్ఛ్వాస నిశ్వాస కదలికలకు
ఊయలూగుతున్నట్లు ఆనందపరవశంలో
మునిగితేలే దృశ్యాన్ని చూడటం ఎలాగో
బిక్కచచ్చిపోతోంది మనసు జీవం లేక
అక్షర సంపదలేక శిక్షను అనుభవిస్తున్నట్లు
కళ్ళలో నీరునింపుకుని శూన్యంలోకి చూస్తూ
ఉన్న ఖాళీ కాగితాన్ని చూసి
ఆశలు అడుగంటుతున్నా ఆవిరవుతున్నా
ప్రయత్నాన్ని పట్టుబడితే
మేఘమై చినుకై వానై
చిగురాశల కొమ్మలు చిగురించేట్లు చేయునని
అక్షర లక్షలు సలక్షణంగా బారులు తీరునని
శారదాంబ అక్షయముగా సదా అనుగ్రహిస్తే
అంతటా హరితహారమై
అక్షర పూదోటల పరిమళాలు వ్యాపించునని
సృష్టించును అద్భుత కవనాలని...

*– మంజుల సూర్య, 9704022244*

## ఆకాశ జెండా

రంగుల వంతెన
మది కంటికి హాయి
సింగిడేసింది

వర్షం విప్పిన
ఆహా! ఆకాశ ఛత్రం
ఇంద్ర ధనుస్సు

రంగు కళ్ళతో
కొన్ని క్షణాల సడి
వర్షపు జాణ

నింగి కొండపై
పురివిప్పి ఆడింది
శ్వేత వర్ణమే

వర్షము, కాంతి
ఎత్తుకొని ముద్దాడె
రంగుల బిడ్డ

వరుణ కాంత
రంగు పూల జడతో
సిగ్గులొలికె

నీటి బిందువు
కాంతి పరావర్తనం
ఆకాశ జెండా

రెప రెపలు
వానెత్తిన పతాకం
ఎద ఆకాశం

*– వనిపాకల లచ్చిరెడ్డి, 9966897001*





## డాక్టర్ కావాడి ఎల్లయ్య కవితలు

సమాజము నిర్మించిన కులవర్ణాల గోడలను
పునాదుల సమ్మూలముగా పెకిలించి వేసెయ్యి
నవసమాజ నిర్మాణానికి నడుము కట్టు
ధనిక బీద అంతరాలను నిర్మూలించు

ప్రేమలోకములో అంతస్తులకు
తావు లేదని చాటిచెప్పు
మనమిరువురము
ప్రేమ పక్షులమై ఆకాశాన విహరిద్దాము
స్వేచ్ఛా వాయువలను పీలుద్దాము
చెట్టు రెమ్మలలో గూడు నిర్మిద్దాము

పాడు లోకానికి దూరంగా పయనిద్దాము
యీర్ష్య ద్వేషం లేని స్వర్గలోకములో
శాశ్వతముగా నిలిచిపోదాము
మన ప్రేమ నిఖిలమైనది,
నిశ్చలమైనదని తెలుపుదాము

...

గలగల నది ప్రవహిస్తుంది
నా మనస్సు ఉవ్వెత్తునపరవళ్లు తొక్కుతుంది
గోదావరి నది తీరాన
ఏకాంతంగా కూర్చొని
నా మనసు లో నిన్ను నింపుకున్నాను

సాగర సంగమం చేరుకున్నాను
అహర్నిశలు సముద్ర కెరటాలు ఘోషిస్తున్నవి
నీ స్మృతులే నా మదిలో తేలిపోతున్నవి
మనమిరువురము
అనంతములో విలీనమై పోదాము

*కవి సెల్: 93962 06298*



## డా. ప్రభాకర్ జైని సరికొత్త సీరియల్

# సమర్థుని జీవయాత్ర

### పార్ట్ 12

### సమర్థుడు-హర్షద్ మెహతా- మారిన దృక్పథం

షేర్ మార్కెటులో ముందుకు సాగాలంటే 24 బై 7 మన దృష్టినంతా మార్కెట్ శక్తుల కదలికల మీదనే కేంద్రీకరించి ఉంచవలసి ఉంటుంది. నేను ఉద్యోగం కోసం బ్యాంకుకు వెళ్ళడం వలన – షేర్ మార్కెటులో లావాదేవీలు జరిగే ప్రైమ్ టైములో – బ్యాంకులోనే గడపడం వలన కొన్ని ఇంట్రా డే {Intra day} లో జరిగే లావాదేవీల పైన శ్రద్ధ చూపలేక పోయేవాణ్ణి. దాని వల్ల కొంత నష్టాన్ని చవిచూడవలసి వచ్చేది.

బ్యాంకు జీతం ఐదువేల పైనే అయినా, బ్యాంకులో కాలం గడపడం వలన నాకు కలిగే నష్టం అంతకు మించి ఎన్నో రెట్లు ఉండేది. కానీ, బ్యాంకు ఉద్యోగం అన్నది మనిషికి ఒక స్థిరత్వాన్ని ఇస్తుంది. సంఘంలో ఒక సామాజిక హోదాను కలిగిస్తుంది. కానీ, స్థిరత్వం ఉంటే మనిషి స్తబ్దతకు అలవాటుపడి, జీవితంలో రిస్క్ తీసుకునే సాహసం చేయలేని ఒక విధమైన మత్తులో ఉంటాడు. రిస్క్ తీసుకుని, గెలిచినప్పుడు కలిగే థ్రిల్లును అనుభవించ లేడు. అందుకే, నేను స్తబ్దంగా ఉండలేకపోయేవాణ్ణి కాబట్టి నా బ్యాంక్ ఉద్యోగం నాకు గుదిబండగా తోచడం మొదలయింది.

నేను చేస్తున్న షేర్ వ్యాపారం, బ్యాంకు ఉద్యోగం యొక్క మౌలిక లక్షణాలు పరస్పరం విరుద్ధమైనవని నాకర్థమైంది.

ఒక చిన్న పట్టణం నుంచి హైదరాబాదుకు రావడానికి కారణమయింది నా బ్యాంకు ఉద్యోగం. బ్యాంకు ఉద్యోగం మూలంగానే సాంఘీగారి దగ్గర పార్ట్ టైం ఉద్యోగం లభించింది. అక్కడ పని చేయడం వల్లనే, యాదృచ్ఛికంగానే అయినా జాజు గారి పరిచయ భాగ్యం కలిగింది. అన్నీ, భగవంతుడు నా కోసం రచించిన ప్రణాళికలో భాగంగా జరుగుతున్నట్టుగా, అంచెలంచెలుగా, జరిగాయి. ఆయా మనుషులు, ఒక మహాద్భుత నాటకంలోని పాత్రలలా, సరైన టైములో ప్రవేశించి, తమ పాత్రను పోషించి, నాటకాన్ని లేదన్నట్లు, నిష్క్రమించినట్టుగా, నా జీవితంలో నుండి నిష్క్రమించారు. అందుకే, నేను ముందుగా సాంఘీగారిని వదిలేసాను. ఇక బ్యాంకును కూడా వదలాల్సిన సమయమాసన్నమైందని భావించి నేనూ నా భార్యా కలిసి ఒక సంచలనాత్మక నిర్ణయం తీసుకున్నాము. అప్పటికే మా దగ్గర ఉన్న ఆస్తుల అప్పుల చిట్టా తయారు చేసుకుని {Assets and Liabilities Balance Sheet} మా పరిస్థితి బాగానే ఉందని అంచనా వేసుకుని, మా చిన్నమ్మాయి రెండో పుట్టిన రోజున నేను నా బ్యాంకు ఉద్యోగానికి రాజీనామా చేసాను.

ఎంతైనా బ్యాంకు ఉద్యోగానికి రాజీనామా చేసిన రోజున మనసు కలవరానికి గురయింది. అందుకే, ఆ కలవరాన్ని దూరం చేసుకోవడానికీ, కొత్త ఉత్సాహాన్ని పొందడానికి ఒక నెల రోజుల పాటు పిల్లలతో ప్రేమయాత్రకు వెళ్ళి దేశమంతా చుట్టి వచ్చాము. చేతికి ఎముక లేకుండా డబ్బులు నీళ్ళలా ఖర్చు చేసాను. ఫైవ్ స్టార్ హోటల్స్, విమానయానాలు, హెలికాప్టర్ రైడులు, ఎక్కడికక్కడ ట్యాక్సీలతో, సౌకర్యవంతంగా ప్రయాణం చేసాము. కాశ్మీరు, దాల్ లేక్ లోని 'షికారా' హౌజ్ బోటులో నుండి కేరళ బ్యాక్ వాటర్స్ లోని హౌజ్ బోటులో వరకు అన్నింటిలో నివాసమున్నాము. అన్ని వింతలు, విడ్డూరాలను ఆస్వాదించాము.

ప్రతీ మధుర క్షణాన్ని వీడియో తీసాము. ఒక మధుర జ్ఞాపకంలా మనో మంజూషలో భద్రపరుచుకున్నాము. పుట్టినప్పటి నుంచి ఇంత ఆనందం నేనెప్పుడూ అనుభవించ లేదు.

ఆనందం వేరే, సంతోషం వేరే అని నాకర్థమైంది. సంతోషం ఉన్నంత మాత్రాన ఆనందం రాదు. డబ్బులు సంపాదిస్తే సంతోషం కలుగుతుంది. కారు కొంటే సంతోషం వస్తుంది. కానీ ఆనందం రాదు. నెలరోజుల్లో కారు రొటీను అయిపోతుంది. కానీ, ఆనందం మనిషిని ఇంకో పై స్థితికి తీసుకు వెళ్తుంది. దీనికి డబ్బుతో సంబంధం లేదు కూడా! ఎక్కడో శ్రీనగర్ అవతల 'పహల్ గాఉవ్' లో ఉండే, ఒక స్త్రీ పండ్లు అమ్ముకుని ఆనందంగా జీవితం గడుపుతుంది. ఆమెకు పెద్దపెద్ద కోరికలు కూడా ఏమీ ఉండవు. వాళ్ళ ముఖాల్లోని ముగ్ధమనోహర సౌందర్యాన్ని, అమాయకత్వాన్ని చూస్తూ ఉంటే నాకైతే ఒక అలౌకిక ఆనందం కలిగింది.

మంచు కప్పబడిన ఆ పర్వత సానువుల్లో విహరిస్తుంటే, నాకు పరమశివుని సాన్నిధ్యంలోనే ఉన్నట్టుగా, ఒళ్ళు గగుర్పొడిచింది. ఒక పాజిటివ్ వైబ్రేషన్ కలిగి మనసంతా ఆనందంతో నిండిపోయింది. ఆ ఆనందాన్ని శాశ్వతంగా పొందగలిగిన వాళ్ళు బ్రహ్మానంద స్థితికి చేరుకుంటారు. పరమ భక్తులై, యోగులై, తాదాత్మ్యంలో సంచరిస్తూ ఉంటారు. మానవమాత్రులమైన మనం, మియర్ మోర్టల్స్ ఆ క్షణకాలపు ఆనందాన్ని అనుభవించి, ఆ అనుభవాన్ని మూటగట్టుకుని వచ్చి, తిరిగి మోహమయమైన దైనందిన జీవితంలో పడిపోతాము.

ఏది ఏమైనా, ఆ యాత్ర నా జీవిత దృక్పథాన్ని మార్చేసింది. డబ్బు సంపాదించాలి. కానీ, అదే ప్రధానం కాదు. దాంట్లోనే కొంతైనా సమాజానికి పంచి పెడితే, కొంతైనా ఆనందం కలుగుతుంది

టూరు నుండి వచ్చిన తర్వాత రెట్టించిన ఉత్సాహంతో పనిచేసాను. ఇంతలో బాబు పుట్టాడు. అంతా బాగుందనుకుంటున్న సమయంలో శ్రీనివాస్



*అదే సమయంలో, దేశ ఆర్థిక రంగంలో కూడా విప్లవాత్మకమైన మార్పులు రావడం ప్రారంభమయ్యాయి. పీవీ నర్సింహారావు ప్రధానమంత్రి కాగానే ఆర్థిక రంగాన్ని ప్రక్షాళన చేసి, 'కంట్రోల్ రాజ్' కు స్వస్తి చెప్పి ఫ్రీ మార్కెటింగ్ విధానంతో, మార్కెట్లను విదేశీ పెట్టుబడిదారులకు తలుపులు తెరిచారు. దానితో, విదేశాల నుండి ఇబ్బడి ముబ్బడిగా పెట్టుబడులు వచ్చాయి. బంగారాన్ని విమానాల్లో తీసుకుపోయి లండన్ మార్కెట్లలో అమ్మి విదేశీ మారక నిల్వలను మెయింటెయిన్ చేసే దుర్గతి తప్పింది.*



పరారయ్యాడు.

శ్రీనివాస్ మోసం చేసి తప్పించుకున్నా అతన్ని వదల్లేదు. నేను కాషన్ ఇవ్వడం వలన బ్యాంకులన్నీ ఆయా అకౌంట్స్ మీద ఓ కన్నేసి ఉంచి, ఆ చెక్కులు రాగానే సస్పెన్స్ అకౌంటులో పెట్టి పోలీసులకు సమాచారాన్ని ఇవ్వడంతో, వాళ్ళు తీగ లాగి డొంకంతా కదిలించారు. కానీ, ఆ పనంతా నెమ్మదిగా, నత్త నడకన నడిచింది. ఇప్పటిలాగా ఆధునిక టెక్నాలజీ, కంప్యూటర్లు, సీసీటీవీలు, ట్రేసింగ్ అండ్ ట్రాకింగ్ పద్ధతులు లేకపోవడంతో, పరిస్థితులు చక్కదిద్దుకునే సరికి ఆరు నెలల సమయం పట్టింది.

ఇంతలో, మా పెద్ద పాప స్కూలుకు వెళ్ళాల్సిన సమయం వచ్చింది. నా చిన్నప్పుడు, ఇప్పుడు సర్వ హంగులతో ఉన్నటువంటి కార్పొరేట్ స్కూల్స్ లేకున్నా, మా ఊళ్ళో కొన్ని ప్రైవేట్ స్కూల్స్ ఉండేవి. ఆ స్కూళ్ళల్లోని విద్యార్థులు రంగురంగుల యూనిఫామ్స్, తళతళ మెరిసే షూస్, భుజాల మీదుగా వీపు మీదకు తొడిగిన స్కూలు బ్యాగులతో స్కూల్ బస్సు ఎక్కి వెళ్ళేవాళ్ళు. నాక్కూడా అటువంటి స్కూల్లో చదువుకోవాలనే కోరిక బలంగా ఉండేది. నేను కూడా అటువంటి యూనిఫామ్ వేసుకుని, బూట్లు తొడుక్కుని స్కూలుకు వెళుతున్నట్టుగా కలలు కూడా వచ్చేవి. ప్రైవేట్ స్కూలు, బూట్ల సంగతులు అటుంచి, ఏడవ తరగతి వరకు కాళ్ళకు చెప్పులు కూడా లేని దుస్థితి నాది.

అందుకే, నేను నా పిల్లలకు ప్రపంచంలోని అత్యంత ప్రతిష్టాత్మకమైన విశ్వవిద్యాలయాల్లో చదివించాలని, వాళ్ళను వాళ్ళు కోరుకున్న రంగంలో అగ్రస్థానంలో నిలబెట్టాలని నిర్ణయించుకున్నాను. ఒక విధంగా, పైన ఎక్కడో మా నాన్నకు నా పిల్లలను చూపించి, 'బిడ్డలకు చదువు ఇలా చెప్పించాలి నాన్నా!' అని, ఏడుస్తూ, ఎలుగెత్తి అరవాలనిపించేది.

నేను ఖాళీ చేసిన హిమాయత్ నగర్ ఫ్లాటులో ఒక ఆఫీస్ ఓపెన్ చేసి ఒక క్లర్కును, ఒక లేడీ టైపిస్ట్ కమ్ రిసెప్షనిస్ట్‌ను అపాయింట్ చేసాను. షేర్ మార్కెటుకు దగ్గరలో ఒక ఆఫీసు ఉండడమన్నది ఎంత ముఖ్యమో నాకు త్వరలోనే అర్థమయింది. అప్పుడు హైదరాబాద్ స్టాక్ ఎక్స్ఛేంజ్ హిమాయత్ నగరులోనే ఉండడంతో, స్టాక్ ఎక్స్ఛేంజ్ కు మా ఆఫీసు దగ్గరగా ఉండడంతో, మా ఆఫీసుకు చాలా మంది మిత్రులు వచ్చి వెళ్తుండేవారు. కాసేపు రెస్ట్ తీసుకోవడానికి, బాత్రూములు వాడుకోవడానికి, లంచ్ చేయడానికి వాళ్ళకు చాలా సౌకర్యంగా ఉండడంతో, అది మా అడ్డాగా మారిపోయింది.

వాళ్ళంతా నాతో స్నేహంగా ఉండేవారు. అక్కడే కిచెనులో పాలు టీ, కాఫీ, పంచదార, బిస్కెట్స్, స్నాక్స్ ఉంచి, వచ్చిన వాళ్ళందరికీ, అడిగినా, అడగకపోయినా, సర్వ్ చేయమని చెప్పేవాణ్ణి. దాని వల్ల కొన్ని వందల రూపాయలు ఖర్చయినా సరే లక్షల విలువైన టిప్స్ లభించేవి. పాండే గారు తన అడ్డా పర్మనెంట్ గా మా ఆఫీసుకు మార్చేసారు. అంతే కాకుండా, ఆఫీస్ స్టాఫ్ వెళ్ళి పోయిన తర్వాత ఒక అటెండరు ఉండేవాడు. ఆఫీసులో కూర్చుని రిలాక్సేషన్ పొందాలనుకునేవారికి మందు, ఫుడ్ సప్లై చేసేవాడు. మందు బాటిల్స్ పాండే గారి కంట్రోల్లోనే ఉండేవి. వంద సెమినార్లలో, ఏజీయం మీటింగుల్లో దొరకని టిప్స్, మందు బాటిల్ విప్పగానే బయటపడుతుంటాయి. అందుకని, ఆ కార్యక్రమాలను నేను ఎంకరేజ్ చేసేవాణ్ణి. నాకు వేరే పనులు లేకుంటే, నా స్థాయి వాళ్ళు వస్తున్నారని తెలిస్తే నేను కూడా వాళ్ళతో కలిసి, ఒకటో రెండో పెగ్గులు పుచ్చుకునేవాణ్ణి.

పాండే గారు పంజాబ్ నేషనల్ బ్యాంకులో మేనేజరుగా పనిచేసి రిటైరయ్యారు. ఇంగ్లీషులో మంచి డ్రాఫ్టింగ్ చేసేవారు. ఒక కంపెనీ బ్యాలెన్స్ షీట్ ఇస్తే దాన్ని క్షుణ్ణంగా చదివి, విశ్లేషించి, కంపెనీ ఆర్థిక ఆరోగ్యస్థితి {financial health} ఎలా ఉందో పసిగట్టి ఒక చక్కటి రిపోర్టు రాసే నైపుణ్యం ఆయనలో ఉంది.

అందుకే, ఆయనను నేను మా ఆఫీసుకు మేనేజరుగా అపాయింట్ చేసి నెలకు మూడు వేల జీతం ఇస్తానని చెప్పాను. అందుకు ప్రతిగా ఆయన నాకు ప్రతీ నెల ఒక పది చిన్నా, పెద్దా కంపెనీల బ్యాలెన్స్ షీట్లను విశ్లేషించి, ఆ కంపెనీల భవిష్యత్తు ఎలా ఉండబోతుందో ప్రెడిక్ట్ చేస్తూ ఒక చిన్న వ్యాసం రాసి ఇవ్వాల్సి ఉంటుందని చెప్పాను.

పాండే రాసి ఇచ్చిన సాంకేతిక వివరాలను కోట్ చేస్తూ నేను, ఆ షేర్ కొనాలా వద్దా అన్న నా అభిప్రాయాన్ని జోడించి "ఫండ్స్ అండ్ ఫైనాన్సెస్" అని ఒక కరపత్రం {pamphlet} తయారుచేసి, ప్రతీ పదిహేను రోజులకు పబ్లిష్ చేసి స్టాక్ ఎక్స్ఛేంజ్ బిల్డింగుల్లో, బ్యాంకుల్లో, షేర్ బ్రోకర్ ఆఫీసుల్లో ఉచితంగా పంచేవాళ్ళం. నా కరపత్రం గురించి దిన, వార పత్రికల్లో, ఫైనాన్షియల్ పత్రికల్లో ప్రకటనలు, వ్యాసాలు రాయించేవాళ్ళం.

మొదట్లో నా పాంప్లెట్ కు పెద్దగా అనుకూల ప్రభావమేమీ కనిపించలేదు. కానీ, నా అభిప్రాయాలను మార్కెట్ వర్గాలు నిశితంగా పరిగణనలోకి తీసుకుంటున్నాయనే సమాచారం నాకు వస్తూనే ఉంది. నాకు ఆరు పేజీల పాంప్లెట్ ముద్రణకు రెండువేల కాపీలకు మూడొందల రూపాయలు ఖర్చయ్యేవి. వాటిని పంచడానికి, పేపర్లలో ప్రకటనలు ఇవ్వడానికి కలిపి మొత్తం వెయ్యి రూపాయలు ఖర్చయ్యేది. ఇటువంటి పాంప్లెట్స్ విదేశాల్లో బాగా పాపులర్. అవి రాసే ఎనలిస్టులకు చందాల రూపంలోనే మిలియన్ల డాలర్లలో ఆదాయం ఉండేది.

నాక్కూడా అలా ఒక ఫైనాన్షియల్ ఎనలిస్ట్ కావాలని ఉండేది. దాని వల్ల మనం చేస్తున్న షేర్ బిజినెస్ అల్లాటప్పా వ్యాపారం కాదనీ, గుడ్డెద్దు చేన్లో పడి కుమ్మేసినట్టుగా కాకుండా, షేర్ బజారులోని ఒడిదొడుకులకు, అప్స్ అండ్ డౌన్స్ కు, బుల్స్ అండ్ బేర్స్ {Bulls and Bears} చేసే గిమ్మిక్కులకూ ఒక శాస్త్రీయత ఉందని నిరూపించాలనుకునేవాణ్ణి.

కేవలం షేర్లు అమ్మడం కొనడం కాకుండా నాలాంటి చదువుకున్నవాడు రంగంలోకి దిగితే షేర్ మార్కెటులో ఏ విధంగా మార్పు తేవచ్చో చూపించడానికి నా పాంప్లెట్ మొదటి మెట్టు. మొదట్లో ఆసక్తి చూపని వారు కూడా రానురానూ నా అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకుంటున్నారు. నేనూహించినట్టుగానే కొన్ని కంపెనీల ఫలితాలు ఉండడంతో, ఆరు నెలల తర్వాత ఎంక్వైరీలు రాసాగాయి. ఒక్క సంవత్సరం కాలం పాటు పాంప్లెట్స్ ఉచితంగా పంచిన తర్వాత, నెలకు వంద రూపాయలు చందా కట్టిన వారికే, మరింత ఆకర్షణీయం

గా, పదిహేను పేజీలతో నెలకు రెండు సార్లు మ్యాగజైను రూపంలో, వాళ్ళు ఇచ్చిన అడ్రస్సుకే పంపుతామని ప్రకటించాము. నా పాచిక పారి, అనూహ్యంగా, విరివిగా చందాలు రావడం మొదలయింది.

నా అభిప్రాయం ఇప్పుడు డబ్బులు పెట్టి కొని, వినడానికి ప్రజలు సిద్ధంగా ఉన్నారనే వాస్తవం నాకు అవగాహనలోకి రాగానే నేను సంతోషించాను.

షేర్ మార్కెట్ గురించి మరింత రీసెర్చి చేయడానికి, వేర్వేరు ఎక్స్ఛేంజిల సమాచారాన్ని సేకరించి దేశవ్యాప్తంగా నా పాంప్లెట్ ప్రాచుర్యంలోకి తేవడానికి, మరింత సిబ్బందిని నియమించుకోవలసి వచ్చింది.

షేర్ మార్కెట్ అంటేనే బాంబే ఎక్స్ఛేంజ్. భారతదేశంలోని కోట్లాదిమంది షేర్స్బ్రోకర్ల, షేర్ హోల్డర్సుకు 'మక్కా' వంటిది బొంబాయి ఎక్స్ఛేంజ్. వాళ్ళ బ్రతుకులను నందనవనం చేయాలన్నా, ఛిన్నాభిన్నం చేయాలన్నా బాంబే స్టాక్ ఎక్స్ఛేంజిలో జరిగి లావాదేవీలే కారణం. అందుకని, అక్కడి మార్కెటును స్టడీ చేయడం కోసం బొంబాయిలో ఒక ఆఫీసు ఓపెన్ చేసి, ఫైనాన్స్ లో యంబీయే చేసిన ఇద్దరు కుర్రాళ్ళని నెలకు ఐదువేల జీతం మీద అపాయింట్ చేసాను. వాళ్ళు అక్కడి వివరాలను పుకార్లను, టిప్పును, కంపెనీల మెర్జర్స్, బోనస్ ఇష్యూలు గురించిన వార్తలు ఎప్పటికప్పుడు 'టెలెక్స్' ద్వారా నాకు పంపిస్తుంటారు.

అదే సమయంలో, దేశ ఆర్థిక రంగంలో కూడా విప్లవాత్మకమైన మార్పులు రావడం ప్రారంభమయ్యాయి. పీవీ నర్సింహారావు ప్రధానమంత్రి కాగానే ఆర్థిక రంగాన్ని ప్రక్షాళన చేసి, 'కంట్రోల్ రాజ్' కు స్వస్తి చెప్పి ఫ్రీ మార్కెటింగ్ విధానంతో, మార్కెట్లను విదేశీ పెట్టుబడిదారులకు తలుపులు తెరిచారు. దానితో, విదేశాల నుండి ఇబ్బడి ముబ్బడిగా పెట్టుబడులు వచ్చాయి. బంగారాన్ని విమానాల్లో తీసుకుపోయి లండన్ మార్కెట్లలో అమ్మి విదేశీ మారక నిల్వలను

మార్కెట్లోని గూఢచారి వర్గాలు పసిగట్టని విధంగా హైదరాబాదులో కొన్ని, బొంబాయిలో కొన్ని, అహ్మదాబాదులో కొన్ని నా షేర్లనూ, నా స్టాక్కును తగ్గించుకుంటూ వచ్చాను. కేవలం ప్రైమరీ మార్కెట్లో అలాటయిన షేర్లను మాత్రమే ఉంచుకున్నాను. ధరలు పెరుగుతున్న సమయంలో నేను షేర్లు అమ్మడాన్ని ఎవ్వరూ హర్షించ లేదు. కానీ, వాళ్ళంతా హర్షద్ మెహతా దెబ్బతో కుదేలయిపోయారు.

ఈ సంఘటనతో షేర్ మార్కెట్ వర్గాలలో నా విలువ మరింత పెరిగింది. నేను గత సంవత్సర కాలంగా హెచ్చరిస్తూనే ఉన్నానన్న విషయం గుర్తొచ్చి, నా హెచ్చరికలను గమనించనందుకు నా ఆంతరంగీకులు, మా F&Fపాంప్లెట్ పాఠకులు చింతించారు.

షేర్ మార్కెట్ పూర్తిగా సెంటిమెంట్ మీద నడుస్తుంది. ఒక్కసారి హర్షద్ మెహతా కొట్టిన దెబ్బతో మార్కెట్ సెంటిమెంట్ ఘోరంగా దెబ్బ తిన్నది. వేలల్లో విలువ కలిగిన షేర్లు పది, ఐదు, రెండు రూపాయలక్కూడా పడిపోయాయి. రెండేళ్ళ వరకూ కోలుకోలేదు.

అదే ఇప్పుడయితే షేర్ మార్కెట్ క్రాష్ అయితే 'షేర్ హోల్డర్ల విలువ లక్షల కోట్లు హుష్ కాకి అయిపోయింది' {in one single day the share value eroded to the tune of one lac crores} అనే వాళ్ళు. అప్పట్లో ఇటువంటి సాంకేతిక పారామీటర్స్ లేవు కాబట్టి ఎంత నష్టపోయారో తెలియదు కానీ, ఆ రోజును షేర్ మార్కెట్ చరిత్రలో ఒక మరుపురాని చీకటిరోజు {UNFORGETTABLE BLACK DAY IN INDIA'S SHARE MARKET HISTORY} గా అభివర్ణించవచ్చును.

మార్కెట్ కుప్పకూలినప్పుడు కూడా తెలివైన ఇన్వెస్టర్లు, షేర్ బ్రోకర్లు లాభాలు మూటకట్టుకోవచ్చునని నేను జాజుగారి దగ్గర గ్రహించిన ఇంకొక పాఠం.

*షేర్ మార్కెట్ కళకళలాడుతున్న సమయంలో హర్షద్ మెహతా కుంభకోణం వల్ల షేర్ మార్కెట్లు కుప్పకూలిపోయాయి. బ్లాక్ మంగళ వారంగా, 28 ఏప్రిల్, 1992 మరియు బ్లాక్ గురువారంగా 6 ఆగస్ట్ 1992, చరిత్రలో మాయనిమచ్చగా మిగిలిపోయి రోజులలో పదుల సంఖ్యల్లో ఆత్మహత్యలు జరిగాయి. నేను ముందు నుంచే నా పాంప్లెట్స్ ద్వారా హర్షద్ మెహతా డీల్ చేస్తున్న కంపెనీల ఆర్థిక సూచీలు ఆరోగ్యకరంగా లేవని హెచ్చరిస్తూ వచ్చాను. నాకు బొంబాయి నుండి కూడా, ప్రమాద ఘంటికలు మోగుతున్నాయన్న సూచనలు వచ్చాయి. నా గట్ ఫీలింగో, నా సిక్స్త్ సెన్సో, భగవంతుడి దయవల్లో గానీ నేను నెమ్మదిగా ఆరు నెలల ముందు నుండే నా షేర్లనూ, నా స్టాక్కును తగ్గించుకుంటూ వచ్చాను.*



{foreign exchange reserves} మెయింటెయిన్ చేసే దుర్గతి తప్పింది.

భారతదేశ మార్కెట్లలోకి నిధులు ప్రవహిస్తుండడంతో, విదేశీ బ్యాంకులు తరలి వచ్చాయి.

షేర్ మార్కెట్ కళకళలాడుతున్న సమయంలో హర్షద్ మెహతా కుంభకోణం వల్ల షేర్ మార్కెట్లు కుప్పకూలిపోయాయి. బ్లాక్ మంగళ వారంగా, 28 ఏప్రిల్, 1992 మరియు బ్లాక్ గురువారంగా 6 ఆగస్ట్ 1992, చరిత్రలో మాయనిమచ్చగా మిగిలిపోయి రోజులలో పదుల సంఖ్యల్లో ఆత్మహత్యలు జరిగాయి.

నేను ముందు నుంచే నా పాంప్లెట్స్ ద్వారా హర్షద్ మెహతా డీల్ చేస్తున్న కంపెనీల ఆర్థిక సూచీలు {financial indices} ఆరోగ్యకరంగా లేవని హెచ్చరిస్తూ వచ్చాను. నాకు బొంబాయి నుండి కూడా, ప్రమాద ఘంటికలు మోగుతున్నాయన్న సూచనలు వచ్చాయి. నా గట్ ఫీలింగో, నా సిక్స్త్ సెన్సో, భగవంతుడి దయవల్లో గానీ నేను నెమ్మదిగా ఆరు నెలల ముందు నుండే,

ఇటువంటి విషయాలు ఎవ్వరూ మనకు పాఠాలు చెప్పినట్టుగా చెప్పరు. వాళు ్ళ చేస్తున్న ఇన్వెస్ట్ మెంట్సును, వాళ్ళ క్లయింట్లకు ఇస్తున్న సలహాలను గమనిస్తూ మనమే ఒక అవగాహనకు రావాలి.

అప్పట్లో ఇన్ని బిజినెస్ ఛానెల్స్, ఛానెల్స్ లో రెగ్యులర్ గా షేర్ గురించిన విశ్లేషణలు ఉండేవి కావు. పుస్తకాలూ దొరికేవి కావు. నేనే మొట్టమొదటిసారిగా, F&F మ్యాగజైన్ తీసుకొచ్చాను. మ్యాగజైన్ లో కూడా మనం ఫలానా షేర్ అని ఖచ్చితంగా చెప్పకూడదు. ఒకవేళ మన అంచనా తప్పైతే, మనం జైలుకు పోవాల్సి వస్తుంది. కొన్ని పరిశోధన వల్ల, మార్కెట్ పరిణామాల దృష్ట్యా ఫలానా షేర్ ధర భవిష్యత్తులో పెరగవచ్చు లేదా తగ్గవచ్చు అని మాత్రం ప్రిడిక్ట్ చేస్తాం.

అందుకే, ఈ క్లిష్ట పరిస్థితుల్లో కూడా ఇన్వెస్టర్లు వివేకవంతమైన నిర్ణయం తీసుకుని లాభాలు సంపాదించవచ్చునని నా F&F మ్యాగజైన్ లో సలహా ఇచ్చాను.

షేర్ మార్కెట్ పడిపోయినప్పుడు కుప్పకూలిన షేర్లలో కొన్ని బలమైన ఆర్థిక పునాదుల మీద పని చేస్తున్న కంపెనీలు కూడా ఉన్నాయి. అయినా సరే, ఆ ప్రభంజనంలో అవి కూడా పడిపోయి పప్పుబెల్లాల మాదిరిగా అమ్మకానికి

సిద్ధంగా ఉన్నాయి. ఆ కంపెనీ ల షేర్లన్నీ లక్షల సంఖ్యలో నేను కొనేసాను. ఒక్క షేర్ విలువ ఐదారు వందలు ఉన్నది, హర్షద్ మెహతా కుంభకోణం తర్వాత ఐదారు రూపాయలకు పడిపోయింది. ఐదారు లక్షలకు లక్ష షేర్లు వచ్చాయి. అవి కూడా అంత బల్కున {in bulk} కొనే నాథుడే లేడు. నేను నా దగ్గరున్న మొత్తం నగదును పెట్టి షేర్లు కొనేసాను.




భారత ఆర్థిక వ్యవస్థలో షేర్ మార్కెట్, బంగారం, రియల్ ఎస్టేట్ ఈ మూడు రంగాలకు విడదీయరాని సంబంధం ఉంది. షేర్ మార్కెట్ పడిపోగానే ఇన్వెస్టర్లు, బంగారం, రియల్ ఎస్టేట్ల మీద పెట్టుబడులు పెట్టి అందులో లాభాలు సంపాదించాలని చూస్తారు. అట్లాగే 1992 లో షేర్ మార్కెట్ కుప్పకూలగానే, రియల్ ఎస్టేట్ ధరలకు అమాంతం రెక్కలొచ్చాయి. బంగారం ధర విపరీతంగా పెరిగింది.

అందుకని నేను జూబ్లీహిల్స్‌లో నా ఇంటిపక్కనే ఉన్న వెయ్యి గజాల స్థలం, నా భార్యాపిల్లల ఒంటి మీద ఉన్న ఏడు వారాల నగలు, ఇంపాలా కారు మొత్తం అమ్మేసి, నగదు చేసుకుని, షేర్ మార్కెట్లో పెట్టుబడి పెట్టాను.

ఒక విధంగా నాది మూర్ఖత్వమే! ధరలు పెరుగుతున్నప్పుడు షేర్లు అమ్మడం, ధరలు తగ్గుతున్నప్పుడు షేర్లు కొనడమనే నా స్ట్రాటజీ ఎవ్వరికీ మొదట్లో అర్థం కాలేదు. నా సీక్రెటును నేను ఎవ్వరికీ చెప్పలేదు. నేను షేర్లు అమ్మిన విషయం, కొన్న విషయం నా F&F ఆఫీసులో ఎవ్వరికీ తెలియదు. నా వ్యాపారమంతా బొంబాయి, అహ్మదాబాద్ స్టాక్ బ్రోకర్ల ద్వారానే జరిపించాను. షేర్ సర్టిఫికెట్లు ఒక వ్యక్తి పర్సనల్ గా, విమానంలో వచ్చి, నా ఇంట్లో ఇచ్చి వెళ్ళేవాడు. షేర్ మార్కెట్ లావాదేవీలు అత్యంత గోప్యంగా జరపాలని సాంఘీగారు, జాజుగార్ల దగ్గర నేర్చుకున్నాను. ఆ విధానాన్ని నేను మరింత ఇంప్రూవైజ్ {improvize} చేసాను.

అందుకే, అందరూ నేను కూడా షేర్ మార్కెట్లో దివాలా తీసి అన్నీ అమ్ముకున్నానని అనుకున్నారు. పుల్లయ్య కూడా బాగానే దెబ్బ తిన్నాడు. అందుకే, నేను దివాలా తీసానని అనుకున్నాడు. నా లాంటి తొందరపాటు తనం ఉన్నవాడు ఎగిరెగిరి పడితే ఇలాగే జరుగుతుందని నన్ను తీవ్ర పదజాలంతో విమర్శించారు కూడా. షేర్ మార్కెట్ గురించి నాకేం తెలుసని F&F మ్యాగజైన్ నడుపుతూ, అమాయక ప్రజలను కూడా మోసం చేస్తున్నానని కూడా ఆరోపించారు. నేను అన్ని విమర్శలకు చిరునవ్వే సమాధానంగా మౌనం వహించాను.

కానీ, నా ఇల్లు మాత్రం కట్టలు కట్టల షేర్ల గుట్టలతో నిండిపోయింది. శ్రీనివాస్ ఉదంతం తర్వాత షేర్ సర్టిఫికెట్లను ఇంట్లోని ఒక స్ట్రాంగ్ రూములో భద్రపరిచే వాణ్ణి. కానీ, ఉన్న షేర్ల గుట్టలు పెట్టడానికి రెండు రూములే కావాల్సి వచ్చింది.

నా ఇన్వెస్ట్ మెంట్ పూర్తయిన తర్వాత, కొన్ని షేర్లలో కొంత పెరుగుదల సూచనలు {upward trends} కనిపిస్తున్నాయని నా F&F మ్యాగజైన్ రీడర్స్ కు సూచనప్రాయంగా చెప్పాను. కానీ, చాలా మంది నా మాట నమ్మలేదు. కానీ, నా మీద గౌరవం కొద్దీ, నేను చెప్పిన విషయం నిజమేనా అని ఫోన్లలోనూ, వ్యక్తిగతంగానూ వచ్చి ఎంక్వైరీ చేసేవారు. అలా ఎంక్వైరీల కోసం వచ్చిన వారికి ఉచిత సలహాలు ఇవ్వడం నచ్చలేదు నాకు.

అప్పుడే, నేను F&F అనే కంపెనీ ప్రారంభించాను.

మా కంపెనీలో ముందుగా వెయ్యి రూపాయలు కట్టి మెంబర్ షిప్ తీసుకోవాలి. అప్పుడే వారికి మేము ఖచ్చితమైన సలహాలు ఇస్తాము. మేము ఒక వంద రూపాయల నాన్ జుడిషియల్ స్టాంప్ పేపరు మీద ఒక ఒప్పంద పత్రం మీద కూడా సంతకం తీసుకుంటాము. మా క్లయింట్లకు మేము సలహాలు మాత్రమే ఇచ్చామని, వాటిననుసరించి క్లయింట్లు చేసే పెట్టుబడులకు తద్వారా కలిగే లాభనష్టాలకు మా బాధ్యత ఉండదని స్పష్టంగా రాయించుకున్నా తర్వాతనే వారి స్టాక్ పోర్ట్ ఫోలియోను చూసి, విశ్లేషించి, ఏయే షేర్లు కొనాలో, అమ్మాలో నిర్ణయిస్తాము.

ఈ పనంతా ఒకరిద్దరు క్లయింట్లు ఉన్నప్పుడు నేనే చేసేవాణ్ణి. కానీ, చూస్తుండగానే వందల మంది కస్టమర్లు, వెయ్యి రూపాయలు కట్టి చేరడంతో, నేను వెంటనే ఒక ఐదుగురు యంబీయే పూర్తి చేసిన అభ్యర్థులను అపాయింట్ చేసాను. అప్పుడప్పుడే పాపులరవుతున్న కంప్యూటర్ల వల్ల పని సులభమవుతుందని గ్రహించి, పది కంప్యూటర్లను కొని, పది మంది కంప్యూటర్ ఆపరేటర్లను అపాయింట్ చేసాను. హిమాయత్ నగర్ లోని ఆఫీస్ ఇరుకుగా తయారయింది. అదే బిల్డింగులో మరో ట్రిబుల్ బెడ్రూం కొని, అందులో కంప్యూటర్ వింగ్‌ను ఎస్టాబ్లిష్ చేసాము.

కానీ, కాలం విరామం లేకుండా పరిగెడుతూనే ఉంది. హర్షద్ మెహతా స్కాం పీరియడ్‌లో కొన్న షేర్లు రెండేళ్ళల్లో పూర్వ వైభవాన్ని సంతరించుకున్నాయి. నేను ఐదు రూపాయలకు కొన్న షేర్లు కొన్ని ఐదు వేల వరకు కూడా పెరిగాయి. నేను కొన్ని కంపెనీలలో లక్షల్లో షేర్లు కొనడంతో, నాకు ఆ కంపెనీల బోర్డ్ ఆఫ్ డైరెక్టర్ గా కూడా అవకాశం వచ్చింది.

నేను మెల్లగా షేర్లు అమ్మడం మొదలుపెట్టాను. నేను ఒక రోజు ఒక కంపెనీకి చెందిన పదివేల షేర్లు అమ్మకానికి పెట్టాను. నేను ఆ పది వేల షేర్లు యాభై మూడు వేలకు కొన్నాను. కానీ, ఆ రోజు అమ్మితే ఐదు కోట్ల అరవై లక్షలు వచ్చాయి. దాంతో, ఆ రోజు హైదరాబాదు స్టాక్ ఎక్స్చేంజ్ దద్దరిల్లిపోయింది. నేనంటే ఏమిటో వాళ్ళకు అర్థమయింది. నా విశ్వరూపాన్ని వాళ్ళు దర్శించారు.

నేను ఇప్పటి విప్రో చౌరాస్తాలో, ఎఫ్ అండ్ ఎఫ్ బిల్డింగ్ నిర్మాణం మొదలుపెట్టాను. అందరూ అది పిచ్చి పని అన్నారు. కానీ, నా ప్లానింగ్ ఎలా ఉంటుందో అర్థం అయినవారు మాత్రం, కొంచెం తికమక పడినా, నేనేదో పెద్ద ప్లానులో ఉన్నా నన్న అనుకున్నారు. వాళ్ళకు తెలియని విషయం ఏమిటంటే, అదే రోజు 'హైటెక్' సిటీ నిర్మాణానికి శంకుస్థాపన జరిగింది. ఇంక ఆ ఏరియా అంతా ముట్టుకుంటే బంగారమవుతుందని ఊహించి, నేను కూడా దాని చుట్టుపక్కల ఎంత వీలైతే అంత స్థలం గత నాలుగైదేళ్ళుగా కొంటూనే ఉన్నాను.

రెండు మూడేళ్ళ ఎదురుచూపుల తర్వాత నా భవిష్యత్ ప్రణాళిక సాకారమయి, ఎఫ్ అండ్ ఎఫ్ నిర్మాణం మొదలుపెట్టాను.

**(ఇంకా వుంది)**

***రచయిత సెల్: 7989825420***

## రచయితలకు సూచనలు

- సమీక్ష కోసం పుస్తకాలు పంపించేవారు విధిగా రెండు కాపీలు పంపించాలి.
- పత్రిక కోసం రచనలు పంపించే రచయితలు, కవులు వీలయితే అను 7 లేదా 6 ఫాంట్‌లో కంపోజ్ చేసి మెయిల్ చేయండి.
- యూనికోడ్‌లో ఉంటే ఓపెన్ ఫైల్ అండ్ పిడిఎఫ్ ఫైల్స్‌లో పంపించండి.
- తమ రచనలు పంపించేవారు ఫోను నెంబర్, ఈమెయిల్‌తో పాటు పూర్తి అడ్రస్ రాయాలి.



కవితావిమర్శ

– రాపోలు సీతారామరాజు

# కాలంతో నడుస్తున్న కవి దామెర రాములు

సమకాలీనత అనేది సాహిత్యచర్చలో ఎక్కువగా వినబడుతున్న అంశం. సమకాలీనంగా సమాజంలోని పరిస్థితులు, రాజకీయాలు, వివిధ సామాజిక ఉద్యమాలు ఇవన్నీ ఈ సమకాలీనతలోని భాగాలే. సాహిత్యగతికి ఒక లక్షణం ఉంది. చరిత్రగతిలో ఏర్పడ్డ ఏ ఉద్యమమైనా కొంత చేతనను కాలానికి ముడివేసి వెళుతుంది. తరువాతి సామాజిక, రాజకీయ పరిణామాలవల్ల ఏర్పడ్డ మరో ఉద్యమం ఈ సమకాలీనతను మరోవైపుకు తిప్పుతుంది. కాలపు నడకలో పురుడు పోసుకున్న ఏ మార్గమూ వెంటనే ముగిసిపోదు. కొత్త ఉద్యమాలతో, భావాలతో కలిసి నడుస్తూనే ఉంటుంది. సమకాలీనంగా తెలుగులో వస్తున్న వచన కవిత్వంలో అనేక ఉద్యమ ప్రతిఫలనాలున్నాయి. వీటిని కొన్ని సమూహాలుగా గమనించవచ్చు.

1. మానవీయ స్పృహ – నైతికభావనలు
2. మానవీయ స్పృహ – విప్లవ కవిత
3. విప్లవ, దళిత సైద్ధాంతిక ప్రతిఫలనాలు
4. విప్లవ, దళిత, ప్రాంతీయ భావనలు
5. స్త్రీ గొంతుక, మానవీయ, దళిత భావనలు
6. ముస్లిం మైనారిటీ – మానవీయ భావనలు

సుమారుగా ప్రతీ కవి ఈ సమూహాల్లో ఏదో ఒక భావనలో ఉంటాడు. సమకాలీనత ఎక్కువగా మానవీయతను ప్రేరేపించడం వల్ల ప్రతీ కవిలోనూ మానవీయ స్పృహ కనిపిస్తుంది.

డాక్టర్ దామెర రాములు ఈ సమూహాల్లో విప్లవ, దళిత, ప్రాంతీయ భావనల్లోని మార్గానికి చెందుతాడు. గతంలోని ఆయన కవితాసంపుటాల్లో విప్లవ సంబంధమైన మార్క్సిస్టు సైద్ధాంతిక భావనలు, ఉద్యమంగా వచ్చిన కాలంలో తెలంగాణ ప్రాంతీయత మరియు దళిత కవిత్వ సైద్ధాంతిక ప్రతిఫలనాలు ఇవన్నీ కనిపిస్తాయి. దామెర రాములు తాజాగా 'గమ్యం తెలిసిన తొవ్వ' కవితాసంపుటిని ప్రకటించాడు. సమకాలీనంగా రాసిన కవిత్వం అవడం అలాగే ఈ కాలం ఎక్కువగా ప్రపంచం కరోనా బారినపడడం వలన ఈ ప్రభావం దామెర రాములుపై కూడా కనిపిస్తుంది. ఈ సంపుటిలో కరోనా, ఢిల్లీలో రైతుల ధర్నా మొదలైన సమకాలీన అంశాలపై కవితలు కనిపిస్తాయి. తెలుగునాట ఉద్భవించిన ఎన్నో ఉద్యమాల్లో క్రియాశీలకంగా పనిచేస్తూ తదనుగుణంగానే సాహిత్యసృజన చేసిన దామెర రాములు ఈ కవితాసంపుటిలో కూడా అస్తిత్వం గురించి మాట్లాడుతాడు. ఐతే ఇక్కడ ఏదో రాజకీయ అస్తిత్వం గురించో లేక ఏదో వాదాల అస్తిత్వం గురించో కాకుండా ఎక్కువగా వైయక్తిక అస్తిత్వం గురించి మాట్లాడుతాడు. మనిషి మానసిక అస్తిత్వం గురించి మాట్లాడుతాడు. పాఠకుడు తనని తాను తరచి చూసుకునేలా మాటలల్లుతాడు.

"కుంచించుకుపోవడం కాదు/ సంక్లిష్ట మనుగడని/ సరళతరం జేసుకో" (పే. 109)

"ప్రతి ఉదయం కొత్త పొద్దుపొడుపే/ప్రతి దినం ఒడుపుగా నేర్పుతుంది/ సరికొత్త జీవనపాఠం" (పే.60)

తరగని జీవనలాలసలో రాటుదేలి ముమ్ముందుకు సాగిపోమ్మంటాడు. నేటి సంక్లిష్టకాలానికి అన్నింటికంటే ఇదే ముఖ్యమని కవి భావన కాబోలు. అందులో వాస్తవమూ లేకపోలేదు.

'గమ్యం తెలిసిన తొవ్వ'లో మొత్తం 90 కవితలున్నాయి. అందులో 14 కవితలు కరోనా మీదనే ఉన్నాయి. ఒకే వస్తువు మీద ఇన్ని కవితలుండడం వల్ల అక్కడక్కడా కొంత వాచ్యంగా అనిపించినా ఒక బాధ్యతగల పౌరుడిగా, చేయితిరిగిన వైద్యుడిగా దామెర రాములు ఆ కవితల్లో దర్శనమిస్తాడు. ఆయన ఆవేదన, బాధ కనిపిస్తాయి. కష్టకాలం అంతమవుతుందన్న నమ్మకమూ కనిపిస్తుంది. మహమ్మారి కాలానికి ధైర్యం నూరిపోయడానికి కవి వైద్యుడిచ్చే కవిత్వపు మాత్రల్లా ఊరటనిస్తాయి.

1. "ఏ వసంతం నిరాశాజనకంగా/కళావిహీనమై ఇంత అధ్వాన్నంగా/ చప్పగా నిస్సారంగా ముగియలేదు/ నిశ్చేతనమైన గ్రీష్మాన్ని/ఇలా ఎన్నడూ కనలేదు" (పే. 127)

సమకాలీనతలోంచి కరోనా సృష్టించిన ఆరోగ్య బీభత్సం గురించి మాత్రమే కాదు. జీవన బీభత్సాన్ని గురించి మాట్లాడుతున్నాడు. లోకం నిశ్చేతనమైన గ్రీష్మంలా ఉందని అనడంలో వాక్యంలో శిల్పసౌందర్యం కనిపిస్తుంది. ప్రకృతిని అమితంగా ఆరాధించే దామెర రాములు ప్రకృతి ప్రతీకలుగానే కరోనాకాటుని కవితగా మలిచిన వైనం ఇక్కడ కనిపిస్తుంది. ఎన్నడూ ఎరుగని, ఎన్నడూ కనని ఒక ఉత్పాతం మనమిప్పుడు కరోనా రూపంలో చూశాం. కవి ఇక్కడ దాన్ని అంతే ప్రభావవంతంగా కవిత్వీకరించాడు.





2. "ఇది ప్రకృతి బీభత్సమా?/నరజాతి తప్పిదమా?/మనిషి మితిమీరిన అశ్రద్ధా?" (పే. 180).

3. "ఈ కోవిడ్–19ని ఎట్లాగో/ టీకాగీకల్తో అధిగమించవచ్చు/కానీ/ రానున్న తరాల్లో/ ఇలాంటి మలుపులెన్నో ఉండవని / బేరీజు వేసుకో/ ఉపకణజీవులన్నింటిని బ్రతకనివ్వు/ భవిష్యత్తులో నువ్వు/ మహోజ్వలంగా జీవించే / ప్రణాళికలు రచించు (పే. 124)

రెండవ వాక్యంలో కరోనా కారణాల అన్వేషణ కనిపిస్తుంది. మానవజాతి నిర్లక్ష్యంపై, అవివేకంపై, అత్యాశపై మౌలికమైన ప్రశ్నలు సంధిస్తాడు. కరోనా కారణాలు విశ్లేషించుకుంటూనే మూడవ వాక్యంలో ఒక వైద్యునిగా మానవజాతి మహోజ్వలంగా జీవించడానికి ప్రణాళికలు రచించమని ప్రేరేపిస్తాడు. ప్రకృతిని సమతుల్యంగా ఉంచాల్సిన బాధ్యతను గుర్తుచేస్తాడు. "మనిషికి ఓర్పు తక్కువ/ ఆశ ఎక్కువ/ పరిస్థితుల ప్రభావమే/ పరిపాలిస్తుంది మానవ మస్తిష్కాల్ని" అంటూ తన సుదీర్ఘ జీవనానుభవంలో మనిషి నైజాన్ని సరిగ్గా అంచనా వేశాడు కవి. అదేవిధంగా మనిషి ప్రకృతిని ఇంకా అర్థం చేసుకోవాల్సిన రీతిలో అర్థం

చేసుకోలేదని, ప్రకృతికి అనుగుణంగా జీవించే నైపుణ్యాన్ని సాధించలేదని అంటాడు.

"వాతావరణ మార్పులకు / శీతోష్ణస్థితులకు / సర్దుకుని తట్టుకుని / సౌఖ్యంగా జీవించే కళానైపుణ్యం/ మనసుపెట్టి శ్రద్ధగా మనిషి అలవరుచుకోలేదు /నేర్చుకోలేదు" (పే. 126)

ఈ విషయంలో పూర్తిగా ఏకీభవించలేకపోయినా నేడు మనిషి ప్రకృతికి తలపెడుతున్న కీడును చూస్తుంటే కవి మాటలు నిజమని ఒప్పుకోవాల్సొస్తుంది. ప్రకృతి గురించే కాదు వ్యవసాయం గురించి కవితలు రాశాడు కవి. వర్తమాన కవి ప్రధానంగా ఏదో ఒక సామాజిక ఉద్యమ మార్గంలో మాత్రమే కాకుండా అనేక మార్గాల్లో తన భావాలను వ్యక్తం చేస్తున్నాడు. ఈ మార్గంలో రాములు రైతులవైపు, మధ్యతరగతి మనుషులవైపు నిలబడిన కవితలు కనిపిస్తాయి.

"ఎన్ని నుదుటి నదులు పారలేదు/ పొలాలన్ని పిండి పొతంజేసి/ సాగుయోగ్యం జేసి/ఆకుపచ్చ సంతకం చేయడానికి?" "ఆలోచనల ప్రవాహం/ నడిచే పాదాలకు పాకుతుంటే/ గట్టుపైన నియంత్రణకే తొలిప్రాధాన్యం/ గట్టుమీద నడకలాంటిదే/తెగదెంపులు లేని/ఎడతెగని జీవనయానం" (పే. 70)

"నిటారుగా నిలవలేదు నిలదీయలేదు/ ప్రతీపశక్తుల ముందు నేలచూపులు/ పైవాళ్ళతో కలవలేని న్యూనత/ కిందివాళ్ళతో జతకట్టలేని బింకం/ సమస్యల ముళ్ళకంపలో చిక్కుకొన్నవాడే/ నేటి మధ్యతరగతి మానవుడు" (పే. 41)

"జీవనరంగాన్ని/ఎప్పటికప్పుడు/ విస్తృతపరుస్తూ పోతూ ఉంటే / సంశయచింతనకి తావెక్కడిది? /జీవనరంగాన్ని / శుద్ధి చేసుకోవడమే / అవలోకన చేసుకోవడమే / కాంతివంతంగా మలుచుకోవడమే /మానవాళి ముందున్న మేలైన/తక్షణ కర్తవ్యం!!" (పే. 177).

శాస్త్రసాంకేతికంగా ఎంతో పురోగతిని సాధించినా మనిషిలో మనీషిగా ఎదిగే హృదయవికాసం కలగాలని, హృదయ పరిపక్వత రావాలని కవి గాఢంగా అభిలషిస్తున్నారు. అదే విషయాన్ని పదేపదే చెబుతున్నాడు ఈ సంపుటిలో. కులం పేరిట, మతం పేరిట సమాజంలో నేడు పెరిగిపోతున్న సంకుచిత ధోరణి గురించి 'అస్థిరత్వం', 'సవరణరణం' మొదలైన కవితలు రాశాడు. ధిక్కారగొంతులపై వలలతాళ్ళ పన్నాగాలు ఆగిపోలేదని ప్రభుత్వ నియంతృత్వాన్ని ఎండగడతాడు. దామెర రాములు అంతరంగాన్ని పట్టిచూపే కవిత 'నేనింతే'. ఈ కవితలో కవి జనం మధ్యనే తిరుగుతానని అంటాడు. వ్యవసాయం గురించి, చెరువు గురించి, ప్రకృతి గురించి మాట్లాడతాడు. ప్రపంచీకరణ దుష్ప్రభావం, నేటికాలపు 'దొంగల' గురించి చెబుతాడు. భాష, యాస గురించి మాట్లాడతాడు. కవితాగానం చేస్తానంటాడు.

గతంలోని కవితా సంపుటాలలో వివిధ సామాజిక ప్రాంతీయ ఉద్యమాల్లో వాటి ప్రేరణతో కవిత్వం రాసిన కవి ఈ కాలానికి ఒక మానవీయ స్ఫూర్తితో సమకాలీనాంశాలను కవిత్వం చేస్తున్నాడు. ఆయన నేపథ్యాన్ని ఆయనే ప్రకటించిన సందర్భాలు ఈ సంపుటిలోనే దర్శనమిస్తాయి.

"అనాది మానవుని మూలాల్ని అస్తిత్వాల్ని అంతరాల్ని
స్పష్టమైన తేలికైన భాష్యంతో
లోకం ముందు ప్రకటిస్తాను
కిరణాల వెలుగులో
కళాకౌశలంతో
ఎడతెగని దుఃఖాల పరిష్కారం ఎరుకపరుస్తాను" (పే. 25) అంటాడు.

ఇది ఇప్పుడు కాలం మానవీయతకోసం ఎదురుచూస్తుందన్న ఎరుకను కలిగిస్తుంది. దామెర రాములు కవిత్వం లోకం కోసం రాసే కవిత్వం. దామెర రాములు కాలంతో నడుస్తున్న కవి.

*కవి సెల్: దక్షిణాఫ్రికా (+27 727747549)*



గుజరాతీ మూలం,
హిందీ అనువాదం : డా. వినోద్ కుమార్ జోషి
తెలుగు సేత: డా॥ సి. భవానీదేవి

# సైరంధ్రి

వికల మనస్సున సంకటాలు,
హృదయంనిండిన వేదన భారం;
రాత్రి గడిచినది మూడోజాము,
దూరమైనది స్వాంతఃసుఖము !

సోమరికాలం కదలిక మంద్రం,
బాహ్యాంతర నిరంతర యుద్ధం;
ఎన్నడెవ్వరికి లేవు జయాపజయాలు,
తీరాల నడుమ మునకలే సుమా !

జనన మరణాలు తెలియలేనివి,
సదా చురుకుగ కాలం పరుగులు;
అంతంలేని అంచనాలతో,
వికట మార్గాన విడిపోవటమే!

**-2-**

సుధేష్ణ స్మరణ బాధిస్తున్నది,
అదృష్టంలో మూగరాతలు;
కుదించుకుంటూ నిలచిన అబల,
మందప్రకాశిత దీపశిఖ!

అర్ధరాత్రికి ద్వారం తెరిచెను,
పిల్లగాలులు హాయిగొలిపెను;
పతులు ఐదుగురున్నా ఒంటరి,
క్లిష్ట ప్రహేళిక విడివడకున్నది!

ఎవరు నన్నిలా బాధిస్తున్నది? యుక్తిరహిత చింతన ఏల?
గుప్తవేషము చాటున, ప్రశ్నించుట ఎలా?
మధ్యద్వారమున నిలిచినది ఏకాంతకాంత,
లోపలా బయటా కాదు, చిక్కువడినది దిగ్భ్రమలోనే!

***(సైరంధ్రి అనువాద కావ్యం లోంచి)***

***అనువాదకురాలి సెల్: 9866847000***



**సమీక్ష** – *బి.నర్సన్*

# కవి ప్రకృతి ప్రకోపించగ పడగలెత్తిన అలలు

సాహితీ ప్రక్రియల్లో కవిత్వానికి ప్రయోగ అనుకూలత లక్షణం ఎక్కువ. వచన కవనంలో గద్యం పద్యం దేనిపాలు ఎంతైనా అర్థవంతంగా ఉంటే చాలు కవిత్వంగా చలామణి అయిపోతుంది. ఇది అభియోగం కాదు. పాఠకామోదంగా విస్తరిస్తున్న తెలుగు కవిత్వపు కొత్త నడకల ప్రస్తావన మాత్రమే. కవి ''నిజం'' గత కొంత కాలంగా నిత్యం లోకరీతులను మననం చేసుకుంటూ సామాజిక కోణంలో తన మనసుకు తట్టిన కవితాత్మక బింబాలను ఫేస్‌బుక్ తెరపై ఉంచుతా వస్తున్నారు. కొత్తగా, సూటిగా, తెగువతో కూడిన ఆ పంక్తులకు వచ్చిన మిత్ర ప్రతిస్పందనలతో వాటి విలువ బయటపడింది. చదివినవారి ఆదరణ, విశ్లేషణ, భాషా ప్రయోగాల చమక్కులపై వచ్చిన ప్రశంసల పరంపర క్రమంలో ఆ కవిత్వ వాక్యాలు సంపుటాకారమెత్తాయి.

విడి విడిగా ఉన్న ఈ కవితోక్తులు పుస్తకరూపంలో సంకెలగా మారి మరింత సమగ్రతను పొందాయి. కవి మనోలోకమే సముద్రంగా ఆ నిరంతరం ఎగిసిపడిన తలపోతలు అలలుగా అవతరించాయి. అప్పుడప్పుడు కలవరింతలుగా వచ్చే కవిత్వం ఏకంగా తల మీద తిష్ట వేయటంతో బుర్ర కవితల ఎత్తిపోతలా మారి కవనతటాకమయింది. అలా తలపోతలు అక్షర రాశులై 'అలలు' పేజీల్లో నురుగు వరుసల్లా అమరినాయి. ఇందులోని రచనల్లో అధికం మూడు, నాలుగు పాదాల్లో ఉన్నందున కవి వీటికి 'అలలు – కవి తలపోతలు' అని పేరు పెట్టి ఉంటారు. పుస్తకంలో ఈ ఖండికల సంఖ్య సుమారు ఏడు వందల దాకా ఉంటుంది.




చింతనాశీలి అయిన కవి నిజం మేధోమథనంలో తేలియాడిన చిక్కని అక్షరాల తరగలివి. ఇది నవ మాసాల ప్రసవం కాదు, నవ మాసాలూ ప్రసవమే. కవి చెప్పినట్లు ప్రతి రోజు పదికి అటు ఇటుగా వికసించిన పొట్టి కవితల తోట ఈ సంపుటి.

అలలు 'తలపోతలు' నిద్రపోనివ్వవు. అలలు ఇసుకలో ఇంకినట్లు తలపోతలు అక్షరాల్లో ఒదిగే దాకా ఒకటే అంతర్జ్వలనం. కూచున్న చోటే మనసు రంగులరాట్నమెక్కి ఊరేగితే చూపు ఆనినంత దూరం అగుపించిన వెలుగు చీకట్లు, చెట్టూ చేమ, పిల్లా పిసరు, అడవి ఎడారి, చావు బతుకు సకలం ఈ కవితల సంతలో ఒకటయినాయి.

చిత్రకారుడు బొమ్మగా ఉన్నది ఉన్నట్లు గీస్తే గొప్ప. కంటికి కనబడే దృశ్యం వెనక్కి వెళ్లి కొత్త అర్థం పట్టుకోవడమే కవికి మెప్పు. నిజం కంటి నిండా కొత్త చూపులే. పువ్వు తేనెటీగ బంధాన్ని 'బహు భార్యాత్వ మూలాల దుస్తర్రం' అని మధుర భావుకతను సామాజిక ప్రశ్నగా మార్చారు.

'ఆకుల పుటల్లో చెట్లు రాసే గ్రంథాలయాలు
జీవన బాటసారుల వృత్తాంతాలు',

'చెట్టు నిండా ఎన్ని ఉత్తరంలో
మేఘాలకు రాసుకున్న
ప్రేమ పత్రాలు',

'వాన చెట్టు మేఘం
వేళ్ళు లేని జల వృక్షం',

'భూమికి, ఆకాశం పంపే పల్లకి, వెన్నెల',

'రాలె పండ్ల కోసం/ ఎండుటాకులు పొత్తిళ్లు' – ఇలా కవి ఊహాలోకపు నవ భావనా వీచికల పంక్తులు. రాలే కాలంలో ఆకుల్లా పాదాల కంటికి ఒరుసుకుంటాయి.

భూమ్యాకాశాలు కవి ముందు కూచొని తామెరు గని తమ కథలని చెప్పించుకున్నట్లు, చెట్లు, పక్షులు, పూలు, వాన చినుకులు కవితో కొత్త రూపాల్ని చెక్కించుకున్నట్లు ఈ తలపోతల్లో ఎన్నో ప్రకృతి ఒడి బాలల్లా ఆడుకుంటాయి.

'రాత్రి చుక్కలే పగటి పూలు/ భూవ్యాకాశాలు/ నగలు మార్చుకుంటాయి' , 'ఉదయాన్నే పూల దుద్దులు/ మార్చుకుంటాయి కొమ్మలు/ రోజుకెన్ని జతల చెవికమ్మలో!', 'తెల్ల మేఘాలు కరిగించి వెండి నక్షత్రాలు/ చేయించుకుంటోంది నింగి చంద్రుడి చేత', 'పక్షులు తమ మజిలీల కోసం/ నిర్మించుకున్న భవనాలే వృక్షాలు',

'పేరంటానికి వెళ్లి/ వచ్చినట్లుంది ఆకాశం/ నుదుట బొట్టు/ మెరిసిపోతోంది' మానవీకరణలో పంచభూతాలు పరవశించే వాక్యాలివి. సౌందర్య చిత్రణలోనే భావుకతకు సామాజిక కోణం అద్ది తన ముద్రను నిలుపుకున్నారు నిజం.

'సీతాకోకలకా పేరెందుకో తెలీదు/ పురుష పరుష వెలిబతుకు జానకిదని తెలీక', 'గాయం చేసినా/ దండ గుచ్చుతోంది సూది', 'సిగ్గుల మొగ్గతనం/ కళ్ళకు సంకెల' లాంటి కవితోక్తులు పంచవర్ణాల్లో వేదన రంగును మిళితం చేస్తాయి.

రచనాకాలంలో నగరాన్నిముంచెత్తిన వర్షం కవి తలపోతల్ని నిండా తడిపేసింది.

'మెట్రో నగరానికొచ్చిన నీలి మేఘాలకు
తిరిగి వెళ్ళబుద్ధి కావడం లేదు',

'వాన భీముడు చెట్లను పెకిలించి/
గదలు చేసుకుంటున్నాడు
దిన బకులై ప్రజలు
దిక్కులు వెతుక్కుంటున్నారు',

'చెట్లెప్పుడూ ఇంతగా కంటితడి పెట్టలేదు
నగరం సాగరమైందని ఏడుస్తున్నాయి', 'ఆకాశాన్ని ఎవరు ఈడ్చి తన్నారో/ ఆ కసినంతా భూమ్మీద కుమ్మరిస్తోంది', 'మగడు జుట్టు పట్టుకొని బాదగా/ ఏడుస్తున్న మహిళలా / వాన ఏడ్చి కొట్టిన నగరం', 'సముద్రానికి మరో సముద్రాన్ని/ కన్పిసున్నాయి భూమ్యాకాశాలు', ' ఆకాశానికి ఈత నేర్పుతోంది నేల' ఇలా వివిధ ఉపమానాలతో ఉన్న న్ని రోజులు వాన కవి ముచ్చట్లతో మురిసి కురిసింది.

పూలన్నీ ఒక్కలా విప్పారనట్లే వీటిలో లోతైన భావనలతో పాటు సాధారణ వ్యక్తీకరణలు కూడా ఉన్నాయి. ఒకే అంశంపై వివిధ రూపాల్లో స్పందించినా సామ్యత నీడ వెంటాడింది.

తలపోతల్లా చెప్పాలంటే కవి నిజం 'కవిత్వం పండిన చెట్టు/ ఆకుల పంట ఆగదు/ రాలినవన్నీ కవితలే'. సుదీర్ఘ అక్షర స్నేహం, బాధిత జన పక్షపాతం, సహజ చమత్కార లక్షణం కలనేతగా కవి అల్లిన ఈ తలపోతల్లో అలలు అలలుగా పఠితుని గుండెకు తాకే హోరులో ప్రకృతి అందముంది, ప్రకోపమూ ఉంది.

ఏడు పదులు దాటిన వయసులో కలంలో యువ రక్తాన్ని ఉరకలెత్తిస్తూ నేటి కవులకు అన్ని విధాలా ఆదర్శంగా నిలుస్తున్న శ్రీరాంమూర్తి నిజంగా "నిజం" కు నిలువుటద్దం.

**అలలు – కవి తలపోతలు**
**రచన: నిజం**
**పేజీలు: 212, వెల: రూ. 125 /-**
**నిజం ప్రచురణలు, హైదరాబాద్**
**ప్రతులకు 9848351806**

– *బి.నర్సన్ 9440128169*



# ఆత్మ సమర్పణ!

పక్షులు ప్రాణులు! పరిసర అంతర్భూతాలు
పర్యావరణ పాలనలో అవసర అద్భుతాలు
రామాయణగాథలు మానవప్రయాణంలో మైలురాళ్ళు!
జననమరణ చక్రంలో సహచర సాధుప్రాణులు!!

నిస్వార్థ త్యాగనిరతితో అనన్య భక్తి ప్రపత్తులతో
ప్రతిఫలాపేక్ష లేకుండా! సర్వస్వ సమర్పణతో
శక్తికిమించిన కార్యభారం వహించిన సంప్రతిసోదరుడు
ఆత్మార్పణ గావించిన అపూర్వ శౌర్యధనుడు!!

రామలక్ష్మణులు సీతామహాదేవి అన్వేషణ క్రమానుండ
రెక్కలు విరిగి దుఃఖితమతుడై సీతజాడను తెలిపె!
రాక్షసుని రథమును విరిచి రథచోదకుని నిలువరించె
దుష్టరావణుడు సాధ్విని అపహరించినతీరు వివరించె!!

భార్యావిరహిత బాధితరామునికి ధైర్యవచనాలు పలికి
త్వరలోనే వారిరువురు కలువగలరని సంకల్పం చెప్పె!
పితృసమానస్థాయిలో అంతిమసంస్కారం అందుకొనె
అన్యాయాన్నెదిరించే గుణాన్ని ప్రదర్శించి మోక్షంపొందె!

శోకంతో మొదలై శ్లోకంతో కొనసాగె రామాయణం!
క్రౌంచపక్షితో కొనసాగి కాంచనమృగమై పరుగిడె
గృధముతో గమనమై రథముతో ముడివడె
ఉడుతసాయంతో ఉపశమనమై వానరాలతో వర్ధిల్లె!!

*– కరిపె రాజ్‌కుమార్, 8125144729*



# తంగేడు పూల బతుకమ్మ



ఇప్పుడు పూలై
బ్రతుకు నిచ్చే బ్రతుకమ్మ
కట్ల పూలతో బతుకమ్మ
గునుగు పూలతో బతుకమ్మ
తంగేడు పూలతో
పచ్చ పచ్చని పసుపు బతుకమ్మ
బ్రతుకు నిచ్చే బ్రతుకమ్మ

అల్లి పూల బతుకమ్మ
జానపదుల సంబరాల బ్రతుకమ్మ
బంతి పూల బతుకమ్మ బంగారు బతుకమ్మ
పసందైన బ్రతుకు తల్లిని ఇచ్చే బతుకమ్మ
గుమ్మడి పూల బతుకమ్మ

ధిక్కార స్వరం అయిన బతుకమ్మ
తెలంగాణ వీరోచిత ఆడబిడ్డల స్వచ్ఛమైన బ్రతుకమ్మ
జానపద రాగాల ఉయ్యాల పాటలు బతుకమ్మ
బ్రతుకు జీవితంలో సంతోషం ఎగిసే బతుకమ్మ
కోలాటాల బ్రతుకమ్మ
చప్పట్ల ఝురుల దారుల బ్రతుకమ్మ బతుకమ్మ
బతుకు నిచ్చే బతుకమ్మ



ఆప్యాయతల అనురాగాలకు
పరస్పర బింబము బ్రతుకమ్మ
పసుపు ముద్ద అయిన గౌరమ్మ బతుకమ్మ

తెలంగాణ జీవనానికి ప్రతీకైన
ఆనందాల వెల్లువ వెన్నెల బ్రతుకమ్మ

బతుకమ్మ బతుకు తాంబాలం లో
పేర్చిన సింగిడి పూల బతుకమ్మ

రంగురంగుల వస్త్రాల ధారణతో
ఆనంద సముద్రమై ఎగిసిన వెన్నెల సరాగాల
బతుకమ్మ బ్రతుకు
తంగేడు పూల పసుపు కాంతి బతుకమ్మ బతుకు



బతుకమ్మ సంక్షేమ మై
ఇచ్చుకున్నాము వాయనం
పుచ్చుకుంటినమ్మ వాయనం
ఫలహారాలు పంచుకొని
ఆనందాల ఆప్యాయతలు
మమతలు రంగరించిన బతుకమ్మ బతుకు
భూమిపైన ప్రకృతి పూల బతుకమ్మ
నిండు చెరువుల బతుకమ్మ
ఆనంద రాగమైన బ్రతుకమ్మ బతుకు బతుకమ్మ

*– డాక్టర్ సి హెచ్. ఆంజనేయులు, 7702537453*

ఇంటర్వ్యూ: జి. ఉమామహేశ్వర్

# మన కాలపు మేటి కథకుడు



తన సర్వశక్తుల్నీ, కాలాన్నీ తెలుగు సాహిత్యం కోసం అంకితం చేసి క్రియాశీలకంగా పని చేస్తున్న మన కాలపు కథకుడు, సిసలైన సృజనకారుడు డా.ఎం.హరికిషన్. కథారచయిత మాత్రమే కాదు చరిత్రని తవ్వితీసి ఈ తరానికి అందిస్తున్న పరిశోధకుడు. పిల్లల కోసం బాలసాహిత్యాన్ని ఉధృతంగా సృజిస్తున్న సాహిత్య కృషీవలుడు. వృత్తిరీత్యా ఉపాధ్యాయుడు. ప్రవృత్తిరీత్యా సాహిత్యశీలి, సామాజిక చింతనాపరుడు. పిల్లల మీద అపారమైన ఇష్టం, ప్రేమ ఉన్నందునే వారి ఎదుగుదలకు ఉపకరించే కథలు రాశారు. వారి స్థాయిని అందుకోడానికి పిల్లల భాషలో పిల్లల కోసం వందలాది కథలు రాస్తూ, చెబుతూ కథ పట్ల ప్రేమని ప్రోది చేయడం హరికిషన్ క్రియాశీలతకు నిదర్శనం. కరోనా కాలంలో వంద రోజుల్లో వంద కథలు చెప్పి వేలాదిమంది పిల్లలకీ, తల్లిదండ్రులకీ చేరువ అయిన హరికిషన్ సాహిత్యరంగాన ఏకవ్యక్తి సైన్యం. తనకు తానే ఒక సంస్థ. అనేక సంస్థలు చేయలేని పని చేసి చూపిస్తున్న అతని కృషి వల్లనే రాయలసీమ కరువు కథలు, రాయలసీమ స్త్రీల కథలు, రాయలసీమ ప్రేమ కథలు వెలుగు చూశాయి. కర్నూలు చరిత్ర, రాయలసీమ చరిత్ర, సమాజం, సంస్కృతికి సంబంధించిన అంశాలు అనేకం పుస్తకాల రూపం ధరించి, తెలుగునాట రాయలసీమ ప్రత్యేకతల్నీ, విశిష్టతల్నీ తెలియజేశాయి.

దాదాపు పాతికేళ్ళుగా కర్నూలు జనజీవితాన్ని, రాయలసీమ సమకాలీన సమస్యల్ని, కార్పోరేట్ విద్యా వ్యవస్థల వికృత స్వరూపాన్ని, పితృస్వామ్య వ్యవస్థలో వ్యథాభరితంగా మారుతున్న స్త్రీల జీవితాన్ని, చిరిగిపోతున్న చిన్నారుల ఆకాంక్షల్ని వస్తువులుగా తీసుకొని కథలు రాశారు. మాయమ్మ రాచ్చసి, నయాఫత్వా, మూడు అబద్ధాలు, టీచరు చెప్పిన కథలు, కందనవోలు కథలు... అనే సంపుటాలు వచ్చాయి. వీటన్నింటి లోని 45 కథలు ఎన్నుకొని హరికిషన్ కథలు పేరుతో ఓ సంపుటాన్ని ఇటీవల తీసుకొచ్చారు. బాలసాహిత్య ప్రక్రియలో యాభైకి పైగా పుస్తకాలు వెలువరించారు.

కథారచయితగా, సంకలనకర్తగా, సంపాదకునిగా, ప్రచురణకర్తగా అనేక ప్రయోగాలు చేసిన మనకాలపు మేటి కథకుడు హరికిషన్. పని తప్ప ప్రచారం పట్టని అతని సాహిత్యకృషిలోని వైశాల్యాన్ని పాఠకులకు తెలియజెప్పాలన్న సంకల్పమే ఈ ఇంటర్వ్యూకు ప్రేరణ. అతని సాహిత్య ప్రయాణాన్ని దగ్గరగా చూస్తున్న మిత్రుడు, ప్రముఖ కథా రచయిత జి.ఉమామహేశ్వర్ అనేక అంశాల మీద హరికిషన్‌తో సంభాషించారు. అపారమైన తల్లి ప్రేమ, జీవన భాగస్వామి వాత్సల్యంతో జీవితాన్ని సృజనాత్మకంగా మలుచుకున్న హరికిషన్ తన సాహిత్య ప్రయాణంలోని అనేక అంశాల్నీ, మలుపుల్నీ వివరించారు. కథా సమయం మిత్రులు, కర్నూలు సాహిత్యకారులు, మంచిసాహిత్యం కోసం పరితపించే ప్రచురణకర్తలు, తన కుటుంబ సభ్యులు తన సాహిత్య జీవన వైశాల్యం కోసం చేసిన దోహదాన్ని పంచుకున్నారు. కర్నూలు కేంద్రంగా ఎదిగివచ్చిన హరికిషన్ అధ్యయనశీలత, సృజనాత్మక ప్రయాణం సాహిత్యరంగంలో ఉన్న కవులకీ, రచయితలకీ, సంస్థలకీ స్ఫూర్తిదాయకం. ఇంటర్వ్యూతోపాటు హరికిషన్ సృజనాత్మక వ్యాసంగంపై పలువురి అభిప్రాయాలు చదవండి...

***హరికిషన్ అనేది బాలసాహిత్యానికి, మరీ ముఖ్యంగా చిన్న పిల్లల జానపద సాహిత్యానికి పర్యాయ పదంగా మారింది. ఇప్పటి చాలామంది పిల్లలు పెద్దయ్యాక, తాము చిన్నప్పుడు హరికిషన్ కథలు చదివి, విని, చూసి పెరిగామని చెప్పుకుంటారనడంలో అతిశయోక్తిలేదు. ఈ సందర్భంగా మీ బాల్యం ఎలా గడిచిందో తెలుసుకుందామనే కుతూహలం కలుగుతుంది. చిన్నప్పుడు మీకు గూడా ఈ కథల పట్ల ఇంత ఆసక్తి ఉండేదా? మీకెవరైనా అవ్వలో తాతలో ఈ కథలు చెప్పిన నేపథ్యముందా?***

నాకు చిన్నప్పుడు కథలు చెప్పినవారు ఎవ్వరూ లేరు. కాకపోతే ఇంట్లో అందరూ చదువుకున్న వారే కావడంతో పుస్తకాలు చదవడానికి అడ్డు చెప్పేవారు కాదు. ఏ మాత్రం తీరిక సమయం దొరికినా మా అన్నతో కలిసి గ్రంథాలయాల కు పరుగెత్తి పోయేవాన్ని. మూసేసే దాకా అక్కన్నే. వేసవి సెలవుల్లో అద్దె లైబ్రరీలో పుస్తకాలు తెచ్చుకోవడానికి అమ్మ నెల చందా కట్టేది. చందమామ కథలు, డిటెక్టివ్ కథలు, వ్యాపార నవలలు అలా వయసుతో బాటు చదవడం పెరిగింది. డిగ్రీలో అడ్వాన్స్ తెలుగు తీసుకోవడంతో అసలైన సాహిత్య పరిచయం కలిగింది. వీటిని చదవడం మొదలుపెట్టాక నా ప్రపంచం మొత్తం మారి పోయింది. కలలకు వాస్తవానికి మధ్య తేడా అర్థమైంది.

***మీ చదువు మొత్తం ఎక్కడెక్కడ సాగింది?***

కేజీ టు పీజీ ఒకే చోట అన్నట్లు ఒకటో తరగతి నుంచి పిహెచ్.డి వరకూ అంతా కర్నూల్లోనే. అక్కకు నా పదోతరగతిలోనే పెళ్ళి కావడం, మా అన్నకు ఇంజనీరింగులో సీటొచ్చి అదే సంవత్సరం ఎస్వీ యూనివర్సిటీకి వెళ్ళిపోవడంతో అప్పటినుంచీ ఇంట్లో నేనూ, మా అమ్మ ఇద్దరమే మిగిలాం. దాంతో అవకాశాలు వచ్చినా ఇక నేను బైటికి వెళ్ళాలనే ఆలోచన చేయలేక పోయాను.

***మీ పరిశోధన వివరాలు, పిహెచ్.డి గురించి.***

"కేతు విశ్వనాథరెడ్డి కథలు, సామాజిక దర్శనం" అనేది నా పరిశోధనాంశం. మార్గదర్శకులు తుమ్మల రామకృష్ణ. కేతు కథలను అధ్యయనం చేయడమంటే రాయలసీమను, అభ్యుదయ సాహిత్య దృక్పథాన్ని అధ్యయనం చేయడమే. ఈ అధ్యయనం తరువాతి దశలో రచనలు చేసేటప్పుడు నాకు ఎంతగానో ఉపయోగపడింది.

***మొట్టమొదటి కథ ఎలా?***

మొదటి కథ పడగనీడ, ఆదివారం ఆంధ్రజ్యోతిలో డిసెంబర్ 1997లో ముద్రించబడింది. కొత్తగా ఉద్యోగం వచ్చిన ఒక ఉపాధ్యాయునికి ఫ్యాక్షన్ విలేజీలో పోస్టింగ్ వస్తే, అదీ అంతకు ముందురోజే ఆ గ్రామంలో ఒక సర్పంచ్ హత్యచేయబడితే అతడు పడే ఆందోళనే కథ నేపథ్యం. మ్యాజిక్ రియలిజం శిల్పాన్ని కథ మధ్యలో ఉపయోగించాను.

***కథలు రాయాలని ఎందుకనిపించింది?***

నాకున్న రకరకాల ఘర్షణల్లోంచి, నిద్రలేని రాత్రులనుంచి విముక్తి కావడానికి కథ ఒక సాధనంగా ఉపయోగపడింది. బహుశా నేను చెప్పాలనుకునే విషయానికి





*ఓ సాహిత్య సమావేశంలో ఎం.హరికిషన్, జి.ఉమామహేశ్వర్*

ఈ ఫార్మాటు సరిగ్గా సరిపోయి వుండవచ్చు. కవిత్వం, వ్యాసం, విమర్శ ఇవేవీ నన్ను అంతగా ఆకర్షించలేదు. కొన్నిసార్లు ప్రయత్నించినా విజయవంతం కాలేకపోయాను.

***హరికిషన్ కొన్ని మంచికథలు సామాజిక అంశాల నేపథ్యంలో రాసినప్పటికీ మొట్టమొదటగా గుర్తుకొచ్చేది బాలసాహిత్యమే. ఈ విషయం మీకెప్పుడయినా ఇబ్బందిగా అనిపించిందా?***

ఆరోగ్యకరమైన సమాజాన్ని నిర్మించడం కోసమే సాహిత్య రచన చేస్తున్నప్పుడు అది ఏ రంగంలో చేసినా ఒక్కటే. బాలసాహిత్యంలో కూడా సామాజిక అంశాలే వస్తువులుగా వుంటాయి. కర్నూలు జనజీవితాన్ని, రాయలసీమ సమకాలీన సమస్యల్ని, కార్పోరేట్ విద్యా వ్యవస్థల వికృత స్వరూపాన్ని, పితృస్వామ్య వ్యవస్థలో వ్యథాభరితంగా మారుతున్న స్త్రీల జీవితాన్ని, చిరిగిపోతున్న చిన్నారుల ఆకాంక్షల్ని వస్తువులుగా తీసుకొని రాసిన కథలు దాదాపు యాభైకి పైన్నే వుంటాయి. మాయమ్మ రాచ్చసి, నయాఫత్వా, మూడు అబద్దాలు, టీచరు చెప్పిన కథలు, కందనవోలు కథలు... అనే సంపుటాలు వచ్చాయి. వీటన్నింటి లోని 45 కథలు ఎన్నుకొని హరికిషన్ కథలు పేరుతో ఓ సంపుటాన్ని తీసుకొచ్చాను. ఇటీవలే ఒక విద్యార్థి ఆ కథలమీద పరిశోధన చేసి ఎస్వీ యూనివర్సిటీలో డాక్టరేట్ కూడా అందుకున్నారు.

కాకపోతే బాలసాహిత్యం విస్తృతంగా రాయడం వల్ల యాభైకి పైగా పుస్తకాలు ప్రచురించడం వల్ల, యూట్యూబ్, ఫేస్‌బుక్ లో పిల్లల కథలు చెబుతూ వీడియోలు అప్లోడ్ చేయడం వల్ల, బాలసాహితీవేత్తగానే ఎక్కువ ప్రచారం జరిగింది. ఇది నేను ఇష్టంతో, ప్రేమతో, బాధ్యతతో చేస్తున్న పని కాబట్టి ఎటువంటి అసంతృప్తి లేదు... ఆనందమే.

***ఇప్పుడిక బాలసాహిత్యం విషయానికొద్దాం. దాదాపు ఐదు వందల కథల పైనే రాశారనుకుంటాను ? ఇన్ని కథలు ఎలా రాయగలిగారు ? ఏ ప్రేరణ దీని వెనుక పనిచేసింది ? అన్నీ మీరు ఆలోచించి రాసిన కథలేనా ? ప్రారంభంలో కొన్ని కథలు సేకరించడానికి చాలా కష్ట పడ్డారు కదా ? అప్పుడు మీకెదురైన కొన్ని అనుభవాలు చెప్పండి?***

నా బాలసాహిత్యం మూడు రకాలుగా వుంటుంది.

1. జానపద కథల సేకరణ - పునర్నిర్మాణం.

2. చిన్న కథలను సేకరిస్తూ సంయుక్త అక్షరాలు, ఒత్తులు లేకుండా కథలుగా రాయడం

3. సొంతంగా కథలు, గేయాలు, నవలలు రాయడం.

ఉపాధ్యాయుడినైన నేను పాఠశాలలో ఖాళీ సమయాలలో పిల్లలకు నాకిష్టమైన కథలు చెబుతున్నప్పుడు వాళ్ళు చాలా గంభీరంగా రెప్ప వేయకుండా, చేతులు కట్టుకొని శ్రద్ధగా వినేవారు. ఉపాధ్యాయుడంటే భయం, కథలంటే



*క్రీ.పూ. ఆదిమానవుల సంచారం నుండి 1956లో ఆంధ్ర రాజధాని కర్నూలునుంచి తరలిపోయేదాకా జరిగిన రాజకీయ సంఘటన లను ప్రధానంగా తీసుకొని చాప్టర్ వైజ్ గా విభజించి కర్నూలు జిల్లా చరిత్ర రాశాను. ఈ పుస్తకం విద్యార్థులను, సాధారణ పాఠకులను దృష్టిలో పెట్టుకొని సాధ్యమై నంత సంక్షిప్తంగా, ఎక్కువ వివరాలతో, ఆసక్తి కరంగా రాశాను. దాదాపు రెండు వందల దాకా అపురూపమైన ఫోటోలు అందులో పొందుపరచి తెలుగు, ఆంగ్ల భాషల్లో ప్రచురించా. ఇది సామాన్య ప్రజలకు చాలా బాగా నచ్చింది. పదివేల కాపీలు అమ్ముడుపోయాయి.*

ఆసక్తి రెండూ కారణం కావచ్చు. ఒకసారి ఎప్పుడూ నేనే చెప్పేదేంది, వాళ్ళను చెప్పమందాం అనుకొని ఎవరైనా కథ చెప్పండ్రా అన్నా. అప్పుడు ఒక పిల్లవాడు 'కుంటికోతి-మంచికోతి' కథ చెప్పడం మొదలు పెట్టాడు. అంతవరకు గంభీరంగా వున్న తరగతి గది ఒక్కసారిగా నవ్వులతో మారుమోగిపోయింది. పిల్లలు కథకునితో బాటు తామూ ప్రయాణం చేయడం మొదలు పెట్టారు. అప్పటికే వాళ్ళు, ఎన్నోసార్లు విన్న కథనే అది.

కానీ అందరిలో మొదటిసారి విన్న అనుభూతే వాళ్ళ కళ్ళలో మెరుస్తా వుంది. పూర్తిగా కర్నూలు నగరంలో, టౌను వాతావరణంలో పుట్టి పెరిగిన నాకు మొదట్లో ఆ పొట్టిగాడు చెప్పిన కథ చాలా వరకు అర్థం కాలేదు. కానీ పిల్లల కళ్ళలో మెరుస్తోన్న సంబరం చూశాక, వాడు చెప్పిన దాంట్లో వాళ్ళను లాగేసే అయస్కాంతశక్తి ఏదో వుందని అర్థమైంది. దాంతో అప్పటినుంచి పిల్లలతో కథలు చెప్పిస్తూ, జాగ్రత్తగా వింటూ, వాటిని రికార్డు చేయడం మొదలుపెట్టాను.

తరతరాలుగా జీవనదుల్లా ఒకరినుంచి మరొకరికి మౌలికంగా సంక్రమిస్తూ, పిల్లలను పెద్దలను ఆశ్చర్యానందాలలో ముంచెత్తుతున్న జానపదకథల ఖజానా అది. ఉమ్మడి కుటుంబాలు విచ్ఛిన్నం అయ్యాక, టీవీలు నట్టింట్లో కొలువు తీరాక, ప్రపంచీకరణ పల్లెల్ని కదిలించడం మొదలు పెట్టాక, అమ్మమ్మలు



*తరతరాలుగా జీవనదుల్లా ఒకరినుంచి మరొకరికి మౌలికంగా సంక్రమిస్తూ, పిల్లలను పెద్దలను ఆశ్చర్యానందాలలో ముంచెత్తుతున్న జానపదకథల ఖజానా అది. ఉమ్మడి కుటుంబాలు విచ్ఛిన్నం అయ్యాక, టీవీలు నట్టింట్లో కొలువు తీరాక, ప్రపంచీకరణ పల్లెల్ని కదిలించడం మొదలు పెట్టాక, అమ్మమ్మలు తాతయ్యలు చిన్నారులకు దూరం అయ్యాక, పెద్దలు పిల్లలు మార్కుల మాయాజాలంలో ఇరుక్కుపోయాక, సంపాదించడమే ఏకైక విలువగా అవతరించాక... ఈ కమ్మని కథల ఖజానా నెమ్మదిగా తరిగిపోతావుంది. వీటిని వెంటనే సేకరించి ముందు తరాల కోసం భద్రపరచక పోతే మన కథా వారసత్వ సంపద చేతులారా మనమే నాశనం చేసుకున్న వాళ్ళం అవుతాం.*

తాతయ్యలు చిన్నారులకు దూరం అయ్యాక, పెద్దలు పిల్లలు మార్కుల మాయాజాలంలో ఇరుక్కుపోయాక, సంపాదించడమే ఏకైక విలువగా అవతరించాక... ఈ కమ్మని కథల ఖజానా నెమ్మదిగా తరిగిపోతావుంది. వీటిని వెంటనే సేకరించి ముందు తరాల కోసం భద్రపరచక పోతే మన కథా వారసత్వ సంపద చేతులారా మనమే నాశనం చేసుకున్న వాళ్ళం అవుతాం. అందుకే పల్లెల్లో పిల్లల ద్వారా పెద్దల ద్వారా సేకరించడం మొదలు పెట్టాను.

కానీ ఆ కథల్ని ఎలా రాయాలో అర్థం కాలేదు. అప్పటివరకు నా కథా వస్తువులు వేరు. నేను ఆలోచించే విధానం వేరు. నా భాష వేరు. నేను జీవించిన వాతావరణం వేరు. ఒక సంవత్సరం పాటు ఆ కథలు రాయలేక ఇబ్బందిపడ్డాను. ఆఖరికి కర్నూలు నగర సరళ మాండలికంలో రాయడానికి నిర్ణయించుకొన్నాను. అలా రాయడంలో పట్టు సాధించడానికి చాలా కాలమే పట్టింది. నిజానికి నాకు సొంతంగా రాయడం చాలా సులభం.

జానపద కథల సేకరణ పునర్నిర్మాణమే చాల కష్టం. నేను ఇతివృత్తాన్ని మాత్రమే తీసుకుంటాను. అందులోని అసంబద్ధ విషయాన్ని పిల్లలకు అవసరం లేని విషయాల్ని తొలగించి, కథల్లో వుండే గ్యాప్స్ పూర్తి చేసి, అవసరమైనవి కలిపి, సంభాషణలు అన్నీ పునర్నిర్మిస్తాను. 125 జానపద కథలు సేకరించి రాయడానికి నాకు దాదాపు 12 సంవత్సరాలు పైన్నే పట్టింది.

***కథలు రాయడం ఒక ఎత్తైతే వాటిని ప్రచురించడం, పాఠకులకు చేర్చడం మరింత కష్టమైన పని. మీరు ఆ పనిని ఇంత సమర్థవంతంగా ఇంత కాలం నుండి ఎలా నిర్వహిస్తూ వస్తున్నారు?***

మనం ఎవరికోసమైతే పుస్తకాలు రాస్తున్నామో అవి వారి వద్దకు చేరకపోతే ఎలా. రచయితలకి పాఠకులకి మధ్య దూరం బాగా పెరిగిపోయింది. పుస్తకాలు అంగళ్ళకు పోయి కొనేవారి సంఖ్య చాలా తక్కువ. అసలు చాలా మందికి రోడ్ల కూడళ్ళలో వుండే పాన్‌షాపులు, పిల్లల స్టేషనరీ షాపులు, బస్టాండుల్లో వుండే పుస్తకాల షాపులు మాత్రమే తెలుసు. ఇందులో చాలావరకు వ్యాపార సాహిత్యం, చవకబారు రచనలు మాత్రమే అందుబాటులో వుంటాయి. ప్రపంచవ్యాప్తంగా రచింపబడుతున్న మంచి పుస్తకాలను అమ్మే అంగళ్ళు ప్రతి జిల్లా కేంద్రంలో కనీసం రెండు మూడన్నా వుంటాయనే విషయం అత్యధిక మంది పాఠకులకు తెలియదు. సమాజంలో సాహితీ ప్రేమికులు, ఇష్టంగా పుస్తకాలు కొని చదివేవారు, మంచి పుస్తకాల కోసం ఆశగా ఎదురుచూసే వారు చాలామంది వున్నప్పటికీ రచయితలు వారి వద్దకు చేరలేకుంటున్నారు. దాంతో నేను నా పుస్తకాలను తీసుకెళ్ళి అంగళ్ళకిచ్చే కమీషను నేరుగా పాఠకులకే అందిస్తూ, ఆ పుస్తకాల ప్రాముఖ్యత గురించి వివరిస్తూ అమ్మడం మొదలు పెట్టాను.

*నేను పిల్లల కథలు రాసే విధానం వేరు, సంప్రదాయంగా పత్రికల్లో ప్రచురింపబడుతున్న విధానం వేరు. అమ్మమ్మనో, తాతయ్యానో పక్కన కూర్చుని కథ చెబుతున్నట్లుగా, పిల్లలు మాట్లాడుకునే భాషలో, కర్నూలు నగర సరళ మాండలికంలో, ఇతర ప్రాంతాల వారికి కూడా అర్థమయ్యేలా నా రచనా శైలి వుంటుంది. కానీ మూస పద్ధతిలో ఇరుక్కుపోయిన పిల్లల పత్రికలు ఏవి గూడా నేను రాస్తున్న శైలిని ఒప్పుకోలేదు. కథ బాగుంది. దీనిని వ్యవహారిక భాషలో తిరగ రాసి పంపండి అని జవాబివ్వడం మొదలు పెట్టారు. పత్రికలో పడడం కోసం నేను నా పద్ధతి మార్చుకోలేకపోయాను. దాంతో మొదట పది కథలు రాసి 'పిల్లలు చెప్పిన కథలు' అనే పేరుతో సొంతంగా ప్రచురించాను.*



***కర్నూలు జిల్లా చరిత్ర పుస్తకావిష్కరణలో ఎస్.డి.వి.అజీజ్, ఉమామహేశ్వర్‌లతో...***

టీచరు ట్రైనింగులు, పదవతరగతి స్పాట్ వ్యాల్యుయేషన్ సమయం నాకు చాలా కలిసొచ్చింది. అక్కడ పుస్తక ప్రదర్శనలు నిర్వహించి కొన్ని వేల పుస్తకాలు అమ్మగలిగాను. ఇక వాట్సాప్, ఫేస్‌బుక్ కూడా అమ్మకాలకు తోడయ్యాయి. నేను పుస్తక ప్రచురణలో సంపాదించకపోయినా ఒక్క రూపాయి కూడా నష్టపోలేదు. నా పెట్టుబడి నాకు చివరి రూపాయ వరకు తిరిగి రావడానికి నేను చాలా కష్టపడతాను. నా పుస్తకాల పర్సనల్ కాపీలు తప్ప నా వద్ద ఏవీ నిల్వలేవు. నాలుగైదు వందల పుస్తకాలు ఒక్కరోజులోనే అమ్మిన సందర్భాలు కూడా వున్నాయి. పుస్తకాన్ని ఉచితంగా ఇవ్వడానికి నేను వ్యతిరేకిని. కొద్దిమంది ఆప్తులైన రచయితలకు, విమర్శకులకు, పత్రికలకు తప్ప. ఈ సంఖ్య యాభై కాపీలకు ఎప్పుడూ మించదు.

***ఈ బృహత్ కార్యంలో మీకు ఎవరైనా సహకరిస్తున్నారా? మీ ఈ ప్రయాణాన్ని సులభతరం చేయడానికి మీతో నడచిన వారెవయినా ఉన్నారా?***

నేను పిల్లల కథలు రాసే విధానం వేరు, సంప్రదాయంగా పత్రికల్లో ప్రచురింపబడుతున్న విధానం వేరు. అమ్మమ్మనో, తాతయ్యానో పక్కన కూర్చుని కథ చెబుతున్నట్లుగా, పిల్లలు మాట్లాడుకునే భాషలో, కర్నూలు నగర సరళ మాండలికంలో, ఇతర ప్రాంతాల వారికి కూడా అర్థమయ్యేలా నా రచనా శైలి వుంటుంది. కానీ మూస పద్ధతిలో ఇరుక్కుపోయిన పిల్లల పత్రికలు ఏవి గూడా నేను రాస్తున్న శైలిని ఒప్పుకోలేదు. కథ బాగుంది. దీనిని వ్యవహారిక భాషలో తిరగ రాసి పంపండి అని జవాబివ్వడం మొదలు పెట్టారు. పత్రికలో పడడం కోసం నేను నా పద్ధతి మార్చుకోలేకపోయాను. దాంతో మొదట పది కథలు రాసి 'పిల్లలు చెప్పిన కథలు' అనే పేరుతో సొంతంగా ప్రచురించాను.

ఆ తరువాత జనవిజ్ఞాన వేదిక మాల్యాద్రి గారితో, మంచి పుస్తకం సురేష్ గారితో జత కలిసింది. వారు నా రచనా పద్ధతికి ఆహ్వానం పలికారు. నా బాలసాహిత్య ప్రయాణంలో ఇది పెద్ద మలుపు. పది పది కథలు ఒక పుస్తకంగా వారి సహకారంతో బైటకు రావడం మొదలు పెట్టాయి. కిర్రుకిర్రులొడ్డప్పా, ఒకటి తిందునా రెండు తిందునా, భంభం చుకచుక, తిండిపోతు దయ్యం, నలుగురు మూర్ఖులు... ఇలా 14 సంవత్సరాలలో 13 జానపద కథల పుస్తకాలు తీసుకురాగలిగాను.



జానపద కథలే కాకుండా బాలసాహిత్యంలో వివిధ ప్రయోగాలు చేయడానికి మాల్యాద్రిగారు ఇచ్చిన సహకారం అమూల్యమైనది. నేను చేసే ప్రతి ప్రయోగాన్ని వారు ఆహ్వానించారు. ప్రచురించారు. తరువాత నవతెలంగాణ వారు ఏకంగా 18 పుస్తకాలు రెండు సంవత్సరాలలో ప్రచురించారు. ఇటీవలే దీప్తి ప్రచురణలు పరిచయం కావడం మరో మలుపు. కేవలం పిల్లల పుస్తకాలే కాకుండా సామాజిక సమస్యలపై రాసిన కథలు, రాయలసీమ కథాసంకలనాలు, నా కథల ఆంగ్ల అనువాదాలు తీసుకురావడానికి వీరు ఇస్తున్న సహకారం మరువలేనిది.

***మీరు బాలల కథలు మాత్రమే కాకుండా సామెతలు, జాతీయాలు, మహనీయుల సూక్తులు వంటి కొన్ని ఆసక్తికరమైన అంశాలపై కూడా పుస్తకాలు రాశారు గదా... వాటికి పిల్లల స్పందన ఎలా వుంది?***

పిల్లల కోసం తయారు చేసిన పుస్తకాలలో 'బొమ్మలతో సామెతలు' చాలా విశిష్టమైనది. ఇప్పటి తరానికి మన పూర్వుల అనుభవసారంలోంచి పుట్టిన ఈ సామెతల విలువ తెలియదు. ఎన్నో వాక్యాల ద్వారా చెప్పలేని భావాన్ని ఒక సామెత ద్వారా మనసుకు హత్తుకునేటట్టు చెప్పవచ్చు. నీతిని, జీవితసారాన్ని, విశేష అర్థాన్ని కలిగి వుండే మన వారసత్వ సంపద అవి. అందుకే ఆ సామెతలను సరదాగా ఆటలాగా పిల్లలకు నేర్పించడానికి అందమైన బొమ్మలతో ఈ పుస్తకం రూపొందించాను. ఇది రెండు భాగాలుగా వచ్చింది. త్వరలో మూడవ భాగం కూడా తెచ్చే ప్రయత్నంలో వున్నాను.

ఇలాంటి మరొక పుస్తకమే 'చెప్పుకోండి చూద్దాం'. పొడుపు కథలు మన ఆలోచనా శక్తికి పదును బెడతాయి. తార్కిక శక్తిని పెంపొందిస్తాయి. కానీ వాటికి జవాబులు కనుక్కోవడం చాలా కష్టం. కొన్నింటికయితే అసాధ్యం గూడా. అందుకని అదే శైలిలో రెండవ తరగతి విద్యార్థుల కోసం "చెప్పుకోండి చూద్దాం" అనే పేరుతో ఒక పుస్తకం రూపొందించాను. పిల్లలను ఓడించడం కాకుండా గెలిపించడం నా ఉద్దేశం. ప్రశ్న పక్కనే నాలుగు బొమ్మలు వుండి, పిల్లలు ఆలోచిస్తే అందులో జవాబు దొరికేలా తయారు చేశాను. త్వరలో ఇది కూడా రెండవ భాగం రాబోతుంది. అలాగే కొన్ని జాతీయాల పుట్టుక వెనుక ఆసక్తికరమైన కథలు వుంటాయి. అటువంటి వాటిని వెదికి ఒక పుస్తకంగా తీసుకువచ్చాను.

నేను బాగా ఇష్టపడే పుస్తకాలలో కమ్మని ఊహలు ఒకటి. ఇందులోనివన్నీ అబద్దాలే కానీ ఇవే నిజమేమో అనేంతగా భ్రమింపజేస్తాయి. ఆలోచనలకు

# హరి నాకెప్పుడూ ఓ ముచ్చటే !



కర్నూలులో దొరికిన అపురూప స్నేహాలలో ఒకటి హరికిషన్. 90లలో తుమ్మల రామకృష్ణ గారి వద్ద కేతు విశ్వనాథరెడ్డి గారి కథలపై పరిశోధన చేస్తున్న విద్యార్థి గా హరి పరిచయం. కర్నూలు సాహిత్య వాతావరణంలో కొత్తగాలి బలంగా వీస్తున్న రోజులవి. కర్నూలు సాహిత్యం పాత సాంప్రదాయికత నుండి కొత్త నుడికారానికి శ్రీకారం దిద్దుకుంటున్నది. 1990లలో మొదలైన సాహితీ స్రవంతి నుండి కథాసమయం వరకు పాల్ ఎలార్డ్ ద్వేషగీతాన్ని ప్రేమిస్తూ నూతన సమాజాన్ని కలగంటున్న రోజుల్లో పిల్లలకు కథలుచెబుతున్న ఒక పాఠశాల ఉపాధ్యాయుడు తను కలగన్న ఒక కొత్త ప్రపంచాన్ని పిల్లలకూ సమకాలపు సాహితీ మిత్రులకూ చూపడానికి బయలుదేరినప్పుడు అతడి అత్యంత ప్రజాస్వామిక ధోరణి నన్ను ఆశ్చర్యానికి గురిచేసింది. సమాజం వలెనే గ్రూపులుగా ముఠాలుగా గూడుకట్టుకుని స్వలాభం కోసం మాత్రమే చూసే సాహితీ వాతావరణం ఇలాంటి వాళ్ళను దరిచేర్చుకుంటుందా, ఇలాంటి వాడొక్కడే ఈ అసమ వాతావరణంలో నెగ్గుకు రాగలడా అనిపించింది. అయితే అన్ని ఆటుపోట్లనూ తట్టుకుని దీక్షతో బాల సాహిత్యంలోనూ రాయల సీమ సాహిత్య వాతావరణంలోనూ తనదైన ముద్రతో అప్రతిహతంగా ముందుకు సాగుతున్న హరి నాకెప్పుడూ ముచ్చటే.

*– చంద్ర శేఖర్ – కథాసమయం మిత్రుడు, విమర్శకుడు*

ఆకాశమే హద్దు. పిల్లల్లో ఊహాశక్తిని పెంచడానికి, కథలు ఎలా అల్లాలో తెలుసుకోవడానికి ఈ పుస్తకం ఎంతగానో ఉపయోగపడుతుంది. ఈ పుస్తకాలు అనేక ప్రచురణలు పొందడం, రెండు మూడు భాగాలు తయారు చేయమని ప్రచురణ కర్తలు అడగడం వాటి విజయాన్ని తెలుపుతుంది.

***నాకు తెలిసి బాలసాహిత్యంలో ఒత్తులు లేని కథలు, గేయాలు, సంయుక్త అక్షరాలు లేని కథలు ఇలాంటి ప్రయోగాలు చేశారు గదా. మీలో ఉపాధ్యాయుడు వాటిని ఎంతవరకు పిల్లలకు ఉపయోగపడతాయని భావిస్తాడు?***

నేను డిపెప్, సర్వశిక్షా అభియాన్ నిర్వహించిన అనేక కార్యక్రమాలలో రచయితగా పాల్గొన్నాను. ఆ సమయంలో అనేక పిల్లల కథల పుస్తకాలు మరలా చదవడం జరిగింది. అప్పుడు నాకర్థమైంది ఏమంటే ఇప్పుడున్న బాల సాహిత్యంలో తొంభైతొమ్మిది శాతం కేవలం ఆరు, ఏడో తరగతి దాటి, బాగా పఠన సామర్థ్యం అలవడిన పిల్లలకే తప్ప, ఐదవ తరగతిలోపు ముఖ్యంగా అప్పుడప్పుడే తెలుగుభాష నేర్చుకుంటున్న చిన్నారులకు ఉపయోగపడవు. ఆ వయసు పిల్లలకోసం పుస్తకాలు చాలా తక్కువగా వున్నాయి. పిల్లల స్థాయిని బట్టి, అవసరాన్ని బట్టి గ్రేడింగ్ పద్ధతిలో రచనలు లేవు. దాంతో ఆ రంగంలో వున్న శూన్యాన్ని కొంతవరకన్నా భర్తీ చేయాలని నిర్ణయించుకోవడం వలన బాలసాహిత్యంలోకి అడుగుపెట్టాను. కేవలం గుణింత పదాలతో రేపటి వెలుగులు, మెరుపుల వాన అనే గేయాల పుస్తకాలు, తుంటరి చిలుక అనే కథల పుస్తకం తీసుకువచ్చాను. రెండవ తరగతి పిల్లవాడు గూడా సొంతంగా చదవగలిగేంత సులభమైన పదజాలంతో సంయుక్త అక్షరాలు లేకుండా ఒక్క పేజీ కథలనుండి, నలభై పేజీల నవలల దాకా సుమారు 30 పుస్తకాలు ఇప్పటివరకు రచించాను. నాకు తెలిసినంతవరకు సంయుక్త అక్షరాలు లేకుండా తెలుగులో ఇన్ని కథలు రాసినవాన్ని నేనొక్కన్నే. ఇంకో ముఖ్యమైన విషయం ఏమంటే నేనిలా ప్రయోగాత్మకంగా రాసినప్పటికి చదివే పాఠకులకు ఇదేదో సర్కస్ ఫీట్ చేసినట్లుగా, కృతకంగా అనిపించదు. చాలా సహజంగా మంచి ఫీల్‌ను అందిస్తాయి.

***పిల్లలు మాత్రమే వీటిని ఆదరిస్తున్నారా? ఉపాధ్యాయుల స్పందన ఎలా వుంటుంది ?***

ప్రాథమిక స్థాయిలో బోధించే ఉపాధ్యాయులు, చిన్నపిల్లలున్న తల్లిదండ్రులు వీటిని విపరీతంగా ఉపయోగించుకుంటున్నారు. నా వాట్సాప్, టెలిగ్రామ్ గ్రూపుల్లో కొన్ని వేలమంది టీచర్లు, తల్లిదండ్రులు, పాఠశాలల కరెస్పాండెంట్లు చేరిపోయారు. కథలు, గేయాలు జిరాక్స్ చేసి పిల్లలకు అందిస్తున్నారు. హెూమ్ వర్క్ గా ఇస్తున్నారు. నోటీస్ బోర్డులో అంటిస్తున్నారు. తెలుగుభాషను తమకిష్టమైన కథలు, గేయాల ద్వారా ఆడుతూ పాడుతూ, సులభంగా చదవడం రాయడం నేర్చుకోవడానికి ఇవి ఎంతగానో ఉపకరిస్తున్నాయని తెలియజేస్తున్నారు. కేవలం గుణింతాలలో కథలు రాయమని ఉపాధ్యాయులనుంచి ఎన్నో అభ్యర్థనలు వస్తున్నాయి. ప్రస్తుతం దానిపైన దృష్టి పెట్టా. కనీసం ఒక వంద కథలన్నా ఒత్తులు లేకుండా గుణింతాలతో రాసి అందించాలన్నది నా ఆలోచన. అది ఫలిస్తే ఒకటో తరగతి పిల్లలకు గొప్ప బహుమతి అందించినట్లే.

***నేషనల్ బుక్ ట్రస్ట్, హైదరాబాద్ బుక్ ట్రస్ట్ లాగా కర్నూల్ బుక్ ట్రస్ట్ అనే ప్రచురణ సంస్థని స్థాపించాలనే ఆలోచన ఎలా వచ్చింది? ఏ పరిస్థితుల లో దాన్ని ప్రారంభించారు? ఇప్పటి వరకూ ఎన్ని పుస్తకాలు ప్రచురించారు? ట్రస్టు కేవలం హరికిషన్ పుస్తకాలలే పరిమితమా? లేక ఎవరి పుస్తకాలనైనా ప్రచురించారా? ముందు ముందు ప్రచురిస్తారా?***

పేరుకది ట్రస్టే కానీ అందులో పైసలూ లేవు. సభ్యులూ లేరు. ఏక్ నిరంజన్. రెండువేల సంవత్సరంలో నేను మాయమ్మ రాచ్చసి అనే నా కథా సంపుటి ప్రచురించే ముందు కర్నూలు కథాసమయం మిత్రులందరికీ ఉమ్మడిగా ఒక ప్రచురణ సంస్థ వుంటే బాగుంటుందీ, ఆధునిక కథా సాహిత్యంలో వెనకబడిన కర్నూలు జిల్లాకు కూడా పేరు వస్తుందనే ఆలోచనతో... మా అమ్మ పేరు

**అన్నయ్య అనువాదాలు**

మా అన్న రామ్మోహన్ మెకానికల్ ఇంజనీరింగ్ పూర్తి చేశాడు. చిన్నప్పటినుంచీ పుస్తకాలు చదివే అలవాటు బాగా వుండేది. దానివల్ల నాకు అవి అందుబాటులోకి వచ్చి ఇష్టం పెరిగింది. అన్న చిన్నప్పటినుంచీ వ్యాస రచన, వక్తృత్వ పోటీలు ఎక్కడ జరిగినా చురుగ్గా పాల్గొంటూ బహుమతులు సాధించేవాడు. మా అన్నకు ఆంగ్ల భాష మీద కూడా మంచి పట్టు వుంది. దాంతో నెమ్మదిగా నా పుస్తకాల అనువాదం లోకి దించాను. కర్నూలు జిల్లా చరిత్ర, కొండారెడ్డి బురుజు, కమ్మని ఊహలు, కథల ఖజానా, బొమ్మలు చెప్పిన కమ్మని కథలు అనే పుస్తకాలను చాలా సరళమైన భాషలో చిన్నారులను ఆకట్టుకునేలా ఆంగ్ల భాషలో అనువాదం చేశాడు.





# డా ఎం. హరికిషన్ ప్రొఫైల్

పుట్టిన తేదీ: 1972 మే 19
పుట్టిన స్థలం: కర్నూలు జిల్లా పాణ్యం
తల్లిదండ్రులు: కృష్ణవేణమ్మ, హుసేనయ్య
వృత్తి: ఉపాధ్యాయుడు
భాష: తెలుగు - జాతీయత: భారతీయుడు
విద్య: శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం నుండి డాక్టరేట్
పూర్వవిద్యార్థి : శ్రీ కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం

## రచనా రంగం

సాహితీ వ్యాసంగం
కథా రచయిత - బాల సాహితీవేత్త - చరిత్రకారుడు
గుర్తింపునిచ్చిన రచనలు - కర్నూలు కథ
ప్రభావం: తుమ్మల రామకృష్ణ
పురస్కారాలు: బాలసాహితీ రత్న (2011)

## పుస్తకాలు

ఇప్పటిదాకా ప్రచురించిన పుస్తకాల సంఖ్య 60 కాగా, వాటిలో సామాజిక అంశాలపై 8, చరిత్రపై 3, బాలసాహిత్యం 49 ఉన్నాయి.

## సామాజిక రచనలు

1.మాయమ్మ రాచ్చసి 2.నయాఫత్వా 3. నేనూ మా అమ్మ 4. మూడు అబద్దాలు 5. ఒక చల్లని మేఘం 6. కందనవోలు కథలు 7. టీచర్ చెప్పిన కథలు

## చరిత్ర

1. కర్నూలు జిల్లా చరిత్ర 2. కొండారెడ్డి బురుజు 3. కర్నూలు జిల్లా మహనీయులు

## సంపాదకత్వం

కర్నూలు కథ - రాయలసీమ ప్రేమ కథలు
రాయలసీమ రచయిత్రుల కథలు - రాయలసీమ కరువు కథలు

## బాల సాహిత్యం

రింగురుబిళ్ళ
నక్కబావ - పిల్లిబావ
చిన్నారి గేయాలు
జానపద గేయాలు
తేనెటీగ - కందిరీగ
బంగారు చేప - గంధర్వకన్య
మెరుపుల వాన
పావురం దెబ్బ
చెప్పుకోండి చూద్దాం
బొమ్మలతో సామెతలు - 1
బొమ్మలతో సామెతలు - 2
తిక్క కుదిరిన నక్క
నమ్మొద్దురా నాయనా దొంగ నక్కల్ని
మూతి పగిలిన పిల్లి
రాముటోపి
కుందేలు దెబ్బ
ఒక వీరుని కథ
పుచ్చకాయ తపస్సు
సముద్రంలో చిన్నచేప
కోటకొండ మొనగాడు
బూర
తేనె చినుకులు
పిండిబొమ్మ వీరుడు
పిల్లలు కాదు పిడుగులు
నాకు మూడు - నీకు రెండు
కిర్రు కిర్రు లొడ్డప్పా
ఒకి తిందునా రెండు తిందునా
నలుగురు మూరు?లు
కమ్మని ఊహలు
చిలుక ముక్కు వూడిపాయ
రేపటి వెలుగులు
నల్లకుక్క - రెక్కల ఎలుక
టక్కరికోతి
అమ్మో దయ్యం
మంచిమాట చెబుతా
చేయి చేయి కలుపుదాం
చందమామలో కుందేలు
మూడుకోరికలు-గాడిద మెచ్చినపాట
భం... భం... చుక చుక
లబో దిబో
గొడవపడకు - దెబ్బ తినకు
మిన్ను - చిటికెల పందిరి
సోమరిపోతు మహావీరుడు
చింతపండు - జాంపండు
రాయలసీమ జానపద హాస్యకథలు6
కర్నూలు జిల్లా జానపద కథలు7












*ఎం. హరికిషన్ సెల్: 9441032212*



హరికిషన్ అత్తామామలు కె.సూర్యనారాయణరెడ్డి, కె.లక్ష్మీదేవి

మీదనో, పిల్లల పేర్ల మీదనో కాకుండా కర్నూల్ బుక్ ట్రస్ట్ అని పేరు పెట్టాను. కానీ నేను అనుకున్నదేదీ కార్యరూపం దాల్చలేదు. ఒక్కన్నే మిగిలిపోయాను. కర్నూలు బుక్ ట్రస్ట్ పేరు మీద సొంతంగా 15 పుస్తకాలు తెచ్చాను. జనవిజ్ఞాన వేదిక మాల్యాద్రి గారితో కలిసి సంయుక్తంగా మరో 15 తెచ్చాను. ప్రస్తుతం నేను రూపొందించే అన్ని రకాల పుస్తకాలకు ప్రచురణకర్తలు అండగా ఉండడంతో గత రెండు సంవత్సరాలుగా కర్నూల్ బుక్ ట్రస్ట్ పేరుతో పుస్తకాలు వేయాల్సిన అవసరం రాలేదు

***ఏదైనా ఒక ప్రాంత చరిత్రను, అక్కడి చారిత్రక అంశాల ప్రాధాన్యతను, ఆ ప్రాంతాన్ని రెప్రజెంట్ చేసే వ్యక్తులను గురించి రచనలు చేయడం సాధారణంగా అక్కడి చరిత్రకారులు చేసే పని. కర్నూల్ జిల్లా చరిత్ర, కర్నూలు జిల్లా మహనీయులు లాంటి పుస్తకాలు హరికిషన్ ఎందుకు రాయవలసి వచ్చింది? ఏమాటకామాట – మీరు రాసిన జిల్లా చరిత్ర చాలా క్లుప్తంగా అన్నీ అంశాలను పరిచయం చేసిందని చాలా మంది పుస్తకం చదివిన వారి స్పందన.***

కర్నూలు జిల్లా చరిత్ర గురించి తెలుసుకోవడానికి ప్రయత్నించినప్పుడు అనేకమంది పరిశోధకులు వివిధ విషయాలపై వ్రాసిన వ్యాసాలు అనేక పత్రికలలో, సంకలనాలలో, గ్రంథాలలో ఒకొక్క అంశంపై ఒకొక్క చోట అగుపించాయి. ఇలా గందరగోళంగా కాకుండా మొత్తం క్రమ పద్ధతిలో ఒకేచోట దొరికితే బాగుంటుంది కదా అనిపించింది. దానితో నేను చారిత్రిక పరిశోధకున్ని కాకపోయినా, ఒక రచయితగా వివిధ విషయాలు చదివి, అనేక ప్రదేశాలు తిరిగి క్రీ.పూ. ఆదిమానవుల సంచారం నుండి 1956లో ఆంధ్ర రాజధాని కర్నూలునుంచి తరలిపోయేదాకా జరిగిన రాజకీయ సంఘటనలను ప్రధానంగా తీసుకొని చాప్టర్ వైజ్ గా విభజించి రాశాను. ఈ పుస్తకం విద్యార్థుల ను, సాధారణ పాఠకులను దృష్టిలో పెట్టుకొని సాధ్యమైనంత సంక్షిప్తంగా, ఎక్కువ వివరాలతో, ఆసక్తికరంగా రాశాను. దాదాపు రెండు వందల దాకా అపురూపమైన ఫోటోలు అందులో పొందుపరచి తెలుగు, ఆంగ్ల భాషల్లో ప్రచురించాను. నేననుకున్నట్లే ఇది సామాన్య ప్రజలకు చాలా బాగా నచ్చింది. పదివేల కాపీలు అమ్ముడుపోయాయి.

ఈ కర్నూలు జిల్లా చరిత్ర గురించి పరిశోధించే సమయంలోనే నాకు జిల్లాకు చెందిన అపురూపమైన పాత ఫోటోలు అనేకం దొరికాయి. అలాంటి అపురూపమైన ఫోటోలతో కొండారెడ్డి బురుజు అనే అందమైన పుస్తకం తీసుకువచ్చాను.



ఈ తరం పిల్లలకు స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్న జిల్లా వాసుల గురించి తెలియదు. దాంతో 20 మంది మహనీయుల ఫోటోలు సేకరించి వాటిని క్రాంతి అనే చిత్రకారుని సహకారంతో వేయించి కర్నూలు జిల్లా మహనీయులు అనే పుస్తకం అందమైన చిత్రాలతో ప్రచురించాను. చరిత్రకు సంబంధించిన విషయాలు ఎంత ఎక్కువ మందికి చేరితే అంత మంచిది. అందుకే ఆ పాత ఫోటోలు, మహనీయుల చిత్రాలు అన్నీ ఫేస్‌బుక్ లో అప్‌లోడ్ చేసి ఎవరైనా సరే నా అనుమతి అడగకుండానే వీటిని వాడుకోవచ్చు అని ప్రకటించాను. ఇప్పుడు అనేక చోట్ల ఇవి పత్రికలలోనూ, వ్యాసాలలోను దర్శనమిస్తుంటాయి.

***జిల్లాను దాటి రాయలసీమ ప్రాతిపదికగా పుస్తకాలు ప్రచురించడం ఎప్పటినుండి ప్రారంభించారు? దానికి కారణాలు, నేపథ్యం ఏమన్నా వున్నాయా?***

రాయలసీమ అంటే మామూలుగానే చిన్నచూపు, ఇక అక్కడి రచయిత్రుల సాహిత్యమంటే మరింత చిన్నచూపు సాహిత్య ప్రచురణ సంస్థలకు ఉండడం వల్ల ఇటువంటి ఆలోచన ఎవరికీ రాకపోయి ఉండవచ్చు. నిజానికి ఈ సంకలనం నేను స్వయంగా తీసుకురావాలని మొదట అనుకోలేదు. అది స్త్రీలనుండి వస్తే బాగుంటుందని అనేకమందికి నా ఆలోచన వివరించాను. కానీ కార్యరూపం దాల్చలేదు. దాంతో నేనే స్వయంగా బాధ్యత తీసుకోవాల్సి వచ్చింది. ఈ సంకలనం వెలువడి సంవత్సరం దాటిపోయినా స్త్రీ విమర్శకులనుంచి కానీ,

## ఒంటరిగా పని చేయడంలోనే స్వేచ్ఛ

***హరికిషన్ ఏ పనైనా ఒక్కడే చేస్తాడు. బృందంగా చేయడానికి ఇష్టపడడు అని మీపై ఒక ప్రశంస, విమర్శ వున్నాయి. అది ఎంతవరకు నిజం?***

*ఒక పని వేగంగా, సమర్థవంతంగా పూర్తి చేయడానికి బృందం అవసరమే. కానీ రచయితల మధ్య వుండే స్వార్థాలూ, సాధించిన ఫలితాలలో అగ్ర తాంబూలం కోసం గొడవలు చేయాల్సిన పనిని ముందుకు సాగనివ్వవు. కలిసి చేయాలి అనుకున్న ఏ పనీ నా విషయంలో విజయవంతం కాలేదు. అందుకే నేను ఒంటరిగా పని చేయడంలోనే సౌకర్యాన్ని, స్వేచ్ఛను అనుభవిస్తాను. నేను ఖచ్చితంగా చేయగలను అని నమ్మిన వాటినే భుజాల మీదకి ఎత్తుకుంటాను. తప్పక పూర్తి చేస్తాను. అలాగని అన్ని విషయాల్లో అందరికీ దూరంగా ఏమీ వుండను. కథా సమయం బృందంగా నిర్వహించిన ప్రతి కార్యక్రమంలోనూ ఎటువంటి భేషజాలకు పోకుండా అందరితో కలిసే పాల్గొన్నాను. విజయవంతం కావడానికి కార్యకర్తలా పూర్తిగా సహకరించాను. శ్రమించాను. అలాగే చూడడానికి రాయలసీమ సంకలనాలు ఒక్కన్నే చేస్తున్నట్లుగా అనిపించినా ఇందులో అనేకమంది సహాయసహకారాలు, సలహాలు వున్నాయి. రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డి, మధురాంతకం నరేంద్ర, కిన్నెర శ్రీదేవి, పాలగిరి విశ్వప్రసాద్, పలమనేరు బాలాజీ, జి.ఉమామహేశ్వర్, తవ్వా వెంకటయ్య లాంటి వారు ఎందరో తోడుగా వున్నారు.*

# తనది నిస్వార్థ సాహితీ సేవ



నిరంతరం ఒక పని పూర్తి కాగానే మరొక పని మొదలు పెడుతుంటాడు. ఇలా నిత్యం ఒక తపనతో రాయడం, పుస్తకాలు ప్రచురించడం, అందుకోసం ఎంతో సమయం కేటాయించడం, అయినప్పటికీ ఎటువంటి సన్మానాలు, అవార్డులు, పొగడ్తలు ఆశించకుండా నిస్వార్థంగా సాహితీ సేవ చేస్తున్న తనని చూస్తే ఆశ్చర్యం కలుగుతుందని చెబుతున్నారు హరికిషన్ భార్య డా.కె. చంద్రమౌళిని. హరికిషన్ ఎడతెగని సాహిత్యకృషికి ఆమె గొప్ప ఆలంబన. హరికిషన్ ని ఇంటర్వ్యూ చేసిన సందర్భంలోనే చంద్రమౌళిని గారితో జరిపిన సంభాషణలో కొన్ని భాగాలు...

***హరికిషన్ మీకు పెళ్లికి ముందే పరిచయం కదా? ఎక్కడ పరిచయమయ్యారు?***

కర్నూలు పీజీ సెంటర్లో ఎం.ఏ.తెలుగు చదివే సమయంలో తను నాకు సీనియర్. అక్కడే మా తొలి పరిచయం.

***మీ పరిచయం స్నేహమై పెళ్లిగా పరిణమించిన పరిస్థితులేమిటి? మీ వివాహానికి ఇంట్లో ఎలాంటి అభ్యంతరాలు వచ్చాయి? అవి ఎప్పుడు ఎలా తొలగిపోయాయి?***

పీజీ తరువాత తుమ్మల రామకృష్ణ గారి దగ్గర ఇద్దరమూ పరిశోధక విద్యార్థులుగా కొనసాగడంతో మా పరిచయం స్నేహంగా బలపడింది. క్రమంగా స్నేహాన్ని మించిన బంధం ఇద్దరి మధ్యా అల్లుకుంటుందని ఎవరికి వారికి అర్థం అవుతున్నా ఏరోజూ వ్యక్తపరచుకున్నది లేదు. కలసి జీవించాలని నిర్ణయం తీసుకున్న క్షణమే ఇరువైపులా పెద్దల అంగీకారంతోనే పెళ్ళి చేసుకోవాలని తీర్మానం చేసుకున్నాం.

మొదట కొంత వ్యతిరేకత ఎదురైనా, తర్వాత ఎలాంటి ఘర్షణలు లేకుండా మా పెళ్ళి పెద్దలందరి సమక్షంలో సజావుగా సాగిపోయింది.

***హరికిషన్ తండ్రిగా పిల్లలతో ఎలా వుంటాడు? చిన్న పిల్లల కథలు రాసే రచయిత పిల్లల పెంపకంలో పాటించే విషయాలు కథలు రాసినట్టే ఉంటాయా?***



ఆయన పిల్లల్లో పిల్లాడిగా మారిపోతుంటాడు. నవ్వడం, నవ్వించడం తప్ప ఏరోజూ పిల్లల్ని కోప్పడ్డం గానీ, గట్టిగా మందలించడం గానీ, దెబ్బలేయడం గానీ జరగలేదు. పిల్లలను ట్యూషన్లకు పంపించడం, టెక్నో స్కూళ్ళలో చేర్పించడం, చదువు పేరుతో ఒత్తిళ్ళకు గురి చేయడం ఇష్టపడరు. బాల్యాన్ని స్వేచ్ఛగా ఎదగనీయాలన్న ఆలోచన తనది.

***మీరు స్వతహాగా రచయిత్రి, గాయని. హరి ప్రోత్సాహం ఎలా వుంటుంది? మీరెందుకు ఎక్కువ రచనలు చేయడం లేదు?***

జ: రచనా వ్యాసంగంలో నన్ను ముందుకు నడిపించడంలో తన సహకారం మొదట్నుంచీ వుంది. కాకపోతే తల్లిగా, ఉద్యోగినిగా ఇంటా బైటా రెండు బాధ్యతలనూ నిర్వహించే క్రమంలో రచనల కోసం ఎక్కువ సమయం కేటాయించలేక పోతున్నాను.

***హరికిషన్ ఇంత కృషి చేస్తాడని, ఇంత పేరు సంపాదిస్తాడని మీకు పెళ్లికి ముందు అనిపించిందా?***

తను మా పెళ్ళికి ముందే సామాజిక సమస్యల పై పెద్దల కోసం కథలు రాస్తూ పుస్తకాలు ప్రచురించే వాడు. ఆ తర్వాత బాల సాహిత్యం లోకి అడుగు పెట్టాడు. అలా అలా అనేక సంకలనాలు వేయడం, యూట్యూబ్ చానల్ నిర్వహించడం, ఫేస్‌బుక్, వాట్సప్ ద్వారా కథలు ప్రజల్లోకి తీసుకు పోవడం... ఇలా నిరంతరం ఒక పని పూర్తి కాగానే మరొక పని మొదలు పెడుతుంటాడు. ఇలా నిరంతర కృషిలో నా కోసం, పిల్లలకోసం తగినంత సమయం కేటాయించలేకపోతున్నాడనే బాధ వున్నప్పటికీ... ఎటువంటి సన్మానాలు, అవార్డులు, పొగడ్తలు ఆశించకుండా నిస్వార్థంగా సాహితీ సేవ చేస్తున్న తనని చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది. అందుకే అతని లక్ష్యాన్ని నేను, పిల్లలూ గౌరవిస్తూ పూర్తిగా సహకరిస్తుంటాము.

# నిజాయితీగా బతకడం అమ్మ నుంచే నేర్చుకున్నా...

***మీకు ఒక అక్క, అన్న అని మీ కథల ద్వారా తెలుస్తుంది. వారేం చేస్తున్నారు? వాళ్ళకి సాహిత్యంతో పరిచయం వుందా?***

మా అక్క పేరు శ్రీదేవి. అందరికన్నా పెద్దది. గృహిణి. అన్న రామ్మోహన్ మెకానికల్ ఇంజనీరింగ్ పూర్తి చేశాడు. వీరిద్దరికీ చిన్నప్పటినుంచీ పుస్తకాలు చదివే అలవాటు బాగా వుండేది. దానివల్ల నాకు అవి అందుబాటులోకి వచ్చి ఇష్టం పెరిగింది. అన్న చిన్నప్పటినుంచీ వ్యాస రచన, వక్తృత్వ పోటీలు ఎక్కడ జరిగినా చురుగ్గా పాల్గొంటూ బహుమతులు సాధించేవాడు. మా అన్నకు ఆంగ్ల భాష మీద కూడా మంచి పట్టు వుంది. దాంతో నెమ్మదిగా నా పుస్తకాల అనువాదం లోకి దించాను. కర్నూలు జిల్లా చరిత్ర, కొండారెడ్డి బురుజు, కమ్మని ఊహలు, కథల ఖజానా, బొమ్మలు చెప్పిన కమ్మని కథలు అనే పుస్తకాలను చాలా సరళమైన భాషలో చిన్నారులను ఆకట్టుకునేలా ఆంగ్ల భాషలో అనువాదం చేశాడు.

***అమ్మ గురించి మీరు చాలా చోట్ల చెప్పారు. ఉద్వేగ పూరితమైన విషయాలను పంచుకున్నారు. అమ్మ గురించి కొన్ని మాటలు... మీపై అమ్మ ప్రభావం?***

నాకు ఆరు నెలల వయసులోనే నాన్న చనిపోయాడు. అండగా నిలబడవలసిన వాళ్ళు ఎవరూ నిలబడక పోగా, సూటిపోటి మాటలతో వేధిస్తుంటే, ఇక్కడే ఈ పల్లెటూర్లో వీళ్ళ మధ్య వుంటే పిల్లల భవిష్యత్తు నాశనమవుతుందని భయపడి, ముగ్గురు పిల్లల్ని వెంటేసుకొని ఏదేమైతే అదవుతుందని తెగించి కర్నూల్లో అడుగు పెట్టింది మా అమ్మ. అప్పటికే టీచర్ ట్రైనింగ్ పూర్తి అయి వుండడం వల్ల కొంతకాలానికి ఉద్యోగం దొరికింది. ఆమె ఆరోజు ధైర్యంగా వేసిన అడుగే మా జీవితాల్ని నిలబెట్టగలిగింది. ఇప్పుడు తలుచుకుంటే ముగ్గురు పిల్లలతో ఆమె చేసిన ఒంటరి పోరాటానికి ఒళ్ళు జలదరిస్తుంది. అమ్మ ప్రభావం నామీద ఏముందా అని ఆలోచిస్తే మొండితనం, ఒంటరిగా పోరాడ్డం, నిజాయితీగా బ్రతకడం ఆమె నుంచే వచ్చింటాయి. 75 ఏళ్ళు నిండినా ఈరోజుకీ అమ్మ మామీద కొంచం గూడా ఆధారపడదు. నేను మా అమ్మ అనే పుస్తకంలో అమ్మకు సంబంధించిన విషయాలు చాలావరకు కథల రూపంలో వివరంగా రాశాను.

***మీ శ్రీమతి గురించి... తాను స్వయంగా రచయిత్రి, గాయకురాలు. మీకెలాంటి సహకారం లభిస్తుంది?***

నా శ్రీమతి కె.చంద్ర మౌళిని నాలాగే తెలుగు టీచర్. "స్త్రీ చైతన్య కవిత – భావ ప్రకటన" అనే అంశంపై పరిశోధన చేసి డాక్టరేట్ పట్టా అందుకొంది. ఇప్పటివరకు 20 కథల దాకా రాసింది. అప్పుడప్పుడ పాటలు కూడా రాస్తుంది. ఆమె కర్నూలు గొప్పతనం గురించి స్వయంగా రాసి పాడిన "కర్నూలుకు వస్తవా మా వూరిని చూస్తవా" అనే పాటగానీ, రాయలసీమ కరువును కళ్ళకు కట్టినట్టు చూపించే "సుగ్గికి పోతున్నా తల్లీ" అనే పాటగానీ చాలా ప్రసిద్ధమైనవి. ఆమె మంచి ప్రూఫ్ రీడర్ కూడా. నా పుస్తకాలన్నీ జాగ్రత్తగా తప్పులు సరిదిద్దుతుంది. ఆమె సహకారమే లేకపోతే వరుసగా ఇన్ని పుస్తకాలు వచ్చేవి కాదు.

***మీది ప్రేమ వివాహం కదా... ఇబ్బందులేవీ రాలేదా?***

మా ప్రేమకు పెళ్ళికీ మధ్య ఐదు సంవత్సరాల ఎదురుచూపు వుంది. పెద్దవాళ్ళు సహజంగానే పిల్లలకు నిర్ణయాలు తీసుకునే పరిపక్వత ఉండదనీ, వాళ్ళపై తమకు సర్వాధికారాలు వుంటాయనీ భావిస్తారు. దానివల్ల ప్రేమ వివాహంలో ఘర్షణ అనివార్యం. కులాల అడ్డుగోడలు దాటడం మరింత కష్టసాధ్యం. మేము పీజీలో ఒకరినొకరం ఇష్టపడ్డా... ఇద్దరికీ ఆ తరువాత ఉద్యోగాలు వచ్చినా, సొంతంగా నిలబడే శక్తి వున్నా... ఎక్కడా తొందరపడలేదు. పెద్దవాళ్ళను ఎదిరించడం కాక వాళ్ళ అనుమతి వచ్చేదాక సుదీర్ఘకాలం ఎదురుచూశాం. దానివల్ల వివాహం ఆలస్యమైనా ఆ తరువాత ఎటువంటి ఇబ్బందులు ఎదురుకాకుండా, వాళ్ళ సహాయసహకారాలతో మేం ఆశించినట్లు సాఫీగా జీవితం సాగిపోతుంది.

***మీ కుటుంబం గురించి... పిల్లలు వాళ్ళ చదువులు?***

నాకు ఇద్దరు పిల్లలు. పాప లాస్య. పదవ తరగతి. పుస్తకాలను బాగా ఇష్టపడుతుంది. బాబు సుహాస్. ఎనిమిదవ తరగతి. వాన్ని హీరోగా పెట్టి రాసిన పుస్తకాన్నే ఇంతవరకూ ముట్టుకోలేదు. పిల్లలు చిన్నగా వున్నప్పుడు నాకు ప్రమోషన్ వచ్చి ఆదోని పరిసరాల్లో ఎనిమిది సంవత్సరాలు ఉద్యోగం చేయవలసి వచ్చింది. సెలవు రోజుల్లో మాత్రమే ఇంట్లో ఉండేవాన్ని. ఆ సమయంలో పిల్లల భారం మొత్తం నా శ్రీమతే మోయవలసి వచ్చింది.



*ఆమె ఆరోజు ధైర్యంగా వేసిన అడుగే మా జీవితాల్ని నిలబెట్టగలిగింది. ఇప్పుడు తలుచుకుంటే ముగ్గురు పిల్లలతో ఆమె చేసిన ఒంటరి పోరాటానికి ఒళ్ళు జలదరిస్తుంది. అమ్మ ప్రభావం నామీద ఏముందా అని ఆలోచిస్తే మొండితనం, ఒంటరిగా పోరాడ్డం, నిజాయితీగా బ్రతకడం ఆమె నుంచే వచ్చింటాయి. 75 ఏళ్ళు నిండినా ఈరోజుకీ అమ్మ మామీద కొంచం గూడా ఆధారపడదు. నేను మా అమ్మ అనే పుస్తకంలో అమ్మకు సంబంధించిన విషయాలు చాలావరకు కథల రూపంలో రాశాను.*



***మీరు తుమ్మల రామకృష్ణ గారి దగ్గర మొట్టమొదట పీ హెచ్ డి పూర్తి చేసిన విద్యార్థి గదా... మీరు కథకునిగా మారడంలో రామకృష్ణ గారి పాత్ర వుందా?***



రామకృష్ణ గారు నాకు పీజీలో గురువు. విద్యార్థులతో చాలా చనువుగా, స్నేహంగా వుండే వ్యక్తిత్వం వారిది. అదీగాక మేముండేది ఒకే వీధిలో. దాంతో మా మధ్య చక్కని అనుబంధం ఏర్పడింది. రోజూ సాయంత్రం కాగానే సారు ఇంటిలో వాలిపోయేటోన్ని. సారు ఎక్కడుంటే నేనూ అక్కడే. రామకృష్ణ సారు ఇంటిలో మంచి గ్రంథాలయం వుండేది. దానినిండా ఎంపిక చేయబడ్డ, ప్రసిద్ధి చెందిన ఆధునిక సాహిత్యం వుండేది. అప్పటివరకు ఏదిబడితే అది చదివే నేను కొత్త సాహిత్య ప్రపంచంలోకి, వాస్తవ జీవితంలోకి అడుగు పెట్టాను. సారు అప్పడప్పుడే కథలు రాస్తున్నాడు. వారికి వున్న సాహితీ మిత్రులంతా నాకూ పరిచయం కావడం మొదలైంది. ఆ పరిచయమే కథాసమయం.

ప్రగతిశీల పత్రికలనుంచి కానీ, రాయలసీమ ప్రతినిధులనుంచి గానీ, ఇంటా బైటా ఎటువంటి వ్యాసాలు రాకపోవడం నన్ను ఆశ్చర్యపరచింది. ఆ వ్యూహాత్మక మౌనం రాయలసీమపై అనేక సంకలనాలు తీసుకురావలసిన అవసరాన్ని గుర్తు చేసింది.

గత ముప్పయి సంవత్సరాలలో రాయలసీమకు ప్రాతినిధ్యం వహిస్తూ సీమకథ, సీమ కక్షల కథలు... అలాగే ఇటీవలే దూదర గూళ్ళు అనే మూడు కథల సంకలనాలు మాత్రమే ఇక్కడి నుంచి వచ్చాయి. మిగతా ప్రాంతాలతో సమానంగా విస్తృతమైన వస్తు వైవిధ్యం, ప్రగతిశీల సాహిత్యం ఇక్కడ వుంది. వాటిని బైటకు తీసుకువచ్చి సాహితీ లోకానికి అందించాలి. అంతేగాక ప్రత్యేక రాష్ట్రాన్ని కలగంటున్నప్పుడు రాయలసీమ పేరుతో విస్తృతమైన సాహిత్యం కూడా ప్రజలకు అందుబాటులోకి రావాలి. అది ప్రజల్లో ఒక సెంటిమెంట్ ను రగిలించి, ఐక్యతకు దారితీసి ముందుకు నడిపిస్తుంది. రాయలసీమ పేరుతో సంకలనాలు తీసుకురావడానికి ఇదొక కారణం.




***ఇప్పటివరకు రాయలసీమ స్త్రీల కథలు, రాయలసీమ ప్రేమకథలు, రాయల సీమ కరువుకథలు కాక ఇంకేమన్నా వచ్చాయా? ఇదే సిరీస్ లో ముందు రాబోయే పుస్తకాల వివరాలేమయినా చెబుతారా?***

ప్రస్తుతం రాయలసీమ హాస్య కథలు, రాయలసీమ వ్యంగ్య కథలు అనే రెండు సంకలనాలు మొదలుపెట్టాను. ఇప్పటికే సగం పని పూర్తి అయింది. ఈ ఏడాది చివరికంతా వచ్చేస్తాయి. చేయాల్సిన లిస్ట్ చాలా పెద్దగా వుంది. ముందే చెప్పి చేయలేకపోతే ప్రెజర్ ఎక్కువ అవుతుంది.

***1992 లో సీమకథలు పుస్తకం ప్రచురించినప్పుడు కర్నూల్ నుండి ప్రాతినిధ్య కథలు లేవని సంపాదకులు రాశారు. అలాంటి వాతావరణం నుండి ఈ రోజు కర్నూల్ నుండే రాయలసీమ సంకలనాలు వచ్చేవరకూ, ఇక్కడ జరిగిన సాహిత్య పరిణామాలు ఏమిటి ? ఈ చైతన్యానికి కారణాలేవని మీరు భావిస్తున్నారు ?***

కర్నూలు జిల్లా కథా సాహిత్యాన్ని 1990కి ముందు, ఆ తర్వాత అని రెండుగా విభజింపవచ్చు. తొంభైలకి ముందు జిల్లాలో వున్న కథా సాహిత్యంలో మానవ సంబంధాల చిత్రణ, ఆదర్శవాదం, సంఘ సంస్కరణాభిలాష, స్వాతంత్ర్య కాంక్ష మొదలైనవి ప్రధాన వస్తువులు. సీమ కథలు సంకలనంలో కర్నూలుకి అసలు ప్రాతినిధ్యమే లేదు. దానికి కారణాలు వివరిస్తూ 'ప్రాంతీయ జీవితాన్ని ప్రతిఫలిస్తున్న కథలేవీ కర్నూలు ప్రాంతంలో దొరకలేదనీ సంపాదకులు పేర్కొన్నారు. ఇది కాదనలేని వాస్తవమే. అక్కడక్కడా ఒకటీ రెండూ కథలు వచ్చినా అవి అంత బలంగా లేకపోవచ్చు. 1990 తర్వాత కథాసమయం సభ్యులు సాహితీ రంగంలో అడుగుపెట్టాక మొత్తం మారిపోయింది. ఇక రాయలసీమ సంకలనాలు అంటారా... ఒకొక్క సమయంలో ఒకొక్క ప్రాంతం యువతరం ప్రవేశం వలన చైతన్యవంతం అవుతూ వుంటుంది. అలా రాయలసీమ సాహిత్యాన్ని సుసంపన్నం చేయడంలో ఇప్పుడు కర్నూలుకు అవకాశం వచ్చింది.

***దాదాపు ఇరవయ్యేళ్ళ క్రితమే కర్నూలు కథ పేరుతో ఇక్కడ రచయితల 60 కథలతో సంకలనాన్ని వెలువరించారు. దానికి ప్రేరణ ఏమిటి ? అంత పెద్ద పనిని ఒక్కరే ఎలా హ్యాండిల్ చేయగలిగారు? నిజానికి అది ఒక ట్రెండ్ సెట్టర్. ఎందుకంటే, ఆ ప్రభావంతో తరువాత్తరువాత ప్రాంతాల వారీగా, ఆయా ప్రాంతాల ప్రాతినిధ్య కథలతో చాలా సంకలనాలే వచ్చాయి?***

*కేవలం పాఠకునిగా వున్న నన్ను కథకునిగా రాటుదేల్చిందీ, తీర్చిదిద్దిందీ కథాసమయం మిత్రులే. ఇతర ప్రాంతాలలోని సమకాలీన సాహిత్యాన్ని అధ్యయనం చేయడానికి, మన రచనలు మెరుగు పరచుకోవడానికి వీరు ఎంతగానో సహకరించారు. ప్రతి నెల రెండవ శనివారం జరిగే సమావేశంలో రచయితలు తాము రాసిన కథల్ని చదివి వినిపించేవారు. ప్రతి ఒక్కరూ నిర్మొహమాటంగా తమ అభిప్రాయాలు వెలిబుచ్చేవారు. రచయితలు తమ లోటుపాట్లు గ్రహించి సవరించుకోవడానికి ఆ వాదోప వాదాలు ఉపయోగపడేవి. చంద్రశేఖర్, శ్రీనివాసమూర్తి, తుమ్మల రామకృష్ణ, రాప్తాడు గోపాలకృష్ణ, జి.ఉమా మహేశ్వర్, వెంకట కృష్ణ, తెలుగు వెంకటేష్, ఇనాయతుల్లా మొదలగువారు చురుగ్గా వ్యవహరించేవారు.*



# వందరోజులు వంద కథలు

హరికిషన్ నిత్య ప్రయోగశీలి. 2020 మార్చిలో ప్రపంచమంతా కరోనా భయంతో ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని ఇళ్ళకే పరిమితమైన సమయంలో, పిల్లలను అలరించడానికి, పెద్దల ఆందోళనలను తగ్గించడానికి వినూత్న కార్యక్రమానికి శ్రీకారం చుట్టాడు. వారానికొకరోజు ఇంట్లో ఉంటేనే పిల్లలను భరించడం కష్టం. అలాంటిది ఎన్ని రోజులో తెలియని అయోమయం..బడి లేకపోయినా పరవాలేదు, మిగతా పిల్లలతో కలిసి ఆడుకుంటారులే అని అనుకోలేని సందర్భం.

ఏమి చేయాలో తెలియక, పిల్లలని ఎలా కట్టడి చేయాలో తెలియక గందరగోళంలో పడిపోయిన తల్లితండ్రుల పాలిటి వరంలా – హరికిషన్ వంద రోజులు, వంద కథలు అన్న ప్రకటన చేశాడు. ప్రతి రోజూ ఒక కొత్త కథతో పిల్లలను అలరించడానికి తన సోషల్ మీడియా వేదికలను సిద్ధం చేశాడు.

ప్రతిరోజూ ఒక కథ, ఒక సామెత, ఒక పొడుపు కథ, ఒక గేయం చొప్పున వంద రోజులు పిల్లలకు పెద్దలకు అందచేయాలని సంకల్పించాడు. మొదట ఒకటి రెండు వాట్సప్ గ్రూపులతో ప్రారంభించిన ఈ కార్యక్రమం ఎంత త్వరగా ప్రజలలోకి వెళ్ళిన దంటే ఒక వారంలో అవి 30 గ్రూపులకు చేరుకున్నాయి.

ఎలుక రాజు

పిల్లలు మెచ్చే సరదా కథ

డా.ఎం.హరికిషన్

ఏప్రిల్ ఒకటవ తేదీన ప్రారంభించిన ఈ ప్రక్రియ రోజుకు దాదాపు 30–40 వేలమంది చూసే విధంగా ప్రజాదరణ పొందింది. 180 గ్రూపులలో కేవలం హరికిషన్ కథల కోసమే ఆయనను గ్రూపులో చేర్చుకుని రోజుకో కథను పొందుతూ, దానిని పిల్లలకు పంచుతూ లాక్ డౌన్ ప్రభావాన్ని కొంత వరకూ తట్టుకునేందుకు ఇవి పెద్దవాళ్ళకి ఎంతగానో ఉపయోగపడ్డాయి.

పక్కింటి వాళ్ళు కూడా మనింటికి రాని రోజులలో హరికిషన్ కథలలో నుండి రాజ కుమారులు, యువరాణులు, తెలివైన మంత్రులు, సోమరిపోతులు, ముసలవ్వలు, తాతలు, దొంగలు, రక్షక భటులు, దేవుళ్ళు, దయ్యాలు, గయ్యాళి అత్తలు, కష్టాల కోడళ్ళు అందరూ మనీళ్లకు అతిదులయ్యారు. ఇల్లు అడవిలా మారిందా, ఆడవే మానింటికి వచ్చిందా అన్నట్టు, పులులు, తోడేళ్ళు, జింకలు, ఏనుగులు అన్నీ కట్ట కట్టుకుని ఇళ్ళలో నివాసముండసాగాయి. బొమ్మల సహాయంతో సామెతలు గుర్తించడం, పొడుపు కథలు విప్పడం, గేయాలను లయ బద్ధంగా పాడడం పిల్లలకు గొప్ప ఆటవిడుపుగా తోచింది.

ఈ కార్యక్రమానికి లభించిన ఆదరణ ఎంతగా ఉన్నదంటే, వంద రోజుల తరువాత కూడా, పాఠక శ్రోతల కోరిక మేరకు దానిని మరి కొన్ని నెలలు పొడిగించక తప్పలేదు. లాక్ డౌన్ పూర్తయి పిల్లలు బడులకు వెళ్ళిన తరుణంలో కూడా ఈ కంటెంట్ స్కూల్ ఉపాధ్యాయులకు ఉపయోగపడిందని చాలా మంది టీచర్లు హరికిషన్‌కి కృతజ్ఞతలు తెలుపుతూ చెప్పారు.

ఇవికాక తాను రాసిన జానపద కథలని, పిల్లల కథలని, తన "హరికథలు" అనే యూట్యూబ్ చానల్ ద్వారా ప్రేక్షకులకు అందిస్తున్నాడు. కేవలం కథలే కాక, సందర్భోచితంగా, స్వాతంత్ర్య పోరాట యోదులను, మహనీయులను, కొన్ని ప్రదేశాలను కూడా పరిచయం చేయడం అభినందనీయం.

– ఉమామహేశ్వర్







సీమకథల్లో కర్నూలుకి ప్రాతినిధ్యమే లేకపోవడం వల్ల అసలు కర్నూలు జిల్లాలో కథే లేదు అనే అపప్రథ బైట వ్యాపించింది. రాయలసీమకు సంబంధించిన వ్యాసాలలోనూ, ఉపన్యాసాలలోనూ కర్నూలు పేరు ఎక్కడా కనిపించేదీ కాదు, వినిపించేదీ కాదు. దానిని బద్దలుగొట్టడానికి చేసిన ఆత్మ గౌరవ ప్రకటనే ఆ సంకలనం. ఇది తెలుగు రాష్ట్రాల్లో మొదటిదేమీ కాదు. అప్పటికే కొన్ని జిల్లాల్లో అప్పుడప్పుడే సంకలనాలు వెలుగు చూస్తున్నాయి. రాయలసీమలో మాత్రం ఇదే మొదటిది. కథలు సంపాదించడం ఒక ఎత్తయితే, సంకనం ప్రచురించడం ఒక ఎత్తు. నా జీతం ఐదువేలున్నప్పుడే యాభై వేలు ఖర్చు పెట్టి దానిని బైటకు తీసుకువచ్చాను. పుస్తకాల ప్రచురణలో ఆర్థిక ఇబ్బందులు ఏర్పడినప్పుడు మా కథాసమయం మిత్రుడు జి.ఉమామహేశ్వర్ చాలాసార్లు అండగా నిలబడేవాడు.

***కర్నూలు కథాసమయం మిత్రులలో మీరూ ఒకరు? మీ సాహితీ ప్రయాణంలో కథాసమయం పాత్ర ఎంత?***

కర్నూలు సాహిత్య చరిత్రలో కథాసమయంది విశిష్టమైన పాత్ర. కర్నూల్లో ప్రాంతీయ జీవిత చిత్రణకి, మాండలికానికి పెద్ద పీట వేసి ఆధునిక సాహిత్యానికి బాటలు వేసింది. కొత్త కథకుల్ని రూపొందించడంలోనూ, వారికి సరియైన దృక్పథం అందించడంలోనూ, ఇతర ప్రాంతాలకు దీటుగా కర్నూలు రచయిత లను నిలపడంలోనూ, సభలూ సమావేశాలూ అన్ని ప్రాంతాల కథారచయితలతో నిర్వహించి అనుబంధాలను విస్తరించడంలోనూ, కర్నూలు జిల్లాకు ఆధునిక సాహిత్యంలో గుర్తింపు తీసుకురావడంలోనూ విశేషమైన కృషి చేసింది.

కథా సమయం సభ్యుల్లో వయసులో అందరికంటే చిన్నవాన్ని నేనే అయినప్ప టికీ కథా సమయం ప్రారంభం అయిన మొదటి సమావేశం నుంచీ నేను వున్నాను. అంతకుముందు కేవలం పాఠకునిగా వున్న నన్ను కథకునిగా రాటుదేల్చిందీ, తీర్చిదిద్దిందీ కథాసమయం మిత్రులే. ఇతర ప్రాంతాలలోని సమకాలీన సాహిత్యాన్ని అధ్యయనం చేయడానికి, మన రచనలు మెరుగు పరచుకోవడానికి వీరు ఎంతగానో సహకరించారు. ప్రతి నెల రెండవ శనివారం జరిగే సమావేశంలో రచయితలు తాము రాసిన కథల్ని చదివి వినిపించేవారు. ప్రతి ఒక్కరూ నిర్మొహమాటంగా తమ అభిప్రాయాలు వెలిబుచ్చేవారు. రచయితలు తమ లోటుపాట్లు గ్రహించి సవరించుకోవడానికి ఆ వాదోపవాదాలు








ఉపయోగపడేవి. చంద్రశేఖర్, శ్రీనివాసమూర్తి, తుమ్మల రామకృష్ణ, రాప్తాడు గోపాలకృష్ణ, జి.ఉమామహేశ్వర్, వెంకట కృష్ణ, తెలుగు వెంకటేష్, ఇనాయతుల్లా మొదలగువారు చురుగ్గా వ్యవహరించేవారు. కథాసమయానికి మంచి విమర్శకుడైన చంద్రశేఖర్ చాలా కీలకంగా వుండేవాడు.

***మీ కథలు వేరే భాషలలోకి ఏవైనా అనువాదం అయ్యాయా?***

నేను రాసిన 121 జానపద కథలను దీప్తి ప్రచురణలు వారు ఆంగ్ల భాషలోకి అనువాదం చేయించి రెండు భాగాలుగా తీసుకువచ్చే ప్రయత్నం చేస్తున్నారు. మొదటి భాగం అనువాదం పూర్తి అయింది. అలాగే ఇటీవల పరమేశ్వర్ గారు కొన్ని జానపద కథలను హిందీలోకి అనువాదం చేశారు. ఇక మా అన్న రామ్మోహన్ ఆంగ్ల భాషలోకి ఆరు పుస్తకాలను అనువాదం చేసిన సంగతి ముందే చెప్పుకున్నాం. సామాజిక సమస్యలపై రాసిన కథల్లో ఇంతవరకు బసివిరాలు బరితెగించింది అన్న ఒక్క కథ మాత్రమే కన్నడ భాషలో అనువాదం అయింది.

***చాలామంది సాహిత్యకారులు సోషల్ మీడియా తమకు ప్రతిబంధకం అని భావిస్తున్న రోజులలో మీరు దాన్నే ఆధారంగా చేసుకుని చాలామంది అభిమానులను, పాఠకులను తయారు చేసుకున్నారు? వాట్సాప్ లో, అలాగే ఫేస్బుక్ లో మీ అనుభావాలు ఏమిటి ? ఆ ప్లాట్‌ఫార్మ్ మీకు ఎలా ఉపయోగ పడ్డాయి?***

ఒకవైపు దారి మూసుకుపోతే మరొక వైపు దారి వెదుక్కోవాలి. తప్పదు. బాలల పత్రికలు నా రాజీలేని శైలివల్ల కథలను తిరస్కరిస్తున్నాయి. నేరుగా పుస్తకాలు ప్రచురిస్తున్నా కథలు చేరేవారి సంఖ్య స్వల్పం. అప్పుడు కనబడిన వెలుగే ఫేస్‌బుక్. ఆ మాధ్యమంలో నా కథల్ని ప్రజల్లోకి తీసుకెళ్ళగలనా లేక అనవసరంగా సమయం వృధా అవుతుందా అని చాలా రోజులు ఆలోచించి వివాదాలలోకి అడుగు పెట్టకుండా కొన్ని జాగ్రత్తలతో అడుగుపెట్టా. నెమ్మదినెమ్మదిగా నా కథలు చదివే పాఠకులు పెరుగుతూ పోయారు. అది ఎంతగా విజయవంతం అయిందంటే కర్నూలు జిల్లా చరిత్రకు చెందిన మూడు పుస్తకాలు ఫేస్‌బుక్ మిత్రులే ప్రచురించారు. నాకు అంతవరకూ ఏ మాత్రం పరిచయం లేనివారు కూడా ఉహించని విధంగా అందులో భాగస్వామ్యం




# నిఖార్సైన రాయలసీమ కథకుడు హరికిషన్

రాయలసీమ పురోగమనం కోసం యెదురు చూస్తున్న నిఖార్సైన రాయలసీమ కథకుడు హరికిషన్. దగా పడిన రాయలసీమ మీద ఆయనకు సానుభూతి వుంది. తెలంగాణా ప్రజలు మేల్కొన్నట్లు రాయలసీమ మేల్కొని వేరుపడాలనే ఆకాంక్ష వుంది.

'కొత్త కల', 'తరతరాల దుఃఖం', 'జై తెలంగాణా' కథల సృష్టితో తన ఆకాంక్షలకై తపన పడ్డాడీయన.

తమ ప్రాంత అజెండానే, రాయలసీమ, కోస్తాంధ్ర, ఉత్తరాంధ్ర ప్రాంతాల ఉమ్మడి అజెండాగా అందరిపై రుద్ది 'సమైక్యాంధ్ర ఉద్యమం' చేయించిన సర్కారు ప్రాంతనేతల కుట్రను 'కొత్త కల' లో మనకు యెరుకపరుస్తాడు.

కోస్తాంధ్ర నాయకుల కుటిలమాటలు విని, దగా పడి 'కృష్ణ-పెన్నార్' ప్రాజెక్టును పోగొట్టుకుని, ఆ తరువాత శ్రీశైలం ప్రాజెక్టు కోసం బలవంతంగా భూములు కోల్పోవాల్సిన ఆగత్యం వచ్చి మరోసారి వంచింపబడిన దైన్యం రాయలసీమవాసులది. ఈ 'తరతరాల దుఃఖం' పట్ల హరికిషన్ కు అమితమైన సానుభూతి వుంది.



ఈ రెండు కథలూ, గతజల సేతు బంధనం అనుకుంటే, ఇప్పుడు రాయలసీమ విముక్తి కోసం కొత్త సేతువును నిర్మించాల్సిన వుద్యమ స్పృహను 'జై తెలంగాణా' కథ యిస్తుంది.

రాయలసీమ రైతులు తమ భూముల్లో పంటలు పండించలేక పోవడానికీ, అదే భూములను సర్కారు ప్రాంతవాసులు కౌలుకు తీసుకుని లాభదాయకమైన వ్యవసాయం చేయడం వెనుక వున్నది రాయలసీమ రైతుల సోమరితనమేనా?

కాదు... కోస్తాంధ్ర వాసుల నిజాయితీ లేనితనం, దొంగ తెలివితేటల వల్లే అది జరుగుతోందనే చైతన్యాన్ని కలిగిస్తాడు హరికిషన్. కోస్తాంధ్ర వాసుల దొంగతెలివితేటలను ముందుగా గుర్తించి వేరుపడిన తెలంగాణావాసుల స్పృహ, రాయలసీమలో కలగాలనే ఆలోచనను రేకెత్తిస్తాడు తన 'జై తెలంగాణా' కథతో. రాయలసీమ రైతుల వెనుకుబాటుతనం, ఆత్మన్యూనత, అమాయకత్వాలను ఈ కథ లోకానికి చెబుతుంది.

కిందటితరం రాయలసీమ రచయితలు రాయలసీమ కరువును రాసినా, ఇక్కడి భౌగోళిక నైసర్గిక, ప్రకృతి శాపాలనే చెప్పి సానుభూతి కథలుగా మిగిల్చారు. లేదా, ప్రభుత్వాలు తమను పట్టించుకోలేదనే నిరసన ప్రదర్శించారు. ఇప్పుడు హరికిషన్ వంటి రచయితలు రాజకీయ కుట్రలను తేటతెల్లం చేస్తూ వుద్యమించాల్సిన స్పృహ కలిగిస్తున్నారు.

జి.ఉమామహేశ్వర్ ఎప్పుడో 'పరాయోళ్ళు' కథ ద్వారా ఈ కుట్ర రాజకీయాలను చెబితే, ఆ తరువాత కర్నూలు జిల్లా రచయితలు అదే దారిలో 'విభజన రేఖలు' సంకలనం తెచ్చే స్థాయికి ఇటువంటి కథలు రాశారు.

ఇటువంటి కథలు ఇంకా ఇంకా... రాయలసీమ 'ప్రత్యేక రాష్ట్రం'గా యేర్పడే స్థాయి వరకూ రావాల్సిన ఆవశ్యకత వుంది. ఈ దారిలో హరికిషన్ ముందున్నాడు.

***– పాలగిరి విశ్వప్రసాద్ – ప్రముఖ రచయిత, సమీక్షకులు***




*రాయలసీమ అంటే మామూలుగానే చిన్నచూపు, ఇక అక్కడి రచయిత్రుల సాహిత్యమంటే మరింత చిన్నచూపు సాహిత్య ప్రచురణ సంస్థలకు ఉండడం వల్ల ఇటువంటి ఆలోచన ఎవరికీ రాకపోయి ఉండవచ్చు. నిజానికి ఈ సంకలనం నేను స్వయంగా తీసుకురావాలని మొదట అనుకోలేదు. అది స్త్రీలనుండి వస్తే బాగుంటుందని అనేకమందికి నా ఆలోచన వివరించాను. కానీ కార్యరూపం దాల్చలేదు. దాంతో నేనే స్వయంగా బాధ్యత తీసుకోవాల్సి వచ్చింది. ఈ సంకలనం వెలువడి సంవత్సరం దాటిపోయినా స్త్రీ విమర్శకులనుంచి కానీ, ప్రగతిశీల పత్రికలనుంచి కానీ, రాయలసీమ ప్రతినిధులనుంచి గానీ, ఇంటా బైటా ఎటువంటి వ్యాసాలు రాకపోవడం నన్ను ఆశ్చర్యపరచింది. ఆ వ్యూహాత్మక మౌనం రాయలసీమపై అనేక సంకలనాలు తీసుకురావలసిన అవసరాన్ని గుర్తు చేసింది.*

అయ్యారు. కొండారెడ్డి బురుజు, కర్నూలుజిల్లా మహనీయులు, Kurnool District's History వారి సహకారంతో ప్రచురించినవే.

ఇదంతా వాట్సప్ రాకముందు. వాట్సప్ వచ్చాక నా కథలన్నీ యూనీకోడ్ లోకి మార్చి ప్రజల్లోకి విస్తృతంగా తీసుకుపోయా. నా కథల కోసం రాష్ట్ర వ్యాప్తంగా రెండువందలకు పైగా గ్రూపులు నన్ను సభ్యునిగా చేర్చుకున్నాయి. ముఖ్యంగా టీచర్ల గ్రూపులు. ప్రతిలిపి, కహానియా.కాం, టెలిగ్రాం, ఇన్ స్టా గ్రాం, డైలీ హంట్, షేర్ చాట్, కూ, బ్లూ ప్యాడ్ ... ఇలా ఏ సామాజిక మాధ్యమమైనా సాహిత్యానికే ఉపయోగించుకుంటా. కథలు రాయడం ఎంత ముఖ్యమో వాటిని పాఠకులకు చేర్చడం కూడా అంతే ముఖ్యం. అందుకే రోజూ కొంత సమయం వీటికి కేటాయిస్తా. మారుతున్న కాలానికి అనుగుణంగా మనమూ మారక తప్పదు. నిజానికి ఈ సామాజిక మాధ్యమాల వల్లనే పాఠకులు విపరీతంగా పెరిగారు. పుస్తకాల అమ్మకాలు కూడా ఊహించనంతగా పెరిగాయి.

***వీడియో మాధ్యమాన్ని వాడుకుందామని ఆలోచన ఎలా వచ్చింది?***

వాట్సప్, ఫేస్‌బుక్ ల వల్ల చాలామందికి నా పేరు తెలుసు. కానీ నేను తెలీదు. దానికి తోడు నా కథ నా యాసలో నేను చెబితేనే మజాగా వుంటుంది. అందుకే సరదాగా ఈ ప్రయోగం. కానీ పని వత్తిడి వల్ల రెగ్యులర్ గా వీడియోలు చేయలేకపోతున్నా. నేననుకున్నంత విజయం యూట్యూబ్ లో ఇంకా దొరకలేదు.

***ఉద్యోగంలో ఎప్పుడు చేరారు? ఎక్కడెక్కడ పని చేశారు? ఆయా పాఠశాలల్లో మీకు గుర్తుండిపోయే సంఘటనలేమైనా చెబుతారా? మీ కథలకు అవి ఏమైనా ఆధారాలై వుంటే అవి కూడా?***

1997లో పారుమంచాలలో తెలుగు ఉపాధ్యాయునిగా ఉద్యోగ జీవితం, నా కథా రచన, గ్రామీణ జీవిత పరిచయం ఒక్కసారే ప్రారంభమయ్యాయి. నేను పూర్తిగా నగరవాసిని. పాణ్యం నా జన్మస్థలమైనా ఎండాకాలం సెలవులు సరదాగా గడపడానికి మాత్రమే చిన్నప్పుడు అక్కడికి వెళ్ళేవాన్ని. ఇంట్లో అంతా చదువుకున్న వారే. పాఠశాలలోనూ, బైట పుస్తకాలలోనూ చదువుకున్నది అంతా కోస్తా వ్యవహారిక భాషనే. ఉద్యోగ జీవితం గ్రామాల్లో కావడం వల్ల, ప్రయత్న పూర్వకంగా అక్కడి మాండలిక సువాసన కొంచం అంటుకొంది. అందుకే నా కథల్లోని భాషను గమనించినప్పుడు ఈ మిక్స్‌డ్ శైలి కనబడుతుంది. ఉపాధ్యాయున్ని కావడం వల్ల పిల్లల సమస్యలపై ఎక్కువగా కథలు రాశాను. జానపద కథల సేకరణ కూడా సులభమైంది. నిజానికి ఈ కథల్లో తొంబై శాతం ఆడ పిల్లలు సేకరించుకొచ్చినవే. వాటిని బ్రతికిస్తున్నది వాళ్ళే. ఆ తరువాత ఎనిమిది సంవత్సరాలు పూడిచెర్లలోని అప్పర్ ప్రైమరీ పాఠశాలలో పసిపిల్లలతో పనిచేసి, ప్రమోషన్ మీద కర్ణాటక బార్డర్ లోని బదినేహాల్ గ్రామంలో అడుగు పెట్టాను. దీనివల్ల కర్నూలు జిల్లాలో అత్యంత వెనుకబడ్డ, విభిన్నమైన సంస్కృతి, యాస గల ఆదోని జీవితాన్ని అర్థం చేసుకోవడానికి ఉపయోగపడింది. బసివిరాలు బరితెగించింది, బంగారం, జై తెలంగాణ లాంటి కథలు ఈ ప్రాంత నేపథ్యం నుంచి వచ్చినవే.

***స్కూల్లో పిల్లలతో మీ సంబంధాలు ఎలా వుంటాయి. బైట ఇన్ని సరదా కథలు చెప్పే హరి కిషన్ స్కూల్లో కూడా అలాగే వుంటాడా?***

అప్పర్ ప్రయిమరీ పాఠశాలలో పని చేసినంత కాలం ఆటలు, పాటలు, కథలు, చదువులతో చాలా సరదాగా గడిచిపోయింది. రెండు నెలలకొకసారి ఏదో ఒక టూర్‌కి తప్పక తీసుకుపోయేవాన్ని. హైస్కూల్ కొచ్చాక అన్నీ నెమ్మదిగా అటకెక్కేశాయి. పబ్లిక్ పరీక్షల ఒత్తిడి, పిల్లలు యుక్త వయస్సులోకి వస్తుండడం, అనేక ఆకర్షణలు, ప్రభావాల మధ్య స్వేచ్ఛగా వ్యవహరించలేం. తరగతి గది మాత్రం నా సబ్జెక్ట్ కుండే సౌలభ్యం వల్ల ఆహ్లాదంగా, సరదాగా వుంటుంది. కానీ నా చూపు, నడక, ఆకారం, గొంతు... ఇవన్నీ గంభీరంగా ఉండడం వల్ల, పాఠశాలలో క్రమశిక్షణ బాధ్యత తల కెత్తుకోవడం వల్ల పిల్లలు కొంచం భయపడతారు.

***తెలుగు భాషను ఎలా కాపాడుకోవాలి?***

ఆంగ్ల మీడియంలో మా పిల్లలను చదివిస్తున్న నేను దీనికి జవాబు చెప్పడం కష్టమే. ప్రభుత్వాలకు, ప్రజలకు ఎటువంటి ప్రేమలేని విచిత్ర స్థితి తెలుగు భాషది. దక్షిణ భారతదేశంలో ఇలాంటి దీనస్థితి దేనికీ లేదు. ప్రాథమిక విద్య ప్రభుత్వ, ప్రయివేట్ తేడా లేకుండా అన్నింటిలో ప్రవేశపెట్టాలి. అది సాధ్యం కాకపోతే తెలుగు ఒక సబ్జెక్ట్ గా నన్నా డిగ్రీ వరకు తప్పనిసరి చేయాలి. గ్రామీణ ప్రాంతాల్లో ఉద్యోగాలకు తెలుగు బాగా వచ్చినవారిని తీసుకోవాలి.

***గ్రంథాలయాలను ఎలా అభివృద్ధి చెందించాలి?***

వ్యక్తిత్వ నిర్మాణంలో ఒకప్పుడు ప్రముఖ పాత్ర వహించిన గ్రంథాలయాలు ప్రస్తుతం బూజుపట్టి, బోసి పోతున్నాయి. విద్యార్థులు, యువకులు అటువైపు తొంగి చూడ్డం లేదు. పాఠశాల దశలోనే చిన్నారులకు గ్రంథాలయా లు అలవాటు కావాలి. పిల్లల్లో చదవాలనే ఉత్సాహం, తెలుసుకోవాలనే కుతూహలం కొండంత వుంది. కానీ చాలా పాఠశాలల్లో విలువైన గ్రంథాలయాలు వున్నా లైబ్రేరియన్లు లేరు. అదనపు బాధ్యతలకు ఎవరూ ముందుకు రారు. పుస్తకాలు బీరువాల్లో బందీ అయి కేవలం అలంకార ప్రాయంగా మారుతున్నాయి.

కొన్ని ప్రయివేటు పాఠశాలల్లో గ్రంథాలయాలు అందుబాటులో వున్నా అందులో పిల్లలకు ఇష్టమైన పుస్తకాలు కాక సబ్జెక్ట్ ఓరియెంటెడ్ పుస్తకాలు వుండడం వల్ల పిల్లలు ఆసక్తి చూపడం లేదు. ప్రభుత్వం సక్రమంగా గ్రంథాలయ సెస్సును విడుదల చేస్తూ, కొనుగోలులో వ్యవస్థీకృతమైన అవినీతిని అరికట్టి, మంచి పుస్తకాలను అందుబాటులో వుంచి, లైబ్రేరియన్ల కొరత తీరిస్తే తప్ప మరలా ఇవి అభివృద్ధి చెందవు.

***జి.ఉమామహేశ్వర్ సెల్: 98498 02521***

# ఆర్ధ్రత హరికిషన్ కథల అంతఃసూత్రం



నీటి సుదులకు, తరంగాలకు, నురగలకు, దాహార్తిని తీర్చే మంచినీటికి రూపం వేరైనా జలమే ఆధారమైనట్లు ఎంత వైవిధ్యభరితమైన కథావస్తువుల్ని హరికిషన్ స్వీకరించినా అన్ని కథలసారం బాధాతప్త జీవిత చిత్రణే. మానవాళికి అందాల్సిన న్యాయాన్ని, జీవించే హక్కును శిల్పించే ప్రయత్నంలో హరికిషన్ కథా సంవిధానానికి సహకరించింది కరుణార్ద్రతలే. అందువల్లనే ఈయన కథలకు పరుషస్పర్శ వుండదు. "కొన్ని లోకస్పర్శ కలిగి పరుషములుగా మారతాయని అందుకు ఆధారం కరుణమేనని" వీర రాఘవ పండితుడు చెప్పారు. ఈ ఆలంకారిక వ్యాఖ్యానం సరిగ్గా హరికిషన్ కథలకు సరిపోతుంది. బలహీన వర్గాల జీవితం సృజించినా, బహుజన జీవితం చిత్రించినా, రాయల సీమ రాజకీయ విద్రోహచర్యలు బహిర్గతం చేసినా, అపసవ్యతల మూలాలు పాఠకుల మనసును ఆర్ద్రతా సంచలనాలకు గురి చేస్తాయి.

హరికిషన్ కథల్లోని ఆర్ద్రతా లక్షణం మనసును క్షాళనం చేస్తుంది. "ఏకో కరుణేవ రసం కావ్యం" అని లాక్షణికులు ప్రతిపాదించిన కేథారసిస్ సిద్ధాంతం లోని మెళకువలు ఎరిగిన కథకుడు హరికిషన్. సాహిత్య సృజనకారుల సభ్యత వాళ్ళు సృజించే సాహిత్యం పైనే ఆధారపడి వుంటుంది. సాహిత్యం సామాజిక ఆదర్శాలకు ప్రతిబింబించి, జీవిత సమస్యలను పరిష్కరించడానికి, జీవితాన్ని సుఖవంతంగానూ, అర్థవంతంగానూ చెయ్యటానికి సాహిత్యం వుపయోగపడటం కంటే మించిన ప్రయోజనం ఏముంటుంది. మనిషిలోని కొన్ని అనుభూతులను జాగృతం చేయడం ద్వారా మనిషితత్వాన్ని పెంపొందించే అర్ధ్రత హరికిషన్ కథలకుంది.

ఇతని కథల్లో ప్రధానంగా కనిపించే వైవిధ్యం రాయలసీమ వాసుల దారిద్ర్యానికి కారణమైన న్యాయమైన నీళ్ళవాటా గురించి కథనం, అలాగే బహుజనులుగా వృత్తి జీవితంలో అనుభవిస్తున్న కడగండ్లు, ఆధిపత్య సామాజిక వర్గం నుండి ఎదుర్కొంటున్న దాష్టీకాన్ని సీమ నేపథ్యంలో చిత్రించారు. మూడవ అంశం స్త్రీల, పిల్లల దుఖమయ జీవితంలో చోటు చేసుకున్న దయనీయత, అలాగే విద్యావ్యవస్థలో చొరబడిన వ్యాపారాంతరీకరణ. ఈ ఇతివృత్తాలన్నింటిలో కనిపించే ప్రధాన లక్షణం ఆర్ధ్రత. అందుకే హరికిషన్ కథల్లోని పాత్రలు అన్యాయాల్ని ఎదిరించే పాత్రలుగా దర్శనమివ్వవు. పాఠకుల అవగాహనా స్థాయిని పెంచే క్రమంలో, తమ జీవన గమనంలో ఒలికే కన్నీళ్ళను పాఠకులకు నివేదిస్తాయి. ఏం చేయాలో, ఏం చేయ కూడదో పాఠకుల నిర్ణాయక శక్తికి వదిలి వేస్తాయే కానీ జీవితాన్ని మించిన సందేశా లు, పరిష్కారాలు ఇవ్వవు. ఈ లక్షణమే హరికిషన్ పాఠక ప్రపంచాన్ని విస్తరించ గలిగింది.

రాయలసీమ కథకులలో మొదటి, రెండవ,మూడవతరం కరువుకు కారణాలు నైసర్గికతలో వెదికారు. కానీ, నాలుగోతరం కథకులు కరువుకు కారణమైన రాజకీయ విద్రోహాలను, నీటి వనరుల పంపిణీలో జరిగిన కుట్రలను, పరాయి ప్రాంత పెట్టుబడిని బయటపెట్టారు. ముఖ్యంగా కందనవోలు సీమ నుండి వచ్చిన ఈ కథకుని కంఠస్వరంలోని సంయమనం ఒక గొప్ప సామాజిక సందర్భం దిశగా అడుగేసింది. ఈ క్రమంలో ఎం.హరికిషన్ నుండి "తరతరాల దుఃఖం", "జై తెలంగాణా", "కొత్తకల" కథలు వచ్చాయి. 1990ల తర్వాత పిల్లల చదువుల్లో పెరిగిన వేగం యాంత్రికత వాళ్ళ జీవితంలో సృజనాత్మకతకు అవకాశం లేకుండా గానుగెద్దుల్లాగా చట్రాల్లో బంధింపబడిన వైనాన్ని హరికిషన్ తన కథల్లో చిత్రించారు.

హరికిషన్ ప్రతి కథలోనూ స్పష్టమైన కంఠస్వరముంది. ఒక తాత్విక భూమిక వుంది. పాఠకుడి చైతన్యాన్ని పెంచే సామాజిక స్పృహ వుంది. రంగుల ప్రపంచం నుండి పాఠకున్ని వాస్తవిక ప్రపంచంలోకి తీసుకెళ్ళే శైలీ శిల్పం వుంది. ఏ అలంకారాలు, ఉపమానాలు, డొంకతిరుగుళ్ళు లేకుండా సూటిగా, స్పష్టంగా తను చెప్పదలచుకొన్న దాన్ని కథాంశంగా మలచగల నైపుణ్యం వుంది. సుదీర్ఘం గా సాగదీసి రెండు మూడు కథాంశాలను ఒకే కథగా చేయకుండా క్లుప్తంగా చెప్పగలడు. ముఖ్యంగా హరికిషన్ కథల్లో ఆవేశం వుండదు. ఆలోచనాత్మకంగా, సహనంగా జీవిత పాఠాల్ని బోధించే ఒక ఉపాధ్యాయ అనుభవం వుంటుంది. ఈ కథల్లో కృత్రిమమైన అనవసరమైన వర్ణనలుండవు. ప్రతి పదం ఉపయోగితా విలువ కలిగి వుంటుంది. అందుకే ఇతని కథనం చిక్కగా ఉంటుంది. హరికిషన్ కథల్లో రచయితగా అతను కలలుగన్న స్వప్నం లేదా అతని సాహిత్య దృక్పథం ఏంటి? అని ప్రశ్నించుకుంటే, బోధపడే అంశాలివి...

1. రాయలసీమకు జరుగుతున్న అన్యాయాలకు రాజకీయ నాయకులు చేస్తున్న విద్రోహాలను ప్రధానంగా ఎత్తి చూపడం.

2. వ్యధా భరితమైన స్త్రీలు, పిల్లల పట్ల గల పితృస్వామిక దృష్టికోణాన్ని బహిర్గతం చేయడం.

3. కార్పొరేట్ విద్యావ్యవస్థ స్వరూపాన్ని విమర్శనాత్మకంగా చర్చించటం.

4. బహుజనులపై ఆధిపత్య కులాల అభిజాత్యాన్ని ప్రశ్నించటం, ధ్వంసమవు తున్న వృత్తికులాల జీవిత భద్రతను డిమాండ్ చేయడం.

5. మృగ్యమౌతున్న మానవీయ కోణాన్ని అందించటం.

6. రాయలసీమలోని స్థానిక సాంస్కృతిక వైవిధ్యమైన వాతావరణాన్ని పరిచయం చేయటం.

7. స్థానిక, స్థలనామాల పరిచయం, మాండలిక భాషా వినియోగం.

– ప్రొఫెసర్ కె.శ్రీదేవి



# కందనవోలు కథకుడు



"సీమ సాహిత్యమే సీమ జీవితం – సీమ వెతలే సీమ కతలు" ఇదొక నానుడిగా చెలామణి అవుతున్న రోజుల్లో కర్నూలు కథని ప్రత్యేకంగా యెత్తి చూపిన రచయిత డా. ఎం.హరికిషన్. నిర్దిష్టంగా కర్నూలు జీవితాన్నీ, కథల్నీ అర్థం చేసుకోడానికి 2005లో హరికిషన్ సంకలనం చేసిన 'కర్నూలు కథ' యెంత గానో తోడ్పడింది. ఆ సంకలనం ద్వారానే గొప్ప తవ్వకపు పనిమంతుడుగా హరికిషన్‌తో నాకు తొలి పరిచయం.

నిజానికి హరికిషన్ కథా రచనా ప్రస్థానం తొలి అడుగు ద్వారానే (పడగ నీడ – 1997) అతను పయనించబోయే తోవా, నడక తీరూ అవగతమయ్యాయి.



సీమ సాహిత్యకారుల్లో యింతకుముందు కన్పించిన ప్రాంతీయ స్పృహ, తెలంగాణ రాష్ట్రోద్యమం నేపథ్యంలో రాజకీయ, ఆర్థిక రంగాల్లో ప్రాంతీయ అస్తిత్వ చైతన్యంగా పరిణమించాల్సిన అవసరాన్ని హరికిషన్ కథలు నిర్దేశిస్తున్నాయి. కృష్ణా నికర జలాల పంపిణీలో న్యాయబద్ధమైన వాటా గురించి డిమాండ్ చేయడం దగ్గరో, హైదరాబాద్‌ను స్విస్ బ్యాంక్ గా మార్చుకొన్న సీమ ఫ్యాక్షనిస్టుల వరకో యీ రచయిత ఆగిపోవడం లేదు. 'శ్రీబాగ్ ఒడంబడికను చిత్తుకాగితంగా మార్చిన పెద్ద మనుషులతో కలసి నడవడం' గురించి, నాలుగు కాసుల కోసం భాషను, సంస్కృతిని రాక్షసంగా మార్చి వెక్కిరించిన వారితో, పదవులు విసిరి ప్రాజెక్టులు కొల్లగొట్టిన పెద్దన్నలతో సహజీవనం చేయడం' గురించి, 'మీసాల మీద నిమ్మకాయలు నిలబెట్టడం మాని, గంజి మెతుకుల కోసం గళం విప్పి ప్రశ్నిద్దాం' (ఒక ఆలింగనం కోసం) అని హెచ్చరిస్తున్నాడు. కోస్తా వలస ఆధిపత్యాలకి తలుపులు తెరచి వాళ్ళు విసిరిన అదనపు పెట్టుబడులకు అమ్ముడుపోయిన అన్ని రాజకీయ నాయకత్వాల ద్రోహాల్నీ హరికిషన్ ప్రశ్నిస్తున్నాడు. ఛిద్రమైన రాయలసీమ ముఖచిత్రాన్నీ, శిథిలమైన బతుకుల్నీ, సామాజిక, ఆర్థిక, రాజకీయ కోణాల నుంచి అధ్యయనం చేయడం వల్ల మాత్రమే అతనీ కథలు రాయగలిగాడని నేను నమ్ముతున్నాను.

రాయలసీమ జీవితాన్ని యథాతథంగా చిత్రించడం దగ్గర ఆగిపోకుండా, ఆ జీవితం అలా వుండడానికి కారణమైన ఆర్థిక, భౌతిక, సామాజిక, రాజకీయ శక్తుల్ని దృశ్యమానం చేయడానికి ప్రయత్నించడం వల్ల మాత్రమే అది సాధ్యమైంది. రచయిత సమకూర్చిన స్థానీయతా నేపథ్యమే తన కథలని 'కందనవోలు కథలు'గా తీర్చిదిద్దడానికి ముఖ్యమైన వనరుగా తోడ్పడింది. కథల్లో సందర్భోచితంగా వాడే కర్నూలు ప్రాంత మాండలికం కూడా అందుకు అదనపు హంగుని జోడించింది. ఆళ్ళగడ్డ, గూళ్యం, బైరాపురం, తర్తూరు, గాజుల దిన్నె, కొండారెడ్డి బురుజు, కాల్వబుగ్గ, యస్టీ బీసి కాలేజి, కందేరి, బండిమిట్ట, సి.క్యాంప్... యీ ప్రాంతాలన్నీ కథల్లో అత్యంత సహజంగా వొదిగిపోయి ఆ వాస్తవికత సాధిస్తాయి.

ఉన్నత విద్య నభ్యసించిన ఉపాధ్యాయుడిగా స్వీయ అనుభవాన్నీ, సామాజిక అవగాహననీ కథలుగా మలిచే సందర్భాల్లో సైతం హరికిషన్ తన నేల వాసనని వదులుకోలేదు. మన విద్యా వ్యవస్థలో రోజురోజుకీ పెరిగిపోతున్న అసమానతల్నీ, జడలు విచ్చుకున్న అమానవీయతనీ, పాతుకుపోయిన అవినీతినీ, అసంబద్ధమైన పోటీనీ దగ్గరగా చూస్తూ అందులో యిమడలేని వూపిరాడనితనంలోంచి... తీవ్రమైన ఆవేదనకి లోనై అతను రాసిన కథలు వొక డజను వరకూ వున్నాయి. చాలామంది ఉపాధ్యాయ రచయితలు చేయని పనిని వొక సామాజిక ఆచరణలో భాగంగా నిర్వర్తిస్తున్నందుకు డా. ఎం. హరికిషన్ని నా వరకు నేను బహుధా అభినందిస్తున్నాను.

ప్రపంచీకరణ ద్వారా మనం కోల్పోతున్నదాన్ని కాపాడుకోవాల్సిన వాటిని కూడా హరికిషన్ స్పష్టంగా గుర్తించాడు. గ్లోబల్ సందర్భంలో సాంస్కృతిక పరాయీకరణ అతణ్ణి ఎక్కువగా బాధించింది. అందుకే అతను రాయలసీమ పల్లెపట్టుల్లో లభించే జానపద గేయాల్నీ, కథల్నీ పిల్లల కోసం సేకరించి ప్రచురిస్తున్నాడు.



కులం – మతం – ప్రాంతం – జెండర్ నిర్దిష్టతల్లోంచి వస్తువైవిధ్యంతో తీర్చిదిద్దిన తన కథలకి ప్రాణభూతమైన అంతస్సూత్రం (యాంకరింగ్ పాయింట్) మాత్రం వొక్కటే – వ్యవస్థీకృతమైన అసమానతలపై తీవ్రమైన క్రోధం, సమస్త ఆధిపత్యాలపై నిరసన. అదే రచయితగా హరికిషన్ ప్రాపంచిక దృక్పథం. ఆ దృక్పథం వల్లే అతను ఐక్యత – సంఘర్షణ సూత్రాన్ని అన్వయించుకొంటూ అనేక నిర్దిష్టతల్లోంచి సాధారణీకరణం వైపు పయనిస్తూ గడ్డిపరకలో తాడు పేనుతున్నాడు.

కథా నిర్మాణంపై అతను తీసుకొనే శ్రద్ధ ముచ్చట గొలుపుతుంది. నిరాడంబర శైలీ, ముక్కుసూటి కథనం, వస్తు వైవిధ్యం, శిల్పం పేరున ప్రయోగాలు చేయకపోవడం, పాత్రోచితమైన భాషా ప్రయోగం చేస్తూనే కథనంలో సైతం తనదైన ప్రాంతీయ ముద్రని చూపే నైపుణ్యం, తన చుట్టూ వున్న సమాజంలోని గతిశీలతని భిన్న పార్శ్వాల నుంచి విశ్లేషించగల యెరుక, స్వీయ జీవితానుభవాలను ప్రగతిశీల ప్రాపంచిక దృక్పథం నుంచి వ్యాఖ్యానించే నేర్పు, స్థానీయతకి పెద్దపీట వేసి వొక వాతావరణాన్ని నిర్మించే జాగరూకత, మానవీయ స్పందనల్ని – వుద్వేగాల్ని నిర్దిష్ట సామాజిక సందర్భం నుంచి చూడగల సంయమనం, 'కథా సమయం' వంటి సంస్థల ద్వారా పెంచుకొన్న సద్వివేచనా రచయితగా హరికిషన్ కూడగట్టుకొన్న బలాలు. ఇవి భవిష్యత్తులో మరింత పదునెక్కుతాయని ఆశంస.

కర్నూలు జిల్లా చరిత్రకారుడిగా, బాల సాహిత్యకర్తగా, జానపద సాహిత్య సేకర్తగా – పునఃస్రష్టగా, కథా రచయితగా తనకంటూ వొక గుర్తింపు తెచ్చుకొన్న డా. హరికిషన్ నుండి కర్నూలు ప్రాంత సమగ్ర సామాజిక చరిత్రకి అద్దం పట్టే మంచి నవలని ఆశించడం తప్పు కాదేమో!

సీమ నవల అనకుండా కర్నూలు నవల అనటానికి కారణం – కర్నూలు నుంచి హరికిషన్ని విడదీయలేకపోవడమే!

**– ఎ.కె. ప్రభాకర్**

# సాహిత్య వార్తలు

## తంగేడు - కథల పోటీ విజేతలు

తెలంగాణ జాగృతి అధ్వర్యంలో కొనసాగుతున్న తంగేడు సాహిత్య పక్షపత్రిక ప్లవనామ సంవత్సర ఉగాది కథల పోటీలో విజేతల పేర్లను ప్రకటించారు. కోట్ల వనజాత 'మైదాకు వసంతం' కథకు, ప్రథమ బహుమతి రూ.20,000, ద్వితీయ బహుమతి పెద్దింటి అశోక్ కుమార్ కథ 'దూరం'కు, రూ10,000, తృతీయ బహుమతి పులికొండకు వోతంరా, పీ.వి.ఆర్. శివకుమార్ కథకు రూ. 5,000 లభించింది. ఈ కథల పోటీలకు న్యాయనిర్ణేతలుగా వ్యవహరించిన ఆడెపు లక్ష్మిపతి, గుడిపాటి, వెల్దండి శ్రీధర్ గార్లకు కృతజ్ఞతలు.

*– కల్వకుంట్ల కవిత, ఎడిటర్, తంగేడు, సాహిత్యపక్ష పత్రిక*

## రంగినేని ఎల్లమ్మ సాహిత్య పురస్కారం ఎంపిక కోసం...

2021 సంవత్సరానికి గాని రంగినేని ఎల్లమ్మ సాహిత్య పురస్కారం ఎంపిక కోసం 2019, 2020, 2021 సంవత్సరాలలో ప్రచురించబడిన తెలుగు కవితా సంపుటాలను తేది 16, నవంబర్ 2021లోపు పంపగలరు. విజేతకు అవార్డు కింద 25000/- నగదు, జ్ఞాపిక పురస్కార పత్రం అందజేయబడతాయి. జనవరి 2022 సంఎలో రగినేని ట్రస్టులో నిర్వహించే ప్రత్యేక కార్యక్రమంలో ఈ పురస్కారం ప్రదానం ఉంటుంది.

**కవితల సంపుటాలు పంపవలసిన చిరునామా:**

**అధ్యక్షులు, రంగినేని ఎల్లమ్మ, సాహిత్య పురస్కారం-2021 రంగినేని సుజాతా మోహన్ రావు, ఎడ్యుకేషనల్ & చారిటబుల్ ట్రస్టు, బాలాజీ నగర్ సిరిసిల్ల-505301, రాజన్న సిరిసిల్లా జిల్లా.**

## సహృదయ సాహితీ పురస్కారం 2020 కోసం
## తెలుగు సాహిత్య విమర్శ గ్రంథాలకై ఆహ్వానం

వరంగల్లు లోని సహృదయ సాహిత్య సాంస్కృతిక సంస్థ 1996 నుండి ప్రతి సంవత్సరం సుప్రసిద్ధ సాహితీమూర్తులు కీ.శే. ఒద్దిరాజు సోదరకవుల స్మృత్యంకంగా "సహృదయ సాహితీ పురస్కారాన్ని" అందిస్తున్నది. నవల, కథ, వచనకవిత, పద్యకవిత, సాహిత్య విమర్శ ...విభాగాలలో ప్రతిసంవత్సరం ఒద్దిరాజు వేణుగోపాలరావు గారి సౌజన్యంతో అందిస్తున్న ఈ ప్రతిష్ఠాత్మక పురస్కారాన్ని 2020వ సంవత్సరానికి గాను తెలుగు సాహిత్య విమర్శ గ్రంథాల మూడు ప్రతులు 2021 నవంబరు 30 లోగా కుందావజల కృష్ణమూర్తి సాహిత్యకార్యదర్శి, శ్రీమాత ప్లాటు నం: 207, ఇంటి నం: 02-07-580, సెంట్రల్ ఎక్సైజ్ కాలని హనుమకొండ-506001, సెల్ నం. 9840366652 కు పంపవలసిందిగా కోరుతున్నాము. 2022 ఫిబ్రవరిలో జరగబోయే రజతోత్సవాలలో పురస్కార గ్రహీతకు రూ.10000/లు జ్ఞాపిక, శాలువాలతో సహృదయ సత్కరిస్తుంది

*– గన్నమరాజు గిరిజామనోహరబాబు, అధ్యక్షులు*

## ప్రకటనలకు ఆహ్వానం

వివిధ సాహిత్య సంస్థలు నిర్వహించే పోటీల, పురస్కారాల సమాచారాన్ని ప్రచురించడానికి పాలపిట్ట సిద్ధంగా ఉన్నది. పురస్కార విజేతల వివరాలు, ఫోటోలు కూడా పంపిస్తే మంచిది.



# దర్భశయనం శ్రీనివాసాచార్య కవితలు

*నిండైన కవితా హృదయం గల కవులు ఎక్కడ వున్నా, ఏ దేశంలో వున్నా, ఏ నేల మీది ప్రకృతిని, జనాల జీవనసరళిని చూసినా స్పందించడం సహజం. కనుకనే ఈ ఏడాది ఏప్రిల్ 23 నుంచి జూన్ నెల 22వ తేదీ వరకు అమెరికాలో గడిపిన సుప్రసిద్ధ కవి దర్భశయనం శ్రీనివాసాచార్య అక్కడి జీవన సంరంభానికీ, ప్రాకృతిక శోభకీ ముగ్ధులయి అనేక కవితలు చూశారు. వారి హృదయ స్పందనలనీ, అనుభూతులనీ ప్రతిఫలించే కొన్ని కవితలు 'పాలపిట్ట' పాఠకులకు ప్రత్యేకం.*

## దృశ్యాలూ, చింతనలూ ఏ బ్లూమింగ్టన్, అమెరికా

**1**
వెళ్తూ వెళ్తూ గాలి
చెట్టు నుంచి కొన్ని పూలను
దోచుకుని వెళ్ళింది
ఇక మిగిలిన జ్ఞాపకాలతోనే
ఆ చెట్టు!

**2**
దూరాన
ఓ ఇంటి చుట్టూరా గడ్డి కొసల్ని
యంత్రమొకటి కత్తిరిస్తున్నది
ఏ తడిగాలీ తాకకపోయినా
ఇక్కడ ఈ చెట్టు వణికిపోతున్నది
బహుశా గడ్డి గాయాల చప్పుడుకేమో!

**3**
శూన్యంలా నిస్తేజంగా వున్న
వాకిట్లో ఇపుడే ఓ పక్షి ఈక
రాలి పడింది
అది ఒక ఆకాశం ముక్క!

**4**
కంటికెదురుగా వాకిట్లో
ఒక భారీ కారూ
ఆ పక్కనే ఓ చిన్న సైకిలూ
కారు ఖరీదుదని తెలుస్తున్నది, అంతే!
సైకిల్ మాత్రం
హుషారైన పిల్లాడిలా కన్పిస్తున్నది

**5**
ఇన్ని మూసిన తలుపుల వెనక
ఎంత వెలుతురో!
ఎవరూ తలుపు తెరవడం లేదు
నాకు ఏ వెలుతురూ అందడం లేదు!

**6**
శీతల పగటి వేళ
బయటకు వెళ్ళా –
ఎన్నో నీడలు, కొన్ని ఎండ పొడలూ దొరికాయి
నీడల్ని బయటే వదిలేసి
ఎండ పొడల్ని పొదివి పట్టుకొని
ఇంట్లోకొచ్చా –

**7**
గాలి ఆ ఇంటినీ ఈ చెట్టునూ
ఒకేలా తడుతున్నది
ఇల్లు కదలట్లేదు
చెట్టేమో ఊగిపోతున్నది
ఏది గొప్ప?
కదలనిదా కదిలేదా

**8**
సన్నగా వూగుతున్న
ఆ చెట్టు వూహల్ని
ఎట్లా పట్టుకునేది
దాన్నిపుడే తాకి వెళ్తున్న
సమీరాన్నడుగుతాను

**9**
ఎండ వణుకుతున్నది
ఈ మధ్యాహ్నం పూట –
దాన్ని గాయపరుస్తున్న
తడిగాలినిపుడు
నిలదీయాలి

**10**
నేలను ఓలలాడించడానికి
వాన మెత్తగా మెల్లగా
కురుస్తున్నది
చినుకుల్ని పూలలా రాలుస్తూ –
నేల పరవశాన్ని సాంతంగా విప్పి చెప్పే
కవి ఇంకా పుట్టలేదు

**11**
ఆకులే లేకుండా వొంపుల శాఖల్తో
పొడుగ్గా నిలబడ్డ చెట్లు –
వాటి కొసల్లో ఎన్నెన్ని
సన్న సన్నని చేతివేళ్లో –
చెట్ల వెనకాల
మబ్బు పట్టిన భారీ ఆకాశం –
చిత్రకారుడు లేకుండానే
అపుడపుడు
చిత్రాలు పుడతాయి సుమా !

**12**
రాలిన పూల చరిత్రను
నేల చదువుకుంటున్నది
అటుగా ఎవరూ వెళ్ళకండి
దాని ధ్యానం చెదిరిపోవచ్చు

**13**
నీడలు
చెట్టు దేహంలోనే
నివసిస్తాయి !
సూర్యుడొచ్చినపుడు వెచ్చబడ్డానికి
బయటికొచ్చి వాల్తాయి అంతే!

**14**
రోడ్డు మీద
మిగిలిన ఈ కాసిన్ని నీళ్ళు
ఏ వాన తాలూకువి?
కొన్ని విషయాలు మనక్కాదు
ఆకాశానికే తెలుస్తాయేమో !



**15**
ఆ ఇంటినానుకుని
పచ్చని గడ్డి తివాచీ
గులకరాళ్ళ గరుకుతనమూ–
ఇంటిలోపలి బతుకును
పరిసరాలు చెపుతున్నాయి
మెత్తగా గరుగ్గా!

**16**
ఆ ఇంటి చూరులో
పగటిపూట వెల్గుతున్న
దీపం కన్నును
ఎవరూ గమనించడం లేదు
వేళా పాళా తెలియకపోతే
వెలుతురుకూ దిక్కుండదు

**17**
ఆ వరస డబ్బాలు కళ తప్పి
వున్నాయి ఖాళీగా ఇప్పటిదాకా!
అతనొచ్చి ఉత్తరాల్ని వేసాడు
అంతే!
వాటికి జీవకళ వచ్చింది అమాంతంగా!



18
ఇన్నిన్ని ఇన్నిన్ని చెట్లిక్కడ –
దేని మీద వాలాలో తేల్చుకోలేక
గాల్లోనే గింగిరీలు కొడుతున్నదీ పక్షి!
ఆప్షన్లు ఎక్కువున్నా
అవస్థలే కాబోలు!

19
వరుసగా ఒకే నమూనా ఇళ్ళు
వరుసగా పలు నమూనాల కార్లు
ఏ అలికిడీ లేదు ఈ వేళ!
ఒక్క మనిషి నమూనా కూడా
ఇపుడిక్కడ కానరాదు

20
ఈ ప్లే ఏరియాలో
పిల్లల సందడీ, స్వచ్ఛతా –
సందడి మాత్రమే వున్న
మన ప్రపంచానికి స్వచ్ఛత అందేదెలా
ఇంటింటినీ
ప్లే ఏరియాగా మార్చాల్సిందే!

## తెల్ల చెర్రీ పూల చెట్టు

పూసినప్పుడు
దీనిది చెదరని
ధవళ తపస్సు
ప్రశాంతత తప్ప
మరేమీ ఎరుగని
ముని వాలకం

ఊర్ధ్వంగా శాఖలు
లేచిన హస్తాలు
నింగికి ప్రార్థనలు

చూపు సోకితే
వాడిపోయేంత
మృదుల సోయగం

పువ్వు సోకులు
అయిదు రేకులు
లలిత శ్లోకాలు



వూగితే హొయలు
నిలిచినా హొయలే
హొయలు దీని శైలి

సౌందర్య శిబిరం
పత్రాల అంచులు
కళాత్మక చిత్రికలు

కనులకు ఉత్సవం
మనసుకు ఉల్లాసం
దారికి అభిషేకం !

## అదే!

దేశం దాటి మరో దేశంలో వాలినా
అక్కడా
అదే నేలా అదే ఆకాశమూ !
నేల ఎగిరి పైకి పోలేదు
ఆకాశం దిగి కిందికి రాలేదు

దేశం దాటి మరో దేశంలో వాలినా
అక్కడా
అవే చెట్లూ, అవే నదులూ!
చెట్ల వేళ్ళు ఊర్ధ్వంగా వెళ్ళడం లేదు
నదుల కాళ్ళు ఎగువకెక్కడం లేదు

దేశం దాటి మరో దేశంలో వాలినా
అక్కడా
అదే గాలీ అదే నిప్పూ!
గాలి ఘనీభవించడం లేదు
నిప్పు మంచు ముద్ద కావడం లేదు

దేశం దాటి మరో దేశంలో వాలినా
అక్కడా
అవే పొలాలూ అవే ఇళ్ళూ!
పొలాల్ని కంప్యూటర్లు దున్నడం లేదు
ఇళ్లను ఉపగ్రహాలు కట్టడం లేదు

దేశం దాటి మరో దేశంలో వాలినా
అక్కడా
అదే మనుషులూ అవే పక్షులూ!
మనుషులు గాల్లో నడవడం లేదు
పక్షులు రెక్కల్ని వొదులుకోవడం లేదు

దేశం దాటి మరో దేశంలో వాలినా
అక్కడా
అదే ప్రాణం అదే మరణం
ప్రాణానికి శాశ్వతత్వం లేదు
మరణానికేదీ అతీతం కాదు

*కవి సెల్: 94404 19039*



## సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు కెంగార మోహన్

తెలుగు భాషా సాహిత్యరంగాల్లో విశిష్టమైన సేవ చేస్తున్న అభ్యుదయ సాహిత్య సంస్థ సాహితీస్రవంతి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అధ్యక్షులుగా కర్నూలు జిల్లాకు చెందిన కెంగారమోహన్‌ను రాష్ట్ర కమిటీ ఏకగ్రీవంగా ఎన్నుకోవడమైనది. ఈ సందర్భంగా జరగిన సమావేశం రాష్ట్ర కార్యదర్శి వర్గాన్ని పునర్వవస్థీకరించింది. ఇప్పటివరకు బాధ్యతల్లో ఉన్న సత్యరంజన్ ప్రధానకార్యదర్శిగా కొనసాగుతారు. అధ్యక్షులుగా ఎన్నికైన కెంగార మోహన్ సాహితీస్రవంతి ఆవిర్భావం నుంచి సాహితీ స్రవంతిలో కర్నూలు జిల్లాలో సామాన్య కార్యకర్తగా, జిల్లా సాహితీ స్రవంతి కో– కన్వీనర్ గా జిల్లా ప్రధాన కార్యదర్శిగా పనిచేస్తూ రాష్ట్ర కమిటీ సభ్యులుగా, సాహిత్య ప్రస్థానం సంపాదక మండలి సభ్యులుగా అంచెలంచలుగా వివిధ బాధ్యతల్లో పనిచేశారు. సాహిత్య కార్యకర్తగా విస్తృతమైన సాహిత్య కార్యక్రమాలను నిర్వహిస్తూనే కవి, కథ, విమర్శ వంటి ప్రక్రియల్లో రాణిస్తున్నారు. వృత్తిరీత్యా కర్నూలు జిల్లాలో తెలుగు ఉపాధ్యాయులు. ప్రపంచీకరణ, ప్రయివేటీకరణ, మతోన్మాదాలకు వ్యతిరేకంగా సాహిత్య ఉద్యమాన్ని నిర్మిస్తామని నూతన ఎన్నికైన అధ్యక్షులు ప్రకటించారు.





# నవరసభరితం- తెలంగాణ యక్షగానం

- కె.సురేష్
తెలుగు అధ్యాపకులు,
ప్రభుత్వ డిగ్రీ కళాశాల,
హయత్ నగర్, హైదరాబాద్

సాహితీ ప్రకర్ష, ప్రదర్శనా విధి కలిగిన ప్రక్రియగా విశిష్ట స్థానాన్ని ఆక్రమించింది తెలంగాణ యక్షగానం. నవరసభరితమై అటు పాఠకులను ఇటు ప్రేక్షకులను సమానంగా ఆకట్టుకొని ఆదరణీయమైంది. సంగీత, సాహిత్య, నృత్యాల మేళవింపుగా సంప్రదాయ కళారూపంగా వెలసింది. పౌరాణిక, రామాయణ, భారత, భాగవత, కాల్పనిక ఇతివృత్తాలతో రసరాజమై ఉగ్రుత లూగించింది. పండితులనే కాకుండా పామరులకు సైతం ఆకట్టుకుని సాంస్కృతిక వారసత్వాన్ని అందించింది.

తంజావూరు, ఆంధ్ర, కర్ణాటక యక్షగాన పద్ధతులను తోసిరాజని తెలంగాణలో యక్షగానం ప్రత్యేక రూపుదాల్చింది. భాషలో, భావంలో కొత్త పుంతలు తొక్కి సామాన్యుని దరి చేరింది. భాగవతం, వీధిభాగవతం, బాగోతం పేర్లతో పిలువబడుతూ కళారూపంగా తెలంగాణ అంతటా విస్తరించిన ఈ యక్షగాన మూలం జానపదం. జానపదుల ఆటగా పుట్టి, పండితుల మెప్పును, రాజాశ్రయాన్ని పొంది, దేశీ శైలులతో కూడిన శాస్త్రీయవిధానాన్ని అవలంబించి, ఒక సంప్రదాయ కళగా రూపాంతరం చెందింది. తెలంగాణ మారుమూల పల్లె నుండి పట్టణాల దాకా వినోద సాంస్కృతిక వికాస కళారూపంగా పరిఢవిల్లింది.తెలంగాణలో నిరక్షరాస్యులు సైతం, గురువుల మౌఖిక అభ్యసన ద్వారా ఎన్నో యక్షగానాలు కంఠస్థం చేసి ప్రతినిత్యం గానం చేస్తూ, సాత్విక, ఆహార్య, ఆంగిక, వాచికాభినయాల ద్వారా యక్షగాన ప్రదర్శనలను రక్తి కట్టించి, పాత్రలో లీనమై నవరసాలను అవలీలగా పోషించినట్లు తెలుస్తున్నది.

## యక్షగానం సంగీతం

యక్షగానం శబ్దం వినగానే ప్రధానంగా గానకళా ప్రక్రియకు సంబంధితమైన శబ్దంగా వినిపిస్తుంది. 12వ శతాబ్దంలో పాల్కురికి సోమనాథుని పండితారాధ్య చరిత్రలోని వర్ణనలో యక్షవిద్య, యక్షగానం ప్రాకృత శబ్దాలు ఆయా ప్రాంతాల దేశీ గానకళా ప్రక్రియలుగా ప్రశంసిస్తూ, అనాదిగా వస్తున్న వినోద కాలక్షేపంగా చెప్పారు. అసలు సంగీత చరిత్రను బట్టి యక్షగానం సంగీతంలో ఒక ముఖ్య భాగమని చెబుతారు సంగీతకారులు.

తెలంగాణ యక్షగానాల్లో ముఖ్య వాయిద్య పరికరాలుగా మద్దెల, తాళాలు, గజ్జెలు కొన్ని కళాబృందాలవారు హార్మోనియం అంతకుముందు శృతి కోసం 'బుర్ర'ను ఊదేవారని తెలుస్తోంది. సందర్భానుసారంగా డప్పులు, కొమ్ములు, బూరలు మొదలైనవి ప్రదర్శనను రక్తి కట్టించేందుకు ఉపయోగించేవారు.

## యక్షగానం- సాహిత్యం

యక్షగానాలు ప్రప్రథమంగా ఎటువంటి వ్యాకరణ భద్రత లేకుండా ఒక ఆటవిక జాతివారి జానపద కళారూపంగా వెలుగు చూసింది. క్రమంగా ఒక కథాగేయ ప్రక్రియగా, పరిణామవికాసంలో సంవాదం, దరువులు, కీర్తనపద్ధతిలో రచనలు కొనసాగాయి. వీటితోపాటు ద్విపదలు, కందములు మొదలైన దేశి ఛందస్సులు చోటుచేసుకున్నాయి. జానపదుల కథాగానాల్లో సంగీతం, సాహిత్యాల కన్నా భావప్రకటన పట్ల శ్రద్ధ చూపుతారు. వీటిలో కథాక్రమం, పాత్రలతీరుకు ప్రాధాన్యమిస్తారు. అందువల్ల రసపోషణకు అవకాశం అధికంగా ఉంటుంది. ఈ కథలు నాయకుని చుట్టూ అల్లుతూ చెబుతారు. కొన్ని సందర్భాల లో ఈ పాటకు అనుగుణంగా చిందులు వేస్తూ నృత్యంచేస్తూ పాటలోని భావాన్ని అందులోని పాత్రలను తమపై ఆరోపించుకొని నటించేవారని తెలుస్తోంది.

## యక్షగానం-వస్తు వైవిధ్యం

తెలంగాణ యక్షగానాలలో రచయితలు వస్తువు మీద విభిన్న ప్రయోగాలు చేసినట్లు చూడవచ్చు. రామాయణ, భారత కథలే కాకుండా కాల్పనిక కథలు, మహాపురుషుల కథలు, జానపదవీరుల కథలు వారివారి సంప్రదాయాల్లో జొప్పించుకుని జానపదకథాగేయ ప్రక్రియగా పెంపొందించారు.

యక్షగానాల్లో కాల్పనికాల సంఖ్య అధికంగానే కనిపిస్తుంది. అనేక పౌరాణిక చారిత్రక అంశాలను చిత్ర విచిత్రమైన కల్పనలు జోడించి, పాఠకులను ప్రేక్షకులను ఆకట్టుకుని, అబ్బురపరిచే ప్రయత్నం బాగానే జరిగింది.

## యక్షగానం-రసపోషణ

ఉదాత్తమైన నాయకపాత్రల ద్వారా రచయితలు వీర, శృంగార, కరుణ, రౌద్రరసాలను పండించి, నాయిక పాత్రలు ఎక్కువగా కరుణ, శృంగారాలకు పరిమితమైనట్లు గమనించవచ్చు. ప్రతినాయక పాత్రలు, అద్భుత సన్నివేశాలు, కథలో సందర్భానుసారంగా వచ్చే ఇతర పాత్రల ద్వారా మిగిలిన రసములు వెల్లడి అయినట్లు కనిపిస్తుంది. హాస్యరసం అప్పుడప్పుడు తొంగిచూసినను, హాస్యము కొరకు ప్రత్యేక పాత్రలనే సృష్టించినట్లు తెలుస్తోంది. తెలంగాణ యక్షగానాల్లోని నవరసభరితమైన కొన్ని పాత్రలను, సన్నివేశాలను పరిశీలిద్దాం.

## శృంగార రసం

యక్షగానాలు ప్రధాన కథతో పాటు, సన్నివేశానుకూలంగా నాయకానాయికల శృంగారచేష్టలు, సరససల్లాపాలు ఉన్ననూ, కృష్ణలీలలు, కాళింగమర్దన, అల్లిరాణిచరిత్ర, కనకతార, ఉషాపరిణయం, చంద్రహాసచరిత్రం, తారాశశాంక నాటకం మొదలగు వాటిలో సంపూర్తిగా శృంగారరసం తొణకిసలాడుతుంది.

సృష్టిలో శృంగారమంత తీయనిది లేదు. అంత బలవత్తరమైన శక్తి లేదు. అది ఒక మధురమైన మానసిక ప్రక్రియ. అందుకే ఆనందవర్ధనుడు "శృంగార ఏవ మధురః పర ప్రహ్లాదనో రసః అన్నాడు.

యక్షగానాలలో నాయికా నాయకుల శృంగారభరిత సంవాదాలు, విచ్చలవిడి పదగుంఫనాలు, అమలిన శృంగారభావనలు,జానపదజావళీలు విరివిగా కనిపిస్తాయి. చుక్కాపురి కాళింగమర్దనలో శ్రీకృష్ణలీలలు, గోపికల ప్రణయకేళి పచ్చి శృంగారాన్ని ఒలకబోస్తాయి. చంద్రహాసచరిత్రలో చంద్రహాసుని తొలిచూపు లోనే వరించిన విషయకన్య అతని వలపుకై, పొందుకై పడే ఆరాటపడే సన్నివేశం వరూధినీ ప్రవరాఖ్యుల సరస సంభాషణలను సాక్షాత్కరింప చేస్తుంది.

**వాదం - దర్పు - ఆది**



విషయకన్య: చలమేల సుందరాంగ : వలరాజు కేళిలో చెలగూచు గూడు సంపెగ పువ్వుల శయ్యలో

చంద్రహాసుడు: మగువ నీవిట్లు బల్క మరియాదయేలనే: జగతి మానవులు విన్న తగదానియందురు

చం: కన్యా నీ వార్తవింటి తిన్నగ బల్కవే । అన్యుడ నిప్పుడు నన్నంట జెల్లదే

విష: అన్యుడవు గావు నాకు అత్యంత భర్తవి; మన్ననజేసి సరసమాడు యీ వేళను । చల ।

చం: మానిని యిట్టి బుద్ధి మానవు యెందుకే ! మీనాక్షి నాదు పురము నేను బోయెదనే । మగు

విష: మీరుబోయిన వెనుక । మీతోడ వచ్చెదా ! నేరముగాదు రాజ నామాట, వినుమికా ॥ చం ॥

చం: నాతోను పురమువస్తే నవ్వేరు జనములురీ॥ మాతంతడ్రి కోపమొందు మదవతి యేలను ॥ మగు

విష: కోపమొందితే నాతో । కుసుమాస్త్రకేళి॥ నీ ప్రాపుగ గూడినన్ను పరగను బంపుమీ

చం: ధరను వేములవాడ హరిహరులకునూ । పరమభక్తుండ నేను పణతిరో చెల్లదూ ॥ మగు

**వాదం – దర్వు – ఆట**

విష: నరనాథ నీమది కరుగదేలనయ్య ప్రాణనాథ నే
విరహసాగరమున । విడిబడితి చూడు ప్రాణనాథా ।

చం: విరహమనెడి మాట । విడనాడవెందుకు సుందరాంగి । నీవు హరిని స్మరించితే । విరహతాపము దీరు సుందరాంగీ

విష: మకరధ్వజుడు బాణ నికరములను వేసె ప్రాణనాథా ! మనసు వికలమాయెను ముద్దు । లిక నివ్వవేమిక ప్రాణనాథా

చం: ముద్దులిచ్చుటకు నే పెద్దవాడను గాను సుందరాంగి । నన్ను రద్దిపాలు సేయ వద్దు విడుము సుందరాంగి ।

మనుచరిత్రలో వరూధినికి మాత్రమే అనురాగం ఉన్నది. కావున ఆ శృంగారము రసాభాసమని శిరోమణి సన్నిధానం వారి అభిప్రాయం. ఇందులో చంద్రహాసుడుకూడా విషయను ఇష్టపడతాడు కానీ పెద్దల అనుమతి లేనిది జత గూడటం తగదని వాదిస్తాడు.

## హాస్యరసం

యక్షగానాల్లో ప్రత్యేకించి హాస్యప్రధాన ఇతివృత్తాలు లేకపోయినా సందర్భాను సారంగా ప్రతి యక్షగానంలో ఏకథ అయినాసరే హాస్యాన్ని కల్పించుటకు కొన్ని ప్రత్యేక పాత్రలు కొనసాగించడం కద్దు. అల్లికాడు, సోడిగాడు అనే పేర్లతో ప్రత్యేకంగా హాస్యపాత్రలు సృష్టించడం జరిగింది. అలాగే ప్రధాని అంటే మంత్రి కూడా యక్షగానంలో ఒక కీలక పాత్ర. ప్రారంభం నుండి చివరి వరకు నాటక ఇతివృత్తంలో అంతర్భాగంగా అనేక సామాజిక సమస్యల్ని స్పృశిస్తూ, అప్పుడప్పుడు సున్నితమైన హాస్యంతో, కొన్ని పర్యాయాలు ఘాటైన హాస్యంతో ప్రేక్షకుల్ని నవ్విస్తూ ఉంటుంది ఈ పాత్ర."రాజువెడలె సభకు రాజు వెడలె రవితేజము లలరగ" అంటూ రాజుపాత్ర ప్రవేశం చేసేటప్పుడు, మంత్రి పాత్రకూడా రాజును అనుకరిస్తూ పాడుతూ, ఆడుతుంది. "రాజు వెడలే సభకు బదులుగా చొప్పకు లేదా సొప్పకు" అని పలకడంతో ప్రేక్షకులు పగలబడి నవ్వుతారు. ఈ ప్రధాని పాత్ర సంప్రదాయ నాటకాలు సూత్రధారుడు వంటిది. సత్యహరి శ్చంద్ర లో నక్షత్రకుడు, బాలనాగమ్మ లో తలారిరాముడు, ప్రహ్లాద చరిత్రలో చండా మార్కులు, ఉత్తర గోగ్రహణం ఉత్తరకుమారుని, కాళింగమర్ధనలో గోపబాలురచేష్టలు మొదలైన వాటిలో హాస్య ప్రధాన పాత్రలు ఎన్నో ఉన్నాయి అసలు యక్షగానమే వినోదప్రధానం కాబట్టి ఆటపాటలతో అలరించే పాత్రలు చూడవచ్చు.

## కరుణరసం

శోకస్పర్శ లేని జీవితానుభవం లేదు. అనుభవం కరుణాభావ స్పష్టములు అయితేగాని జీవితం పరిపూర్ణత పొందదు. సుఖమయమైన జీవితాన్ని ఆశించిన



మానవుడు జీవిత ప్రయాణంలో అనుకోకుండా సంభవించిన సంఘటనల ద్వారా కొన్నిసార్లు దుఃఖ పడవలసి వస్తుంది. ఒక వస్తువును ఆశించుటలో ఆనందం, అది దూరమైనప్పుడు కలిగే దుఃఖం, ఈ రెండు మానవజీవితంలో అవశ్యముగా అనుభూతి చెందుతాము. బాలనాగమ్మ చరిత్ర, కుశలవ నాటకం, హరిశ్చంద్ర నాటకం, పద్మవ్యూహం, బొబ్బిలిచరిత్ర మొదలైనవి కరుణరసా మృతములు. బాలనాగమ్మ చరిత్రలో పినతల్లి మాణిక్యాల దేవి పెట్టే బాధలు తట్టుకోలేక నవ భోజరాజు ఏడుగురు కూతుర్లు పడే వేదన.

**వాదం - దర్వు - ఆది**

మాణిక్యాల దేవి: సవతి బిడ్డలారా మీరు చక్కనైన పున్నమా
చిల్లి పోయిన కుండలోన నీరు నింపి తెండికా
బాలికలు: చిల్లి పోయినా కుండలోన నీరు ఎట్లా నిలుచునూ
దండములు పెట్టేదాము పంప బోకు మమ్ములా

తండ్రి నవభోజరాజు భార్య మాట కాదనలేక బిడ్డలను అడవిలో వదిలిపెట్టి వచ్చేసన్నివేశం కంటతడి పెట్టిస్తుంది.

## రౌద్ర రసం

"యుద్ధప్రహార ఘాతన వికృతచ్ఛేదనవిదారరైశ్చవ
సంగ్రామసంభామాద్వైరేభి సంజాయతే రౌద్రః" అని భరతముని చెప్పినట్లుగా రౌద్రము నందు ఉగ్రతయే ప్రధానము.

యక్షగానంలో మహాభారత యుద్ధ సన్నివేశాలు అనేకముగా ఉండుట చేత భీమార్జునులు, కర్ణదుశ్శాసనులను వధించినతీరు మదిలో మెదలును. నరసింహస్వామి హిరణ్యకశపుని చీల్చివేసిన విధానంలో క్రోధము కట్టలు తెంచుకుంది. కర్ణదుశ్శాసన వధలో భీముడు దుశ్శాసనునిరొమ్ముపై కూర్చుండి

దర్వు–మత్తకోకిల.
సంతసమ్మున దుస్ససేనుని; సాహసంబున యురమికన్
కుంతికొమరుడు చీల్చి రక్తము; గ్రోల సాగెనుక్రోధుడై
వింతగా సురలెల్ల భీముని; వినుతు సల్పిరి లెస్సగ
అంతరంగము నందు ఖేచరు;లాత్మలో వెరవొందగా...
యని క్రోధము శిఖరాయమానంలో పలికించబడింది.

కిరాతార్జునీయం, దుర్గావిజయం, బకహిడింబాసురవధ,వీరభద్రవిజయము, పరశురామవిజయం మొదలైన యక్షగానాల్లో తారాస్థాయికి చేరిన రౌద్ర రసం మనము చూడవచ్చు

## వీర రసం

ఉత్సాహం ఉత్తములందు దీపించు సత్త్వగుణం. కానీ ఉత్సాహము ధర్మబద్ధముగానిచో వినాశహేతువగును. ఉత్సాహము, పూనిక, విషాద రాహిత్యం, విస్మయం, వ్యామోహం లేకుండుట వలన వీరరసము జనించునని తాత్పర్యం. గయోపాఖ్యానంలో కృష్ణార్జునుల యుద్ధఘట్టములో వీరరసం ఉట్టిపడుతుంది.

## భయానక రసం

భయానకంగాని, శాంతముగాని, అద్భుతరసం గానీ కావ్యాలలో ప్రధాన రసంగా ఉండవు. ఎక్కడో ఒక దానిలో తప్ప అవి చాలా వరకు అంగరసములుగా పోషింప బడును. భయానకం వికృతమైన ధ్వనులు, క్రూరజంతువులను చూడడం వల్లగాని, యుద్ధము, అడవిలోన సంచారము వల్లగాని, రాజుకు, గురువుకు అపరాధము చేయుట మొదలగు వాటివలన కలుగును. జానపద కథలు కలిగిన యక్షగానాలు క్రూరమృగాల సందర్శనము వలన, రాజు కఠినమైన శిక్షలు విధించడం మొదలగు సన్నివేశాలు అనేకం. కీచకుని బాధలకు తాళలేక అక్క సుదేష్ణ, ద్రౌపది భయభ్రాంతులకు గురికావటం కనిపిస్తుంది. బాలనాగమ్మలో చాకలి తిప్పడు పులిని చూసి భయపడి పారి పోవుట మొదలైనవి ఎన్నో చూడగలం.

## బీభత్స రసం

బీభత్సరసమునకు స్థాయిభావం జుగుప్స. సహృదయునకు రోత పుట్టించు ఏ విషయమైనా బీభత్సరసమును జనింపజేయును. యుద్ధభూమిలో శత్రువులను హింసించి వీరులకు సైతం రోతకలుగునట్లు రక్తాన్ని ప్రవహింప చేయును గనుక అర్జునునికి బీభత్సుడని పేరు. పద్మవ్యూహం యక్షగానంలో అభిమన్యుడు హతుడైన తరువాత అర్జునుడు దివిటీ పట్టుకొని కొడుకుని వెతుకుటకు వెళ్ళినప్పుడు అక్కడ దృశ్యాలు అతి జుగుప్సాకరంగా వర్ణించబడ్డాయి. కీచకవధలో కీచకుని వికృత చావు, సీతా స్వయంవరంలో తాటకి విశ్వామిత్రునియాగశాలను పాడుచేసిన తీరు, మైరావణ చరిత్ర, పరశురామ విజయంలో బీభత్సరస ప్రధాన సన్నివేశాలు కనబడతాయి.

## అద్భుత రసం

అద్భుతమైన విషయమంతయు నాటకీకరణకు ఎంతో పనికివచ్చును. అతిమానుషచర్యలు ఆశ్చర్యం కలిగిస్తాయి. ఆ చర్యలను విశదముగా వర్ణించుట అద్భుతరసమును సృష్టించుటయే. అల్లిరాణిచరిత్రలో స్త్రీవేషంలో ఉన్న అర్జునుని రూపలావణ్యములకు యుద్ధనైపుణ్యానికి అల్లిరాణి ఆశ్చర్యపోతుంది. తరువాత సేదదీరుతూ నదిలో ఇద్దరం కలిసి స్నానంచేద్దాం అంటుంది. ముందే పురుష ద్వేషి అయిన అల్లిరాణితో అర్జునుడు ఎలా వేగుతాడని ప్రేక్షకులు ఉగ్గబట్టి చూస్తారు. కాళింగమర్దనలో గోవర్ధనగిరిని ఎత్తిన కృష్ణుని చూసిన రేపల్లెవాసులు, జనం ఆశ్చర్యంతో తిలకిస్తారు వాల్మీకిచరిత్ర, శశిరేఖపరిణయం, కృష్ణగారడి మొదలైన యక్షగానాల్లో అద్భుత సన్నివేశాలు ప్రేక్షకులను సమ్మోహన పరుస్తాయి.

## శాంతరసం

శాంతం రసమగునాయని కొంత వివాదం నడిచింది. అనాది కాల ప్రవాహమున వచ్చు రాగద్వేషాలను సమూలముగా నాశనము చేయుట అసాధ్యము. కనుక రసస్థితిని పొందరనుట అసమంజసం. రాగద్వేషాలను విడిచి పరమ శాంతిని పొందిన మహనీయులు అనేకులు ఉన్నారు. కాబట్టి శాంతరసం శ్రవ్య, దృశ్య కావ్యాలలో ఉండవచ్చు.

యక్షగానాలలో వేదాంతసారం, భగవత్ గుణసంకీర్తనం ఉపదేశ రూపమున చెప్పబడింది.. సంసార తాపమును పోగొట్టి జీవులకు ఉపశమనం కలిగిస్తుంది. పోతులూరి వీరబ్రహ్మంగారి చరిత్రలో పూర్తిగా తత్వజ్ఞానచింతన, జీవిత పరమార్థం, చావుపుట్టుకలు, పరమపదం, కాలజ్ఞానం పారమార్థిక చింతన వైపు నడిపిస్తుంది.

ఈవిధంగా తెలంగాణ యక్షగానాలు నవరసభరితములై ప్రజల హృదయాల్లో విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకున్నాయి. కావ్యం, దృశ్యరూపకం వలన అలౌకికానందము కలుగుతుంది. కావున ఆనందం అనుభవించు పాఠకులు ప్రేక్షకులు ఆత్మానందం పొంది సహృదయంతో జగత్ కళ్యాణమునకు తోడ్పాటును అందించవలెను.











## విభిన్న ప్రక్రియల్లో పురస్కారాలు

పి. విజేందర్‌రావు సతీమణి కీ.శే. ఫీచర సునీతారావు జ్ఞాపకార్థం అందిస్తున్న అవార్డుల విజేతలను ప్రకటించారు. నూటెంకి రవీందర్ (అతడు అలిగితే కవితా సంపుటి), దేవనపల్లి వీణావాణి (శిలాఫలకం కవితా సంపుటి), కె.వి.నరేందర్ (కథమానం భవతి – కథ), ఎం.వి.రాంరెడ్డి (వెంటవచ్చునది – కథ), విహారి (వివిధ – విమర్శ), రూప్‌కుమార్ డబ్బీకార్ (అంతర్వీతం – విమర్శ) ఎంపికయ్యారు. త్వరలో నిర్వహించనున్న సభలో విజేతలకు అవార్డులు ప్రదానం చేయనున్నట్టు అవార్డు కమిటీ కన్వీనర్ ఒక ప్రకటనలో తెలియజేశారు.

## డా. వేదగిరి రాంబాబు కథానికా పురస్కారం - 2021



సింహ ప్రసాద్ సాహిత్య సమితి ఆధ్వర్యంలో నిర్వహించిన 'డా. వేదగిరి రాంబాబు కథానికా పురస్కారం–2021' విజేతగా రాచమళ్ళ ఉపేందర్ (ఖమ్మం) రచించిన 'విరుగుడు' కథానికా సంపుటి ఎన్నికైంది. అక్టోబర్ 14న రవీంద్రభారతిలో నిర్వహించే కార్యక్రమంలో పురస్కారం అందించనున్నట్లు సమితి కన్వీనర్ సింహప్రసాద్ ఓ ప్రకటనలో పేర్కొన్నారు.

## అమ్జద్, లేదాళ్ల రాజేశ్వర రావులకు పురస్కారాలు








తెలుగునాట సాహిత్య సేవ చేస్తున్న వారిని సత్కరించుకోవాలనే తలంపుతో పురస్కారాలు అందించాలని కథా, కవితా సంపుటాలను ఆహ్వానించాం. విభిన్న ప్రాంతాలవారు బాగా స్పందించారు. పురస్కార విజేతలు ఈ కింది వారు.

1) శ్రీమాన్ దగ్గుబాటి రాఘవయ్య చౌదరి, సీతమ్మ స్మారక కథా పురస్కారం - 2020 కు ఎంపికయిన కథా సంపుటి : పూల చాదర్, రచయిత : అమ్జద్, న్యాయ నిర్ణేత : శ్రీ ఈతకోట సుబ్బారావు, ప్రముఖ కథా రచయిత, నెల్లూరు. ఇది అమ్జద్ వెలువరించిన తొలి కథా సంపుటి.

2) శ్రీమాన్ గన్నమనేని కోటయ్య చౌదరి, మంగమ్మ స్మారక కవితా పురస్కారం - 2020 ఎంపికయిన కవితా సంపుటి : కందిలి, కవి: లేదాళ్ల రాజేశ్వర రావు, న్యాయ నిర్ణేత : శ్రీ పొత్తూరి సుబ్బారావు, ప్రముఖ కవివరేణ్యులు, హైదరాబాద్. ఈ కవితా సంపుటి కవి తొలి పుస్తకం.

ఈ రెండు పుస్తకాలను కూడా ప్రతిష్టాత్మకమైన 'పాలపిట్ట బుక్స్' ప్రచురణ సంస్థ నుంచి వెలువడటం గమనార్హం.

విజేతలిద్దరికీ ప్రకటించిన విధముగా రూ.5000/- చొప్పున వారి బ్యాంకు అకౌంట్స్ లలో జమ చేస్తున్నాము. కరోనా సమయం సద్దుమణిగిన తర్వాతవీరిని మా సహజ సాహితి, చీరాల వేదికగా ఘనంగా సత్కరిస్తాము.

*- గన్నమనేని విజయలక్ష్మి, గుంటూరు.*

*వడలి రాధాకృష్ణ, అధ్యక్షులు, సహజ సాహితి, చీరాల*

**స్పందన**

# దుస్తులు - ఒక సంచలనం

పాలపిట్ట మాసపత్రిక సెప్టెంబర్ 2021 సంచికలో వంశీకృష్ణ రాసిన 'దుస్తులు' కథ ఒక చిన్న సంచలనానికి దారితీసింది అనే చెప్పాలి. ఈ మధ్య కాలంలో నార్త్ ఇండియాలో ఒక పబ్ కి చీర కట్టుకొని వెళ్లిన ఆమెని allow చేయలేదు. అలాగే ఒక కాలేజీ లో modern dress వేసుకొని వచ్చిన యువతులను అనుమతించలేదు. అంటే స్త్రీ వేషధారణ ఆమె "ఇష్టం" కాదు, సమాజ పరమైనది అనే అభిప్రాయం వస్తోందా!!

ఈ కథలో ఆమె కొన్ని షోలలో పాల్గొంటుంది, కొన్ని ఈవెంట్స్‌కి యాంకర్‌గా ఉంటుంది, టీవీలోనూ సినిమాల్లోనూ చిన్న చిన్న పాత్రలు వేస్తూ ఉంటుంది. ఆ సమయంలో ఎలాంటి డ్రెస్ లు వేసుకుంటేనే TRP rates వస్తాయి - అన్నది ఆమె అభిప్రాయము, టీవీ యాజమాన్యం వారి అభిప్రాయము. అది ఎంతవరకు సమర్ధనీయం అన్నది ఒక కోణం.

ఆమె కొడుకు స్కూల్లో చదువుతున్న- మరీ చిన్న పిల్లవాడు కాదు, మరీ యువకుడు కాదు. (పన్నెండేళ్ల) వచ్చీ రానీ వయసు... వచ్చీ రాని జ్ఞానం. టీనేజ్ లోకి అడుగు పెట్టబోతున్న... హార్మోన్స్ చేంజ్ కాబోతున్న వయసు. పక్కవాళ్ళు, స్నేహితుల మాటల ప్రభావానికి లోనయ్యే వయసు. అమ్మ అంటే చాలా ప్రేమ ఉంది. కానీ తన ఫ్రెండ్స్ అనే మాటలకి ఆ అబ్బాయి సున్నితమైన మనసు దెబ్బతింది. అయోమయానికి గురి అయ్యాడు. అమ్మకి చెప్పాలని ప్రయత్నించాడు. కానీ ఆమె వినలేదు. ఆ వత్తిడికి, సంఘర్షణకి లోనై తన ప్రాణం తీసుకున్నాడు. అంటే కొడుకు అభిప్రాయం, వాడి మనస్సులోని అల్లకల్లోలం, ఆలోచనలను ఆమె గమనించకపోవడం.. తన వస్త్రధారణ కే ప్రాధాన్యం ఇవ్వటం.. కొంత ఆలోచించాల్సిన విషయం

ఈ కథ ఒక రచయిత్రి రాస్తే ఆమె అభిప్రాయం ఏమిటో, మన స్పందన ఏమిటో- కానీ ఇది రాసింది ఒక రచయిత. ('త' కి 'త్రి' కి తేడా ఉంటుందా అన్నది మరొక చర్చ అనుకోండి) కాబట్టి స్త్రీవాద కథ అని గాని, పురుషాధిక్యత కథ అని కానీ నిర్ణయించలేం. ముఖ్యంగా టీనేజ్ వారి సున్నితమైన భావాలు కూడా పరిగణనలోకి తీసుకోవాలి.

ఇది యదార్థంగా జరిగిన కథ అవునో కాదో మనకు తెలియదు. కానీ కథని కథగా తీసుకుందాం (కథ చదువుతుంటే ఒక ప్రముఖ యాంకర్ మన ఆలోచనలకు వస్తే అది రచయిత తప్పు కాదు)

ఏది ఏమైనా ఒక కథ ఇంత సంచలనానికి నాంది కావడం, చర్చించటానికి ముఖ్యమైన అంశం ఉండటం చాలా రోజుల తర్వాత ఈ "దుస్తులు" కథ తార్కాణంగా నిలిచింది. కేవలం తమ పేరు పత్రికలో చూసుకోవాలి అని తాపత్రయంతో మొదలు చివర తెలియకుండా అయోమయంగా వస్తున్న చాలా చాలా కథల్లో ఇది ఒక మంచి ఆలోచనాత్మక చర్చకు దారితీసే కథ అని నా అభిప్రాయం.

ఆమెకి భర్త ఉన్నాడు. కానీ అతనిని తెరమీదకు తీసుకు రాలేదు రచయిత. అది రచయిత ఉద్దేశపూర్వకంగా చేసిన కథాశిల్పం, ఒకానొక టెక్నిక్ ఏమో తెలియదు. అలాగే ముగింపు కూడా రచయిత తనకై తాను వచ్చి చెప్పకుండా పాఠకుల ఆలోచనకి వదిలివేయటం కూడా ఒక మంచి రచయిత లక్షణం అనిపిస్తోంది నాకు.

*- డా. సి హెచ్. సుశీల, రిటైర్డ్ ప్రిన్సిపాల్, గుంటూరు*

# సాలూరి వారి పాట చెరిగిపోని పచ్చబొట్టు సుగంధం

**– మొదలి పద్మ**

తెలుగు పాట సౌరభం రసరాజేశ్వరుని వైదుష్యం. ఏ భావాన్నైనా స్వరలహరులలో తేలియాడించడం, మనసున మల్లెల గుబాళింపై పరిమళింప చేస్తూ పలుకరించడం ఆ స్వరకర్త నైపుణ్యం.

చల్లగాలిలో యమునా తటిపై శ్యామసుందరుని మురళి.., పాట పాడుమా కృష్ణా.. అంటూ తనదైన శైలిలో సాగిన ఆ పాట, తదుపరి సినీ సంగీత జలధిలో అవధులు దాటిన జలపాతమైంది. ఎందరో రచయితల భావాలకు ఊపిరి పోసిన ఆ స్వరకల్పనా చాతుర్యం అద్వితీయం. అక్షర సమీరాలు వారి స్వరాల వేణువులో చేరి మదిలో వీణలు మ్రోగించాయి.

సాలూరి రాజేశ్వరరావు గారి స్వరసరోవరంలో అలా మదిని సేదతీర్చే సుస్వరాలు ఎన్నో. వారి స్వరవనిలో నడయాడే మణిమయూరాలు మరెన్నో. వారు చేసిన స్వర ప్రయాణంలోకి అలా ఒక్క సారి తొంగి చూస్తే మనసును సున్నితంగా మీటే వీణామృత రాగాలు, మురళీగానాలు, సితార్ వాదనలు, పియానో కదలికలు వంటి ఎన్నో నాదసమీరాలు ముచ్చటగా తారసపడతాయి.

ఏ రచయిత వాణినైనా తనదైన బాణీలో మధురంగా రసహృదయాలను సమ్మోహితులను చేసే స్వరకల్పన ఆ స్వరరాజు సొంతం. కమ్మని భావమే కన్నీరై చిందెను.. అన్న పదాన్ని ఎంత లలితంగా స్వరం చేశారో, మానవుడే మహనీయుడు అనే స్ఫూర్తిగీతాన్ని అంతే భిన్నంగా నడిపించారు.

యుగళగీతాలు, వీణపాటలు, జావళీలు, నృత్య గీతాలు, భక్తి పాటలు, హాస్య గీతాలు, సందేశాత్మక గీతాలు.. అన్నింటా తనదైన శైలి – ప్రావీణ్యం వారి ప్రత్యేకత. నవరసాలు ఆ బాణీలలోకి అలవోకగా నడిచివస్తాయి. సాహిత్యాన్ని అర్థం చేసుకుని, భావాన్ని లోతుగా అధ్యయనం చేసి స్వరాన్ని చేయడం వారి పాటకున్న సహజ లక్షణం.

భీష్మ చిత్రంలో మహాదేవ శంభో గీతంలో ప్రతీకార శక్తి ప్రసాదించరావా.. అన్నచోట తీవ్ర స్వరాన్ని, ప్రసన్నమ్ముకావా.. అన్న కరుణాపూరిత భావనను సాత్వికంగా మంద్రంగా ప్రయోగించటం అరుదైన ఆనందం. ఎవరవయా ఏ దివ్యభువి నుండి దిగి అన్న గీతంలో ఆరంభం చిరు అడుగుల సవ్వడిని అందంగా స్వరపరిచి చకితుల్ని చేశారు సాలూరి.

శ్రీకర కరుణాలవాల వేణుగోపాలా.., తెలుగు కీర్తి తేజరిల్లి అన్న తావున కీర్తి స్వరమై అంబరాన్నంటిన వైభవం ప్రస్ఫుటంగా వినిపిస్తుంది.

చిగురులు వేసిన కలలన్నీ గీతం గమనిస్తే అలల రాక లేదా అలల సడి యిలా ఎలా ఉపమానం



చేసుకున్నా పాట మొదలు స్వరాల కదలికల్ని ఆనందపుటలల ధ్యానంలోమేళవించి మనోరంజకంగా మదిని మీటిన అనుభూతిని కలిగిస్తారు స్వరకర్త.

ఈ మౌనం, అందాలరాణివే, చెలికాడు, కిలకిల నవ్వులు, ఓ సుకుమార, నిలువుమా నీలవేణి.. అనే గీతాలు మధురంగా పలుకరిస్తూ మన సమయాల్ని మధురం చేస్తాయి. ఆ రాగాలు వీనులకు వినిపించడమే కాదు సన్నివేశాన్ని మనోదర్శనం చేస్తాయి.

నిను చేర మనసాయెరా ఎంతో అద్భుతమైన జావళి. మన మనసుల్లో అలా చేరిపోతుంది. స్వరాల ఊయలలో ఊగాడుతున్న భావన. అందాల బొమ్మతో ఆటాడవా, నగుమోము చూపించవా, పిలిచినా బిగువటరా, రారా నా స్వామి రారా, బాలనురా మదనా.. నృత్యాభినయాన్ని అందంగా ఆవిష్కరించిన స్వరకేళీనర్తనలు.

ముత్యాల చెమ్మచెక్క నిజంగానే పదతులు



ఆనందాలకేళిలో తేలియాడుతున్న అనుభూతి తరంగం. ఆ గీతం రావడమే ఒక సంరంభాన్ని మోసుకొస్తుంది. అదే స్వరకర్త ప్రతిభ. సన్నివేశాన్ని – సందర్భాన్ని పరిపూర్ణంగా అవగాహన చేసుకుని స్వరపరిచిన తీరుకు చక్కని ఉదాహరణ. వారి స్వరాల కొలనులో యిటువంటి ముత్యాల సరులు ఎన్నో.

నిన్నలేని అందమేదో పాటలో, కనిపించని వీణలేవో కదలి మ్రోగెనే అన్న వాక్యంలో వీణా నాదాన్ని, సెలయేరులు కులుకుచు రాగా అన్నచోట సెలయేటి నడకల్ని స్వరాలపై ప్రయోగించిన తీరు రసరమణీయం. వినిపించని రాగాలే గీతం ఆరంభంలో వచ్చే ఆలాపన ఏవో లోకాల్లోకి తీసుకువెళుతుంది. వలచి వచ్చిన వసంతంలా ఎద మీటుతుంది.

ఇంతేరా యీ జీవితం.. తాత్విక గీతాన్ని కడు తాత్వికంగా స్వరపరచి మరోవంక అదే చిత్రంలో, మనసు మనసు కలిసే వేళ అన్న గీతాన్ని లలితంగా కోమలంగా స్వరపరిచారు. ఈ నల్లని రాలలో శిల ఉలికిపాటును ఉలి కదలికలలో నింపిన తీరు కమనీయంగా తోస్తుంది.

కనరాని దేవుడే గీతం మరో అద్భుతం. అల నీలిగగనాన అన్న భావనను నింగిలో విహరింప చేస్తూ, ఆనందబాష్పాల మునిగె నాచూపు అన్న అక్షరసమూహాన్ని నేలమీదకు జారవిడిచారు. ఆ గీతమే చివరలో నీ చరణ కమలాల నలిగిపోనీవా అన్న చింతనను నిజంగానే స్వరాల మలుపుల్లో నలిగిన భావనతో ముగిస్తారు రసరాజేశ్వరుడు.

కోయిల కోయని మరో ఆణిముత్యం ఈ గీతంలో చిరుగాలి కెరటాల తేలేను నేను.. అన్న చోట గమనించండి ఆ కెరటాలు అలా సుతారంగా మనల్ని తాకుతూ వెళ్లిన భావన అతిసహజంగా కలుగుతుంది. వారి స్వరాల తాలూకు గుభాళింపు అది. మన మనసు పొందే మైమరపూ అదే. పగలే వెన్నెల నిజంగానే పగలు వెన్నెలగా మారిన వైనం మనసును ఆహ్లాదపరిచే మలయసమీరం.

చూడుమదే చెలియా.. గీతంలో వినిపించే వేణువు అలౌకిక ఆనందం. వేణువులోంచి జాలువారే స్వరాల తేనెను అలా అరమోడ్పు కనులతో ఆలకించవలసిందే. అస్వాదించాల్సిందే.

మనసున మనసై మనసుని మరో లోకంలోకి నడిపించి జ్ఞాపకాల తీగల్ని నవరించి ఒక ఏకాంతంలో విడిచివెళుతుంది. ఇష్టమైన ఆనందం అది. మనసు కోరే ఆనందం. ఆ గీతంలో సితార్ నాదతరంగాలు మరీ ప్రత్యేకం. వీణ పాటలు సాలూరివారి ఖజానాలో దేదీప్యంగా ప్రకాశిస్తాయి. పాడెద నీ నామమే, ఏమని పాడెదనో, నీవు లేక వీణ, పాడమని, పాడవేల రాధికా, నీవు రావు, మదిలో వీణలు.. అన్నీ రసరాగప్రవాహాలే.

వారి స్వరయానాన్ని మలుపు తిప్పిన చిత్రం మల్లీశ్వరి. మాయాబజార్ చిత్రంలోనూ కొన్ని

పాటలు వారి స్వరపరిచినవే. మనసున మల్లెల విరబూసిన చందమే వారి స్వరపరాగం. ఘడియ యేని యిక విడిచిపోకుమా.. బేలత్వం గుండె నిండా నింపుకున్న స్వరాలవి. హృద్యమైన భావావేశాన్ని స్వరంలో పొదిగిన రాగపరిమళమూ అదే.

బృందావనమది అందరిదీ గీతం అపురూపం. హిందీలోనూ అదే బాణీని కొనసాగించటం మరీ అపురూపం. రాసక్రీడ ఇక చాలు మరో లావణ్య భరితగీతం.

చూచి చూచి కళ్ళు, ఏమిటి యీ అవతారం – సున్నితంగా అలరించే హాస్య భావనలు.

పాలకడలిపై శేషతల్పమున శయనించిన దేవదేవుని నన్నుతించిన స్వరతరంగము, నారాయణ మంత్రం అంటూ తాదాత్మ్యంగా శ్రీహరి చరణాల మోకరిల్లిన ప్రహ్లాదుని భక్తితరంగము అనంతమైన వారి స్వరప్రాభవానికి నిదర్శనాలు. భక్త ప్రహ్లాద పద్యాలు, ముగింపు నమో నారసింహా గీతం అత్యద్భుతాలు. ఆది అనాదియు నీవే దేవా.. మంగళంపల్లివారి గళంలో ఉవ్వెత్తుగా ఎగిసిన భక్తి తరంగం.

పొన్నలు పూచే బృందావనిలో వెన్నెల కురిసే యమునా తటిపై.. మంద్రంగా వీచే మృదుమధుర ధారలవి. గమకాలు వారి స్వరాలలో చిరుగాలి వెన్నంటి నడిచే విరిసోయగాలు.

ఆ స్వరాలు ఆకాశ వీధిలో హాయిగా విహరిస్తూనే నీటిలోన తొంగిచూసే కలువభామ హొయలును సున్నితంగా వివరిస్తాయి. నడిరేయి ఏ జాములో అన్న కరుణాపూరిత భక్తిచింతన, అవునా నిజమేనా అనే విరక్తి చింతన వారి బాణీలోని భిన్న చాతుర్యం. ఈ గీతం మొత్తం స్వగతంగా సాగుతూ ఒక నైరాశ్యపుజడిలోకి నెట్టివేస్తుంది.

చంద్రుడు – వెన్నెల, వీణ – నాదంలా వారి స్వరం సాహిత్యంలో ఒదిగిపోయి నిండుగా ప్రవహిస్తుంది. కొలను నీటిని పెనవేసుకున్న

పూతీవెలా, కన్నుల నీరిడి కలియచూచే ప్రేయసి అనురాగరాగంలా ఆ స్వరబంధం సాహిత్యంతో ముడిపడిన తీరు అమూల్యం. అనిర్వచనీయం.

సినీసంగీతవనిలో వారి పాట చెరగిపోని పచ్చబొట్టు సుగంధం. చెదిరిపోయిన హృదయంలో పదిలపరచిన మమతలు ఆ రాగాలవే.

కొరతలేని విరితేనెల భావనలు ఆ స్వరాలవే.

నా హృదయంలో నిదురించే చెలీ.. అని పలవరించినా, పూలబాణాన్ని మదిలో సంధించినా ఆ పాటకే సాధ్యం. వెన్నెలలోని వికాసాన్ని చలచల్లగా మనసున వెలిగించిన ఆ సుస్వరరాజుకు అభినందన మందారమాల. దిగంతాల అంచులకు వ్యాపించిన అనంతమైన వారి స్వరధారకు అభివందనాంజలి.

***అక్టోబర్ 11 వారి జయంతి సందర్భంగా యీ అక్షరాంజలి.***

***రచయిత్రి సెల్: 9248259622***

# కొన్ని గీతలు చెరిపేసుకోవాలి

అవి మన గుండెను
కోతకోస్తూ ఉంటాయి

కొన్ని గోడలు కూల్చేసుకోవాలి
అవి అడుగడుగునా
మనకు అడ్డు పడుతూ ఉంటాయి

కొన్ని జ్ఞాపకాల్ని మర్చిపోవాలి
అవి గతాన్ని
తోడి పోస్తూ ఉంటాయి

కొన్ని దారుల్ని చెరిపేసుకోవాలి
అవి ప్రయాణానికి
అడ్డు తగులుతూ ఉంటాయి

కొంతమందిని రద్దు చేసుకోవాలి
వాళ్లు మనల్ని తిరోగమనంలోకి
నడిపిస్తూ ఉంటారు

కొన్ని మనసుల్ని నింపేసుకోవాలి
అవి వర్తమానాన్ని
నడిపిస్తూ ఉంటాయి

కొన్ని స్మృతుల్ని నాటేసుకోవాలి
అవి జీవితాంతం
రాసేసిన పేజీల్ని తిరగేస్తూ ఉంటాయి

కొన్ని జీవితాల్ని పెనవేసుకోవాలి
అవి మన జీవనానికి
అర్థం చెబుతూ ఉంటాయి

కొంతమందిని
గుండె గూటిలో చేర్చేసుకోవాలి
వాళ్లు ఎందర్నో జీవితాంతం
ముందుకు నడిపిస్తూ ఉంటారు

***– మంచికంటి, 99495 35695***





# నాన్న వేలు

నా ఐదువేళ్ళతో
నాన్న వేలును పట్టుకొని
మొదటి అడుగులు వేసినప్పుడు
ప్రపంచం నా కాళ్ళకిందికి
వచ్చేసినంత సంబరపడ్డాను!

నన్ను భుజాన మోసిన నాన్న
నా భుజంపై చెయ్యేసి నడిచినప్పుడల్లా
తానిప్పుడు పిల్లోడినని గుర్తుచేస్తుంటాడు,
నేను నడిచే ప్రతిచోటల్లా
తన గుండెను పరుస్తుంటాడు!

ఇంటికి నాయకుడైనా
పనివాడిలా చక్కబెడుతూ
బంటులా కాపలా కాస్తుంటాడు,
అందరికీ అన్నీ ముడేసి
తానో మసిగుడ్డలా మారిపోతాడు!

అందరూ వదిలేసిన బరువులను ధరిస్తూ
ఎదురైన కష్టాలను తొడుక్కుంటూ
ఎప్పుడూ పాతమనిషిలా కనిపిస్తూ
మనకు కొత్తదనాన్ని అద్దుతాడు!

ఇవ్వడమే తెలిసిన నాన్న
నోరు తెరిచి అడగడం రాని అల్పజీవి,
బతికున్నప్పుడు ఇవ్వలేనివన్నీ
గోడమీద చిత్రపటమైనప్పుడు ఇస్తుంటాం!

కొండలా కనబడే నాన్న
గుండెలో మెదిలినప్పుడల్లా
కంటిచుక్కలా రాలిపడుతుంటాడు,
కళ్ళలో చూపంతా మాయమై
నాన్నే నిండిపోతాడు!

చేతగాని నాన్నను
ఎప్పుడో మూలన పడేసాం
కానీ, ఆయన ఎక్కడ ఉన్నా
ఆ వేలు మనల్ని కడదాకా నడిపిస్తూ
గుండెలోలకమై కదులుతూనే ఉంటుంది!

***– పుట్టి గిరిధర్, 9491493170***

– మడిపల్లి రాజ్‌కుమార్

# వేదన వేణువై పలికిన రుబాయీల గుచ్ఛం

అత్తరు తయారు చేయడం అంత సులువైన పని కాదు. గులాబుల పరిమళాలను నిల్వచేసే ప్రక్రియ అది. అత్తరు సువాసనలను పీల్చినప్పుడు కలిగే ఆ హాయి, కవిత్వం విన్నప్పుడు కలగాలంటే గులాబీల మార్దవమే కాదు, అత్తరు తయారీ లోని మెళకువలు, అనుభవాలలా ఆ కవిత్వాన్ని రూపు కట్టడంలో అంతటి జాగరూకత అవసరం. అరబ్బీ, ఫారసీ, ఉర్దూ కవిత్వంలో గుబాళించే ఆ అత్తరు గుమగుమలు తెలుగు కవిత్వంలో ఉన్నాయా..? అన్న ప్రశ్నకు జవాబుగా నిలిచే రుబాయీ పెన్నాది.

పెన్నా శివరామకృష్ణ గారి సాహిత్య జీవిత చిత్రాన్ని స్థూలంగా చూద్దాం. కవిగా.. వచనకవిత్వం, హైకూ, గజల్, రుబాయీ విమర్శకునిగా.. శేషేంద్ర, సినారె, శివారెడ్డి, గోపి, గోరటి వెంకన్నల కవితా తత్త్వ వివేచనలు; గజల్ సౌందర్య దర్శనం, తెలుగు గజళ్ళు – రుబాయీలు, వచనకవిత్వం చర్చలు; ప్రేమ సంగతులు, ముద్దుల ముచ్చట్లు.. ఇలా బహుముఖీనంగా కనిపిస్తారు. వారి రచనలు వేటిని తడిమినా ఆయన లోని సౌందర్యారాధన అనే సుకుమార హృదయదళమే మొత్తాన్ని తూచగలిగేదని ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. అందుకే పెన్నా కలం ముందు తరం, ప్రస్తుత తరం ప్రముఖ తెలుగు కవులు చాలమందిలా కేవలం వచన కవితకే పరిమితం కాక, గజల్ రుబాయీల మార్గాన్ని తొక్కింది.

పెన్నా శివరామకృష్ణ గారి మరో గుణం పరిపూర్ణతను సాధించాలని, ఆ దిశన సాగే వైఖరి. చెప్పాను కదా అది పూర్వపు సాయేబులు అత్తరు తయారీ లో చూపే అంకిత భావం లాంటిది. తనకు నచ్చకుంటే ముందు ప్రచురించినవైనా, రాసేవై నా, రాస్తున్నవైనా ఏవైనా సరే చెత్తలో విసిరేసే ఆయన నిర్మమత్వం సర్వ సాధారణం కాదు.




రుబాయీ ప్రక్రియ విషయానికి వస్తే, "అశ్రుధార" ముందుమాట 'నా మాట' లో పెన్నా పూర్వం తాను రాసి, ప్రచురించిన రుబాయీల విషయంలో అసంతృప్తిని వ్యక్తం చేశారు. ఉర్దూ రుబాయీలను అధ్యయనం చేస్తూ రాస్తున్నపుడు తొలి రెండు వందల రచనలను(కవి రుబాయీలు అనక రుబాయీలను పోలినవి అన్నారు.) చెత్తలో వేసి, యథాశక్తి 500 రుబాయీలతో "అశ్రుధార" ను ప్రచురించానని చెప్పుకున్నారు.

*శూన్యమె కలిసేది, చెయి చాచి ఉంచకు!*
*ఏ పూవుపైన నీ చూపును ఆపి ఉంచకు!*
*అక్షరంగ మార్చితేనె నివురవుతుంది!*
*ప్రతి అశ్రువు అగ్నికణికె, దాచి ఉంచకు!* (2)

ఇందులో ... చాచి/ఆపి/దాచి మాటలు కాఫియాలు. రదీఫ్ ఉంచకు. కాఫియాల చివరన స్వర సామ్యం(ఇ కారం) తోపాటు, ముందరి అక్షరాల్లోను స్వరం మళ్ళీరావడం (ఇక్కడ –ఆ) గమనించ వచ్చు. పెన్నా ఉర్దూ కవుల మార్గంలోనే తాను ఇలా రాశానని 'నామాట' లో పూర్వ ఉర్దూ కవుల కాఫీయాలను ఉదహరించారు.

ఉర్దూ రుబాయీలలోని చమత్కారాన్ని, ఆకట్టుకునే గుణాన్ని తెలుగున పండించడానికి పెన్నా "అశ్రుధార" రచనను అసిధారావ్రతదీక్షతో నిర్వహించారు.

పెన్నా ఇదివరకు సల్లాపం, శిశిరవల్లకి అనే రెండు గజల్ సంపుటాలను రచించారు. గజళ్ళకు చమత్కారమే హృదయం. గజళ్ళలో ప్రకాశించిన వారి చమత్కార ప్రభ రుబాయీలలో సువ్యక్తం కావడానికి మార్గదర్శిగా తోడ్పడి ఉంటుంది.

ఈ రుబాయీని గమనించండి. కవి చమత్కారాన్ని ఎంత గడుసుగా వ్యక్తీకరించాడో తెలుస్తుంది.

*ముఖాలన్ని ముసుగులలో ఆగ్రహించి ఉన్నవి!*
*అణువణువున ద్వేషాలే ఆవరించి ఉన్నవి!*
*అవసరాలు కలిపే బంధాలు ఎంత కాలమో?*
*శాంతికోరు సైన్యాలే మోహరించి ఉన్నవి!*

అంతా నటిస్తున్నారనే విషయాన్ని ముసుగుల్లో దాచుకున్న కోపించిన అసలు ముఖాలను చూపి తొలి పాదంలో, ప్రేమలు, స్నేహాలు నటనలని అణువణువున ఆవరించి ఉన్నవి పరస్పర విద్వేషాలనే విషయాన్ని రెండో పాదంలో, ఇలా 1,2 పాదాలలో తెరవెనుక నాటకాన్ని బహిర్గతం చేశాడు కవి. ఈ నటనలకు మూలం పరస్పరం అవసరాల వల్ల ఏర్పడిన కృత్రిమమైన బంధాలేనని, అవి ఎంత కాలం నిలుస్తాయో? అన్న ప్రశ్నలోనే నిలిచేవి కావని కవి మూడో పాదంలో ధ్వనింప జేస్తున్నాడు. చివరి పాదంలో కవి పాఠకుడు నివ్వెరపోయేలా ఆయుధాలతో సంసిద్ధంగా ఉన్న సైన్యాలు శాంతి కొరకేనని, విరుద్ధ భావాల శాంతి, యుద్ధాలు పరస్పరం ఆధారపడిన వైచిత్రిని చూపి చమత్కారాన్ని పండించాడు. అమెరికా శాంతి కొరకే యుద్ధమని ఆఫ్ఘనిస్తాన్, ఇరాక్ లపై చేసిన దాడుల గురించి మనకు తెలిసిందే కదా!

ఈ విధంగా చాలావరకు రుబాయీలలో పెన్నా ఈ వ్యూహాన్నే కనబరచి, 1,2 పాదాలలో ప్రస్తావించపోయే అంశానికి సరిపోయే దృష్టాంతాలను తెల్పుతాడు, లేదా తాను చెప్ప దలుచుకున్న దానికి భూమికను సిద్ధపరుచుకుంటా డు. మూడో పాదాన్ని, చెప్పబోయే నాలుగో పాదానికీ, పైరెంటికి లంకెగానో, ఆ రెండు అంశాలకు సరిపోయే సాధారణమైన లోకనీతిగానో, వ్యక్తంచేసి, అనుకోని మలుపుతో పాఠకుడిని చమత్కారంతో చకితుణ్ణి చేస్తాడు.

కవి తాను నడచి వచ్చిన జీవిత పథాన్నే కాదు, తన చుట్టూ ఉన్న వ్యక్తుల జీవితాలను లోనారసి పరికించారు. ప్రేమ, ప్రేమకు సంబంధించిన వివిధ పార్శ్వాలను అవగతం చేసుకున్నారు . కోరికలు కలగడం ఎంత సత్యమో.., అవి చాలా వరకు విఫలం కావడం అంతే సత్యం అన్న ఒక సార్వత్రిక, సార్వకాలిక తత్త్వ విచార ధార వద్ద నిలిచారు. దానినే "అశ్రుధార"కు ఆలంబనగా మార్చి కొనసాగారు.

*కట్టకడకు ఏకాంతపు రొదయే మిగిలింది!*
*గాలిపటం తెగి, దారపు కొసయే మిగిలింది!*
*పలు ఆశలు, నిరాశాలుగ మిగలడమే జీవితం!*
*దివ్వెను వెలిగించుకుంటె పొగయే మిగిలింది!*

ఈ సంపుటిలోని రుబాయీలు అన్ని వేటికవి ముక్తకాలైనా, అన్నిటా ముక్తకంఠంతో పలికేది వేదనాస్వరమే!

కవి ఒకసారి అశ్రువును అగ్నికణిక అని, మరోసారి సహచరి అని, నిత్య అతిథి అని, శూలమని, దివ్వె అని.. ఇలా ఈ సంపుటి నిండా అశ్రుశబ్దం సుమారుగా 80 సార్లు వివిధ రుబాయీల్లో ధ్వనించింది.

చిట్టచివరి రుబాయీలోను రుబాయీ ని తన హృదయం ఎగరేసిన 'అశ్రుపతాక' అని ఎత్తిచూపాడు కవి.

*మనసారా ప్రేమతోటి పిలిచెను ఈ రుబాయీ!*
*ఎదగాయపు మరకగనే మిగిలెను ఈ రుబాయీ!*
*నన్ను వలచి తను మాత్రం పొందినదేమున్నది?*
*హృదయ అశ్రుపతాకగా నిలిచెను ఈ రుబాయీ!*

అశ్రువు అనేమాట బహురూపాలతోను, శాబ్దికంగాను సంపుటిని అశ్రుధారగా మార్చి, మనల్ని నులివెచ్చగా తడుపుతున్నది.

"అశ్రువు తప్పితె, అన్నీ ముగిసి పోయేవే కద!" అంటూ అశ్రువే శాశ్వతమనీ చెప్పాడు కవి. ఇలా ఈ కావ్యంలో అశ్రు విశ్వరూపం ప్రదర్శింప జేశాడు.

*పగలంతా నా వదనమె తొడుగై పోతుంది!*
*ఇరు సంధ్యలలో నీడా పొడుగై పోతుంది!*
*నమ్ముకుంటె ఏ వృక్షం తరుమదు దూరంగా!*
*ఎండలోన ముళ్ళచెట్టు గొడుగై పోతుంది!* (32)

కవి పగలు నటిస్తూ బతకాల్సిన స్థితిని, చీకటి తొలగినా, ముసిరినా కలిగే భావాల 'అవాస్తవ' రూపాలదే పైచేయి అవుతున్న పరిస్థితిని రెండు పాదాల్లో చెప్పాడు. వృక్షతత్త్వం ఎంతగొప్పదో చెబుతూ.. ముళ్ళుకక్కే వృక్షస్వభావులు నమ్ముకుంటే కష్టాల్లో కాపాడతారని తెలిపాడు కవి. లోతైన విషయాలకు ఎంచుకున్న దృష్టాంతాలతో రుబాయీ

లుగా మలచి చెప్పడం ద్వార కవి భావగాంభీర్యతనే కాక, శాబ్దిక సౌందర్యాన్ని సాధించి మనల్ని ఆకట్టుకుంటున్నాడు.

"నేను" జ్వాల లాంటిదని అనడం ద్వార అది వెలుగే కాదు, కాల్చే మంట అంటున్నాడు కవి. "అహం" తలుపుల వంటిదని, ఆ తలుపులను మూసి, బావిలో కప్పలా తనే గొప్ప, తానున్నదే లోకం అనుకోక, తెరచి అహంకారపు అంధకారాన్ని పోగొట్టు కోవాలని చెబుతున్నాడిక్కడ.

*ఆమనిలో కొమ్మకైన భారమె మిగిలేది!*
*కుసుమానికి కడకు ఒక్క హాసమె మిగిలేది!*
*వృక్షానికి మించిన ఉపదేశం ఏముంది?*
*వేర్లకైతె తుదకు గుప్తదానమె మిగిలేది! (392)*

వసంతం పూలకారుగా కొమ్మకు పూల మోతనే మిగుల్చుతుందని, పూవుకూ చివరకు నవ్వు తప్ప ఏ పరిమళమూ మిగలదని, ఇన్నిటికీ ఆధారమై

అని తనకు తానె 'దొర' తనాన్ని 'ధూళిపొర'లో కలిపేసుకున్నారు. అవ్యక్తమైన 'మొర'నని దిగజారిన బతుకు తీరును వ్యక్తం చేసుకున్నారు.

"తివిరి ఇసుమున తైలంబు తీయవచ్చు" అన్న ఏనుగు లక్ష్మణ కవిలా (భర్తృహరి 'సుభాషిత త్రిశతి' అనువాదకుడు)

*తారలనూ చెరగకుండ ఆపుట సులభం!*
*ఆకులలో అగ్నినైన దాచుట సులభం!*
*మనసును గెలవడమే ఈ లోకంలో కష్టం!*
*ఇనుడి నుండి వేడిని ఎడబాపుట సులభం! (210)*

అసాధ్యాలనైనా సులువుగా సాధించవచ్చు గాని, మనసును నియంత్రించడమే అత్యంత కఠినంగా కవి తెలిపాడు.

ఈ కావ్యంలో ఎన్నో రుబాయీల పాదాలు విడివిడిగా కూడ వినగానే 'వాహ్..' అనిపించేంతగా

(140)/"కామా"తో ఏ వాక్యం ముగియాలని అనుకోదు! (237)/ పూవుల చిత్రాల నుంచి సుగంధాలు వస్తాయా? (316)

ఇలా ఏ మిస్రాకు ఆ మిస్రానే భావ పరిమళంతో మనల్ని మంత్రముగ్ధులను చేస్తుంది.

"తలుపనుకుని గోడను తడుతున్నది ఇంకా!" (306)

ఎన్నటికీ తెరచుకోని గోడను తలుపనుకునే అజ్ఞానాన్ని తెలిపిన మిస్రా ఇది. మొత్తం కావ్యంలో ఈ ఒక్క మిస్రా మాత్రమే మరొక రుబాయీలో పునరావృత మయింది. తలుపనుకొని గోడలన్ని తడుతూనే ఉన్నది (457)

ఈ కావ్యంలో కవి రుబాయీల నిర్మాణంలో భాగంగా అసంకల్పితంగానే ముళ్ళముఖ్మల్, ఇనుపమలాము, మాంత్రికముకురాలు వంటి హృద్యమైన సమాసాలను ప్రయోగించారు.

*తాకితేనె తెలుస్తుంది, మది భారం అంతా!*




*ప్రముఖ కవి, రచయిత పెన్నా శివరామకృష్ణకు సెప్టెంబర్ 9వ తేదీన రవీంద్రభారతిలో జరిగిన సమావేశంలో తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం కాళోజీ సాహిత్య పురస్కారం అందించినప్పటి దృశ్యం. వచన కవిత్వం, హైకులు, గజళ్ళు, రుబాయీలు రాయడమేగాక విమర్శనా రంగంలో విశేషకృషి చేసిన పెన్నాకు ఇది అరుదైన పురస్కారం.*

తిండిపెట్టే వేళ్ళను ఎవరూ గుర్తించరని కవి చెట్టును చూపెడుతూ ఉపదేశిస్తున్నాడు మనకు. ఈ రుబాయీలో కళాకారులకు, గురువులకు ఎవరికైనా సందర్భానికి అనుగుణంగా అనువర్తింపజేసె సార్వజనీనత ఉన్నది.

దేవులపల్లి తన 'కృష్ణపక్షం' లో "నే ననంత శోకభీకర తిమిర లోకైక పతిని" అని చెప్పుకున్నట్లుగా ఇక్కడ పెన్నా అదే స్థాయిలో "గాయాలను పాలించే దొరనే నేను" అని చెప్పుకుని.. వెంటనే

*సుడిగాలికి ఎగయు ధూళి పొరనే నేను!*
*ఎలాగైతేనేం బతికే ఉన్నాను!*
*నాకైనా వినిపించని మొరనే నేను (22)*

పెన్నా మలిచారు.

సాంధ్యఘోష అంతా ఒక పడమరకే తెలిసేది! (4)/ వీడుకోలు ఎపుడైనా వేడుక అవుతుందా?(9)/ కన్నీటి లోనె వేల ఇంద్రధనువులు చూశాను (10)/ ఒక అశ్రువె సహచరిగా మారని వారున్నారా? (12)/ కవి ఎదలో ప్రతిఅశ్రువు పూమొక్కగ మొలుస్తుంది! (20) /సూదులతో పూలకు కరచాలనమూ అవసర మే! (44)/అర్చనలెన్నైనా శిలలను కరిగించ లేవు! (54)/ఆ దేవతయే హారతి ఊదేస్తూ ఉన్నది! (68)/ పూవులాగ బతికితె ఎడబాయడమూ తెలుస్తుంది! (83)/ తనువుకు ఒకటే మనసుకు మరణాలెన్నో! (101)/ప్రాణం,కన్నీరు ప్రళయాంతం కవలలే!

*చేతుల కలయికలోనే ఉన్నది ఆమోదం అంతా!*
*చెవి కంటే, చూపు కంటె, చర్మం స్థిరమైనది!*
*ఇష్టమైన స్పర్శలోనె ఉన్నది పరమానందం అంతా! (259)*

స్పర్శలోని ఆనందం సర్వ జీవులకు అనుభవైక వేద్యమే.

స్పర్శేంద్రియాన్ని ఎత్తున నిలిపే ఈ రుబాయీ మనకు ఇష్టమైన దానిని తాకాలనే ఒక కాంక్షను రగిలిస్తుంది.

అలా నాలా నచ్చిన పాఠకులంతా ఈ "అశ్రు ధార" స్పర్శానుభూతిని పొందుతారని ఆకాంక్షిస్తున్నాను.

***రచయిత సెల్: 9949 699 215***



# అస్తిత్వకేతనం

త్యాగాల పోరుగడ్డపై
అస్తిత్వం కేతనమై ఎగిరింది
నిర్బంధం, నిరంకుశత్వం
మోసంతో స్వేచ్ఛను బంధిస్తే
కపట బుద్ధుల దురాలోచనను
కొదమసింహం చిన్ననాడే ప్రశ్నించింది
విషం చిమ్మే మనుషులు
పెదాలపై నవ్వును అతికించుకొని వస్తే
వలస పాలన కుతంత్రంపై
ఉడుకు రక్తం ఉప్పెనైంది
విశాలాంధ్ర ముసుగులో
ఇడ్లీసాంబార్ల రుచిజూపి
నాన్ ముల్కీలు మన గట్కు దోస్తుంటే
సహించని చైతన్యం తిరగబడింది
బలిదానాలను తలుచుకొన్నప్పుడల్లా
ఆ గుండెపొరల్లోంచి రక్తం
ఆరిపోని ఆశయమై ఎగసింది
దశాబ్దాల నివురుగప్పిన చరితను
యాది మరువకుండా
తరతరాల తలరాతలకు రాసిన
నిప్పులకొలిమి నిత్యం మండింది
రాలిపోయేవరకు
రాజీపడని వ్యక్తిత్వం
అలుపెరుగని పోరులో
ఆత్మగౌరవాన్ని శ్వాసించింది.

*(ప్రొఫెసర్ జయశంకర్ గారి యాదిలో....)*

*– డాక్టర్ చింతల రాకేశ్ భవాని*
*9246607551*

# ఆమని



ఆ...
పచ్చని పూల సుగంధ
పరిమళాలలో
ఓ సుమ సుందరి
కురులపై పూల
బతుకమ్మ సిరులు
అందాల హొయలతో
చిరునవ్వుల లయలతో
పసిడి ఛాయ మేను
మిలమిల కనులతో
తళతళ మెరుపులతో
కాంతులు చిందించే
కావ్య కన్య నడయాడగా
హృదయము పులకించగ
ఆ వని నా ప్రియమణి
ఒక ఆమని

## నయన సూత్రం

నవ రసాలొలికించు
నయనాలు
హృది పులకించగ
ఎద సొద చేయగ
మది గది మనసు నింద
కాంతులు విరజిమ్మగ
ఆ కాటుక కన్నులు
నను కలవరపరచెను కదా..
ఏదో అద్భుతం
ఆ నేత్ర సూత్రంలో
ఏవో తెలియని
మత్తును కలిగించే
మౌన రాగ గీత
మాలికలున్నవిలేజి
అవి నను పరిపరి విధాల
భ్రమింపచేసే
అద్భుత కళాఖండాలులే....

*– కె.హరనాథ్, 9703542598.*



# ఆనంద ద్వారం

పచ్చదనాల పరిసరాలుగా
పంటపొలాల సిరి స్వరాలుగా
అనుబంధాల నవ గ్రంథాలుగా
అలరించే పల్లెతనపు పరిమళం
నా అక్షర రూపం....

చినుకొస్తే పులకరించే
చిగురుతనం నా ధనం
మెరుపొస్తే మురిసిపోవు
రైతు వోలె సంబరం.

బడి పిల్లల మోములలో
వెలుగు పూలు పూయించే
జ్ఞాన సలిలమై ద్రవించే
సంకల్పం నా సంతకం...

ఇహపరాల బోధలెన్నో
మాటలోని రీతులెన్నో
శాస్త్రాలు సూత్రాల నీతులెన్నో
వాదాల జోలికిపోని
స్నేహ సుధల తీరం నాది...

గగనాలూ గమనాలూ
గ్రహాంతర యానాలూ కాదు
నేల తల్లి ఒడి గుడిలో
సేద దీరు తీరు నాది...

పేదల ఆకలి తీర్చేదిశగా
భద్రమైన అడుగు నాది..
అవనికి కళలను అద్దే
హరిత లయల గొడుగు నాది...

జగతికి భాగ్యం పంచే
ఆరోగ్య దీపం నాది
అంతరాల జాడలేని
ఆనంద ద్వారం నాది.

*– వెల్మల జయపాల్‌రెడ్డి,*
*94411 68976*

# సాహిత్య పదరంగం - 21

నిర్వహణ:

డాక్టర్ ఆరవల్లి జగన్నాథస్వామి

సెల్: **94401 03345**



| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | * | 2 | 3 | | * | 4 | |
| | * | 3 | 5 | * | | * | 6 | | * |
| * | 7 | * | | * | | * | 7 | | |
| 8 | | | | * | * | 9 | * | | * |
| | * | * | * | 11 | * | 9 | | * | 10 |
| | * | 10 | 12 | | | * | * | * | |
| | * | * | | * | * | 13 | | 18 | |
| * | 14 | | * | 15 | * | | * | | * |
| * | | * | * | | * | 15 | 17 | | |
| 16 | | * | 17 | | | * | 18 | | |

### ఆధారం

**అడ్డం**

1. పన్నెండవ తిథి (3)
2. మంచి పుట్టుక (3)
3. వర్షమే...చినుకుతో మొదలు (2)
4. అసలు కంటే ఇది ముద్దట (2)
6. దేవదాసు ప్రేయసికి సంబోధన (2)
7. రక్తమే..బ్లడ్ (3)
8. కుమార్తె కాదు...పుత్రుడు (4)
9. పట్టుదల....శపథం (2)
10. చందనయాత్ర దివ్యక్షేత్రం (4)
13. యాదాద్రి పాతపేరు,..టీవీ చానల్ (4)
14. శ్రీహరి ప్రధాన అవతారాలు (2)
15. దీనికి చెద పట్టదట (2)
16. వైభవం, దర్జా (2)
17. మంత్రే...మహ్మదీయ పాలనలో (3)
18. మాదన్న సోదరుడు (3)

**నిలువు**

1. వాయులీన విద్వాంసుడు వేంకటస్వామి ఇంటి పేరు (2)
2. శివుడిని సంబోధించుదాం (2)
3. 'నవయుగ కవితాచక్రవర్తి' బిరుదాంకితుడు (3)
4. ప్రవరుడిని వలచిన అప్సరస (4)
5. పాకశాస్త్ర ప్రవీణుడు, దమయంతి పత్ని (3)
6. ప్రవహించు, పరిగెత్తు (2)
7. పాండురాజు చిన్నభార్య..తలకిందులైంది (2)
8. అటుకులు కానుకిచ్చిన కృష్ణమిత్రుడు (4)
9. వరానికి వ్యతిరేకం (2)
10. నటి రోజా ప్రాతినిధ్యం వహిస్తున్న నియోజవర్గం (3)
11. క్రైస్తవుల ప్రార్థనా మందిరం...కింద నుంచి (2)
12. నవ్వు...కొన్నాళ్లు నడిచిన పక్షపత్రిక (2)
13. రాత్రి...పసుపు (3)
14. పాటకు ఇది ప్రాణమట (3)
15. తాపీ ధర్మారావును ఇలా పిలుస్తారు (3)
16. సింహపురి ఈ నది ఒడ్డున ఉంది (2)
17. రుణమే..తిరగబడింది (2)
18. పాత కొలమానం...సోలలో నాలుగో వంతు (2)

**సాహిత్య పదరంగం-20 గడులను సరిగ్గా నింపినవారు: 1. ఐ.వి.సుబ్బాయమ్మ 2. అడవి సుజాత 3. చెన్నూరి సుదర్శన్ 4.కె. ప్రకాశం 5. కె.వి.దుర్గామోహనరావు... వీరికి పాలపిట్టబుక్స్ ప్రచురించిన రెండు పుస్తకాలను పంపిస్తాం. పదరంగం నింపి palapittamag@gmail.com కు పంపించాలి.**

**వాట్సాప్ నెంబర్: 94900 99327**

**సాహిత్య పదరంగం సరిగ్గా పూర్తి చేసి పంపించిన వారి పేర్లు ఇక్కడ ప్రచురిస్తాము. అలాగే తొలి అయిదుగురికి రెండు పుస్తకాలను బహుమతిగా పంపిస్తాం.**

# సాహిత్య పదరంగం - 20 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 అ | ని | 2 శం | * | 3 బా | 4 స | ర | * | 5 బా | 6 వి |
| డ | * | 7 క | 8 ల | * | మ్మె | * | 9 నా | లు | క |
| 10 వి | 11 ది | * | 12 గ్గం | 13 మ | * | 14 క్లో | తి | * | ట |
| * | వా | లి | * | 16 క | 17 ప | టీ | * | 18 పా | క |
| 19 బా | ణం | * | 13 మి | రం | తి | * | 21 మ | న | వి |
| లి | * | 22 ప | న్ను | * | 23 తం | 24 తు | * | కం | * |
| 25 క | 26 ల | ది | * | 27 వ | * | ల | * | * | 29 భో |
| * | య | * | 30 ఆ | నం | 31 దం | * | 32 ప | 33 తం | గం |
| 34 మా | * | 35 బా | న | * | 36 డ | బ్బు | * | పో | * |
| 37 కు | దు | వ | * | 38 బ | కం | * | 39 సు | క | వి |




# బతుకుకథ - కవిత్వం

నాన్న గురించి ఎప్పుడూ మరిచింది లేదు. చిన్నప్పుడు మా అమ్మను కొడతడని కోపం ఉండేది. ఆయన కోపం కూడా భయంకరమైన కోపం. వాళ్లిద్దరూ తగవుపడితే అదొక రణరంగం. అదొక బీభత్సం. ఇల్లంతా బిక్కుబిక్కుమంటూ ఉండాల్సిన స్థితి. మా చెల్లెలు బుజ్జి పుట్టేదనక ఈ తీవ్రత ఉండేది. సినాసిన్నంగా తగ్గింది. మా అమ్మ నోరుకూడా పెద్దదే. ఏడా తగ్గేది కాదు. ఏడా ఆగేది కాదు. భీకరంగా ఉండేది. 'కొట్టినచోట కొట్టకుండా కొట్టిండు మీఅబ్బా' అంటుండేది. ఆ బీదరికం, మాటపట్టింపులు, అలుగుళ్లు, ఆప్యాయతలు, చీకాకులు, చీదరింపులు ఎప్పుడూ నిమ్మలంగా ఉండేది కాదు. పిల్లలం బిక్కుబిక్కుమనుకుంటా ఉండేవాళ్ళం.

వ్యవసాయం, కిరాణా కొట్టు – అంతా బాగున్నట్టున్నా అన్నీ అరకొరగానే ఉండేవి. సక్కనైన బట్టలు కానీ, సక్కనైన సదుపాయాలు కానీ పిల్లలకి అమిరేడివి కాదు. తిండికి ఫర్వాలేదు. ఉంటానికి గూడుకు పర్వాలేదు. చదువుకోసం ఖర్చుపెట్టగలిగిన స్థితి ఉండేది కాదు. 'ఎంత సంపాదించిన, రెక్కలుముక్కలు చేసుకున్నా మీ పొట్టలు నింపడానికే సరిపోతుంది' అనే మాటలే ఇంట్ల ఎప్పుడూ విన్పించేవి.

ఎవరూ ఖాళీగా కూచున్నది లేదు. ఎవరికీ కూకొని తినే పరిస్థితీ లేదు. పిల్లలం పదో తరగతి చదువుకునేలోపల కేవలం చదువుకుంటూనే గడిపాం అని కాదు, అన్ని పనులు, చెప్పిన పనులు చేసేటోళ్లం – పొద్దుగాల బుగ్గలనుంచి నీళ్లు మొయ్యడం, గడ్డికోయడం, పొద్దున్నే చేలకు పిట్టల్ని తోలడం కోసం మంచెలెక్కి పిట్టకావలి చేయడం, గొడ్ల కొట్టంల పెండ ఎత్తడం, పెంటకుప్పదాకా మోసి వేసి రావడం, వాకిలి ఊడవడం – ఈ పనులు మా పిలగాండ్లకు ఎవరికీ తప్పలేదు. తర్వాత కాలంలో జీతగాళ్ళు వచ్చినా ఎప్పుడూ రికాముగా కూచున్నది లేదు. స్కూల్ టైం వరకు పనులు చేయాల్సిందే. ఆ తర్వాత కొన్ని మేకలు వచ్చాక అవి మేపేటోళ్లు కుంపు పెడితే, స్కూల్ కు దుమ్మా కొట్టాల్సిందే, మేకలు కాయాల్సిందే. గొడ్లు కాయడం కూడా తప్పలేదు. నాట్ల రోజుల్లో



పొలంల సాయం చేయడానికి దుగాలు చెక్కడం, దుగాలు అలకడం, నారు కట్టలు అందించడం, గడ్డిమొట్లు బురదలోకి తొక్కడం, మళ్లీ బీళ్ళల్ల నాగళ్ళు ఇప్పినంక ఎడ్లను రాత్రి పదింటిదాకా సందపూట మేపకరావడం – చదువు రోజుల్లో ఉత్త చదువే కాదు, ఈ పనులూ కలగలిసి సాగేది. పల్లెటూళ్లనుంచి వచ్చే పిలగాండ్లకు ఎవరికీ ఇవి తప్పవేమో, ఎవరో కొద్దిమందికి తప్ప.

ఈ మొత్తంల మా నాయిన మీద, అమ్మమీద సిన్నతనంల లోపల కోపంగ ఉన్నా –కొద్దిసేపన్నా కూసోనీయరు అని, తర్వాత అర్థం అవుతూ వచ్చింది అట్లా కూసోనీయకుండా పనులు చేయించడం వల్లనే ఈ లోకంల నిలబడ్డానికి అప్పట్లనే తర్ఫీదు ఇచ్చిండని. తర్వాత రోజుల్ల ఎక్కడికిపోయినా ఆ కష్టం చేసే అలవాటు పనికివచ్చింది. అందుకే మా అబ్బ, అమ్మ అంటే ఇష్టం. వాళ్ళున్న స్థితిల అట్లా తప్ప ఇంకోలాగా పెంచలేరు. వాళ్ళూ ఎక్కడా కూసున్నది లేదు, మమ్మల్నీ కూసోనీయలేదు.

పరుగులాంటి జీవితం. బాల్యం. విశ్రమించని బాల్యం. విరామమెరుగని బాల్యం. కనాకష్టపు అరకొర బాల్యం.

అయినా గర్వంగా చెప్పుకోగలిగిన బాల్యం.

కవిత్వం రాయడం మొదలుపెట్టాక ఇవన్నీ ఏదో ఒక సందర్భంలో కవిత్వంలోకి తీసుకొచ్చే పని చేసాను. చాలానే ఉన్నాయి. అందులో ఈ కవిత ఒకటి. 'సరిహద్దురేఖ' సంపుటిలో ఉంది.

### ఆత్మకథ

ఉగ్గంపల్లి పీరీల కొట్టం, జయ్యారం ఏటిపాట, చినగూడురు గడీల మగ్గిన బతుకులు, సాయిబులో దూదేకులో తేడా తెలియని అమాయక జ్ఞానం, మాట్లాడితే పీరీలు ఊరేగిన గాథలు, అర్ధరూపాయికోసం ఆరుమైళ్ళు నడిచిన సిత్రాలు, బండమీద తాటిదూలాలతో కట్టుకున్న ఒంటిదూలం గుడిసె కతలు, పొవ్వాకు చుట్టను చుట్టుకునే నేర్పులు, గుక్కతిప్పుకోకుండా ఊపిరి తీసుకోకుండా బీడీలు తాగిన వైనాలు, ఐదుగురన్నదమ్ముల ఆరాటాలు, అందరి పొత్తునా పుట్టిన 'అక్కమ్మ 'లాంటి అక్క;

అక్కకోసం అమ్మపంపిన గోష్కీ సాలన్ – బుత్తీలు, మీఅమ్మకోసం నువ్వు కొనుక్కొచ్చిన చీరల కథలు, మానుకోటనుండి బెజవాడదాకా రైలుకట్టమీద నడుచుకుంటూ కూలీ కోసం తరలిపోయినకష్టాలు

**నాయినా!**

**ఇదంతా నీ కన్నీటి వ్యథ!**

మామ్మతో నీ నిఖాముచ్చట్లు, మాతాత కరీంసాబు గొడ్లుకోసి పోగులు పంచిన దృష్టాంతాలు, కావిడి చేతుల కాకలు తీరిన నీ ముచ్చట్లు; ముత్రాసి గూడెం, రేగుల గూడెం, పూసమోళ్ళ గుంపు, అనంతారం 'ఓ సాయిబూ' అని పిలుచుకున్న దగ్గరితనాలు, వడితిరిగిపోయిన నీ పిక్కల నరాలు, తట్ట మోసిమోసి బోడిగుండైన నీ వంకీల జుట్టు

**అబ్బ!**

**ఇదంతా నీ జీవిత గాథ!**

ఇరవైగుంటల పొలంలో బంగారం పండించిన వైనాలు, ఏట పెట్టడాలు, ఎగసాయం చేయడాలు, మోట కొట్టడాలు, మోపులెత్తడాలూ, కాసెపోసి పంచె కట్టడాలు, ఎలుగుకట్టడాలు, గిత్త ఒట్టకొట్టడాలు, తాడుపేనడాలు, చిక్కం వేయడాలు, గుమ్మి కట్టడాలు, ఇటుకబట్టి కాల్చడాలు, మునుం పట్టడాలు, రుణం తీర్చుకోవడాలు, పందిరేయడాలు, పగ్గమేయడాలూ

**అబ్బా!**

**ఇదంతా నా వారసత్వపు కథ!** (2000)

### మేకలుమేపడం - గొడ్లుకాయడం

చదువుకునేరోజుల్లో ఆదివారాలు, సెలవులు పిలగాండ్లకు సంబురమే. మా ఇంట్ల పిలగాండ్లకు మాత్రం ఇష్టం ఉండేది కాదు, చానామందికి పల్లెళ్ళ



గంతేనేమో ! ఊరక కూసునేది ఉండదు. అట్లని తలిదండ్రులు ఉత్తగ కూసుంటరా అంటే అట్లనిగాదు. పనిచేస్తనే ఉండాలె. మా ఇంట్ల జీతానికి ఒక్కో ఏడు ఒక్కోరు జీతానికి కుదిరెటోళ్లు. చానామంది పక్కూర్లల్లకు జీతాలుండి పొద్దున్నే పోయి సీకటిపడ్డంక వచ్చేటోళ్లు.

అట్ల మా దగ్గర జీతమున్నోళ్లు ఆ సంవత్సరాల్లల్ల సర్వయ్య, నెల్లబోయిన సూరయ్య, ఇరప రాగోలు, ఇరప ఎంకటి, చింత రాములు, ఇరప రాములు, సమ్మయ్య ఎవుసాయం పనిల మా అబ్బా వెంబడి అరకలు కట్టుడు, చేను పనులు చేసుడు, గొడ్ల పనులు చేసుడు... ఇట్లా ఉండేది. ఇద్దరి ముగ్గురి ఇండ్ల గొడ్లుకాయడానికి, మేకలు కాయడానికి కలిపి ఒక్కళ్ళు ఉండేటోళ్లు. అట్లా వాళ్ళల్ల ఎవరు రాకపోయినా, ఎవుసాయం పనుల్ల వాళ్ళ అవసరం పడ్తా పిలగాండ్లకు ఆ పనిపడేది. గొడ్లు కాయడం నిమ్మలమే కానీ మేకలు కాయడం కష్టం. అవి ఒకచోట మేయవు. ఒకదగ్గర ఉండవు. అటుఇటు ఉరుకుతుంటయి. మళ్ళించాలంటే ఒకరికి అలిమి కాదు. అందుకనే తెలగోళ్ల మేకలెంబడో, కుంజోళ్ళ మేకలెంబడో పోవాలె.

పోనని చెప్పడానికి లేదు. భయం. కొడతరనో, బడికి పంపరనో లోపల భయం.

నల్లవాగు, బుగ్గవాగు ఒడ్డులెంబడి, రైలుకట్ట ఎంబడి, చీమలోరిగూడెం పక్కపొంటి, ఆ పక్కన తండా దగ్గర, ఇంకా ఇంకా ముందుకుపోతే బొల్లిగుట్ట దాకా మేకల్ని మేపుకుంట పోతనే ఉండాలే. చేన్లల్లకి మేకలు దూరకుండా, మేయకుండా చూసుకోవాలె. చిన్న గొడ్డలి ఎంబడి పెట్టుకుని తుమ్మమండలు, సీమచింత చెట్ల కొమ్మలు (గుబ్బకాయల చెట్టు)కొట్టి, మేకలకు అందించాలె. అవి మేసేందుకు వీలున్న ఆయమన్న చెట్ల కొమ్మలు వొంచి వాటికి అందించాలె. మేకలు మేపడం – అదొక కళ, టెక్నిక్. ఉత్తుత్తిగ కాదు.

ఈ నడిమిట్ల గుబ్బకాయలు (సీమసింతకాయలు) కోసుకుని తినడం, పక్కనున్న చేలల్లో కందికాయలు, పెసరకాయలు, అలిసెందకాయలు, పరిక్కాయలు, బుడంకాయలు, పచ్చి దోసకాయలో; బీళ్ళల్ల, డొంకలల్ల తునికిపండ్లు, ఊదుగుపండ్లు, రేగ్గాయలు, పులిసేరి పండ్లు, బలుసుకాయలు, కలెంకాయలు, జబిలికి పండ్లు, ఇంకా మేడిపండ్లు, గిన్నెపండ్లు, ఏప పండ్లు, నేరేడుపండ్లు, ఎలక్కాయలు ,బ్రెంక చెట్ల చిగుర్లు; వాగు ఎంబడి తవ్వితే దుంపలు గోవింద గడ్డలు, ముసలమ్మ గడ్డలు, అల్లిగడ్డలు,...ఇలా ఎన్నెన్ని పండ్లు, పచ్చికాయలు తినడానికి దొరికేయి.

విసిత్రం – మోదుగాకు దొన్నెలా కుట్టి లోపల ఆకుకి, బ్రెంక కొమ్మను విరిస్తే వచ్చే తెల్లని జిగురులాంటి పాలను పూసి అందులో మేకను పట్టుకుని, పొదుగునుంచి పాలని ఆ దొన్నెలోకి పిండితే అరనిమిషంలో జున్నులాగ గడ్డకట్టేది. మస్త్ మజాగ ఉండేది తింటే ! ఇంకొక రకం – పుట్టను పైపైన మట్టిని గిల్లి దాన్ని మోదుగాకు దొప్పలో వేసుకుని అందులో ఊడుగుపండ్లు చిదిపి వేసి కలిపి తింటే కమ్మగా ఉండేది.

గివేకాక, మా ఊరి ఒకపక్కన తోలెం ముత్యాలు వాళ్ళ ఐదు మామిడిచెట్లు ఉండేవి వాగు ఒడ్డు మీద. రాలిన పండ్లు వాగులో ఇసుకమీద, ఒర్రెల పడుండేవి. చిన్నగ వెతికి జేబులేసుకుని ఉరకడమే. ఆ మామిడి పండ్ల రుచి ఇప్పటికీ మర్వలేదు. అట్లుండేదిది.

*చేన్లల్లకి మేకలు దూరకుండా,*
*మేయ కుండా చూసుకోవాలె.*
*చిన్న గొడ్డలి ఎంబడి పెట్టుకుని తుమ్మ మండలు, సీమచింత చెట్ల కొమ్మలు (గుబ్బ కాయల చెట్టు)కొట్టి, మేకలకు అందించాలె. అవి మేసేందుకు వీలున్న ఆయమన్న చెట్ల కొమ్మలు వొంచి వాటికి అందించాలె.మేకలు మేపడం –*
*అదొక కళ, టెక్నిక్.*

మేకలు కాసుడు ఎట్లున్నా చెట్లూ చేమలెంబడి తిరగడం తీరొక్క పండు, కాయ రుచిచూడటం, ఆకులు, చెట్లు, చెట్లతీగెలు, కొమ్మలు, కొమ్మల తీరులు, వాగు, మడుగులు, చేపలు, ఎండ్రకాయలు, పాములు, తేళ్లు, జెర్రులు, పిట్టలు, గూళ్ళు, పిట్ట గుడ్లు, తుమ్మ బంక, రకరకాల మొక్కలు, వాటి చిన్ని చిన్ని పూలు , వీటన్నింటినీ కలగలిపిన ఓ కమ్మనైన పసరుతో కలగలిసిన వాసన.

ఊరంటేనే గమ్మత్తైన పసరు పసివాసన మనసులోంచి ఎగుస్తుంటుంది. పురావాసన.

ముళ్ళతో పెద్ద సమస్య. ఎక్కడ కాలుపెట్టినా కొంచెం కన్ను తిప్పితే కసుక్కున దిగే ముళ్ళు. ముళ్ళలో నెప్పి ఎక్కువపెట్టే ముల్లు ఊదుగుముల్లు. దిగితే విషమే. ముల్లు కాల్లోంచి లాగాలన్నా బలంగా లాగడమే. లోపల విరిగిందంటే ఓ వారం పదిరోజులు అవస్థ. ముల్లు పిన్నీసుతోటి గుచ్చిగుచ్చి గెలికి గెలికి తీసినా దాని పొట్టు లోపలున్నా చాలు – చీము పట్టడం, కాలు వాయడం, అదంతా బయటికొచ్చేదాక ఎన్ని రకాల కష్టాలో ! మొత్తం ఒత్తి చీము నెత్తురు నీరు బయటికి తీసి, నిప్పు కొరకాసితో ముల్లు గుచ్చిందగ్గర వెచ్చచేసి, జీడిగింజ కాల్చి ఆ గాయంల దాని రసాన్ని పోస్తుంటే, అప్పుడు తాత ముత్తాతలు గుర్తుకొస్తరు. ఇగ రేగుముల్లు గుచ్చితే అదితీసినా లోపలెక్కడో ములుకు మిగిలుంటది.అది పెట్టే పోరు అంత ఇంతకాదు. తుమ్మముల్లు లోపలిదాకా పోతది. ఒడుపుగ తీయకపోతే కష్టాలే.!

ఇదిగిట్లుంటే, రకరకాల పాకుడు పురుగులు. ఒంటిమీద పాకితే దద్దుర్లు, పొక్కులు, దురదలు. ఏదో ఒక ఆకుపసరు రాసుకుని రోజంతా ఒళ్లు గీక్కోవడమే. ఇదికాక, ఎక్కడైనా మేకలు మేసుకుంట పుల్ల తేనెతుట్టెల్ని, కందిరీగ తుట్టెల్ని గెలికితే ఇగ కష్టమే. తేనెటీగలు, కందిరీగలు వెంటపడి ఉరికిస్తయ్. కుడితే ఒళ్ళంతా ముళ్ళు. వాసిపోద్ది.

మేకలు కాసుడు ఎట్లున్నా, ఈ కష్టాలు వెంటుంటాయి. ఇయన్నీ దాటుకుని ఆ రోజు గడపాలి. తెల్లారి స్కూలుకు పోవాలె.

గొడ్లు కాయడంలోని అనుభవాలు ఇంకొన్ని.. బీడుంటే కొంచెం సులువు. లేకపోతే రైలు కట్టెంబడి, వాగు ఒడ్లమీద, కోసిన చేన్ల మొట్లల్ల, డొంకలల్ల తిప్పాలె. కొన్ని నిమ్మలంగ మేస్తయి. కొన్ని అటుఇటు ఉరుకుతుంటయి. ఉరికే గొడ్లకి ముందే మెడకు తాడు వేసి దానికో మేడిలాంటి కట్టెను కట్టి, అది ఉరికితే ఆ కట్టె దాని కాళ్లకు తగిలేట్టు మేడి బంధం, అది కాకపోతే మెడకు కాలికి తాడు కట్టే ఒంగుడు బంధం వేసేదిడి. అప్పుడప్పుడు గొడ్లు కోసిన కందిమొట్లల్లనో, జొన్న మొట్లల్లనో ఉరికితే చూడాలి ఆ కష్టం. కొర్రులు కాళ్లకు గుచ్చకపోవడం, లేదా కింద అరికాళ్ళల్ల పల్లెరుకాయలు దిగడం– అదో పెద్ద నరకం.

ఇవన్నీ చేసుడు నాకు మంచిదే అయ్యింది.

ఆ నేల అణువణువుతో అనుబంధం పెరిగింది.

***(ఇంకా వుంది)***

***రచయిత సెల్: 98491 56588***



## గన్నవరపు నరసింహమూర్తి కొత్త సీరియల్

# తూరుపు సంధ్యారాగం

### పార్ట్ 5

**(గత సంచిక తరువాయి)**

పల్లె అంటే పచ్చటిపొలాలు, పైర్లపై ఎగిరే పిట్టలు, కొండ పక్క ఉరుకులు పెడుతూ పారే ఏటి గలగలలు...

*"పొలాలనన్నీ*
*హలాలదున్నీ*
*ఇలా తలంలో హేమం పిండగ*
*జగాని కంతా సౌఖ్యం నిండగ*
*విరామ మెరుగక పరిశ్రమించే*
*బలం ధరిత్రికి బలికా వించే*
*కర్షకవీరుల కాయంనిండా*
*కాలువ కట్టే ఘర్మ జలానికి ఖరీదులేదోయ్"*

అలా మాఊరికి తొలకరి ప్రవేశించింది.

ఎప్పుడూ వ్యవసాయం పనుల్లో తొలకరివేళ మునిగిపోయే నాన్నమంచం పట్టేయడంతో నేనే దుక్కి దున్నించి విత్తులునాటించాను. నాగళ్లతో సేద్యం కష్టం అనీ ఒక ట్రాక్టర్ కొన్నాను. మారైతుకొడుకు సన్యాసికి దాన్ని అప్పచెప్పాను.

చాలామంది నేను వ్యవసాయం మొదలు పెట్టగానే "అదేంటిబాబూ! పెద్ద ఇంజనీరింగ్ చదువుకొనీ ఎవసాయం సేత్తున్నారు" అనీ అడగటం మొదలు పెట్టారు.

వాళ్లకి నేను సమాధానంగా 'నవ్వు' నవ్వి ఊరుకున్నాను.

ఆ సంవత్సరం వర్షాలు పుష్కలంగా పడి చెరువులన్నీ నిండి పంట బాగాపండింది. వరిచేలు ఆనందంతో ఊగిపోతూ కనిపించాయి. ఎక్కడ చూసినా పచ్చటి వరిచేలే... ధాన్యపు కంకుల భారంతో తలలు వంచీ వరిచేలు పుడమితల్లికి తమ కృతజ్ఞతలు తెలియచేసాయి.

పక్షుల గుంపు పంటచేలమీద ఎగురుతూ ఉంటే తెల్లటి పువ్వుల దండలా కనిపిస్తున్నాయి. ఇంటి చూరుకు వేలాడే వరికంకుల నిండా కిచకిచమంటూ గొలచేస్తూ పిచ్చుకల గుంపు..

ఆ గోల త్యాగరాజు కృతిలా వీనులకు విందు కలిగిస్తున్నాది.

ఆ సంవత్సరం ఊరి పంట పండింది. వరి ధాన్యపు రాసులతో రైతన్న ఇళ్లన్నీ నిండిపోయాయి. మాకు కూడా పంటబాగాపండింది.

ఆ ఆనందంతో సంక్రాంతి బాగా జరుపుకున్నాము. పౌష్యం ప్రవేశించగానే ఊరంతా సందడే సందడి. ప్రత్యూషానికిముందే ఊరు మేల్కొంటుంది..

ఆ మంచులోనే లాంతర్లు పెట్టిమరీ ఇంటి ముందర రంగ వల్లులు వేసే పెళ్లికాని అతివలు... మరీ ముఖ్యంగా రథం ముగ్గులు.. ఈరోజు నేను తెలవారక ముందే లేచి డాబా మీదనుంచి వీధిని గమనిస్తుంటే అందరి ఇళ్ల ముందూ రథం ముగ్గులేస్తున్న అమ్మాయిలు..

ఆ క్షణంలో నాకు మధూలిక గుర్తుకువచ్చింది. ఆమె కూడా నెల గంటు పెట్టిన దగ్గర్నుంచీ ఇంటి ముందర ముగ్గులు వేసేది.

ఆ తరువాత నెత్తిమీద తలపాగా చేతిలో తుంబురాతో వచ్చేవాడు హరిదాసు... వాడికి బియ్యం వేయిగానే మనస్ఫూర్తిగా పంటలు పండిచల్లగా ఉండాలనీ దీవించేవాడు.

కానీ దురదృష్టవశాత్తూ ఈ సంవత్సరం సంక్రాంతి జరుపుకోకుండానే నాన్నగారు చనిపోయారు. ఒకరోజు అనుకోకుండా అతని ఆరోగ్యం క్షీణించింది. విశాఖపట్నం తీసుకెళ్దాం అనీ నేనుకుంటున్న సమయంలో అతను తుది శ్వాస విడిచారు.



అలా మాకుటంబానికి పెద్దదిక్కు లేకుండా పోయింది. రెండునెలలు దాకా నేను మనిషిని కాలేక పోయాను.

ఆ వేసవిలోనే మాస్టారిగారి అమ్మాయి ఆముక్త మాల్యద వివాహం జరిగింది.

శాస్త్రి మాస్టారుకి డబ్బు ఇబ్బంది వస్తే నేను లక్షరూపాయలిచ్చాను.

పెళ్లివారు మేమనుకున్నంత మంచివారు కాదు. ఆ విషయాన్ని శాస్త్రి గారే రెండు మూడుసార్లు నాతో చెప్పి బాధపడ్డారు.

ఏభైమంది పెళ్లికి వస్తామనీ చెప్పి రెండువందల మందిని తీసుకొచ్చారు. దాంతో మరొక 50000 ఖర్చు అయింది. బంగారం కూడా చాలదనీ మరొక 5 తులాలు అడిగిమరీ పెట్టించుకున్నారు.

పెళ్లికొడుక్కి బైకు, లాప్‌టాప్.. ఇలా ఒకటేమిటి ఎన్నో గొంతెమ్మ కోరికలు కోరడంతో మాస్టారిగారి ఆర్థిక పరిస్థితి బాగా దెబ్బతినీ అప్పులపాలయ్యారు.

మొత్తానికి ఎలాగైతే నేం ఆమె పెళ్లి అయిపోయింది.

అపుడు నాకు అమెరికా వెళ్లాలనిపించింది. పొలాన్ని రైతుకి అప్పచెప్పి అమ్మకి తోడుగా మాపిన్నిని సాయంగా ఉంచి వెళ్లాలనుకున్నాను.

అటువంటి సమయంలో ఒకరోజు మెయిల్లో మధూలిక నుంచి ఒక ఉత్తరం వచ్చింది.

అమెరికా వెళ్లిపోదాం అనుకుంటున్న నా ఆశలకు ఆఉత్తరం నీళ్లు జల్లింది.

ఆ ఉత్తరంలో ఇలా ఉంది.

"శంకరం గారికి,

నేను ప్రస్తుతం చాలా ఇబ్బందుల్లో ఉన్నాను. అనారోగ్యంతో హస్పిటల్లో ఉన్నాను. మీరొకసారి రావలసిందిగా కోరుతున్నాను. మధూలిక" అనీ ఆ హాస్పిటల్ ఎడ్రస్ అందులో వ్రాసింది.

ఆ రాత్రి అంతా నిద్రలేకుండా గడిపాను. అసలు మధూలికకి ఏం జరిగింది. ఎటువంటి కష్టాలొచ్చినా, ఆపదలొచ్చినా తొణకని మనస్తత్వం ఆమెది. ఎవరినీ సహాయం చెయ్యమనీ అడిగే తత్వం కాదామెది. అటువంటిది నన్ను రమ్మనమని ఉత్తరం వ్రాసింది

అంటే చాలా విపత్కర పరిస్థితులలో ఉండి ఉంటుంది.

తెల్లవారు జామున లేచి నా కారులో బయలు దేరాను. ఉదయం పదిగంటలకు హాస్పిటల్ చేరుకున్నాను. అది ఓ ప్రవేట్ హాస్పటల్ అక్కడ చాలా రద్దీగా ఉంది.

డాక్టరుతో మాట్లాడి ఆమెను చూడటానికి వెళ్లాను.

అక్కడ బెడ్ మీద అచేతనంగా మధూలిక...

ఏం జరిగింది... అందానికే మారుపేరైన మధూలికకు ఏం జరిగింది?

ఆరోజు హస్పిటల్లో వాళ్ల మేనత్త సీతమ్మ కలిసి అన్ని విషయాలు చెప్పింది.

మధూలిక తండ్రి శర్మగారు పదవీవిరమణ ఇంకా నెలరోజులుండనగా తీవ్ర అనారోగ్యం చేసి చనిపోయారనీ, ఆ బెంగతో మధూలిక ఆరోగ్యం పాడైందనీ, అందుకే హస్పిటల్లో చేర్పించాననీ ఆమె చెప్పింది. ఆమె కూతురుకి పెళ్లైపోయి హైదరాబాద్ వెళ్లిపోయిందనీ కూడా చెప్పింది.

తండ్రిచనిపోయిన తరువాత ఆర్థికపరిస్థితి తారుమారై డబ్బుకి బాగా ఇబ్బంది ఏర్పడిందనీ, చివరకు హాస్పిటల్ వారికి ఛార్జీలు కూడా కట్టలేని పరిస్థితి ఏర్పడిందనీ ఆమె చెప్పింది.

నేను వెంటనే ఇంకేమీ ఆలోచించకుండా మాఊరికి వాళ్లిద్దర్నీ తీసుకొచ్చేసాను.

మాఫామిలీ డాక్టర్ శ్రీపతి గారిని తీసుకొచ్చి మధూలికను చూపించాను. అతను ఆమెకి అన్ని పరీక్షలు చేసి టైఫాయిడ్ జ్వరమనీ తేల్చి మందు లిచ్చాడు. అలా ఆమె పదిహేనురోజుల్లో పూర్తిగా కోలుకుంది.

మా అమ్మ కూడా మధూలికకి బాగా సేవ చేసింది. ఇక సీతమ్మ మా ఇంటిపనులన్నీ తనే చేయడం మొదలుపెట్టింది.

మధూలికను మాఊరుతీసుకొచ్చి నెలరోజులు దాటింది.

మధూలిక రానురాను కోలుకోసాగింది. ఆరోగ్యం కుదుట బడుతోంది. రోజూ లేచి స్నానం చేసి దేవుడికి పూజ చేసి డాబామీద కొబ్బరిచెట్టు కింద కూర్చొని పుస్తకాలు చదువుకోవడం, సాయంత్రం ఏటికెళ్లడం... ఇదే ఆమె దినచర్య...

ఒక రోజు నేను సాయంత్రం పూట పొలం నుంచి రాగానే మధూలిక నాగురించి ఎదురు చూస్తూ కనిపించింది.

“శంకరం గారూ! నాకిక్కడ సమయం గడవటం లేదు. వంటరిగా ఉంటే మానాన్న గారే గుర్తుకొస్తున్నారు. అందుకనీ ఏంచెయ్యాలో అర్థం కావటం లేదు” అనీ చెప్పింది.

“మధూలిక గారూ! పదండి ఏటివైపు వెళ్దాం. ఆ వాతావరణం మీకు ప్రశాంతతని కలిగిస్తుంది” అనీ అన్నాను.

“రోజూ నేను ఏటివైపే వెళ్తున్నాను. ఈరోజు పొలం వైపు వెళదాం పదండి” అంది.. ఇద్దరం పొలం గట్ల మీద నడుస్తూ మా బోరింగ్ షెడ్డు దగ్గరికి చేరుకున్నాము. సంధ్యా సమయం! గోధూళి వేళ కావడంతో సూర్యుడు పశ్చిమాద్రికి కుంగిపోతునాడు. ఇద్దరం కలసి మా చెరువుగట్టుకి వెళ్ళాము. ఆ చెరువంతా సముద్రంలా కనిపించసాగింది. దూరంగా తెల్లటి కొంగల బారు ఆకాశంలో ఎగురుతూ కనిపించింది. చెరువులో నీటిబాతులు.. చెరువు నీటిమీద నుంచి చల్లటిగాలి వీస్తోంది.

చాలాసేపటివరకు మామధ్య సంభాషణలు లేవు. ఇద్దరం ప్రకృతి వీక్షణలో మునిగి పోయాము.

“శంకరం గారూ! నేనిలా మీఇంట్లో ఉండటం ఇద్దరికీ మంచిది కాదు. లోకులు కాకులు... మన గురించి పరోక్షంగా చెడు మాట్లాడుకుంటారు. అది నాకిష్టం లేదు. ఇద్దరు అవివాహితులైన ఆడ, మగ ఒకింట్లో ఉంటే ఒప్పుకునే సమాజం కాదు మనది. కాబట్టి మీరు వెంటనే మా ఇంటిని బాగు చేయించండి. నేను, మా అత్త అందులోకి మారిపోతాము. నాన్నగారు పదవీ విరమణకి ముందే చనిపోయారు. కాబట్టి ఆ ఉద్యోగం నాకొస్తుందనీ డి ఈ ఓ గారు చెప్పారు. కాబట్టి దానికి అప్లికేషన్ పెట్టాలి. వీలుంటే నన్ను జిల్లా కలెక్టర్ ఆఫీసుకి తీసికెళ్ళండి. ఇంకో ముఖ్య విషయం... మా నాన్నగారు వాళ్ళు ఇద్దరన్నదమ్ములు... పదెకరాల పొలం ఉంది.. మా చిన్నాన్న పక్క ఊళ్లో టీచరు చేస్తూ చనిపోయాడు. అతని కొడుకు శ్రీధర్.. వాడు చాలా చెడ్డవాడు. వ్యసనపరుడు... ఈ ఊళ్లోని ఆ పదెకరాలు వాడే చేస్తున్నాడు. అందులో నావాటా నాకు వచ్చేటట్లు చూడండి. నాన్న గారున్నప్పుడే పొలాల విషయంలో గొడవలు జరగడం నాకు గుర్తు... నేను చెప్పినట్లు చేస్తే మీకు జీవితాంతం ఋణపడి ఉంటాను” అంది మధూలిక.

*ఆ సాయంత్రం మధూలిక కేసుపెట్టడంతో పోలీసులొచ్చి శ్రీధర్ని అరెస్ట్ చేసి తీసికెళ్లి పోయారు. ఆవిధంగా ఆ ఐదెకరాల పొలం మధూలిక స్వంతం అయింది. దాని వ్యవసాయాన్ని మా రైతు వెంకన్నకే అప్పచెప్పాను.*

ఆమెమాటలు నాలో ఆలోచనలు రేకెత్తించాయి.

“అలాగే మధూలికా! రేపట్నుంచీ మీఇంటి మరమ్మత్తులు చేయిస్తాను. పొలం గురించి మీ అన్నతో మాట్లాడుతాను” అనీ చెప్పాను.

చీకటి పడుతుండటంతో ఇంటికి బయలు దేరాము. మధూలిక చెప్పిన పనులన్నీ పూర్తవడానికి నెలరోజులు పట్టింది. ఇపుడు వాళ్ళ ఇల్లు నివాస యోగ్యంగా తయారైంది. రెండు రోజుల క్రితమే ఆమె, వాళ్ళ మేనత్త సీతమ్మగారు ఆ ఇంటికి మారిపోయారు. వాళ్ళకు ఓపని మనిషిని కూడా ఏర్పాటు చేసాను.

టీచరు పోస్ట్కి అప్లికేషన్ పెట్టాము. కలెక్టర్ గారు దానికి రెండు మూడు నెలలు సమయం పడుతుందనీ చెప్పారు.

అన్నింటి కన్నా పొలం విషయంలోనే పెద్ద సమస్య వచ్చింది. శ్రీధర్ని పిలిచి మధూలిక వాటా పొలం ఐదెకరాలు అప్పచెప్పమనీ చెబితే అతను ఒప్పుకోలేదు. నాన్నగారు పెదనాన్నకి పెద్ద మొత్తంలో డబ్బులిచ్చి పొలాన్ని కొనేసారనీ చెప్పాడు. ఆ కాగితాలు చూపించమంటే చూపించటంలేదు.

నేను, మా ప్రెసిడెంట్కి వివరాలన్నీ చెబితే తహశీల్దార్ దగ్గరకి వెళ్లాలని చెప్పాడు.

కొందరి రైతులలో తహశీల్దార్ని కలిసి ఈపొలం పట్టా ఎవరి పేరుమీద ఉందో చెప్పమనీ అడిగితే అతను రెవెన్యూ సర్వేయర్ని మా ఊరు పంపాడు.

వారం తరువాత సర్వే పూర్తైంది. ఆ పొలం శంకరం గారి వారసత్వపు ఆస్తి అనీ, ఇద్దరన్నదమ్ములకూ చెందుతుందని చెప్పాడు.



ఊళ్లో పెద్దమనుషులు పంచాయితీ పెట్టి శ్రీధర్కి, మధూలికకు ఐదేసి ఎకరాలు పంచుతూ తీర్మానం చేసారు. దానికి శ్రీధర్ ఒప్పుకోక పోవటంతో రైతులంతా ఏకమై అతనికి హెచ్చరిక చేసారు.

ఆమర్నాడు నేను మారైతుతో ఆపొలం దున్నిస్తుంటే పదిమంది మనుషులతో వచ్చి శ్రీధర్ అడ్డుకున్నాడు.

ఆ సాయంత్రం మధూలిక కేసుపెట్టడంతో పోలీసులొచ్చి శ్రీధర్ని అరెస్ట్ చేసి తీసికెళ్లిపోయారు. ఆవిధంగా ఆ ఐదెకరాల పొలం మధూలిక స్వంతం అయింది. దాని వ్యవసాయాన్ని మా రైతు వెంకన్నకే అప్పచెప్పాను.

మరో రెండు నెలలకి మధూలికకి టీచరుగా ఉద్యోగం వచ్చి మాఊరి స్కూల్లోనే వేసారు.

అలా ఆమె సమస్యలు ఒక కొలిక్కివచ్చాయి. ఇపుడు ఆమె ఆరోగ్యంకూడా పూర్తిగా నయమై పున్నమి చంద్రుడిలా మునుపటి మధూలికలా తయారైంది.

ఓ ఇరవైమంది పిల్లలకి సంగీతం నేర్పేటట్లు మధూలికని ఒప్పించాను.

ఇపుడు ఆమెకి సమయం తెలియటంలేదు.

రోజూ ఉదయం, సాయంత్రం పిల్లలకి సంగీతం, స్కూలు, ఇంటి పనులు... ఇలా ఆమెకి క్షణం తీరిక దొరకటంలేదు. మధూలికను చూస్తే ఇపుడు నాకు సంతృప్తిగా ఉంది.

శ్రీధర్ పొలం మధూలికని అప్ప చెప్పింద గ్గర్నుంచీ ఆమె మీద శతృత్వం పెంచుకున్నాడు. ఊళ్లో చెరకు క్రషర్ పెట్టి బాగా నష్టపోవడంతో పొలం అమ్ముకోవలసి వచ్చింది. రెండుమూడు సార్లు మధూలిక ఇంటికి వచ్చీ ఆమెని డబ్బుల్విమనీ బెదిరించటం మొదలుపెట్టాడనీ మారైతు నాకు చెప్పాడు.

ఒకరోజు నేను మధూలిక ఇంటికి వెళ్లాను. పిల్లలకు సంగీత సాధన అప్పుడే పూర్తైందికాబోలు వాళ్ళందరూ ఇంటికి వెళ్లిపోతూ కనిపించారు.

మధూలిక చాపలన్నింటినీ ముడిచి లోపలపెడుతోంది. నన్ను చూసి ఆమె మౌనంగా లోపలికి వెళ్లిపోవడం నాకు ఆశ్చర్యం కలిగింది.

నేను కొద్దిసేపు అక్కడే ఉండి ఆమె బయటకురాక పోయేసరికి ఏంచెయ్యాలో తోచక బయటకు వెళ్లిపోతుంటే ఆమె 'శంకరం గారూ' అని పిలవడంతో ఒక్కసారిగా ఆగిపోయాను.

"ఏమీ అనుకోవద్దు... మీరు తరచు మాఇంటికి వస్తే బాగుండదేమో ఆలోచించండి. మీరు నాకు ఎంతో సహాయం చేసారు. అది ఎవరు కాదనలేని సత్యం... ఇది పల్లెటూరు, నలుగురూ నాలుగు రకాలుగా అనుకుంటారు. అలా మనగురించి కొందరు తప్పుగా మాట్లాడుకోవటం నాదృష్టికివచ్చింది. మీరన్నీ తెలిసినవారు. మీకు చెప్పేటంతటిదాన్నికాను. ఇలా అన్నాననీ ఏమనుకోకండి" అంటూ లోపలికి వెళ్ళిపోయింది.

ఆమె మాటలు నాకుసూటిగా గుచ్చుకున్నాయి. ఇంతటి చిన్న విషయాన్ని నేనెందుకు గుర్తించ లేకపోయానో నాకే అర్థం కావటంలేదు. ఒంటిరిగా స్త్రీలున్న ఇంటికి వెళ్ళటం పల్లెల్లో అంతమంచిది కాదనే విషయాన్ని ఆమె బాధపడుతూ నాకు విషయాన్ని చెప్పడం నాలో అశాంతిని రగిల్చింది. ఇక ఆమె ఇంటికి వెళ్ళకూడదనీ నిర్ణయించుకున్నాను.

వారంరోజుల తరువాత శివరాత్రి వచ్చింది. ప్రతీ శివరాత్రికి శివాలయంలో 'హరికథ'ని పెట్టించ టం చాలా రోజులనుంచీ వస్తున్న ఆనవాయితీ... ఈసారి విజయనగరం నుంచి వచ్చింది భాగవతారిణి ఆమెపేరు ఇందిరాబాల, హరికథ చెప్పడంలో ఆమెదో ప్రత్యేకశైలి. శ్రావ్యమైన గొంతు, నిండైన విగ్రహం, స్పష్టమైన వాచకం.. మధ్యమధ్యలో శ్రోతలని కడుపుబ్బా నవ్వించే పిట్టకథలు...

ఈసారి ఆమెరానంటే నేను ప్రత్యేకంగా ఫోన్ చెయ్యడంతో ఆమె తప్పక ఒప్పుకుంది. ప్రతీ సంవత్సరం నాన్నగారున్నపుడు శివరాత్రినాడు మాఇంటికి వచ్చేది. అందుకే కాదనలేకవచ్చింది.

రాత్రి ఎనిమిది గంటలకు "హరికథా కాలక్షేపం" మొదలైంది. 'శివపురాణం' కథ ఆరోజు చెప్పడంతో శ్రోతలందరూ ఎంతో ఆసక్తిగా విన్నారు.

అరగంట తరువాత నేను వెనక్కి తిరిగి చూసి నపుడు మధూలిక కనిపించింది. హరికథ పూర్తైన తరువాత ఆమె వెళ్లిపోతూ కనిపించింది..

చాలారోజులనుంచీ మామధ్య మాటలులేవు. నేనిప్పుడు వాళ్లింటికి వెళ్లడం తగ్గించేసాను.

**--8--**

ఒక రోజు నేను ఉదయాన్నే లేచేసరికి పిడుగు లాంటి వార్త.... మారైతు రంగన్న వచ్చి "బాబూ! మాస్టారింట్లో ఎవరో దెబ్బతినీ పడున్నాడనీ చెప్పుకుంటున్నారు" అని చెప్పాడు.



దాడి మాటలు నాకు అర్థం కాక వెంటనే లేచి బట్టలు వేసుకొని వీధిలోకి బయలుదేరాను.

మధూలిక ఇంటి ముందర చాలా మంది గుమిగూడి ఉండటంతో అక్కడికి వెళ్ళాను.

నన్నుచూసి కొందరు మౌనం దాల్చేరు.

'ఏంజరిగింది' అనీ అడిగాను అక్కడున్న సర్పంచ్ నాయుడుని.

"పక్క ఊరి రైతు పకీరు కొడుకు రాము ఇక్కడ పడిపోయి ఉన్నాడు" అనీ చెప్పాడు.

నేను లోపలికెళ్లి చూసాను.

అప్పటికింకా సమయం 5గంటలే అయింది. మధూలిక ఇంటి తలుపులు వేసి ఉన్నాయి. ఇంటిముందర వసారాలో ఒకవ్యక్తి పడిపోయి ఉన్నాడు. తలమీద, బట్టలనిండా రక్తం...

నేను మధూలిక ఇంటి తలుపులు కొట్టాను. ఐదునిమిషాల తరువాత తలుపు తెరుచుకుంది.

ఎదురుగా మధూలిక.. నన్నూ, అక్కడున్న రైతుల్ని చూసి ఆమె ఆశ్చర్యపోయింది. ఆతరువాత ఎదురుగా రక్తపు మడుగులో పడివున్న వ్యక్తిని చూసి గాబరాపడుతూ.."ఎవరతను?" అని అడిగింది.

"ఎవరో పక్క ఊరి వ్యక్తట.. మీ ఇంటి ముందు పడి ఉన్నాడు. రాత్రి ఇతనేమైనా మీ ఇంటికిగానీ వచ్చాడా?" అని అడిగానామెని.

ఆమె నావైపు చూస్తూ "లేదు. ఎవ్వరూరాలేదు. రాత్రి 9 గంటలకు మేము పడుకున్నాము" అని చెబుతుంటే ఆమె అత్త సీతమ్మ వచ్చి చూసీ ఆమెకూడా ఆశ్చర్యపోయింది.

"లేదు బాబూ! పిల్లలు 8 గంటలదాకా సంగీత సాధన చేసారు. ఆతరువాత వాళ్లంతా వెళ్లిపోయారు. మేము భోజనాలు చేసి తలుపులువేసి పడుకున్నాము. ఆతరువాత ఏంజరిగిందో తెలీదు" అని చెప్పింది.

కొద్ది సేపటికి ఊరి వాళ్లంతా రావడం మొదలు పెట్టారు. వాళ్లంతా అక్కడికి వస్తూ అనేక ప్రశ్నలు వెయ్యడం నాకు నచ్చక నాయుడితో "నాయుడూ! వెంటనే ఇతన్ని హస్పిటల్‌కి తీసికెళితే మంచిది. ఈవ్యక్తి చనిపోలేదు. కాకపోతే తలమీద బాగా దిబ్బలు తగిలినట్లున్నాయి. ఆలస్యం అయితే ప్రమాదం అనీ నేను చెప్పగానే నాయుడు ఒకవ్యక్తితో" "సింహాద్రీ! ఆటో పట్టుకురా పట్నానికి ఎల్లి ఆసుపత్రిలో సూపించాలి.. ఎల్లు" అనీ గట్టిగా చెప్పడంతో ఆ వ్యక్తి పరుగున వెళ్లిపోయాడు.

పదిహేను నిముషాల తరువాత ఆటోవచ్చి ఇంటిముందర ఆగింది. నలుగురు మనుషులు వచ్చి ఆవ్యక్తిని పట్టుకొనీ ఆటోలో పడుకోపెట్టారు. ఆసమయంలో ఆవ్యక్తిని దగ్గరగా చూసింది మధూలిక.

"శంకరం గారూ! ఈవ్యక్తిని పదిరోజులు కిందట నేను మన రేవులో చూసాను. ఆరోజు నాతో తప్పుగా ప్రవర్తించాడు" అనీ మధూలిక చెప్పడంతో నేను ఆలోచించడం మొదలుపెట్టాను.

"ఎవరిమీద అయినా అనుమానమా?"

"లేదు మాశ్రీధర్ అన్నయ్య మీద ఉంది"

"మధూలికా! గాబరా పడొద్దు. మీకెం తెలియ దంటున్నారు కదా! మీరేం భయపడకండి. పోలీసు లొస్తే ఆవిషయమే చెప్పండి. మిగతాదంతా నేను చూస్తాను" అన్నాను.

మధ్యాహ్నం అవుతుండగా మా సర్పంచ్ నాయుడు వచ్చి "శంకరం బాబూ... ఆ పడిపోయి నోడు మన పక్కఊరి పకీరుగాడి కొడుకు.. రౌడీ ఎదవ.. తల మీద ఎవరో బాగా కొట్టడంతో బాగా రక్తం పోయిందట.. ఈరోజు గడిస్తే గానీ చెప్పలేమం టున్నారు.. పోలీసులొచ్చి నాస్టేట్‌మెంట్ తీసుకున్నా రు. రేపు మనూరు కూడా వస్తామన్నారు" అనీ చెప్పాడు.

ఆ తెల్లవారి దెబ్బలు తగిలిన రాము చనిపో యాడు. ఆ సాయంత్రం డాక్టర్ల పంచనామా రిపోర్ట్

కూడా వచ్చింది. అందులో హతుడికి తలమీద బాగా దెబ్బ తగలడంతో మెదడులో నరాలు చిట్లి రక్తం పోవడంతో బ్రెయిన్ డెడ్ అవటంవల్ల చనిపోవడం జరిగింది" అని వ్రాసి ఉంది.

ఊళ్లో జరిగిన హత్య కాబట్టి మా సర్పంచ్ నాయుడు ఫిర్యాదుతో పోలీసులు ఎఫ్ ఐ ఆర్ నమోదు చేసారు.

ఆ మధ్యాహ్నం సబ్- ఇన్‌స్పెక్టర్, ఇద్దరు కానిస్టేబుళ్ళు వచ్చి హత్యజరిగిన ప్రదేశాన్ని చూసారు. వేలుముద్రల నిపుణులు వచ్చి అన్నీ పరిశీలించారు. ఇన్‌స్పెక్టర్ పేరు కిరణ్.

ఇన్‌స్పెక్టర్ మధూలికను ప్రశ్నించడం మొదలుపెట్టాడు.

"మీపేరు"

"మధూలిక"

"ఈహత్య ఎప్పుడూ జరిగిందో మీకు తెలుసా?"

"నాకు తెలియదు.. మేము తలుపులు వేసి పడుకున్నాము. అందుకనీ ఇంటిముందర ఏం జరిగిందో తెలియలేదు"

"మరి హతుడిని ఎప్పుడైనా చూసారా? అతను మీకు తెలుసా?"

"ఒకసారి నేను పడవలో వెళ్తున్నపుడు నాతో అసభ్యకరంగా ప్రవర్తించాడు.. అతనెవరో నాకు తెలియదు. అపుడు మిగతా ప్రయాణీకులు అతనికి బుద్ధి చెప్పటంతో వెళ్లిపోయాడు. ఆరోజు అతను తాగి ఉన్నాడు. అప్పుడు చూడటమే'' అంది మధూలిక...

"మీకు ఈఊళ్లో ఎవరితోనైనా విరోధం ఉందా?"

"నాకెవరితోనూ విరోధంలేదు.. అదీకాక నేనిక్కడ కు వచ్చి మూడు నెలలే అయింది" అని చెప్పింది.

ఇంతలో నేను కల్పించుకొని "సార్! ఈమెకూ, ఆమె చిన్నాన్న కొడుకు శ్రీధర్‌తో భూముల విషయం మీద కొన్ని గొడవలు జరగుతునాయి'' అనీ చెప్పాను.

"మీరెవరు?" అన్నాడు ఎస్సై నన్ను చూసి.

"నాపేరు శంకరం ఈమె మాకు చదువులు చెప్పిన మాస్టారు శర్మగారి అమ్మాయి. ఈమె మాకందరికీ బాగా తెలుసు" అనీ చెప్పాను.

"మధూలిక గారూ! మీఇంటిముందర అదీ మీ వరండాలో జరిగిన హత్యగురించి మీకు తెలియక పోవడం ఆశ్చర్యంగా ఉంది. పైగా హతుడికి మీకు గొడవ జరిగిందనీ చెబుతున్నారు. అంటే హతుడు మీద మీకు కోపం ఉండొచ్చుకదా" సూటిగా ప్రశ్న వేశాడు ఇన్‌స్పెక్టర్ కిరణ్...

మధూలిక ముఖంలో ఆందోళనని నేను గమనించాను. కొద్దిసేపు మౌనంగా ఉండి "ఇన్‌స్పెక్టర్ గారూ...మీరు అనవసరంగా ఆరోపణ చేస్తున్నారు. రాత్రి 9 గంటలకు తలుపులు వేసిపడుకున్న నేను తెల్లారి ఊరి వాళ్ళు లేపితేగానీ తలుపులు తియ్యలేదు. ఈ విషయంలో నాకేం సంబంధంలేదు. దయచేసి అటువంటి ఆరోపణలు చెయ్యొద్దు" అనీ ధైర్యంగానే సమాధానం చెప్పింది.

ఆ తరువాత ఇన్‌స్పెక్టర్ మాఊరి వాళ్ళను మరికొన్ని ప్రశ్నలు వేశాడు.

వెళ్లిపోతూ నాతో "శంకరం గారూ.. ఈ విషయంలో అవసరం అయితే ఆమె స్టేషన్‌కి రావలసి ఉంటుంది. ప్రస్తుతానికి ఆమె అనుమానితు రాలు మా దర్యాప్తు కొనసాగుతుంది" అని చెప్పి వెళ్లిపోయాడు.

నాకెందుకో ఇన్‌స్పెక్టర్ని చూసి ఒక విధమైన అనుమానపు ఛాయలు గోచరించాయి.

బహుశా అతను మధూలికను అనుమానిస్తున్నా దేమోనన్న ఆలోచన నాకు వచ్చింది.

పోలీసులకు గానీ ఒకసారి అనుమానం వస్తే వాళ్ళు అంత త్వరగా దాన్ని వదలరు.. పోలీసులు కాబట్టి అందులోనూ మధూలిక ఇంటి వరండాలో

*వారంరోజుల తరువాత శివరాత్రి వచ్చింది. ప్రతీ శివరాత్రికి శివాలయంలో 'హరికథ'ని పెట్టించ టం చాలా రోజులనుంచీ వస్తున్న ఆనవాయితీ... ఈసారి విజయనగరం నుంచి వచ్చింది భాగవతారిణి ఆమెపేరు ఇందిరాబాల, హరికథ చెప్పడంలో ఆమెదో ప్రత్యేకశైలి. శ్రావ్యమైన గొంతు, నిండైన విగ్రహం, స్పష్టమైన వాచకం.. మధ్యమధ్యలో శ్రోతలని కడుపుబ్బా నవ్వించే పిట్టకథలు...*

హత్య జరిగింది కాబట్టి అతనికి మధూలిక మీద అనుమానం రావడంలో తప్పులేదు. పైగా అది అతని వృత్తి ధర్మం.

ఈవిషయంలో అతన్ని అనడానికి ఏమీలేదు..

మర్నాడు ఇంకో పోలీసు కానిస్టేబుల్ వచ్చి మధూలిక దగ్గర, ఆమె అత్త సీతమ్మ దగ్గర స్టేట్‌మెంట్‌లు లిఖిత పూర్వకంగా తీసుకున్నాడు.

ప్రతీరోజు పోలీసులు తనింటికి రావడం మధూలికను ఆందోళనకి గురిచేయసాగింది. ఒకరోజు నేను ఇంటికి వెళ్లినపుడు "అసలు ఏం జరుగుతోందో నాకు అర్థం కావటం లేదు. స్వంత ఇల్లు, పొలాలున్నాయనీ ఊరు వస్తే దేవుడు కఠిన పరీక్షలు పెడుతున్నాడు. ఇపుడు నేనేంచెయ్యాలి" అనీ అడిగింది.

'మధూలిక గారూ! ప్రతీవారి జీవితంలో ఎప్పుడో అపుడు ఇలాంటి సమస్యలు వస్తూనే ఉం టాయి. మీరేమీ గాబరా పడొద్దు. ఇదివరకు శ్రీధర్ మీకు పంపిన ఉత్తరాలు ఏవైనా ఉంటే ఇవ్వండి.. నా ఉద్దేశ్యంలో ఇదంతా అతని కుట్రే ననిపిస్తోంది. ఇంకెవ్వరికీ మీకు హానిచేసే ఉద్దేశ్యం ఉండదు. అసలు ఆవ్యక్తి ఈ ఊరు ఎందుకువచ్చాడో, ఏం జరిగిందో అన్నీ తెలుసుకుంటే ఈకేసు చిక్కుముడి విడుతుంది. అవన్నీ నేను చూసుకుంటాను. మీరు గాబరా పడకుండా మీ పనులు మీరు చూసుకోండి" అనీ చెప్పి ఆమె ఇచ్చిన ఉత్తరం తీసుకున్నాను.

అది శ్రీధర్ మొదటిసారిగా పొలం తనదేననీ, ఆమె నాన్నకు ఆపొలం డబ్బులు తనతండ్రి ఇచ్చాడన్న ఉత్తరం... అది టైపుమిషన్‌తో టైపు చెయ్యబడింది.

ఆ మధ్యాహ్నం నేను పోలీసుస్టేషన్‌కి వెళ్లి ఎస్సైని కలిసాను.

"సార్! ఆమెకు శ్రీధర్ స్వయాన చిన్నాన్నకొడుకు. వాళ్ళకు ఆస్తివిషయమై కొన్ని గొడవలున్నాయి. ఆమెకు న్యాయంగా రావలసిన తనతండ్రి వారసత్వ పు ఆస్తిని ఇవ్వకుండా ఆమెమీద కేసులుపెట్టాడు. ఆమెమీద రెండుసార్లు దాడి చెయ్యడానికి తన మనుషులతో ప్రయత్నంచాడు. ఇదే హతుడు రాము ఆమెమీద తాగి దాడికి ప్రయత్నించాడు. ఇదంతా ఆశ్రీధర్ కుట్ర. కాబట్టి మీరు ఆశ్రీధర్‌ని స్టేషన్‌కి పిలిపించి విచారిస్తే అన్నివిషయాలు తెలుస్తాయి. మధూలిక ఒక వంటరి స్త్రీ... ఆమెకు నా అన్న వాళ్ళు లేరు... ఆమెని ప్రతీరోజు విచారణపేరిట పోలీస్‌స్టేషన్‌కి పిలిపించడం భావ్యం కాదు'' అన్నాను.

"శంకరం గారూ! ఈకేసుని త్వరగా తేల్చమనీ మా ఎస్పీగారు కూడా చెబుతున్నారు. హంతకుణ్ణి పట్టుకోవాలి. శ్రీధర్‌ని ప్రశ్నించాలంటే ఆధారాలు ఉండాలి కదా... హతుడు ఆమె ఇంట్లో పడి ఉండటతో ఆమెని ప్రశ్నించవలసివస్తోంది. అదీకాక హతుడు ఇదివరకు ఆమె మీద దాడిచేసినట్లు చెప్పింది. అందుకే ఆమెమీద అనుమానం.. ఈ కేసులో త్వరగా ఛార్జిషీటు కోర్టులో దాఖలు చెయ్యాలి" అన్నాడు ఫైలుని నాకు చూపిస్తూ

నేను కొద్దిసేపు ఆఫైలంతా చదివాను.

"ఎస్సై గారూ! మీరు శ్రీధర్, రాముల కాల్‌లిస్టు వివరాలు తెప్పిస్తే వాళ్ళు ఎవరెవరితో మాట్లాడారో తెలిసి ఒక ఆధారం దొరకొచ్చు. ఆవిధంగా ప్రయత్నించ కూడదూ" అనీ చెప్పాను.

"ఆపనిమీదే ఉన్నాను. వాళ్లతో పాటు ఆమె కాల్స్ వివరాలు కూడా తెప్పిస్తున్నాము. చూద్దాం... ఏం జరుగుతుందో.. ఆపొలం విషయమై మీఊళ్లో మరికొందరినీ ప్రశ్నించాలి." అన్నాడు కిరణ్..

"మధూలిక, శ్రీధర్లిద్దరూ పెదతండ్రి పినతండ్రి పిల్లలు వాళ్ళకు పదెకరాలపొలం ఉంది. మొన్ననే మధూలిక తండ్రి చనిపోయారు. ఆమెవాటా ఐదెకరాలు ఆమెకివ్వమనీ అడిగితే శ్రీధర్ ఒప్పకో వటం లేదు. ఇన్ని సంవత్సరాలనుంచీ వాళ్ళ కుటుంబమే ఆ ఫలసాయం అనుభవించింది. ఈ మధ్యనే ఆ పొలాన్ని ఆమెకి అప్పచెప్పాడు. ఆ కోపంతోనే ఇవన్నీ చేయిస్తున్నాడు అని నా అనుమానం" అని చెప్పి వచ్చేసాను.

**(ఇంకా వుంది)**

***రచయిత సెల్: 7752020123***



**సమీక్ష** - సి.ఎస్. రాంబాబు

# కలలు కన్నారు... కన్నీరు తుడిచారు

ఆకాశవాణిలో బాధ్యతలు నిర్వహించే కార్యక్రమ నిర్వహణాధికారులలో వ్యవసాయ విభాగపు కార్యక్రమ నిర్వహణ అధికారుల ప్లానింగ్ కానీ పనితీరు కానీ ప్రత్యేకం. ఆ ప్రత్యేక కోవకు చెందిన కార్యనిర్వహణాధికారి వలేటి గోపిచంద్. సమయాన్ని అత్యంత జాగురూకతతో వినియోగించే వ్యక్తి. ఎప్పటికప్పుడు అక్షరం చరిత్రను రికార్డు చేయాలని నమ్మే ఆశావాది.

అందుకే కొవిడ్ బీభత్సంలోనూ కాలాన్ని సద్వినియోగ పరుచుకున్నాడు. కొవిడ్ మొదటి వేవ్‌లో తను చదువుకున్న బా.వ్య.క.(బాపట్ల వ్యవసాయ కళాశాలను అలా ప్రేమగా పిలుస్తాడు) డెబ్భై ఐదు సంవత్సరాలను స్ఫురింప చేస్తూ "ఒకనేల–అనేక ఆకాశాలు" శీర్షికన అక్కడ చదువుకున్న వివిధ బ్యాచ్‌ల వారి సమాచారాన్ని అందంగా అచ్చేసి అందరికీ ఆదర్శంగా నిలిచాడు. బహుశా దేశంలో మరెక్కడయినా ఇటువంటి ప్రయత్నం జరిగుండకపోవచ్చు. కానీ అలా జరగాలన్న ఆలోచనకు అంకురార్పణ చేశాడు.

అక్కడితో తన అన్వేషణ పూర్తయిందా?. లేదు... కొవిడ్ సెకండ్ వేవ్ లో మరో ఆలోచనను నిశ్శబ్దంగా పుస్తకంగా మార్చి మరోసారి మనలను ఆశ్చర్య పరిచాడు. ఈసారి ఆ ఆలోచన పేరు – వెలుతురు తోవలు. బాపట్ల వ్యవసాయ కళాశాల(బా.వ్య.క) లో చదివిన యాభైమూడు మంది వ్యక్తుల జీవనరేఖలను హరితరేఖలుగా చూపుతూ హృదయాన్ని హత్తుకునేంత మృదువుగా, నాజూకుగా ముద్రించాడు. మన చేతుల్లో పెట్టాడు. జర్నలిస్ట్ ఆకుల అమరయ్య గారి రచనా సహకారంతో సంకలనంగా రూపొందిన వీరందరి విజయగాథలు మనలను అబ్బురపరుస్తాయి.

ఒక జీవితమే అనుభవాల పుట్ట అనుకుంటే యాభైమూడు జీవితాలు పంచే వెలుగులను ఊహించండి. ఊహకి అందనంత వైవిధ్యంతో తొణికిసలాడతాయి వారి జీవితాలన్నీ. మొక్కవోని దీక్షతో రైతును, వ్యవసాయాన్ని.. నేలను, పంటను ముడివేసేందుకు తమను తాము ముడిసరుకుగా మార్చుకుని మురిసిపోయిన (సా)మాన్యులు వీరంతా అని చెప్పక తప్పదు.

తమదృష్టిని పరిశోధనపై పెట్టి నేల అణువణువును శోధించిన వారున్నారు, దేశవిదేశాలలో జయకేతనాన్ని ఎగరేసినవారున్నారు, ప్రైవేటు సంస్థల్లో ఉన్నా రైతేరాజని భావించి తమకృషిని కొనసాగించినవారున్నారు.

అలా ఎవరి పంథావారిదే. వారి అడుగుజాడల 'వెలుగుతోవలు' మనకు చూపించటానికి వలేటి గోపిచంద్ పడిన కష్టమే ఈ గ్రంథం.

పూర్తి సాంకేతికతతో నింపకుండా అందరికీ అర్థమయే రీతిలో ఈ యాభై మూడుమంది వ్యక్తుల జీవనపయనాన్ని తీర్చిదిద్దటం వలన ఈ పుస్తకం అందరినీ చేరుతుంది. స్ఫూర్తిని నింపుతుంది.తామేదో విజయం సాధించామని ఈ యాభై మూడుమంది అనుకోలేదంటారు గోపిచంద్. నమ్మినదాన్ని ఆచరించి చూపటమే వారు వేసిన వెలుగుబాట అంటారు.

కొందరి కృషిని మనం గమనిస్తే వారి క్రమశిక్షణ ఆశ్చర్యపరచకమానదు. ఈ పుస్తకం విత్తనరంగ పితామహుడు యలమంచిలి యోగేశ్వరరావు చూపిన వెలుగుతోవను స్మరిస్తూ తొలి అడుగు వేస్తుంది. డాక్టర్ కావాలని ఇంట్లో వారు తపిస్తే విశ్వనాథ సత్యనారాయణ గారి పాఠాలు విని అధ్యాపకుడినవాలని ఆకాంక్షించారు వారు. పరిశోధన విస్తరణలే కళ్ళుగా తమ ప్రస్థానాన్ని సాగించారు. విత్తనరంగ నిపుణులుగా తన ప్రత్యేకతను చాటుకున్నారు.

ఏ బ్యాంకులో ట్రెయినీగా చేరారో అదే బ్యాంక్ ఛైర్మన్‌గా బాధ్యతలు చేపట్టడం ఎందరికి సాధ్యం.ఆ ఘనతను సాధించినవారు ప్రస్తుత నాబార్డ్ ఛైర్మన్ చింతల గోవింద రాజులు. వారి తండ్రి బుచ్చయ్య 6 నెలలు సెలవుపెట్టి పిల్లలకు ఇంగ్లీషు,గణితం నేర్పించారన్న సూక్ష్మ సమాచారన్నందచేస్తారు సంకలనకర్త.

ఇదే రీతిలో బి.పి.సి.ఎల్.లో ట్రైనీగ చేరి అదే ప్రభుత్వ రంగ సంస్థ కు సీఎండీ స్థాయికి ఎదిగిన ఒక వ్యవసాయ పట్టభద్రుడు కప్పగంతుల పద్మాకర్. ఎవ్వరూ ఊహించని జీవనగమనం. చాలా సందర్భాలలో చక్కని శీర్షికలతో విషయాన్ని చెప్పకనే చెబుతారు. ఏషియన్ డెవలప్మెంట్ బ్యాంక్‌లో వాతావరణ మార్పుల బృందం ఛైర్మన్ డా.అంచా శ్రీనివాసన్ జీవనరేఖలు స్పృశిస్తూ వాతావరణ మార్పులతో వచ్చే నష్టం శ్రీనివాసుడి చక్రంతో చెక్ అని చెబుతారు.

వరితో మమేకమయిన యస్.వి.యస్.శాస్త్రి గారి గురించి చెబుతూ వారు ఏ పల్లె వాతావరణంలో పెరగలేదంటారు. కానీ ఆ ఒక్క వాక్యం శాస్త్రిగారి నిబద్ధతకు గీటురాయిలా తోస్తుంది. అంతేకాకుండా భారత దేశ యువాన్ లాంగ్ పింగ్ అని వారిని పేర్కొనటం కూడా అబ్బురమనిపిస్తుంది.

ఇక నీలంరాజు గంగా ప్రసాద్ రావు ను హైబ్రిడ్ జొన్న పితామహుడు అని అభివర్ణిస్తారు పద్మశ్రీ డా.ఐ.వి.సుబ్బారావును 'రైతునేస్తం'గా ప్రశంసిస్తూ వారు వైస్ ఛాన్సలర్‌గా ఉన్న కాలంలోనే పరిశోధన, విద్య, విస్తరణ రంగాలలో వీరు ప్రవేశపెట్టిన మార్పులు ఇతర విశ్వవిద్యాలయాలకు మార్గదర్శకమయ్యాయంటారు గోపీచంద్. ఏరువాకకేంద్రాలు వారి మానసపుత్రికలని కూడా చెబుతారు. సాంబ మషూరీ రూపకర్త ఎమ్.వి.రెడ్డి కృషిని పేర్కొంటూ 1986లో విడుదలైన ఈ బిపిటి 5204 జైత్రయాత్ర ఇంకా కొనసాగుతుండటానికి కారణం వృత్తిపట్ల వారి అంకితభావం, క్రమశిక్షణ అంటారు సంకలనకర్త.

అనకాపల్లి పరిశోధనా స్థానంకు చెరుకులో ప్రత్యేక గుర్తింపు తెచ్చిన వారు డా.కొటికలపూడి ప్రసాదరావు. వారి ముప్ఫై ఎనిమిదేళ్ళ పరిశోధనలో పధ్నాలుగు కొత్త వంగడాలను సృష్టించారు. వారిపై సమగ్ర సమాచారం ఆసక్తికరం.

జీవితం సృష్టించిన ఒడిదుడుకులను ఎదుర్కొన్న యాగంటి గారి తెగువ మనలను ఆశ్చర్యపరచకమానదు.

ఎక్కడైతే అసిస్టెంట్‌గా పనిప్రారంభించారో అదేచోట అధిపతి అయిన ఖ్యాతి డా.నాయని శ్రీరామచంద్రమూర్తి ది. గుంటూరు మిర్చి ఘాటుని అంతర్జాతీయంగా వ్యాప్తి చేశారు వారు. కేవలం వ్యక్తుల గురించే కాక పరిశోధన నిబద్ధతను మన ముందుంచుతుందీ పుస్తకం. ఉదాహరణకు బిపిటి 5204 విజయం వెనుక ఆరేడేళ్ళ పాటు శ్రమించిన బృందంతో పాటు రైతుల స్వేదం ఉంది.

ఇక స్వర్ణ రకం ప్రాచుర్యం పొందడంలో డా.ఎన్.శ్రీరామరెడ్డి కృషి అపారం. డా.యువాన్ లాంగ్ పింగ్‌లి ను మార్టేరు కు రప్పించిన ఘనత కూడా వారిదే అని తెలుస్తుంది. సేవే మార్గంగా ఎంచుకున్న బెల్లం కోటయ్యలి పొగాకు ప్రాసెసింగ్ యూనిట్ నెలకొల్పిన వ్యక్తిగా మన్ననలు పొందుతారు.

సమగ్ర సస్యరక్షణతో రైతుల గుండెచప్పుడయిన డా.గంగవల్లి వెంకటరంగా రావు ఎరపంటల విధానానికి రూపకల్పన చేశారని తెలిసినప్పుడు ఆశ్చర్యమేస్తుంది. ఇవన్నీ ఒకెత్తు. ఆయన వెటరన్స్ విభాగంలో టేబుల్ టెన్నిస్ క్రీడలో ప్రాతినిధ్యం వహించటం అరుదైన విషయంగా చెప్పుకోవాలి.

అగ్రోక్లైమాటాలజీ కే జీవితాన్ని అంకితం చేసిన డా.మన్నవ శివకుమార్‌ని ఎలా మర్చిపోతామనిపిస్తుంది వారిపై సమగ్ర సమాచారాన్ని చూశాక.

మెట్ట ప్రాంతాలలో నూనె గింజల ఉత్పత్తిని స్థిరపరచటానికి కృషిచేసినవారు డా.ఎంవీఆర్ ప్రసాద్. వర్షాభావ పరిస్థితులలోనూ సాగుచేయగల 'నరసింహ' పత్తి రకాన్ని రూపొందించిన డా.కాదరాబాద్ రవీంద్రనాథ్ ను ఆయనే నరసింహ ఆయనే బ్రహ్మ అని చమత్కరిస్తారు.

డా.ఏ.సుబ్రమణ్యేశ్వరరావు తన 37 సంవత్సరాల సర్వీసులో కలుపుపై 97 పరిశోధనా పత్రాలు సమర్పించారంటే ఆశ్చర్యం వేయదూ. కలుపు నిర్మూలనలో వారి కృషి అనన్య సామాన్యం.

ఆంటిగ్వా దేశ కస్టమ్స్ విభాగంలో కంప్ట్రోలర్ గా బాధ్యతలు నిర్వహిస్తున్న బొడ్డు రాజు గారు బా.వ్య.క.నాటిన విత్తనమే. ఇప్పుడు ప్రపంచ గాలులు వీస్తోంది. నూనెగింజల పరిశోధనను ఒక గాటన పెట్టినవారుగా గుర్తుండి పోతారు డా.వీరవనేని రంగారావు. ఉరిమే ఉత్సాహం వారిదంటారు సంకలనకర్త. బ్యాంకింగ్ రంగంలో అపారమేధోసంపత్తి కలిగిన బ్యాంకర్ ఫరీద్ అహ్మద్ గారెక్కడివారనుకున్నారు! నిస్సందేహంగా బా.వ్య.క.ప్రాడక్టే.. పంజాబ్ సింధ్ బ్యాంక్ ఎక్సిక్యూటివ్ డైరక్టరు కూడావారు. స్వయంకృషి, పట్టుదల, తండ్రి చూపిన బాట కలిపితే తక్కెళ్ళలక్ష్మీ నరసయ్య అవుతారు. కమ్యూనిస్ట్ నేపథ్యం వారిని నిత్యసామాజికుడిని చేసిందంటారు మిత్రులు.

బా.వ్య.క. పూర్వ విద్యార్థుల్లో ఇద్దరే మహిళామణులు కన్పిస్తారు. ఒకరు కొండపల్లి సీతారామయ్య మనవరాలిగా మానవ హక్కుల కోసం కృషిచేస్తున్న కావూరి అనూరాధ. మరొకరు వ్యవసాయ చదివి వ్యాపార రంగంలో అడుగుపెట్టిన నరహరిశెట్టి శిరూషా భిన్న అభిరుచులు..విభిన్న దారులనిపిస్తాయి.

కొందరి అనుభవాలు స్ఫూర్తిదాయకం. డిగ్రీల కన్నా రైతు క్షేత్రాల అనుభవం మిన్న అన్న పెసర ప్రతాపరెడ్డిలి ఉల్లికోడు తట్టుకునే రకాలపై దృష్టి సారించి పదకొండు రకాలకు రూప కల్పన చేశారు.

బా.వ్య.క.పూర్వ విద్యార్థుల్లో తక్కువ ఖర్చుతో నూతన సాగు పద్ధతులను తన కంపెనీ ద్వారా అందించిన సిరం చంద్ర మోహన్ లాంటి వారున్నారు..సినీనటుడు చంద్రమోహన్ కూడా బా.వ్య.క. పూర్వ విద్యార్థే. ఒకప్పుడు బ్రెడ్ అంటే మోడరన్ బ్రెడ్ మాత్రమే ఉండేది. అలాంటి ప్రభుత్వ సంస్థను తీర్చిదిద్దిన మాధవపెద్ది మురళీకృష్ణ బా.వ్య.క. లోనే చదివారు.

అలాగే వ్యవసాయం చదివి కెరీర్‌ను మైనింగ్ వైపు మళ్ళించుకున్న రామరాఘవరెడ్డి ఎమ్మెస్ పూర్తిచేయలేక ఆ దిశగా సాగినా అటువంటి సాహసోపేతమైన నిర్ణయానికి భూమికను ఏర్పరిచింది బాపట్ల కళాశాలే అనిపించక మానదు..

గుంటూరు లాంఫాం ఎన్ని అవరాల రకాలను రూపొందించిందో.. దాని వెనకున్న డా.యార్లగడ్డ కోటేశ్వరరావు కృషి వెలకట్టలేనిది.అదేవిధంగా చెరకు పంటపై కృషిచేసిన డా.జెవిఆర్ భూపాలరావు ఆచార్య ఎన్జీరంగా భావజాలంతో ప్రస్తుతం స్వగ్రామాన్ని తీర్చిదిద్దుతున్నారు..




రాగులు రకాలను అభివృద్ధి పరచిన తంగుడు వెంకటేశ్వరరావు గారికి రంగస్థలమంటే ఆసక్తి. ఇక నిబద్ధతతో నువ్వుల రకాలను అభివృద్ధి చేసినవారు సున్నం గంగాధరరావు. బాపట్లలో చదివి అంతర్జాతీయ కంపెనీలకు మేనేజింగ్ డైరక్టర్ స్థాయికి ఎదిగిన రామ్ కౌండిన్య వ్యవసాయ రంగంలో బయోటెక్నాలజీ విస్తరణకు కృషిచేశారు. వ్యవసాయంలో రిమోట్ సెన్సింగ్ టెక్నాలజీ ప్రవేశపెట్టిన ఘనత ఎల్.వెంకట్ రత్నం గారిది. పరిశోధనతోపాటు ఆరోగ్యం ఆటల్లో కూడా రాణించినవారిలో చెప్పుకోదగ్గ వారు డా.కన్నాజీ ప్రసాదరావు.

ఎక్కువ సమాచారం దొరికినట్టులేదు క్లుప్తంగా చెప్పినా నికరమైన సమాచారాన్నిచ్చారు స్వర్ణ రకాన్ని అభివృద్ధి పరచిన విన్నకోట రామచంద్రరావు గురించి. అలాగే దోమపోటును తట్టుకునే రకాలను రూపొందించిన డా.చలసాని భాస్కరరావు, నెల్లూరి ప్రాంతానికి అనువైన రకాలు రూపొందించిన జి.వెంకటేశ్వర రెడ్డి ల గురించి కూడా బాగా రాశారు.

జీవితమంటే కష్టసుఖాలని తెలుసుకున్న నాదెళ్ళ లక్ష్మీనారాయణ జీవన యానం వ్యక్తిత్వ పాఠం లాంటిదనిపిస్తుంది.పత్తిని అమితంగా ప్రేమించి జిన్నింగ్ మిల్లు కూడా పెట్టిన నాదెళ్ళ లక్ష్మీనారాయణ తన జర్నీ లోని ఒడుదుడుకులను అధిగమించిన తీరు అభినందనీయమనిపిస్తుంది. బాపట్ల నుంచి గ్లోబల్ లీడర్ గా ఎదిగిన డా.కుంపట్ల శివప్రసాద్ పంటల అభివృద్ధికి మాలిక్యులార్ బయాలజీ కీలకమని గ్రహించి ఆ దిశగా కృషిచేసిన సంగతులు అబ్బురమనిపిస్తాయి. ద్రవరూపంలో బయోఫెర్టిలైజర్స్ మొక్కల కందించవచ్చని గ్రహించినవారు నున్నా త్రిమూర్తులు. వారి అనుభవం ఆసక్తికరం. అదేవిధంగా బెట్టపరిస్థితులను తట్టుకుని దిగుబడినిచ్చే వేమన వేరుశనగ రకాలను రూపొందించిన కృషీవలుడు డా.పి.నరసింహారెడ్డి అనుభవం ఎంతో విలువైనది.

హైబ్రిడ్ వరి వంగడాలను రూపొందించడంలో దిట్ట పాలడుగు వెంకట సత్యనారాయణ మొక్కవోని దీక్ష 23 వరివంగడాల అభివృద్ధికి ఆలంబన అయింది. గ్రామీణ భారతాన్ని చుట్టిన వీరుడు జె.అఖండరావు తమిళనాడు లో పనిచేశారు. సాహిత్యంతో సమాజాన్ని అర్థంచేసుకున్నారు. తను పనిచేసిన ప్రాంతంలో భాగమైన వాళ్ళ వచ్చునూర్‌లో వ్యవసాయ కళాశాల ఏర్పాటుకు కృషిచేశారు. పలు సామాజిక ఉద్యమాలలో చురుకైన పాత్ర పోషించిన డా.నాగుబడి వెంకట్రావు తరిమెల నాగిరెడ్డి పుస్తకాన్ని తాకట్టులో భారతదేశం పేరిట అనువాదం చేశారు. చదువును నిర్లక్ష్యం చేయలేదు. పరిశోధన లోనూ అదే శ్రద్ధ చూపించారు. నిరంతర సంచారి డా.మట్టా రాజకుమార్‌ను చివరికి ఔషధమొక్కలు నిలువరించాయి. రెండు వందలకు పైగా ఔషధజాతి మొక్కలు సేకరించి వనాన్ని రాజేంద్ర నగర్‌లో ఏర్పాటుచేశారు.

భారత దేశంలో రెండవ హరిత విప్లవానికి బయోటెక్నాలజీ కీలకం అని నమ్మిన నూతలపాటి చంద్రశేఖరరావు నిరంతర పరిశోధనాశీలి. కారల్ మార్క్స్ గతితార్కిక భౌతిక వాదం ప్రపంచాన్ని అర్థం చేసుకోవటానికి అవసరమంటారు.

ఈసంకలనంలో పొందుపరచిన యాభైమూడు మందిలో పరిశోధనలు చేసినవారు, రైతు క్షేత్రాలతో మమేకమయిన వారు, పరిశ్రమలు పెట్టినవారు, విదేశాల్లో తమ ప్రతిభను చాటినవారున్నారు. సేంద్రియ వ్యవసాయ అవసరాన్ని గుర్తించి ఆ దిశగా ఉద్యమ కారుడిగా, ప్రయోగశాలిగా కృషిచేస్తున్న జివి రామాంజనేయులు వంటి వారున్నారు. ఆదివాసీ జీవనవిధానానికి ఆలంబనగా నిలిచిన వాసన్ రవీంద్రన్ లాంటి వారున్నారు. అందుకు భిన్నంగా వాణిజ్య పత్తి రకాలను రూపొందించి విజయాన్ని సాధించిన పిన్న వయస్కుడు జన్ని చంద్రశేఖర్ లాంటి వారున్నారు.

వీరందరూ ఏదోవిధంగా తాము అనుకున్న లక్ష్యాన్ని చేరుకునేందుకు కృషిచేసినవారే. తమ సంకల్పాన్ని ఆవాహన చేసుకున్నవారే. అందరూ గ్రామీణ ప్రాంతాలనుంచి వచ్చిన మధ్యతరగతి దిగువ మధ్యతరగతి కుటుంబాలనుంచి వచ్చారు. వారందరి జీవనప్రయాణాన్ని ఆసక్తికరమైన కథనంగా మార్చిన మిత్రులు వలేటిగోపిచంద్, అమరయ్య ల సూక్ష్మ దృష్టిని అభినందించాలి. ఇలాంటి ప్రయత్నంలో తానున్నానని వారికి వెన్ను దన్నుగా నిలిచిన బద్దెవోలు శ్రీహరిరెడ్డి గారు కూడా అభినందనీయులే.

పూర్వ విద్యార్థుల కలయికే అపూర్వం అనుకుంటాం మనం.మరో అడుగు ముందుకేసి వారి జీవనపథాన్ని రికార్డు చేయటం అరుదు. ఇలాంటి సంకలనాలు మరెందరికో ప్రేరణనిస్తాయి. ప్రతి రంగంలోను తమదైన ముద్రవేసే వ్యక్తులు ఉంటూనే ఉంటారు. కానీ వారి జీవన రేఖలను అక్షరబద్ధం చేసేవారే వెలుగు దీపాలై గతాన్ని వర్తమానాన్ని ముడేసి భవిష్యత్తు బాట ఇలా ఉండాలని మృదువుగా చూపుతారు. ఆ మేరకు ఆ లక్ష్యాన్ని సాధిస్తుందీ పుస్తకం.

రైతు నేస్తం ప్రెస్ వారు అందంగా అచ్చు వేశారు.

తల్లవజ్ఝల శివాజీ గీసిన ముఖచిత్రం అందంగా ఆర్థవంతంగా, ఆకర్షణీయం గా ఉంది. తప్పని సరిగా అందరినీ ఆకట్టుకుంటుంది.

**250 పేజీల రంగుల పుస్తకం వెల కేవలం 200 రూపాయలే. పోస్ట్ లో పొందేవారికి అదనం మరో యాభై రూపాయలు. ప్రతులకు హైదరాబాద్ ఖైరతాబాద్ లోని రైతు నేస్తం వారి ఆఫీసును, సంకలన కర్త గోపీచంద్ నీ 9441276770 ఫోన్లో సంప్రదించవచ్చు.**

***రచయిత సెల్: 83748 18961***



# ఒక అనుభవం నుండి మరో అనుభవంలోకి...

– డా॥ రూప్ కుమార్ డబ్బీకార్

తెలుగు సాహిత్య సరస్సులో శతక కుసుమం 12వ శతాబ్దంలో ఆవిర్భవించినట్లు తెలుస్తుంది. అప్పట్నుంచి ఎన్ని రకాల నూతన ప్రక్రియలు వచ్చినా, తెలుగు సాహిత్యంలో శతకం సజీవ ప్రవంతిలా అవిచ్ఛిన్నంగా సాగుతూ వస్తున్నది. ఆంగ్ల సాహిత్యంలో సానెట్, హిందీలో దోహా, ఉర్దూలో గజల్, రుబాయిలు లాంటి సాంప్రదాయ కవితలకు దీటుగా తెలుగులో శతక సాహిత్యం తన స్థానాన్ని పదిలపరుచుకుంది. మల్లికార్జున పండితారాధ్యుని 'శివ తత్వసారం' శతక వాఙ్మయమునకు ఆద్యముగా చెబుతారు. కానీ, పాల్కురికి సోమన 'వృషాధిప శతకము' తొలి సంపూర్ణ శతకంగా ప్రసిద్ధి చెందింది. సుమారు సోమన కాలంలోనే బద్దెన సుమతీ శతకం కూడా వెలుగులోకి వచ్చింది. తెలుగులో మొట్టమొదట వెలసిన శతకములన్నీ శైవమత సాంప్రదాయకములు. దీనిని బట్టి తెలుగులో శతక సాహిత్య ప్రక్రియకు ఆద్యులు శైవ కవులే అని కూడా చెబుతారు.



వేణుశ్రీ గారు సీనియర్ కవి. ఛందోబద్ధమైన పద్యాలే కాదు వచన కవితలన్నా అభిరుచి చూపి ఇష్టంతో రచనలు చేస్తారు. కవి సమ్మేళనాలలో, సాహితీ సభల్లో కలిసినపుడు వారు చూపే అభిమానం, వారి నిండైన వ్యక్తిత్వానికి నిదర్శనం. వేణుశ్రీ గారిది సున్నితమైన మనస్తత్వం. ఆలోచనా ప్రౌఢత్వంతో బాటు బాల్యపు నిర్మలత్వం వారి మాటల్లో ద్యోతకమవుతుంది. కవిత్వం కూడా వారి వ్యక్తిత్వాన్ని, ఆలోచనా ధారని పట్టిస్తుంది. కొద్దిపాటి పరిచయమైనా, మనసుకు దగ్గరై, అభిమానాన్ని తట్టి లేపే వారి మాట నిండుదనం, సాహిత్యంపై వారికున్న మమకారం 'ముందుమాట' గా ఈ రెండు మాటలు రాసే ధైర్యాన్నిచ్చాయి. "ఓ ప్రచేతసా!" శీర్షికతో రాసిన నూట పదకొండు సీస పద్యాల శతకం ఓ వర్తమాన సామాజిక దర్పణం. 'ఓ ప్రచేతసా!' శీర్షిక ఒక సంబోధన. ఒక ఆప్యాయకరమైన పలకరింపు. సంబోధించడంలో కూడా వినయాన్ని ప్రకటించుకునే దారిలో "ఓ ప్రచేతుడా వినుమయ్య ఒక్క మాట!" అనే మకుటాన్ని తేటగీతికి చివరి పాదంగా ప్రయోగించారు. కవి తన సంవేదనలను, అనుభూతులను వ్యక్తీకరించడానికి తాను ఇష్టపడే మార్గాన్నే ఎన్నుకుంటాడు. అలా కవి సీస పద్యాన్ని ఎన్నుకొని శతకానికి ప్రాణం పోశారు. 'ప్రచేతసా' పదం ఋగ్వేదం, భాగవత, పురాణాలలో బాగా నానిన పదం. విస్తృతార్థాలు కలిగినది. ప్రచేతుడా! అన్న పదానికి సారాంశంగా చూస్తే విచక్షణ కలిగినవాడు, వివేకి, సంస్కారవంతుడు అని అర్థం. తాత్విక చింతన గలవాడు, స్వయంగా సరియైన నిర్ణయం తీసుకోగల సమర్థత వున్నవాడు. ఇన్ని సలక్షణాలు కలిగిన ఓ ప్రచేతుడా, ఓ మనిషి, వినుమయ్య ఒక్క మాట! అంటూ ఆధునికతను సంతరించుకున్న నేటి మనిషిని, సామాజిక రుగ్మతలను తెలియజేస్తూ సచేతనుణ్ణి చేస్తున్నాడు కవి. అంతే కాదు, ఇందులోని పద్యాలు మనిషిలోని విచక్షణను, సామాజిక స్పృహను, మేధోశక్తికి మూలాలైన పంచేంద్రియాల చేతనను తట్టి లేపుతాయి. పద్యమనగానే సాంప్రదాయ పదాలు, పురాగాథల సౌగంధికాలు వుంటాయని అపోహ. కానీ, ఈ సంపుటిలో సరళమైన వ్యావహారిక భాష, తెలంగాణ పదాలు, ఆంగ్లం, ఉర్దూ పదాల మేళవింపు కవిత్వానికి ఒక వింత పరిమళాన్ని అద్దుతున్నాయి. ఇందులోని పద్యాలు చదివితే కవి వర్తమానంలోనే క్రియాశీలుడై ప్రతి విషయాన్ని సునిశితంగా గమనిస్తున్నాడనిపిస్తుంది. ఎక్కడా ఊహాలోకంలో విహరింపడు.

సీ! తెలంగాణ రైతులు తీరొక్క పంటల
　　కట్టపడుచు మన కడుపు నింపు
అవ్వ బువ్వ తలెలో అంచుకు తొక్కును
　　ఎయ్యంగ కలెగల్పి ఎంగిలిపడి ...
తే! ... ఇసుగిరామము లేకను ఇల్లిడిసియు
　సెలక సేన్ల సెట్ల కాడనే సేద దీరు..

పల్లె భాష, పల్లె మట్టి పరిమళం, పొలాలు, రైతుల జీవన దృశ్యం అన్నీ కలగలిసిన 'అలుకు బోనం' ఈ పద్యం. రైతు లేనిదే పల్లె లేదు. పల్లెకు పటం కట్టేవాడు, పుటం పెట్టేవాడు రైతే. ఆ నిజం తెలిసిన కవి వేణుశ్రీ. కనుకనే పల్లె దృశ్యానికి జీవం పోయడమే గాక, రైతు జీవితాన్ని రేఖా చిత్రంగా గీసి సజీవంగా మన కళ్ళ ముందుంచుతాడు.

చినుకు నేలను తాక చిగురించు భువి మేను
పచ్చని రంగుల పరుచుచుండ ..
అంటూ ఉల్లాసంగా సాగుతూ
ప్రకృతియే పగబూని పంటలు చెడగొట్ట
వడగండ్ల వర్షము పాడుచేయు.. అంటూ రైతుల
వెతలను చూపుతాడు.

ఢిల్లీలో జరుగుతున్న రైతుల ఉద్యమాన్ని ప్రస్తావిస్తూ, రైతు సమస్యలను స్పర్శిస్తూ రైతు పక్షం వహిస్తాడు.

సీ! రైతుల వ్యతిరేక రాజ్యచట్టాలేల
　　రైతు ఉద్యమముల రక్షచేసి
　మట్టి కంపినిలకై మార్చుట తగదయ్య ...
సీ! వ్యవసాయదారుల వ్యథలింక తీరునా
　　పాలకులెందరో వచ్చినారు
ఉండుంటే నూతన ఊబి చట్టాలతో
　　రైతుల బతుకులు రచ్చకెక్కి
చేటుకల్లు నటంచు చెప్పిన వినకుండ
　　కాలయాపనచేసి గడుపుటేల

రైతుకు, పర్యావరణానికి దగ్గరి సంబంధమే. కవి రైతులతో అలాయి బలాయిలు తీసుకుంటూనే పర్యావరణాన్ని ఆలంబనగా చేసుకుంటున్నాడు. పర్యావరణానికి ప్రాణాధారమైన పశు, పక్ష్యాదులను అనేక చోట్ల తన కవితా వస్తువులుగా కవి ప్రత్యేక రీతిలో, విలక్షణమైన పద్ధతిలో ప్రదర్శిస్తాడు.

'అడవి మైదానాల హాయిగా తిరుగాడు
పక్షులానందము పంచుచుండె ...'

'కోడిపుంజులు కూయు కొక్కరోకో యంచు
ప్రజలంత మేల్కొని పనులకేగు ..'

'గుడ్లగూబలు రాత్రి గుగ్గూయని యఱచు
తీతువు యఱపుల తీరువేరు...'

పర్యావరణం పై ఆందోళన పడుతూ, పశుపక్ష్యాదులపై జీవ కారుణ్యత చూపుతూ, ప్రకృతి తోనే జీవించే ఈ జీవరాశి ప్రకృతికి నిండుదనం ఇచ్చే మూలాధారాలు అని కవి చెప్పకనే చెబుతాడు.

"శివ వాహనము నంది చిత్రముగా తోచు
"ఎలుక వినాయకుడెక్కితిరుగు.."

'విష్ణువు గ్రద్దపై వెడలునెచటికైనా..' అంటూ వివిధ జంతువులూ, పక్షులు ఏ విధంగా దేవతలకు వాహనాలుగా ఉన్నాయో చూపుతూ వాటి వైశిష్ట్యాన్ని దర్శింపచేస్తాడు. ఆధునిక సమాజంలో పశుపక్ష్యాదులను ఏ తీరుగా వాడుకుం టుంటున్నారో, హింసలకు గురిచేస్తున్నారో, జంతువుల మనోభావాలెలా వుంటాయో కూడా తమ పద్యాల్లో స్పర్శిస్తాడు.



నేడు సమాజాన్ని పట్టి పీడిస్తున్న మహమ్మారి కుల పిచ్చి. ప్రధానంగా రాజకీయ రంగంలో, ఉద్యోగ రంగాల్లో పాతుకున్న విష బీజం. కులమతాల చాటున జరిగే రాజకీయ కుట్రలను బహిర్గత పరచడమనే కార్యాన్ని కూడా కవి తన భుజాలపై వేసుకున్నాడు.

'జాతులు మతాలు జనముల కల్పదా
కులముల భాషలు కూడునెపుడు ...'
'కులవిభజనజేసి కులుకుచుందురెపుడు
రాజకీయ గెలుపు రాచబాట ..'
'కులము కులమటంచు కులసంఘములబెట్టి /..'
'కులమైక్యతను కోరి కూడగొట్టి..'

అలా కుల మహమ్మారియే కాదు, చివరికి కరోనా మహమ్మారిని కూడా తన కవిత్వంలోకి ఒంపుకున్నాడు. కరోనా కాలంలో వచన కవిత్వం వరదలాగా సాగింది. అనేక పార్శ్వలను కవులు స్పర్శించి స్పందించారు. ఈ సందర్భంగా కరోనా తాకిడికి బలైన గాన గంధర్వుడు బాలు మీద కూడా ఒక పద్యాన్ని అల్లి తన వేదనను, అభిమానాన్ని తెలుపు కుంటున్నాడు.

సీ! సుస్వర సామ్రాజ్య సుమధుగాత్రమునేగె
గాయక హృదయాల గాయ పరిచి ...
కొత్త గొంతులనెల్ల కూర్మితొ సరిజేసి
పాడుతా తీయగా బాటలేసి ...
తే! తల్లడిల్లు హృదయాలకు దారియేది
అలసిపోయి విశ్రాంతికై అమరుడయ్యె.

కవి స్పర్శించని వస్తువు లేదు. కర్మ సిద్ధాంతాలపైన, మూఢ విశ్వాసాలపైన, చాందస భావాలపైన, రాజకీయ కుట్రలు, దొంగ బాబాల మోసాలు, ఆశ్రమాలలో జరిగే అవకతవకలు, అలా భిన్న విషయాల పైనా, భిన్నస్వరాలతో తీవ్రమైన నిరసనను తెలుపుతాడు. తల్లితండ్రులు, భార్యాభర్తలు, పిల్లల మధ్య తరిగిపోతున్న ప్రేమానురాగాల పట్ల బాధ, తెగిపోతున్నకుటుంబాలలోని సంబంధ బాంధవ్యాల పట్ల దుఃఖం, సమాజంలోని జాతి మతాల మధ్య గల వైషమ్యాలను, మానవ సంబంధాల మధ్య మానవీయ విలువలు మరిచిన వ్యాపార లక్షణాలు పొడసూపుతున్న వైనాన్ని తమ పద్యాల్లో అభివ్యక్తీకరిస్తారు. సమాజంలో జరిగే అనేక మోసాలు, అమానవీయ సంఘటనలకు పద్యాలు దృశ్యం కడతాయి. ఇన్ని అవలక్షణాలతో వర్తమాన సమాజం సాగుతోంది, ఓ ప్రచేతుడా! ఓ మనిషి! విచక్షణ కలిగినవాడా! నీవు లేకుండా ఈ సమాజం మనుగడ ఎలా సాగుతుంది. జీవితం పెడదారుల్లోకి ప్రవహించకుండా దిశానిర్దేశం చేసుకుంటూ, సరియైన మార్గంలో లక్ష్యం వైపుకు నడిపించుకోమ్మని కవి వినమ్రమంగా విన్నవించుకుంటున్నాడు – "ఓ ప్రచేతుడా వినుమయ్య ఒక్క మాట !" యని. శతక సాహిత్యంలో ఈ మకుటం కవి సంతకంలా నిలిచిపోతుంది.

పద్యాలు– ఛందస్సు నియమాలతో, గణాలు, ప్రాస యతుల నియంత్రణలో వున్నా, వీటికి రమ్యత, ప్రవాహ లక్షణాలు ప్రధానం. వేణుశ్రీ గారి పద్యాలు ముక్తక సొబగులతో సరళమైన, సున్నితమైన, మార్దవమైన పదాలతో సాగుతూ పల్లె, ప్రాకృతిక సౌందర్యంతో పాటు రాజకీయ, సామాజిక, సాంస్కృతిక కోణాలను స్పర్శిస్తాయి. భిన్న వక్రతల కు దర్పణం పడతాయి. గతి తార్కిక అనుభవాలను మనసు లోకి తీసుకుంటూ చిన్న చిన్న అలతి పదాలతో సామాజిక చిత్రణ చేసే ప్రయత్నంలో సఫలీకృతులు కావడమే గాక, కవి తన భావ విస్తృతికి అనుగుణంగా తేటగీతి భాగాలను (గీతి) 'మాలిక'లుగా నడిపించి విషయ పరిపుష్టి, సంపూర్ణత కోసం ప్రయత్నంలో భాగంగా విజయం సాధించాడు.

సామాజిక చైతన్యమే రస నియమంగా వుంటూ, భాషాపరంగా కావ్యభాష కాకుండా వ్యావహారిక భాషనే వాడుతూ, కాలప్రవాహంలో కదిలిపోతున్న సమాజాన్ని భిన్నకోణాలనుండి వీక్షిస్తూ, వాటిని అనుభవంలోకి తీసుకొని, ఒక అనుభవం నుండి మరో అనుభవంలోకి ప్రయాణిస్తూ, అనేక సంవేదనలను స్వంతం చేసుకుంటున్న కవి వేణుశ్రీ, వాటిని అక్షర బద్ధం చేస్తూ సంవేదనలను శాశ్వత పరచుకుంటు న్నాడు. శతక సాహిత్యంలో – శతకం గురువులా బోధిస్తుంది, ఆత్మీయుడిలా పలకరిస్తుంది, మిత్రుడిలా సలహాలనిస్తుంది అంటారు. ఈ గుణాల ఆలంబనతో ఏ పద్యానికి ఆ పద్యం స్వేచ్ఛా విహంగంలా విహరిస్తూ, వేణుశ్రీ గారి పద్య సృజనలోని సారళ్యతను, భాష లోని ధారాలతను, అభివ్యక్తిలోని కొత్తదనాన్ని అల్లుకొని మన ముందుకు వస్తున్నాయి. పద్యాల రెక్కల నీడలో 'ప్రచేతుడు' కాలాన్ని తట్టుకొని నిలబడతాడని ఆశిద్దాం. అభినందనలతో...

**(పద్యకవి వేణుశ్రీ గారి 'ఓ ప్రచేతసా !' సామాజిక శతకానికి ముందు మాట నుండి)**

*రచయిత సెల్: 99088 40186*

## శిఖామణి సాహితీ పురస్కారాలు - 2021

సాహిత్యంలో జీవన సాఫల్య కృషికి ప్రతీ ఏటా ఇచ్చే 'శిఖామణి సాహితీ పురస్కారం–2021'కి ప్రముఖ దిగంబర కవి, రచయిత నగ్నముని ఎంపిక అయ్యారు. ఈ సం॥ నుండి కొత్తగా ప్రారంభించిన 'శిఖామణి యువ సాహితీ పురస్కారానికి' 'నడిచే దారిలో' కవితా సంపుటి కవి సురేంద్రదేవ్ చెల్లి ఎంపిక అయ్యారు. వివిధ రంగాలలో కృషి చేసిన వారికి ఇచ్చే కవిసంధ్య ప్రతిభా పురస్కారాలకు గాను ఈ కిందివారు ఎంపికయ్యారు.

ప్రసేన్, ఖమ్మం (వచన కవిత్వం) శ్రీ కరీముల్లా, వినుకొండ (ముస్లిం మైనార్టీ సాహిత్యం), గుడిపాటి, హైదరాబాద్ (పత్రికారంగం) శ్రీ వల్లూరు శివప్రసాద్, గుంటూరు (నాటక సాహిత్యం), ముకుంద రామారావు, హైదరాబాద్ (అనువాదం), గనారా, కాకినాడ (సాహితీ స్రవంతి), ఈమని శివనాగిరెడ్డి, హైదరాబాద్ (చరిత్ర, పురావస్తు విభాగం) శ్రీమతి కె. వరలక్ష్మి, హైదరాబాద్ (కథా సాహిత్యం), మధునాపంతుల సత్యనారాయణ మూర్తి, పల్లిపాలెం (ఆంధ్రీ కుటీరం) శ్రీ బండి ప్రసాదరావు, పొడగట్లపల్లి (పద్య కవిత్వం), ఆచార్య వెలమల సిమ్మన్న, విశాఖపట్నం (సాహిత్య చరిత్ర) శ్రీమతి డా॥ సి.హెచ్. సుశీలమ్మ, హైదరాబాద్ (పరిశోధన)

జీవనసాఫల్య పురస్కారానికి (రూ.10,000/–) యువపురస్కారానికి రూ.5,000/– కవిసంధ్య ప్రతిభా పురస్కార గ్రహీతలు ఒక్కొక్కరికి 1,116/– చొప్పున అక్టోబరు చివరి వారంలో జరిగే పురస్కారాల ప్రదానోత్సవ సభలో అందజేస్తారు. ఈ పురస్కారాల కమిటీలో శ్రీ దాట్ల దేవదానంరాజు (అధ్యక్షులు), శ్రీ కె.శివారెడ్డి, శ్రీ శీలా వీర్రాజు, శ్రీ డా॥ డి. విజయ్‌భాస్కర్ సభ్యులుగా వున్నారని కవిసంధ్య అధ్యక్షులు డాక్టర్ శిఖామణి ఒక ప్రకటనలో తెలిపారు.

అనువాద కథ

# చంద్రుని నీడలు





ఒరియా మూలం : మోనాలిసా జేనా తెలుగు అనువాదం : వంశీకృష్ణ

మళ్ళీ ఫోన్ మోగింది.

అర్ధరాత్రి కావడానికి కాస్త సమయముంది. డిసెంబర్ మాసపు పౌర్ణమి రాత్రి. నేను ఫోన్ తీసి పక్కన పెట్టాను. లేకపోతే అతడు పదే పదే రాత్రంతా ఫోన్ చేస్తూనే ఉంటాడు. ఏ లిక్కర్ డెన్ లోనో కూర్చుని కళ్ళు మత్తుతో వాలిపోతుంటే తన స్పృహను తాను కోల్పోతూ. హఠాత్తుగా కళ్ళ ముందు అతడి మొహం ప్రత్యక్షమైంది. గులాబీ రేకులతో నిండిన పింక్ కలర్ లెటర్ హెడ్ మీద అతడు నాకు రాసిన పొడవాటి ఉత్తరాలు కూడా.

అప్పుడు అతడొక సైనికుడు. కాశ్మీర్ లోయలో ఎక్కడో సుదూరంగా పనిచేస్తూ ఉండేవాడు. రైల్వే స్టేషన్ లోని ప్రయాణీకుల విశ్రాంతి గదిలో అతడితో ఇలాంటి డిసెంబర్ మాసపు రాత్రిపూటే అతడితో పరిచయం కలిగింది. అదీ కొన్నిగంటలపాటు మాత్రమే. ఆలివ్ గ్రీన్ మిలటరీ యూనిఫామ్ మీద మెరిసే ముత్యాల రంగు జాకెట్ వేసుకున్నాడు, అలాంటి జాకెట్ ఒకటి ఇంతకుముందు ఎవరూ వేసుకోగా నేను చూడలేదు. అతడి చేతిలో Roald Dahl పుస్తకం ఒకటి వుంది. తన చుట్టూ ఉన్నవాళ్లను చలాకీగా చూస్తూ, ఎవరెవరు ఎక్కడికెక్కడికి వెళ్లాలో ఆరా తెస్తూ, వాళ్ళు చెప్పిన ప్రదేశాలతో తనకు ఉన్న అనుబంధాన్ని చెపుతూ అతడు చాలా చురుకుగా ఉన్నాడు. ఉరిమే ఉత్సాహం లాగా వున్నాడు.

తాను ఈశాన్య భారతానికి చెందినవాడిగా అతడు చెప్పినప్పటికీ ఆ పర్వత ప్రాంత పురుషుల భౌతిక లక్షణాలు ఏవీ అతడిలో లేవు. అతడొక పురుషత్వం మూర్తీభవించిన అందమైన సైనికుడు. అంతే! క్షణానికి ఒకసారి అతడి వంక చూడటం నా కెందుకో బావుంది. అందుకేనేమో అతడు ఒక చిన్న పేపర్ నాకిచ్చి నాపేరు, చిరునామా, ఫోన్ నెంబర్ రాయమని అడిగినప్పుడు హిప్నటైజ్ అయినదానిలా పర్యవసానాలు ఏవీ ఆలోచించకుండా ఆ డిసెంబర్ మాసపు తెలవారుజామున 3 గంటల 45 నిమిషాలకు నా చిరునామా, ఫోన్ నెంబర్ అతడికి రాసి ఇచ్చేసాను. నేనా క్షణం లో ఒక సాంప్రదాయిక కుటుంబం లో పుట్టిన ఆడపిల్లకి ఆ కుటుంబం నేర్పే అన్ని రకాల జాగత్తలను, ఆంక్షలను మరచిపోయాను. అతడి వేష ధారణ, చిరునవ్వుతో కూడిన అతడి ప్రవర్తనకు నేను చాలా ఆకర్షితురాలను అయ్యాను. అతడు తనలగేజీలో ఉన్న పెద్ద హార్మనీ మీద పాతకాలపు హిందీ పాటలు పాడుతుంటే నన్ను నేను మైమరచి పోయాను. ఆ రాత్రి అతడు తన సంగీతంతో వికసించే పూలకు మరింత పరిమళాన్ని అద్దాడు.

ఆ తరువాత నాకు అతడొక ఉత్తరాన్ని రాసాడు. లేత ఎరుపు రంగు లెటర్ హెడ్ మీద ఎనిమిది పేజీల సుదీర్ఘమైన వుత్తరం. నా జీవితంలో అదే మొదటి సారి అంత అందమైన ఉత్తరాన్ని అందుకోవడం. అది మామూలు పోస్టల్ కవర్ లో రాలేదు. జేగురు రంగు అఫీషియల్ ఎన్వలప్ లో చిరిగిపోయే స్థితిలో నన్ను చేరింది. ఆ వుత్తరం మొదట మా అమ్మ కంట పడింది. ఆ వుత్తరం లో అతడు అభ్యంతరకరమైన విషయాలు ఏవీ రాయకపోవడంతో నాకూ మా అమ్మకూ మధ్య ఒక అనీజీ సందర్భం తప్పిపోయింది. అతడికి ఈ మధ్య ఒక చిన్న యాక్సిడెంట్ అయిందట. హాస్పిటల్ బెడ్ మీద పడుకుని ఈ ఉత్తరం రాస్తున్నాడట. మంచు కప్పుకున్న పర్వతాలు దూరం నుంచి చూడటానికి బావుంటాయి కానీ, అవి మన చర్మాన్ని కాల్చేస్తాయి. ఆ పర్వతాలు అగ్ని గీతాలను ఆలపిస్తాయి. ఇలా చాలా రాసాడు. వాటి తో పాటుగా తన ఆర్మీ విషయాలు కూడా . నా నుండి జవాబు కోసం ఎదురుచూస్తూ ఉంటాడట. నానుండి వెళ్లే జవాబు అతడికి కాలం కాని కాలంలో కనువిందు చేసే కుంకుమ పూల తోట లాగా అనిపిస్తుందట. చాలా చాలా దూరం నుండి ఒక యవ్వనవతి లోలోపలి ఫీలింగ్స్‌నూ, సెంటిమెంట్స్ నూ గౌరవిస్తూ ఆమెకు మాత్రమే రాసిన ఉత్తరం అది. ఆ ఉత్తరం నాకు చాలా ఆనందాన్ని ఇచ్చింది. అతడి ఉత్తరాలకి నేనేందుకు జవాబు ఇవ్వలేదో ఇప్పటివరకూ నాకు తెలియదు. బహుశా నేను భయపడి వుంటాను. లేదా జవాబు ఇస్తే అతడు పదే పదే ఉత్తరాలు రాస్తాడేమోనని సందేహపడి వుంటాను. అతడి వుత్తరం నా హృదయం లో కలగచేసిన వెచ్చదనాన్ని అతడికి చెప్పే ధైర్యం చేయలేకపోయాను.

ఒక రాత్రి పూట నా ఫోన్ మోగింది. రిసీవర్ ఎత్తగానే "పద్మాజీ" అన్న పిలుపు. ఒక చలి తుఫాను ఏదో నా చెంప మీద బలంగా తట్టినట్టు ఒక భావన. ఆ రోజులలో మధ్య హాలులో మోగే ఫోన్ స్వరం ఇంట్లో అందరినీ ఫోన్ దగ్గరికి పరుగెత్తేలా చేసేది. పైగా అది చాలా పొద్దు పోయిన శీతాకాలపు రాత్రి. ఆ సమయంలో బిగ్గరగా మోగే ఫోన్ శబ్దం గుడ్లగూబ అరుపు కంటే భయంకరంగా ఉంటుంది.

అతడు మరొక్క మాట మాట్లాడే లోగానే, మా లేడీస్ హాస్టల్ వార్డెన్ పలికేంత గరుకైన స్వరం తో "ఇలా ఇంత రాత్రి పూట ఫోన్ చేయవద్దు. మా ఫ్యామిలీ రూల్స్ ఇందుకు ఒప్పుకోవు" అని గట్టిగా చెప్పి ఫోన్ పెట్టేసాను, మా కుటుంబ సభ్యుల కళ్ళలో కదిలే కుతూహలాన్ని తుడిచివేస్తూ. కానీ అప్పటి నుండీ మా అమ్మ పొగలు, సెగలు కక్కుతూనే వున్నది అతడిమీద. అతడు అప్పటికే నాలుగు సుదీర్ఘమైన ఉత్తరాలు రాసివున్నాడు, ఎలాంటి సంయమనం లేకుండా నన్ను పొగుడుతూ మరి.

పది రోజుల తరువాత అతడినుండి వుత్తరం వచ్చింది. ఈ సారి అతడి వుత్తరం నిండా క్షమాపణలే ఎక్కువగా వున్నాయి. పంక్తికి పదిసార్లు అతడు ఆలా రాత్రిపూట ఫోన్ చేసినందుకు క్షమాపణ కోరాడు. అతడు నిశ్శబ్దంగా ఏడుస్తూ, తన హార్మనీ మీద విషాద గీతాలు పాడుకుంటూ పైన్ వృక్షాల మధ్య తిరుగాడుతున్న దృశ్యాన్ని నేను ఊహించుకున్నాను. మనం ఎవరినైనా అకారణంగా బాధ పెడితే, ఆ బాధలో మనకు కూడా భాగస్వామ్యం ఉంటుంది. అతడిక ఎప్పటికీ నాకు ఉత్తరాలు రాయడని ఊహించాను నేను.



కానీ అతడు చాలా కాలం నాకు ఉత్తరాలు రాస్తూనే వున్నాడు. తన ఆర్మ్ క్వార్టర్స్ నుండీ, బారాక్స్ నుండీ చిరునామా చెప్పలేని చాలా ప్రదేశాల నుండి. బహుశా అతడికి నన్ను చూడగానే తనకు చాలా ప్రియమైన మనిషి

ఎవరో గుర్తుకు వచ్చి ఉండాలి. మరీ ముఖ్యంగా మెరుస్తూ వుండే నా కళ్ళను, పొడవాటి నా జుట్టును చూసినప్పుడు అతడికి ఎవరో గుర్తుకు వచ్చి వాళ్ళని నాలో చూసుకుంటూ ఉండి ఉండాలి. అతడొక సారి తన కుటుంబం గురించి రాశాడు. వాళ్ళది చాలా పెద్ద కుటుంబం. అతడి భార్య ఒక గొప్ప ధనవంతుడికి ఏకైక కూతురు. ఆ ఇంట్లో ఆమెని ఒక సున్నితమైన పువ్వు లాగా చూసుకుంటారట. ఆమె మంచి చిత్రకారిణి అట. అంతేనా సంగీత సరస్వతి కూడానట. ఇవన్నీ తెలిసాక అతడి మీద నాకు కాస్త జాలి కలిగిన మాట వాస్తవం. అంత గొప్ప ధనవంతుడై ఉండి ఈ కఠినమైన ఆర్మీ వుద్యోగం ఎలా చేస్తున్నాడు? అంత అవసరం ఏమున్నది?

అతడిని కావాలనే నేను పక్కన పెట్టసాగాను. అలా పక్కన పెట్టడం నాకు చాలా అవసరం. కానీ అతడు నాకు ఉత్తరాలు రాస్తూనే వున్నాడు. అతడికి ఒక కల వున్నది. నా చేతిలో తన చేతిని వేసి కుంకుమ పూల తోటల మధ్య నుండి గులాబీ వనాల మీదుగా పైన్ వృక్షాల అరణ్యంలో వెన్నెల రాత్రులలో నడచి వెళ్లి ఉత్తర ధ్రువం దగ్గరి Ursa Major అందుకోవాలన్నది అతడి కల. ఆ కల నన్ను ఆకట్టుకోలేదు. అతడు ఉత్తరాలు రాస్తూనే వున్నాడు. మొదట్లో ఎంతో అద్భుతంగా తోచిన ఉత్తరాలు ఆ తరువాత వాటి ఆకర్షణను కోల్పోయాయి. అతడి ఉత్తరాలన్నీ దెజావూ లు గా మిగలసాగాయి.

అతడు హెూలీ పండుగనాడు తప్పకుండా ఫోన్ చేస్తాడు నాకు శుభాకాంక్షలు చెప్పడానికి. కానీ ఎప్పుడూ నా ఫోన్ డెడ్ అయ్యే ఉంటుంది. పదిహేడేళ్ల తరువాత హెూలీ పండుగనాడు నాకు శుభాకాంక్షలు చెప్పడానికి అతడు ఫోన్ చేసినప్పుడు "నేను మీ రాష్ట్రానికి వస్తాను. మిమ్మల్ని కలుస్తాను" అని చెప్పాను. అతడు నా మాటకి దిగ్భ్రాంతి చెందినట్టున్నాడు. ఎక్కడో చాలా దూరంగా ఒడిషా లో ఉన్న నేను ఈశాన్యభారతం లోని నాగా హిల్స్ కి వెళ్లడమా? నేనేదో టీజ్ చేస్తున్నాను అని అనుకున్నట్టున్నాడు. కానీ అతడు వెంటనే తేరుకుని

తన మామూలు స్వరం తో "తప్పకుండా రండి మిమ్మల్ని చూడటం నాకు చాలా సంతోషం" అన్నాడు. నాకు ఇంకా పెళ్లి కాలేదు అని తెలుసుకుని అతడు చాలా బాధ పడ్డాడు. నన్ను తను పెళ్లి చేసుకుని ఉన్నట్టు అయితే అని ఏవేవో ఊహలలోకి వెళ్ళిపోయాడు

చాలా రాత్రి అయింది. నేను నా సెల్ ఫోన్ నెంబర్ అతడికి ఇవ్వలేదు. నేను అతడి వూరికి వెళతానని అతడు ఖచ్చితంగా నమ్మి ఉండడు. సాధారణ మధ్యతరగతి భారత కుటుంబం లోని ఒక అత్యంత సాధారణ యువతి తనకు అంతంత మాత్రమే తెలిసిన మనిషి కోసం రాష్ట్రాలు దాటుకుని వెళుతుందని ఎవరు మాత్రం నమ్ముతారు. కానీ నేను అతడు వుండే ఊరు పేరు గుర్తు పెట్టుకున్నాను.

ఆ ఊరు ఖత్ ఖత్తి (khatkhatti).

కొన్నాళ్ల తరువాత నా అస్సామీ స్నేహితుడు తో "దిమాపూర్ వెళ్ళాలి. అక్కడ నాకో బోయ్ ఫ్రెండ్ వున్నాడు. అతడిని కలసి రావాలి" అని చెప్పాను.

## రచయిత్రి పరిచయం

మోనాలిసా జెనా ఒడియాలో ప్రసిద్ధి చెందిన అనువాదకురాలు, కవయిత్రి, కథకురాలు. ఇప్పటి వరకు మూడు కవిత్వ సంపుటాలు రెండు కథా సంకలనాలు వెలువరించారు. అస్సామీ నుండి ఒడియా లోకి ఒడియా నుండి ఇంగ్లీష్ లోకి అనువాదాలు చేశారు. అనువాదానికి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు, ఒడియా సాహిత్య అకాడమీ అవార్డు అందుకున్నారు. ప్రముఖ రచయత గౌర హరి దాస్ కథలను The Nail and other stories శీర్షిక న అకాడమీ కోసం ఆంగ్లం లోకి అనువాదం చేశారు. ప్రస్తుత కథ ఆమె అనువదించి ఎడిట్ చేసిన విమెన్ రైటింగ్స్ ఫ్రం ఒడిష The Spark of Light నుండీ తెలుగులోకి వంశీకృష్ణ అనువాదం చేశారు

అతడుమారు మాట్లాడకుండా నాతో కలసి దిమాపూర్ రావడానికి ఒప్పుకున్నాడు. గౌహతి నుండి దిమాపూర్ చాలా దూరం. దిమాపూర్ వెళ్లే మార్గం చాలా వరకు ఒడిషా ను గుర్తు చేస్తూ సాగింది. విశాలమైన, మైదానాలు వరి చేలు. సమయం గడుస్తున్న కొద్దీ వాతావరణం వేడెక్కసాగింది. బయట వాతావరణం లాగే నా లోపల కూడా తన్యత పెరిగి పోతున్నది. దిమాపూర్ రైల్వే స్టేషన్ లో నా స్నేహితుడు ఎదురుచూస్తూ వున్నాడు.

నేను ఎదురు చూస్తున్న స్నేహితుడు అదే ఆర్మీ హెయిర్ కట్ తో ఉన్నాడు కానీవొంటి మీద మెరిసే ముత్యాల రంగు జాకెట్ స్థానం లో అందమైన ఎరుపు నలుపు రంగు చారల నాగా జాకెట్. నేను మాత్రం చాలా మారిపోయాను. మోకాళ్ళ వరకు ఉండే జుట్టును కత్తిరించి క్రాప్ చేసుకున్నాను. కళ్ళకు పెద్ద పెద్ద దళసరి గ్లాసులు. కొంచెం బొద్దుగా తయారు అయ్యాను. నన్ను అతడు గుర్తు పట్టడని అనుకున్నాను. కానీ అతడు నన్ను చూసి మెల్లగా "పద్మా జీ" అని గుసగుస లాడుతున్నటుగా గొణిగాడు. నా కళ్ళలో మెరుపు చూసి నన్ను గుర్తుపట్టాడు. అతడు పదిహేడేళ్ల క్రితమే చూసిన అమాయకమైన అమ్మాయి పద్మ కి నేను పరిణితి చెందిన వెర్షన్ ని. మేమందరమూ కలసి మధ్యాహ్న భోజనానికి ఒక విలాసవంతమైన హెూటల్ కి వెళ్ళాము. వివిధ రకాల ఎరుపు రంగుల లో స్నాప్ డ్రాగన్ పువ్వులు వికసించి కనువిందు చేస్తున్నాయి. క్రేన్ వువ్వులు మెరుస్తున్నాయి. వాటి ఆకులు ఆకుపచ్చగానూ, పైన ఆకాశం నీలి రంగులోనూ ఉండి వాతావరణం అంతా ఒక వర్ణ సముచ్చయం లాగా వుంది. దూరంగా కొండలలో మేఘాలు వివిధ ఆకారాలలో కుదురుకున్నాయి.

అతడు కొన్ని డ్రింక్స్ ఆర్డర్ చేసాడు. దిమాపూర్ లో ప్రసిద్ధమైన రైస్ బీరు రుచి చూపించాడు. పోర్క్ కూర తినిపించాడు. నా అస్సామీ స్నేహితుడితో

*అతడు మరొక్క మాట మాట్లాడే లోగానే, మా లేడీస్ హాస్టల్ వార్డెన్ పలికేంత గరుకైన స్వరం తో "ఇలా ఇంత రాత్రి పూట ఫోన్ చేయవద్దు. మా ఫ్యామిలీ రూల్స్ ఇందుకు ఒప్పుకోవు" అని గట్టిగా చెప్పి ఫోన్ పెట్టేసాను, మా కుటుంబ సభ్యుల కళ్ళలో కదిలే కుతూహలాన్ని తుడిచివేస్తూ. కానీ అప్పటి నుండీ మా అమ్మ పొగలు, సెగలు కక్కుతూనే వున్నది అతడిమీద. అతడు అప్పటికే నాలుగు సుదీర్ఘమైన ఉత్తరాలు రాసివున్నాడు, ఎలాంటి సంయమనం లేకుండా నన్ను పొగుడుతూ మరి.*





*అతడలా నిలబడి నేను ఫోన్‌లో చెప్పిన మాటలు గుర్తు చేసుకుంటున్నాడా? ఆ రోజు నేను ఫోన్‌లో మీ ఇంటికి వస్తాను అని చెప్పాను. అదొక ప్రేమ, నిబద్ధత. కానీ జీవితం ఎన్ని విచిత్ర దారులలో పయనించింది? తనకు తోచిన దారులలో పయనిస్తూ అందంగా రెక్కలు విప్పుకుని ఆనందంగా జీవించే శీతాకోక చిలుక రెక్కలను విరిచేయడానికి కూడా అది వెనుకాడదు కదా. చుట్టూ ఒక నొప్పి పరిపక్వమైన సూర్యకాంతిలా ఆ దిగంతాల పర్వతాల వరకు వ్యాపిస్తున్నది. మేమిద్దరమూ ఒకరి కెదురుగా ఒకరు అద్దంలా నిలబడినప్పటికీ ఒకరి మొహాన్ని మరొకరం చూసుకోలేకపోయాం.*

బాగా కలసిపోయి తనకు సహజమైన ధోరణిలో చెణుకులు విసిరాడు. ఏ మనిషికి అయినా జీవితం పట్ల గొప్ప లాలస, సంగీతం నృత్యం పట్ల అనురక్తి ఉండి కావలసిన ప్రేమ దొరికితే చాలు. జీవితం లో ఏదీ లేదని బాధ పడే అవసరమే ఉండదు. ఆర్థికాంశాలు జీవితాన్ని ఎప్పుడూ బాధ పెట్టవు అని అతడేదో చెపుతున్నాడు. నేను అతడినే చూస్తున్నాను. అతడు ఇంత క్యాజువల్ గా ఎలా ఉండగలుగుతాడో నాకు ఇప్పటికీ అర్థం కావడం లేదు. ఏ స్త్రీని అయినా ఇట్టే వశ పరచుకోగల విశేషం ఏదో అతడిలో ఉండి ఉండాలి. అతడి ఉత్తరాలకు నేనుప్పుడూ జవాబు ఇవ్వలేదని ఫిర్యాదు చేస్తున్నట్టుగా నా అస్సామీ స్నేహితుడు తో అతడు చెపుతున్నాడు.

చీకటి పడబోతున్నది. మంచి చిత్రకారిణి, గాయని అయిన అతడి భార్య ఎలా ఉంటుందో చూడాలి అన్న కుతూహలం నాలో మొదలుఅయింది. అతడి రాజప్రాసాదం లని ఇంటిని కూడా చూడాలి. కొన్ని వందల వేల ప్రశ్నలు నా హృదయం లో. నా అస్సామీ స్నేహితుడు మా ఇద్దరినీ ఒంటరిగా వదిలి కాసేపు బయటకు వెళ్ళినప్పుడు అతడు మెల్లగా నాకు దగ్గరగా వాలి కాస్త గుసగుస లాడుతున్నట్టుగా "పద్మాజీ ! ఒక రెండువేలు ఉంటే ఇస్తారా? నేను నా వాలెట్ మరచిపోయి వచ్చాను. రేపుదయమే ఇచ్చేస్తాను. ఇందాకటి నుండీ అడగాలంటే మీ స్నేహితుడి ముందు సిగ్గనిపించి అడగలేదు" అన్నాడు. నేను మారుమాట్లాడకుండా రెండు వేల రూపాయలు తీసి అతడికి ఇచ్చాను. హొటల్ బిల్లు కట్టేసాడు అతడు.

నా అస్సామీ స్నేహితుడికి అతడి పట్ల పెద్ద ఆసక్తి కానీ కుతూహలం కానీ ఏదీ లేదని నాకు అర్థం అయింది. దానికంటే మిన్నగా నా సౌకర్యం గురించి అస్సామీ స్నేహితుడు ఎక్కువ ఆలోచిస్తున్నాడు. మేమిరువురమూ అతడికి సెండ్ ఆఫ్ ఇవ్వడానికి కొంచెం దూరం అతడితో కలసి నడిచాము. హొటల్ బయట కారు లాంటిది ఏదీ అతడికోసం ఎదురు చూడటం లేదు.

"మేమిద్దరమూ రేపు ఉదయం ఎనిమిదింటి కల్లా తయారై ఉంటాము" అని చెప్పాను అతడికి.

"తప్పకుండా ! రేపు ఉదయం వచ్చి మిమ్మల్ని మా వూరికి తీసుకెళ్తాను" అన్నాడు అతడు చీకటిలో కలిసిపోతూ.

దిమాపూర్ లో చీకటి చాలా త్వరగా పడుతుంది. వీధులన్నీ నిర్మానుష్యంగా మారిపోతాయి. రాత్రి ఎనిమిదింటికికల్లా షాపుల వాళ్ళు అందరూ షట్టర్లు దించేసుకుని వెళ్ళిపోతారు. అసోం, బర్మా, మణిపూర్, నాగాలాండ్ లకి ఇది వ్యాపార కూడలి. డ్రగ్ మాఫియా ఎక్కువ. ఒక చిన్న గొడవ కూడా కత్తులతో, గొడ్డళ్ళ తో దాడి చేసుకునే దాకా వెళుతుంది.

నా అస్సామీ స్నేహితుడు నవ్వి "ఇతడు నిజంగా మీ ప్రేమికుడేనా?" అని ప్రశ్నించాడు. అప్పుడు నేను నిజం చెప్పాను. "లేదు. అతడు నాకు పదిహేడేళ్ల క్రితం నేను న్యూ ఢిల్లీ రైల్వే స్టేషన్‌లో రైలు కోసం ఎదురుచూస్తున్నపుడు పరిచయం అయ్యాడు. చాలా కాలం ఉత్తరాలు రాశాడు. భారతదేశం లోని ఈ ఈశాన్య భారతాన్ని చూడాలని అనుకున్నప్పుడు అతడు గుర్తుకు వచ్చి అతడి జీవితం గురించీ, అతడి కలల గురించీ స్వయంగా తెలుసుకోవచ్చని మోహపడ్డాను"

నా అస్సామీ స్నేహితుడు ఏమీ అనలేదు కానీ గొణుగుతున్నట్టుగా "అతడు ఎందుకలా చీకటి లోకి మాయమయ్యాడు. అతడి కారు కేమైంది? నాగాలాండ్ లాంటి కల్లోలిత ప్రాంతం లో రాత్రిపూట అదెంత ప్రమాదకరం" అని అన్నాడు.

నేను శుభ రాత్రి చెప్పి నా గదిలోకి వచ్చి పక్క మీద వాలాను. బాగా అలసిపోయి ఉన్నానేమో గాఢంగా నిద్ర పట్టేసింది.

ఉదయం ఎనిమిదిన్నర అయింది. మేము మా బ్రేక్ ఫాస్ట్ ముగించుకుని అతడికోసం ఎదురుచూస్తున్నాము. అతడు వచ్చే జాడ కనిపించడం లేదు. పద్మాజీ అంటూ నా చుట్టూ తిరిగిన అతడు వచ్చే సూచన కనిపించకపోవడంతో నాకు అసహనంగా వుంది. నా అస్సామీ మిత్రుడు దానిని గమనించినట్టున్నాడు నాకు ఏదో సర్ది చెప్పబోతున్నాడు.

అతడు నన్ను మోసంచేశాడు అని నా కెందుకో అనిపిస్తున్నది. నిన్న అతడు నా దగ్గర రెండు వేల రూపాయలు తీసుకున్నాడు. అవి తిరిగి వచ్చే సూచన లేదు. నాకెంతో అవమానంగా వుంది. అతడి ఊరి పేరు నాకు తెలుసు కనుక మేమిద్దరమూ వాళ్ళ ఊరు వెళ్లాలని నిర్ణయించుకున్నాము. దిమాపూర్ నుండి వాళ్ళ ఊరు పద్దెనిమిది మైళ్ళ దూరం. మేము ప్రయాణం చేస్తున్న దారి అంతా ఆకు పచ్చగా ఉండి మనసుకు ఆహ్లాదం కలిగిస్తున్నది. చెక్కలతో తయారు చేసిన ఇళ్ళు, వెదురు బద్దలతో కట్టిన ప్రహరీ గోడలు చాలా సున్నితంగా, అచ్చు నాగా ప్రజల లాగే అందంగా వున్నాయి.

ఖత్ ఖతీ గ్రామంలో అతడి ఇల్లు కనుక్కోవడానికి ఇబ్బంది పడలేదు. ఆ ఊళ్ళో అతడు చాలా పాపులర్. ఊరు మొదట్లోనే అతడి మూడు గదుల ఇల్లు. రాళ్లతో గోడలు కట్టిన ఇల్లు. కొంచెం దూరంలో ఒక చిన్న నీటి కొలను. దాని పక్కన కూర్చోవడానికి సిమెంట్ బెంచీ. మేము వెళ్లే సరికి అతడు ఇంట్లో లేడు.

పెద్ద వయసు స్త్రీ పురుషులు నలుగురు కూర్చుని పేకాట ఆడుకుంటూ మధ్య మధ్య కాఫీ తీసుకురమ్మని తమ చిన్న మనవరాలికి పురమాయిస్తున్నారు. ఆగి ఆగి మాట్లాడుకుంటున్నారు ఒకటీ రెండూ మాటలు. వాళ్ళు అతడి తల్లి తండ్రులు, అతడి భార్య తల్లితండ్రులు అయి ఉండవచ్చు. వాళ్ళ గురించి అతడు తన ఉత్తరాలలో చాలా సార్లు చెప్పడం చేత నేను చాలా తేలికగా పోల్చుకోగలిగాను. వాళ్ళు మంచంలో నుండి లేవలేని స్థితిలో ఉండి అన్ని పనులకు మరొకరి మీద ఆధారపడే స్థితిలో వున్నారు. బహుశా ఇంకెంత కాలమో వాళ్ళు ఉండకపోవచ్చు.

శ్రీల అతడి భార్య ఆ ముసలివాళ్ళ మాటలకు ఏ సమాధానమూ చెప్పడం లేదు. అలాంటి పరిస్థితిని ఎదుర్కొనే ఇతర ఆడవాళ్లలా వాళ్ళ వెనుక కూడా ఏ వ్యాఖ్యనూ చేయడం లేదు. ఆమె తన నిస్సహాయతను, నిరాశను మౌనం మాటున దాచేసింది. కుటుంబం మొత్తానికి ఆమె ఆధారం. ముసలి వాళ్ళ భారము, ఎదిగే పిల్లల భారమూ ఆమె భుజాల మీద మోపబడి వుంది. జీవితం, దాన్ని వెన్నంటి వచ్చే చావు రెండూ ఒకేసారి వచ్చి ఆమె శక్తినీ, సహనాన్ని పరీక్షిస్తున్నటుగా వుంది. ఇదంతా ఒక ఎత్తు అయితే పేదరికం ఒక ఎత్తు. ఒక పూట కూడా నాలుగు వేళ్ళు లోపలికి వెళ్లవేమో. ఒక చూపులో ఇదంతా నాకు తెలిసి పోయింది.

ఒక శాశ్వతమైన చిరునవ్వు ఏదో శ్రీల పెదవులను, కళ్ళను వెలిగిస్తున్నది. అప్పుడే వికసించిన స్వచ్ఛమైన పువ్వు లా ఆమె అందంగా వుంది. వాళ్ళు క్రిస్టియన్స్. ఆ ఇంట్లో కూడా పెద్దగా ఏమీ లేవు. నిద్రించడానికి కొన్ని పక్క

బట్టలు, కొన్ని వ్యవసాయ పనిముట్లు, దుస్తులను తమలో దాచుకున్న కొన్ని చెక్క పెట్టెలు. ఇంటి పైకి కొన్ని తీగలు పాకి వున్నాయి. బహుశా కాకర లాంటి పాదులు కావచ్చు. ఇంటి వెనుక ఒక చిన్న కూరగాయల తోట. దూరం నుండి చూడటానికి ముచ్చటగా ఉంది ఆ ఇల్లు.

శ్రీల మీదే ఆ ఇంటి బాధ్యత మొత్తం వుంది. ఆమె స్థానిక హాస్పిటల్‌లో నర్సుగా పనిచేస్తూ కొంత సంపాదిస్తుంది. శ్రీల కు తన భర్త అంటే అమిత ఇష్టం అనుకుంటాను. ఎంత ఇష్టం లేకపోతే తన భర్త స్నేహితురాలిని అని చెప్పిన నన్ను కూడా అంత సాదరంగా ఆహ్వానిస్తుంది.

ఆమె భర్త ఆ చుట్టూ పక్కల ఎక్కడా కనిపించడం లేదు. అతడి రంగురంగుల జాకెట్ మాత్రం గోడకు వేలాడుతూ వుంది. బహుశా ఒక్క ముక్క కూడా అతడు మా గురించి ఆమెకు చెప్పి ఉండడు. బహుశా అతడు ఎప్పటికీ మమల్ని కలవడేమో. నా రెండు వేల రూపాయలు ఒంటరిగా తిరిగి వస్తే రానీ. ఎప్పుడూ కలల ప్రపంచంలో విహరింప చేసే అతడి వాస్తవం ఇంత చేదుగా ఉంటుందని నేనెప్పుడూ ఊహించలేదు. ఈ క్షణం వరకూ నేను అతడి భార్య మీద అసూయ పడ్డాను. అతడి ఉత్తరాలకి ఎప్పుడూ జవాబు ఇవ్వనప్పటికీ, ఆ అద్భుత ప్రపంచంలో నన్ను నేను చాలా సార్లు భాగస్వామిని చేసుకున్నాను. మద్యం, వ్యభిచారం కారణంగా అతడు సైన్యం నుండి అతడు బహిష్కరించబడ్డాడు అనేది వాస్తవం. కానీ అతడెప్పుడూ తన భార్య మీద చేయిచేసుకోవడం కానీ, తప్పుగా ప్రవర్తించడం కానీ చేసి ఉండడు. లేకపోతే ఆమె మొహంలో అంత ప్రశాంతత, స్వచ్ఛత, భర్త మీద ప్రేమ ఉండేదా.

అప్పుడొచ్చాడు అతడు. ఆకాశం నుండి చుక్క తెగిపడినట్టు. అతడి చేతిలో నాలుగు చేపలు. బహుశా దగ్గరలో ఉన్న నదిలో చేపలు పట్టడానికి వెళ్ళి వుంటాడు. స్థానిక రాజకీయాలలో పాల్గొనడంతో పాటు ఇల్లు గడవడానికి ఇలాంటి చిన్న చిన్న వ్యాపారాలు కూడా చేస్తూంటాడేమో. మమ్మల్ని చూడగానే అతడి మొహం తెల్లగా పాలిపోయింది. మాకై మేము వస్తాము అతడు ఊహించి ఉండడు. అతడి పేదరికం మా కళ్ళ ముందు పడగానే అతడు అంతకు ముందు నాకు ఉత్తరాలలో రాసిన రాజప్రాసాదం లాంటి ఇల్లు, ధనవంతుడైన మామ గురించి చెప్పిన మాటలు గుర్తు వచ్చి ఉంటాయి. అతడలా భూమి లో పాతేసినట్టు మమల్ని చూడగానే నిలబడిపోయాడు. కానీ నేను నా గురించి ఆలోచిస్తున్నాను. శ్రీల స్థానంలో నేనుంటే ఎలా మానేజ్ చేసేదానిని? శ్రీల లాగా ఆనందంగా వుండేదానినా? నేను నాదైన జీవన విధానంతో ఆనందంగా వున్నాను అని కాదు కానీ ఒకరికి ప్రియమైన భార్యగా వున్నప్పుడు, ఆ ప్రియమైన మనిషి ఒక అసమర్ధుడు, మోసగాడు అయినప్పుడు ఎలా ఉండేదానిని?

అతడలా నిలబడి నేను ఫోన్‌లో చెప్పిన మాటలు గుర్తు చేసుకుంటున్నాడా? ఆ రోజు నేను ఫోన్‌లో మీ ఇంటికి వస్తాను అని చెప్పాను. అదొక ప్రేమ, నిబద్ధత. కానీ జీవితం ఎన్ని విచిత్ర దారులలో పయనించింది? తనకు తోచిన దారులలో పయనిస్తూ అందంగా రెక్కలు విప్పుకుని ఆనందంగా జీవించే శీతాకోక చిలుక రెక్కలను విరిచేయడానికి కూడా అది వెనుకాడదు కదా. చుట్టూ ఒక నొప్పి పరిపక్వమైన సూర్యకాంతిలా ఆ దిగంతాల పర్వతాల వరకు వ్యాపిస్తున్నది. మేమిద్దరమూ ఒకరి కెదురుగా ఒకరు అద్దంలా నిలబడినప్పటికీ ఒకరి మొహాన్ని మరొకరం చూసుకోలేకపోయాం.

తిరిగి వస్తున్నప్పుడు నా అస్సామీ స్నేహితుడు నా చేతిని తన చేతిలోకి తీసుకుని మంచులా చల్లబడ్డ నా చేతిలోకి కొంత వెచ్చదనాన్ని సరఫరా చేస్తూ "బాధపడకండి. హృదయం లోకి తీసుకోకండి... దేవుడికి ధన్యవాదాలు చెప్పుకోవాలి. అతడి భార్యకి వినపడదు. మాట్లాడలేదు. His wife is both deaf and mute. There is a saying that Nagas can lie at the drop of a hat అన్నాడు.

ఆకుపచ్చని అరణ్యంలో నుండి రహదారిమీదకు కమ్ముకుంటున్న నీడలు దగ్ధమైన ఒక మనిషి హృదయం నుండి వెలువడే పొగ లాగా సెగలు కక్కుతున్నాయ్. హృదయం అనే కుంకుమ భరిణ లో భద్రంగా దాచుకున్న జీవితానందము అనే వెన్నెల నీడను కొన్ని క్షణాల క్రితం దోచుకుని పోయారు.

*అనువాదకుని సెల్: 95734 27422*

# సముద్రం ఎప్పటికీ ఇంకిపోదు

మీరుఎక్కడైనా
సముద్రం ఆవిరవ్వటం చూసారా
మీరెప్పుడైనా
సముద్రం తనలోకి తాను ఇంకిపోవడం చూసారా
నేను ఇవాళ
ఒక సముద్రం ఇంకిపోవడం కళ్లారా చూసాను.
ఆ సముద్రం వొడ్డునే నేను
కవితాబీజాక్షరాలు దిద్దుకుంది.
ఆ సముద్రం నన్ను చిటికెన వేలు పట్టుకుని నడిపిస్తేనే
నేను నడక నేర్చుకుంది
నాలుగడుగులు వేసి
ఇంతదూరం నడిచొచ్చింది.
సముద్రం నాకు మాటలు నేర్పింది
సముద్రం నాకు పాటలు నేర్పింది
సముద్రం నాకు ఇంకా తెగ నరకమని
పదునైన కవిత్వపు కరవాలం అందించింది
దూరం నుండి చూస్తే సముద్రం
ముదురు నీలం రంగుతో గంభీరంగా భయపెడుతుందిగానీ
దగ్గరకెళ్లి దోసిట్లోకి ఇన్ని నీళ్లు తీసుకుని చూస్తే
ఎంత తరళ స్వచ్ఛజలమో తెలుస్తుంది.
సముద్రం తన
అందనంత లోతుల్నీ
సముద్రం తన
అనంతమైన వైశాల్యాల్నీ
తనకు తెలియకుండానే
మాకు పంచిపెట్టింది.
సముద్రం అంటే రత్నగర్భ కదా
మాలాంటి ఎందరికో
జ్ఞానరత్నాల్ని పంచిపెట్టింది.
ఇవ్వడం మాత్రమే తెలిసిన సముద్రం
ఎవ్వరినుండీ ఎప్పుడూ ఏమీ ఆశించలేదు.
చిరకాలం కరచాలనం చేసిన సముద్రం
ఇవాళ హఠాత్తుగా ఇంకిపోయింది
గుండెలోపలికి తొంగిచూసుకుంటే
ఒకటే నీలినీలి కెరటాల అలజడి
గుండెమీద చెవి ఆన్చి వింటుంటే
లోపలినుండి
ఒకటే సముద్రపు హోరు.
సముద్రం
ఎప్పటికీ ఇంకిపోదు–



*(మాస్టారు అత్తలూరి నరసింహారావుగారి స్మృతిలో...)*

***– శిఖామణి, 9848202526***

సమీక్షలు – కె.పి. అశోక్‌కుమార్

# అభ్యుదయ సాహిత్య చరిత్ర

అభ్యుదయ రచయితల సంఘం – ఆ రచయితల కృషిని, అభ్యుదయ రచనల విశిష్టతలపై సరికొత్త వెలుగులు జిమ్ముతూ పెనుగొండ లక్ష్మీనారాయణ వెలువరించినదే ఈ 'దీపిక'

ప్రజాశ్రేయస్సు, సామాజిక సంక్షేమం ప్రధాన లక్ష్యాలుగా పురోగమిస్తున్న ప్రగతి పథగామి 'అభ్యుదయ కవిత' అని నిర్ధారిస్తున్న విమర్శకుడు, అరసం సభ్యులు రాసిందే అభ్యుదయ కవిత్వమని అనుకోవలసిన అవసరం లేదు. వారితో పాటు ఇతర కవులు రాసిన అభ్యుదయ కవిత్వాన్ని పరామర్శించడం ఒక వ్యాసంలో కనిపిస్తుంది. సాహిత్య రంగంలో కూడా ఒక రకంగా అస్పృశ్యతకు గురైన దళిత వర్గాలకు, కష్టజీవులకు ప్రతినిధిగా నిలిచింది 'అభ్యుదయ రచయితల సంఘం' అని పేర్కొంటూ– అభ్యుదయ దృక్పథంతో వచ్చిన కవిత్వం, కథ, నవల, నాటకం, విమర్శల గురించి వివరిస్తూ, ఈ సాహిత్యాన్ని అరసం స్వాగతిస్తుంది. వర్ణ, వర్గ దృక్పథాల సమన్వయంతో ముందుకు సాగుతున్నదని తెలియజేశారు.

మన సమాజం గురజాడ పుట్టిన కాలం నాడు వుంటే, గురజాడ మాత్రం కాలం కంటే ముందుండి నేడు ఆధునికులకు, అభ్యుదయవాదులకు మార్గదర్శకత్వం చేస్తున్నారంటూ ప్రముఖ సాహితీవేత్తలు గురజాడ సాహిత్యంపై చేసిన విశ్లేషణలను తెలియజేశారు. "వక్రీకరణ – వాస్తవాలు" లో సినారె ప్రతిపాదించిన "ఇద్దరు యుగ కర్తలు" ఆయన వ్యక్తిగత అవసరాలు ప్రయోజనాలకు అనువుగా వచ్చిందనే విషయాన్ని అందరూ గుర్తించారు. ఇక రంగు కళ్ళద్దాల వెనుక దాక్కొని దాడి చేసేవారి సంచలనాలను పట్టించుకో వాల్సిన అవసరం లేదు. జాషువాపై అభ్యుదయ సాహిత్యోద్యమ ప్రభావముందంటూ, దళితులలో ప్రతిఘటన చైతన్యాన్ని రగిల్చిన తొలి రచయిత. పద్యాన్ని ప్రజాస్వామికం చేసిన కవి. హేతువాద భావాలను ప్రసారం చేసిన సామాజిక ఉద్యమ సాహితీవేత్తగా జాషువాను కొనియాడారు. అలాగే అడవి బాపిరాజు రచనల్లో కనిపించే సంఘ సంస్కరణలను ఆధారం చేసుకుని, వారిని అభ్యుదయ రచయితగా నిరూపించే ప్రయత్నం మరో వ్యాసంలో కనిపిస్తుంది.

అభ్యుదయ సాహిత్యోద్యమ నిర్మాణంలో భాగస్వామియైన సోమసుందర్ జీవితం – సాహిత్యం కూడా అభ్యుదయ పంథాలోనే కొనసాగాయని గుర్తు చేసుకున్నారు. మార్క్సిజం–లెనినిజం తనలో సాహిత్యస్ఫూర్తిని, దార్శనికతను, చైతన్యాన్ని కలిగించిందని స్పష్టం చేసిన శశిశ్రీ ఉన్నత వ్యక్తిత్వాన్ని – సాహిత్య కృషిని మరో వ్యాసంలో తెలియజేశారు. అభ్యుదయ సాహితీవేత్త ముత్యాల ప్రసాద్ సంపాదకుడిగా, రచయితగా చేసిన కృషిని ఇంకో వ్యాసంలో తెలియజేశారు. ఈ ముగ్గురు సాహితీవేత్తల మరణానంతరం వారి సాహిత్య కృషిని, నిబద్ధతను జ్ఞాపకం చేసుకుంటూ విమర్శకుడు వారితో గల అనుబంధాన్ని, ఆత్మీయతను తలచుకుంటూ అర్థంగా రాసిన శ్రద్ధాంజలి వ్యాసాలివి.

అరసం సభ్యునిగా తెలుగు సాహిత్యానికి, చిత్రకళకు, ప్రజా సాంస్కృతికోద్యమానికి విలువైన సేవలందించిన మా గోఖలే కృషిని ఒక వ్యాసంలో తెలియజేశారు. గురజాడ రచనలను వెలుగులోకి తెచ్చిన చరిత్రకారుడిగానే సెట్టి ఈశ్వరరావును అందరూ తలచుకుంటారు. కాని వారు అభ్యుదయ సాహిత్యోద్యమ చరిత్రలో, విశాలాంధ్ర పత్రిక చరిత్రలో, ప్రజా సాంస్కృతికోద్యమ చరిత్రలో చేసిన కృషిని మరో వ్యాసంలో జ్ఞాపకం చేశారు. నడిచే విజ్ఞాన సర్వస్వంగా కొనియాడబడే రాంభట్ల కృష్ణమూర్తిని, వారికి అరసంతో గల అనుబంధాన్ని, అరసం పునర్నిర్మాణానికి చేసిన కృషిని ఇంకో వ్యాసంలో వివరించారు. అభ్యుదయ సాహిత్యోద్యమ వికాసానికి, ప్రజా సాంస్కృతికోద్యమ విస్తృతికి దోహదపడే కొన్ని రచనలు చేసిన బహుళ ప్రక్రియల సాహితీ విన్యాసి రెంటాల గురించి కూడా ఒక వ్యాసంలో తెలియజేశారు. ఈ నాలుగు వ్యాసాలు ఆయా వ్యక్తుల శతజయంతుల సందర్భంగా, వాళ్ళ గొప్పదనాన్ని జ్ఞాపకం చేసుకుంటూ రాసినవే. వీటితో పాటు సామాజిక, సాహిత్య ఉద్యమ జీవి ఎస్వీ సత్యనారాయణ, సాహసోపేత రచయిత పి.వి.సునీల్‌కుమార్‌ల పరిచయ వ్యాసాలు కూడా వున్నాయి.

గోలకొండ కవులు సంచిక మొదలుకొని ఇప్పటి వరకు వచ్చిన ప్రముఖ కవితా సంకలనాలను రేఖామాత్రంగా పరిచయం చేశారు. "నయాగారా" వెలువడి 75 ఏళ్ళు నిండిన సందర్భంలో, ముందుగా నవ్యకళా పరిషత్తు ఆవిర్భావ వికాసాలను తెలియజేశారు. తర్వాత నయాగరా కవిత్వం గొప్పదనాన్ని వివరిస్తూ ఇది తెలుగు సాహిత్యంపై, అభ్యుదయ సాహిత్యోద్యమంపై కలిగించిన ప్రభావాన్ని తెలియజేశారు. ముద్దుకృష్ణ సంకలనం చేసి "వైతాళికులు" మీద వచ్చిన అనుకూల, ప్రతికూల విమర్శలను చర్చిస్తూ దీన్ని "భావకవుల ప్రేమ గోల"గా నిర్ధారించారు. ప్రపంచీకరణ నేపథ్యంలో వచ్చిన తెలుగు కవిత్వాన్ని వివరించడం బాగా వచ్చింది. కవిగా, విమర్శకునిగా బి.హనుమారెడ్డి సాహిత్య కృషిపై పరిచయ వ్యాసం కూడా ఇందులో వుంది.

కథలు రాయడం గురించి తెలుగులో అనేక మంది ప్రసిద్ధ రచయితలు, విమర్శకులు వెలువరించిన పుస్తకాలను పరిచయం చేయడం, కొత్తగా కథలు రాసేవారికి ఎంతగానో తోడ్పడతాయి. ప్రాంతీయాభిమానంతో, అస్తిత్వ దృక్పథంతో వెలువడిన కథా సంకలనాల పరామర్శ ఎంతో సమాచారాన్ని అందజేస్తుంది. తెలంగాణ సాయుధ పోరాటానికి సంఘీభావంగా ఆంధ్ర ప్రాంతానికి చెందిన అభ్యుదయ రచయితలు పోరాట కాలంలోనూ, పోరాట విరమణా నంతరం చరిత్రను నిక్షిప్తం చేస్తూ గేయం, కవిత, కథ, నవల, నాటకం రూపంలో వచ్చిన రచనలను పరిచయం చేసిన వ్యాసం పరిశోధనాత్మకమైనదే. గుంటూరు నుంచి 72 సంవత్సరాల క్రితం వెలువడిన తొలి కథా సంకలనం "కథాకళి" అనే అరుదైన పుస్తక పరిచయంతో పాటు పి.వి. రాసిన 'గొల్ల రామవ్వ' కథ చారిత్రక నేపథ్యాన్ని తెలియజేశారు. "తొలి మలితరం తెలుగు కథలు" సంకలనంలో ఎన్నో నిరాధార నిర్ధారణలు, మరికొన్ని అవగాహనా లోపాలు, అస్పష్టత ఉండటం వల్ల ఈ పుస్తకం పాఠకులను తప్పుదోవ పట్టించే ప్రమాదముందని హెచ్చరిస్తున్నారు. విమర్శపై విమర్శను ఆహ్వానించిన 'మరో చర్చ' పుస్తకం ద్వారా రాచపాళెం చంద్రశేఖర్ రెడ్డిని మార్క్సిస్టు విమర్శకుడిగా నిరూపించారు. కవిత్వం కంటే కథా సంపుటాలకు రాసిన 'ముందుమాటలు' బాగున్నాయి. చివరకు మనం సాధించాల్సిన సాంస్కృతిక విధానాన్ని తెలియజేయడంతో పాటు గ్రంథాలయాల పునర్వికాసానికి ఉద్యమిద్దాం అని పిలుపునిచ్చారు.

అభ్యుదయ రచనలు, అభ్యుదయ కృషిని కొత్త తరానికి పరిచయం చేసే ఈ వ్యాసాలు సమాచారాత్మకంగానూ, విజ్ఞానాత్మకంగానూ వున్నాయి.

**(దీపిక– అభ్యుదయ సాహిత్య వ్యాస సంపుటి, పెనుగొండ లక్ష్మీనారాయణ, ప్రతులకు : విశాలాంధ్ర, నవచేతన పుస్తక కేంద్రాలు, పేజీలు: 356, వెల : రూ.200/-, పేజీలు : 256)**

*రచయిత సెల్: 97000 00948*

# శంభూకుని సాక్షిగా...

శ్రీ భగవాన్ దాస్ గారు ప్రముఖ అంబేద్కరిస్టు.ఆయన రాసిన కథలలో నుండి తొమ్మిదింటిని ఎంపిక చేసుకుని కవి, అనువాదకుడు డా.జి.వి.రత్నాకర్ గారు అనువదించి వెలువరించిన కథల సంపుటి ఇది. ఇందులో-శూద్రులను విద్యకూ విజ్ఞానానికి దూరం చేయడానికి బ్రాహ్మణులు పన్నిన కుట్రలు, కుతంత్రాలను రాజులు ఎలా అమలు చేయాల్సివచ్చిందో శంభూకుని వధను ఉదాహరణగా తీసుకుని రాసిన "శూద్రుని శాపం" కథ చాలా బాగా వచ్చింది. కులాన్ని బట్టి "దొంగ"లుగా నిర్ణయించే పద్ధతి మనుస్మృతి కాలం నుండి ఇప్పటికీ కొనసాగుతునే వుందని ఒక కథలో తెలియజేశారు. ప్రేమికులు పెళ్ళి చేసుకోవాలనుకుంటే అంటరానితనం, కులం ఎలా అడ్డంకిగా నిలుస్తుందో 'సహచరి' వివరిస్తుంది. మతం మారినా క్రిష్టియన్ల పట్ల చూపే వివక్ష, చులకన భావాలకు "విముక్తి" అద్దం పడుతుంది. "కాఫీహౌస్ లో" జరిగిన చర్చలో, అంటరానివారి అభివృద్ధి-ఉన్నతి భారతదేశ కమ్యూనిజంలో దాగిలేదు.ఒకవేళ కమ్యూనిస్టులు తమనుతాము ఉన్నతీకరించుకోవాలనుకుంటే, వాళ్ళు అంటరాని వాళ్ళ దగ్గరికొచ్చి వారితో కలిసిపోవాల్సి వుంటుందని నిర్ధారిస్తారు.




ప్రభుత్వ ఆఫీసుల్లో కొనసాగే బ్యూరో క్రసీ, రెడ్ టేపిజంలకు మంచి ఉదాహరణ "ఆఫీసులో ఎలుక". "ఒకవేళ మనిషికే తోకవుంటే" మానవ జీవన విధానం ఎలా వుండేదో హాస్యభరితంగా తెలియజేశారు. ఈ రెండు కథలలో వ్యంగ్యాన్ని పోషించిన తీరు బాగుంది.

బ్రిటీష్ పరిపాలనలో మనల్ని నల్ల వాళ్ళని హీనంగా చూస్తే, ఈ నల్లవాళ్ళు అంటరానివారిని మరింత హీనంగా చూడటానికి అలవాటు పడిపోయారు. భంగీల (పాకిపనివారు) ఆచారాల్ని భరించ లేని రాజపుత్రులు "తగవు" పెట్టుకుని వారిపై దాడిచేసి, గుడిసెలు కాల్చివేసి, వారిని ఊళ్ళో ఉండకుండా తరిమేస్తారు. ఇంతకంటే అమానుషత్వం మరొకటి వుంది. భంగీ, చమార్ మొదలైన అంటరాని కులాల్లో అందమైన అమ్మాయిలు వుండటం కూడా నేరమే అవుతుంది. అందమైన భంగో అమ్మాయిలను లొంగదీసుకోవడానికి అందరూ ప్రయత్నించేవారే. అందులో విఫలమైన పోలీసు, ఆమె భర్తను దొంగగా ముద్రవేసి చిత్రహింసలు పెడుతుంటాడు. పెళ్ళాన్ని అప్పగిస్తేనే వదిలిపెడతానంటాడు. దిక్కులేని పరిస్థితుల్లో ఆ భంగీ దంపతులు రైలు కిందపడి ఆత్మహత్య చేసుకుంటారు. "సతీ సమాధి" అనే ఈ కథలో ఆ భంగీ అమ్మాయి పడిన వేదన, మానసిక క్షోభను వివరించలేము. దళితుల పట్ల కొనసాగే వివక్ష-అణచివేత, అమానుషత్వాలను వివరించే ఈ కథలు మనసును కదిలిస్తాయి. "పోగొట్టుకున్న హక్కులు పోరాడితే గాని తిరిగిరావు, పోరాడండి. హక్కులు నిలబెట్టుకోండి" అనే అంబేద్కర్ సందేశం ప్రతి కథలోనూ కనిపిస్తుంది. రత్నాకర్ అనువాదం బాగుంది. హాయిగా చదివింపజేస్తుంది.

(శూద్రుని శాపం (అంబేద్కరిస్టు కథలు) హిందీ మూలం: భగవాన్ దాస్. తెలుగు అనువాదం: డా.జి.వి.రత్నాకర్, ప్రచురణ: జై భీం పబ్లికేషన్స్, హైదరాబాద్. పేజీలు: 104, వెల: రూ. 120, ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు)

# కిన్నెరసాని పాటలు-ఒక పరిశోధన

నదీవైభవాన్ని వస్తువుగా తీసుకున్న ఆధునిక కృతులు చాలా కొద్దిగా మాత్రమే వున్నాయి. అందునా ఆధునిక సాహిత్యంలో విశ్వనాథ "కిన్నెరసాని పాటల"కు వచ్చిన గుర్తింపు మిగతా వాటికి రాలేదు.

కిన్నెరసాని పాటల్లోని పాత్రల్ని పోలిన మనుషులు, అందలి సంఘటనల్ని పోలిన సంఘటనలు మనం నిత్య జీవితంలో చూస్తూనే వుంటాం. కవి చుట్టూ వున్న సమాజంలోని సామాన్య కుటుంబాలలో నిత్యం జరిగే కథ ఇది. అయితే సహజంగా వున్న ప్రకృతి దృశ్యాల్ని కథకు అన్వయించుకున్న తీరు కవి భావనా శక్తికి, సునిశిత పరిశీలనకు నిదర్శనం. "కిన్నెరసాని పాటలు" నదీమతల్లిని నారీమణితో పోల్చడం కవిసమయం. వాగునే మగువగా రూపించడం ఇందులోని చమత్కారం. నదీవైభవాన్ని అవిచ్ఛిన్న ధారామధురంగా ఆవిష్కరించడం, కళావైభవాన్ని తెలుగు పలుకుల జిలుగు శిల్పంతో వ్యంజింపజేయడం కిన్నెరసాని రచనలోని శిల్పం.

పరిశోధకురాలు సి.హెచ్.సుశీలమ్మగారు కిన్నెరసాని పాటలను పూర్తిగా విశ్లేషించి, అందులోని పాత్ర చిత్రణ, రసనిర్వహణ, ఛందస్సు, ఇతివృత్తం, నాటకీయత లాంటి అంశాల్ని విడమరిచి వివరించారు. చివరగా నేటి కాలంలో దానికున్న ప్రాధాన్యతను కూడా తెలియజేయడం విశేషం.

**(కిన్నెరసాని పాటలు-సమీక్ష (యం.ఫిల్ సిద్ధాంత గ్రంథం), రచన: సి.హెచ్.సుశీలమ్మ, పేజీలు: 108, వెల: రూ. 100, ప్రతులకు: ప్రముఖ పుస్తక కేంద్రాలు, రచయిత్రి సెల్: 8333868879)**

---

## సినిమా పదబంధం-15 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 నా | ర | ప్ప | * | 2 లై | * | 3 రా | మ | 4 కృ | ష్ణ |
| గ | * | * | 5 బా | ల | 6 రా | జు | * | ష్ణ | * |
| 7 భూ | కై | 8 లా | స్ | * | జే | * | 9 ర | కు | ల్ |
| ష | * | వ | * | 10 ఈ | శ్వ | రి | * | మా | * |
| ణం | * | ణ్య | * | * | ర | * | 11 స | రి | 12 త |
| * | 13 క | * | 14 క | ధి | రా | * | ప్త | * | ని |
| * | న్నాం | * | ళ్యా | * | వు | * | గి | * | కె |
| 15 న్ని | బ | * | 16 ణి | 17 వా | * | 18 పూ | రి | * | ళ్ళ |
| * | * | 19 య | * | ణి | * | ర్ణి | * | 20 మీ | * |
| 21 యం | నే | జ | ఆం | శ్రీ | * | 22 మ | హా | న | టి |

# పాలపిట్ట పుస్తకాలు

## కథలు

1. వీణా వేదనం -గన్నవరపు నరసింహమూర్తి రూ. 80/-
2. ఉడుతాభక్తి -గన్నవరపు నరసింహమూర్తి రూ. 60/-
3. కల చాలనమ్ - బుర్రా లక్ష్మీనారాయణ రూ. 100/-
4. నాలుగు పుంజీలు - బుర్రా లక్ష్మీనారాయణ రూ. 100/-
5. దేహనది -బుర్రా లక్ష్మీనారాయణ రూ. 100/-
6. మట్టి అరుగు -బుర్రా లక్ష్మీనారాయణ రూ. 100/-
7. ఫాలచుక్కలు -బుర్రా లక్ష్మీనారాయణ రూ. 100/-
8. పసిడి మనసులు -సి.ఎస్.రాంబాబు రూ. 100/-
9. పూలచాదర్ - అఫ్జద్ రూ. 100/-
10. గోరింటాకు - అఫ్జద్ అనువాద కథలు రూ. 80/-
11. పాలపిట్ట వినూత్న కథ రూ. 150/-
12. పరాయోళ్ళు -జి. ఉమామహేశ్వర్ రూ. 70/-
13. భరోసా -జి. ఉమామహేశ్వర్ రూ. 120/-
14. కథాదౌత్యం -ఎల్.ఆర్.స్వామి రూ. 100/-
15. కథాకాశం -ఎల్.ఆర్.స్వామి రూ. 60/-
16. అలగా... అలగా... - ఎల్.ఆర్.స్వామి......... రూ. 100/-
17. పేగుకాలిన వాసన - ఏ. ఎన్. జగన్నాథశర్మ రూ. 125/-
18. పనామా బీచ్‌లో -తరానా రూ. 100/-
19. కథాపార్వతీపురం రూ. 250/-
20. ఒక వర్షం కురిసిన రోజు - డా. కాంచనపల్లి రూ. 100/-
21. సుదర్శన్ సెటైర్స్ తెలంగాణ.కామ్ -చింతపట్ల రూ. 100/-
22. నిత్యకల్లోలం -ముదిగంటి సుజాతారెడ్డి రూ. 150/-
23. కొత్తగూడెం పోరగాడికో లవ్‌లెటర్ -సామాన్య రూ. 100/-
24. అమ్మ కోరిక - తడకమళ్ళ మురళీధర్ రూ. 100/-
25. కురిసి అలసిన ఆకాశం - పద్మావతి రాంభక్త రూ. 150/-
26. కిరణం - పి.వి.శివకుమార్ రూ. 200/-
27. అతిథికి దేవుడు - పి.వి.శివకుమార్ రూ. 150/-
28. లచ్చుంబాయి - డా. రూప్‌కుమార్ డబ్బీకార్ రూ. 100/-

## నవలలు

1. అనాచ్ఛాదిత కథ - ఝాన్సీ కొప్పిశెట్టి రూ. 150/-
2. విరోధాభాస - ఝాన్సీ కొప్పిశెట్టి రూ. 150/-
3. గొంతు విప్పిన గువ్వ - ఝాన్సీ కొప్పిశెట్టి రూ. 150/-
4. రజనీకాంత్ - డాక్టర్ కావాడి ఎల్లయ్య రూ. 100/-
5. శ్రీబాలాజీ టాకీస్ - కరణ్ గోపిని రూ. 250/-
6. మిస్టర్ బాలు - అఫ్జద్ రూ. 100/-
7. నాలుగు అస్తిత్వాలు 4 నవలికలు-శాంతినారాయణ రూ. 150
8. డాక్టర్ సుందరరావు -డా. ఎం.వి.రమణరావు రూ. 100/-
9. అభయం - సింహప్రసాద్ .........................రూ. 120/-
9. ధిక్కారం - సింహప్రసాద్ .........................రూ. 120/-
11. పుష్పావతి లోయలో - తరానా రూ. 150/-
12. అడవి - వసంతరావు దేశ్‌పాండే ... రూ. 150/-
13. అనూహ్య- వసంతరావు దేశ్‌పాండే రూ. 80/-
14. భూమి గుండ్రంగానే ఉండాలి- వసంతరావు.... రూ. 80/-
15. తాటక - బెజ్జారపు రవీందర్ రూ. 80/-
16. కౌసల్య సుప్రజారామ-తాటికొండల నరసింహారావురూ. 80/-

## బాలసాహిత్యం

1. మహాభారతం - ఎ.ఎన్.జగన్నాథశర్మ రూ. 100/-
2. ఎత్తు పెరిగిన తాత -విద్వాన్ చొప్ప వీరభద్రప్ప రూ. 100/-

## జీవిత చరిత్ర

1. ఒబామా - గుడిపాటి రూ. 50/-
2. మానవోత్తముడు షిరిడి సాయిబాబా రూ. 100

## చరిత్ర

1. మన చరిత్ర - సంస్కృతి - బండారి శైలజ రూ. 100/-
2. హైద్రాబాద్ విషాదం - ఏనుగు నరసింహారెడ్డి రూ. 150/-

## సాహిత్య విమర్శ

1. సమాహార -ఏనుగు నరసింహారెడ్డి రూ. 100/-
2. అంతరంగం -ఏనుగు నరసింహారెడ్డి రూ. 150/-
3. కథావలోకనం -కె.పి.అశోక్‌కుమార్ రూ. 50/-
4. కథావిష్కారం - కె.పి. అశోక్‌కుమార్ రూ. 120/-
5. తెలుగు నవల-ప్రయోగవైవిధ్యం కె.పి.అశోక్‌కుమార్‌రూ. 200
6. స్త్రీవాదం-పురుష రచయితలు -డాక్టర్ సుశీలమ్మ రూ. 150/-
7. పుట్టబంగారం - గుడిపాటి రూ. 120/-
8. కథాదీప్తి - గుడిపాటి రూ. 100/-
9. హైకూ సారస్వతం - రూప్‌కుమార్ డబ్బీకార్ రూ. 70/-
10. చంద్రుణ్ణి చూపించే వేలు - ఆకెళ్ళ రవిప్రకాష్ రూ. 100/-
11. సృజనరంజనివిమర్శావ్యాసాలు-కొండపల్లినీహారిణి రూ. 200
12. శివారెడ్డి పీఠికలు రూ. 400/-
13. శివారెడ్డి కవిత్వం విమర్శలు విశ్లేషణలు రూ. 150/-

## సినిమా పుస్తకాలు

1. ఒకశబ్దం కొన్నిఅర్థతాత్పర్యాలు-వంశీకృష్ణ వ్యాసాలు రూ. 150
2. దాశరథి చలనచిత్రగీతాల విశ్లేషణ-జగన్నాథస్వామి రూ. 250

**ఆడియో బుక్**

1. ఐలాండ్‌విల్లా(కథలు)
–డా॥ ధేనువకొండ శ్రీరామమూర్తి .రూ.50/-

**ఆంగ్లం**

1. EDUCATION my perception
- Jayanth Munigala, I.A.S. (Retd.) రూ.120/-

**కవిత్వం**

1. మట్టి పాట – ఏనుగు నరసింహారెడ్డి రూ. 50/-
2. కొత్త పలక –ఏనుగు నరసింహారెడ్డి రూ.50/-
3. మూలమలుపు – ఏనుగు నరసింహారెడ్డి రూ.100/-
4. నీడల దృశ్యం – ఏనుగు నరసింహారెడ్డి రూ.80/-
5. తెలంగాణ రుబాయీలు – ఏనుగు నరసింహారెడ్డి రూ.300
6. మమతా బెనర్జీ కవిత్వం – సామాన్య రూ.100/-
7. ఆమె ఎవరైతే మాత్రం –కె. శివారెడ్డి .............రూ.50/-
8. సూర్యశిల –నాగరాజు రామస్వామి రూ.100/-
9. స్వేచ్ఛాగానం – కరిపె రాజ్‌కుమార్ రూ.150/-
10. పాలపిట్ట వినూత్న కవిత రూ.100/-
11. కావ్యనందనం–తిరుమల దేశికాచార్యులు రూ.200/-
12. కావ్యనందనం (రెండో భాగం)
–దేశికాచార్యులు రూ.250/-
13. పొద్దున్నే వచ్చిన వాన –గోపిని కరుణాకర్ రూ.50/-
14. ప్రేమ ప్రతిపాదన –ఆకెళ్ళ రవిప్రకాష్ రూ.200/-
15. భూమి పుట్టిన రోజు –ఆకెళ్ళ రవిప్రకాష్ రూ.50/-
16. కవిగానే కనుమూస్తా –కె. జనార్దన మహర్షి రూ.90/-
17. శ్రమపొదుగు – యరకల యాదయ్య రూ.100/-
18. కందిలి – లేదాళ్ళ రాజేశ్వరరావు రూ.100/-
19. మట్టినై పుట్టాలనుంది – డా. బి.బాలకృష్ణ రూ.80/-
20. పద్యభారతి – పారనంది శోభాదేవి రూ.99/-
21. ఒకదేశం రెండు పదప్రయోగాలు –వంశీకృష్ణ రూ.60/-
22. ఊపిరిపాట – సంపాదకులు: గోపగానిరవీందర్‌రూ.60/-
23. మనుషులమై బ్రతకాలి – డాక్టర్ కె. దివాకరాచారి రూ.100
24. మందువా లోగిలి–గంగిశెట్టి లక్ష్మీనారాయణ రూ.60/-
25. ఎనిమిదో అడుగు – కొండపల్లి నీహారిణి రూ.80/-
26. అడవి దీపాలు – తోకల రాజేశం రూ.80/-
27. దేవుడు తప్పిపోయాడు –కె. విల్సన్‌రావు రూ.120/-
28. నల్ల చామంతి – చిత్తలూరి సత్యనారాయణ రూ.120/-
29. నాన్న కావాలి – ఎస్.సుమిత్రాదేవి రూ.50/-
30. ముసురు – తాటికొండాల నరసింహారావు రూ.60/-
31. విరమించని వాక్యం – దాసరాజు రామారావు రూ.60/-
32. అమిత్వం –బి.ఎస్.ఎం.కుమార్ రూ.70/-
33. వరికల్లం – నాగవర్మ ముత్యం రూ.50/-
34. కొర్రాయి – డాక్టర్ దామెర రాములు రూ.100/-
35. భిన్నకాలం – డాక్టర్ దామెర రాములు...........రూ.100/-
36. గమ్యంతెలిసిన తొవ్వ – డాక్టర్ దామెర రాములు.రూ.100-
37. దుఃఖానంతర దృశ్యం–ఒద్దిరాజు ప్రవీణ్‌కుమార్ రూ.60/-
38. ఇదీ వరస – బుర్రా లక్ష్మీనారాయణ రూ.50/-
39. సెంద్రి తలపులు – బుర్రా లక్ష్మీనారాయణ........ రూ. 60/-
40. ఐనా ప్రయాణం – రూప్‌కుమార్ డబ్బీకార్ రూ.60/-
41. అతను వ్యాపిస్తాడు – నవీన్ రూ.70/-
42. శిరిడిసాయి గీతాసచ్చరిత్ర–కోమటి రమణయ్య రూ.60/-
43. రమణయ్య చాటువులు –కోమటి రమణయ్య. రూ.25/-
44. తొలకరి చినుకులు – అష్రఫ్ రూ.50/-
45. జీవితం–కవిత్వం – మాడభూషి సంపత్‌కుమార్ రూ.60/-
46. శత్రువుతో ప్రయాణం–మాడభూషిసంపత్‌కుమార్ రూ.60/-
47. ఆలోచనలు –మాడభూషి సంపత్‌కుమార్ రూ.60/-
48. చివరకు గెలిచేది నువ్వే–మాడభూషిసంపత్‌కుమార్ రూ.60
49. వికారి –మాడభూషి సంపత్‌కుమార్ రూ.50/-
50. మూడో మనిషి –మాడభూషి సంపత్‌కుమార్ రూ.60/-
51. వాన కురిసిన రాత్రి – బండి సత్యనారాయణ రూ.60/-
52. యుద్ధకాండ – బండి సత్యనారాయణ రూ.70/-
53. విస్ఫోటనం – గొట్టిపర్తి యాదగిరిరావు రూ.60/-
54. నిశ్శబ్దయుద్ధం – గొట్టిపర్తి యాదగిరిరావు రూ.90/-
55. మాగిపొద్దు –ఉదారి నారాయణ............... రూ.60/-
56. దూరమెంతైన –గోపగాని రవీందర్............రూ. 80/-
57. జీవితం గీసిన చిత్రాలు – సతీష్ గొల్లపూడి......రూ. 100/-
55. హరిత స్వప్నం – కోట్ల వెంకటేశ్వరరెడ్డి...........రూ.100/-
58. అంతర్వాహిని – కోట్ల వెంకటేశ్వరరెడ్డి...............రూ.50/-
59. మనుమసిద్ధి – కోట్ల వెంకటేశ్వరరెడ్డి.................రూ.30/-
60. బాలబోధ – బొంతా లచ్చారెడ్డి..................... రూ. 30/-
61. కావ్య కుసుమాలు – బొంతా లచ్చారెడ్డి........... రూ. 50/-
62. నది కాలం అతడు – రవూఫ్ ......................రూ.100/-
63. కొత్త వేకువ – పద్మావతి రాంభక్త.................రూ.100/-
64. కలల గూడు – డా. బి. బాలకృష్ణ..................రూ.100/-
65. మునిమడుగుల రాజారావు సమగ్ర కవిత్వం......రూ.150/-

*ఈ పుస్తకాలు కావలసిన వారు సంప్రదించవలసిన చిరునామా :*

**పాలపిట్ట బుక్స్**

**ఫ్లాట్ నెం: 3, ఎం.ఐ.జి–2, బ్లాక్–6, ఏ.పి.హెచ్.బి, బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్–500 044, సెల్: 9848787284**
Ph: 040-27678430 • palapittabooks@gmail.com

## అందుకున్నాం



**న- నవల**
**అట్టాడ అప్పల్నాయుడు**
పేజీలు: 468,
వెల: రూ. 300
ప్రతులకు: నవోదయ బుక్‌హౌస్, హైదరాబాద్
రచయిత సెల్: 9440031961



**భావతరంగాలు(కవిత్వం)**
**రచన: సురేంద్ర రొద్ద**
పేజీలు:160, వెల: రూ.160
ప్రతులకు: విశాలాంధ్ర పుస్తక కేంద్రాలు



**భారతీయ సాహిత్య నిర్మాతలు**
**సి.నారాయణరెడ్డి**
**రచన: ఎస్వీ రామారావు**
పేజీలు;152. వెల: రూ.50
ప్రతులకు: నవోదయ బుక్‌హౌస్ హైదరాబాద్



**ఇచట...దుమ్ము దులపబడును.(సాహిత్య విమర్శ)**
**రచన: డా.దేరంగుల శ్రీనివాసులు)**
పేజీలు: 152 వెల: రూ.100
ప్రతులకు: నవోదయ, నవతెలంగాణ పుస్తక కేంద్రాలు



**మాయామహల్ (బాలల జానపద నవల)**
**రచన; విద్వాన్ చొప్ప వీరభద్రప్ప**
పేజీలు:76,
వెల:రూ.70
ప్రతులకు: పాలపిట్టబుక్స్



**పకోడి పొట్లం (కార్డు కథలు)**
**ఆర్.సి.కృష్ణస్వామి రాజు**
పేజీలు:111, వెల: రూ.100
ప్రతులకు: మల్లెతీగ ప్రచురణలు
సెల్: 9393662821



**అదృశ్యమైన నిప్పు పిట్ట కోసం – వి.చంద్రశేఖరరావు సాహిత్యావలోకనం**
పేజీలు: 200
వెల: రూ. 100
ప్రతులకు: ప్రముఖ పుస్తక కేంద్రాలు



**సంపూర్ణ ఘటోద్గజ పురం గాథలు – హాస్య, వ్యంగ్య కథానికలు – టి.ఎస్.ఎ. కృష్ణమూర్తి**
పేజీలు: 152, వెల: రూ. 200
ప్రతులకు: ప్రముఖ పుస్తక కేంద్రాలు
రచయిత సెల్: 9347298942



**సీతాకోక రెక్కలు హైకూలు**
**రచన:దామరకుంట శంకరయ్య**
పేజీలు: 56, వెల: రూ.30
ప్రతులకు: నవోదయ, నవతెలంగాణ పుస్తక కేంద్రాలు

## పాలపిట్ట కొత్త పుస్తకాలు



**గొంతు విప్పిన గువ్వ (నవల)**
**రచన: ఝాన్సీ కొప్పిశెట్టి**
పేజీలు: 204, వెల: రూ. 150



**స్వేచ్ఛాగానం (కవిత్వం)**
**రచన: కరిపె రాజ్‌కుమార్**
పేజీలు: 192, వెల: రూ. 150



**లచ్చుంబాయి (కథలు)**
**రచన: డా. రూప్‌కుమార్ డబ్బీకార్**
పేజీలు: 112, వెల: రూ. 100

Printed, Published and Owned by Gudipati Venkateswarlu and Printed at Karshak Art Printers, Vidyanagar Hyderabad - 500 044 and Published at H.No.16-11-20/6/1/1, 403, Vijaya Sai Residency, Saleem Nagar, Malakpet, Hyderabad - 500 036, Telangana **Editor: Gudipati Venkateswarlu**




పాలపిట్ట-డా.అమృతలత సంయుక్త నిర్వహణలో

# దీపావళి కథల పోటీ



తెలుగువారు నిర్వహించుకునే అతి పెద్ద పండుగ దీపావళి. ఈ సందర్భంగా దీనిని ఒక సాహిత్య ఉత్సవంగా మలచాలన్న సంకల్పంతో పాలపిట్ట-డాక్టర్ అమృతలత సంయుక్త ఆధ్వర్యంలో దీపావళి కథలపోటీని జరపాలని పాలపిట్ట సంపాదకవర్గం నిర్ణయించింది. మంచి కథలని ప్రోత్సహించే లక్ష్యంతో తలపెట్టిన ఈ పోటీలో పాల్గొనవలసిందిగా కథకులని ఆహ్వానిస్తున్నాం.

**మొదటి బహుమతి: రూ. 10000**

**రెండో బహుమతి: రూ. 6000**

**మూడో బహుమతి: రూ. 4000**

**పది ప్రత్యేక బహుమతులు**

**ఒక్కొక్క కథకి రూ. 1000**

## కథలు పంపాల్సిన చిరునామా:

ఎడిటర్, పాలపిట్ట

ఎఫ్-2, బ్లాక్ -6, ఏపిహెచ్‌బి

బాగ్‌లింగంపల్లి, హైదరాబాద్-500044

ఫోను: 94900 99327

email: palapittamag@gmail.com

మీ కథలు చేరడానికి చివరితేదీ - 15 అక్టోబర్ 2021

మీ కథలని పోస్టు చేయవచ్చు లేదా మెయిల్‌లోనూ పంపవచ్చు.

## నిబంధనలు

- ఇతివృత్తం ఆయా రచయితల, రచయిత్రుల ఇష్టం. జీవితం విశాలమైంది. మానవ జీవితం అనేక అనుభవాల సమాహారం. కనుక ఎలాంటి ఇతివృత్తం ఎంచుకోవాలో కథకుల నిర్ణయానికి వదిలేస్తున్నాం. తీసుకున్న వస్తువును కథగా మలచడంలో చూపిన ప్రతిభకే ప్రాధాన్యం.
- ఏం చెప్పారన్నదే కాక ఎలా చెప్పారన్నదే ఈ పోటీలో ప్రముఖంగా పరిగణనలోకి తీసుకునే అంశం. ఇతివృత్తాన్ని ఎంత అందంగా, పఠిత మనసుని ఆకట్టుకునేలా సృజించారన్నదే ముఖ్యం.
- పోటీకి పంపించే కథలకు ఎలాంటి పేజీల పరిమితి లేదు. కథ రాయాలనుకునే వారికి ఇన్నిపేజీలలోనే రాయాలని నిబంధన విధించడం సరి కాదని పాలపిట్ట భావిస్తున్నది. తాము చెప్పదలచుకున్న కథని ఒక పేజీలో చెబుతారా ఇరవై, ముప్పయి లేదా అంతకన్నామించిన పేజీలలో చెబుతారా అనేది కథకుల సృజనాత్మక స్వేచ్ఛకు సంబంధించిన అంశం. అందుకే కథా రచనకు సంబంధించి ఎలాంటి పరిధులు, పరిమితులు లేవు.
- పోటీకి పంపించే కథలు సొంత కథలయి ఉండాలి. అనువాదాలు కాదు. అలాగే ఇదివరలో ఎక్కడా ప్రచురితం, ప్రసారితం కాకూడదు. సోషల్ మీడియాలోగానీ, ఇతర వెబ్‌సైట్లలో గానీ ప్రచురితమై ఉండరాదు. ఈమేరకు కథతోపాటు హామీపత్రం పంపించాలి.
- కవర్ మీద దీపావళి కథల పోటీకి అని రాయాలి. పోటీ నిమిత్తం పంపించే కథలు తిప్పి పంపడం సాధ్యం కాదు.
- కథల ఎంపిక విషయంలో పాలపిట్ట సంపాదకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎలాంటి వాదవివాదాలకు, సంప్రదింపులకు తావు లేదు.
- ఈ పోటీలో ఎంపిక చేసే కథలని పాలపిట్టలో ప్రచురించడంతోపాటు భవిష్యత్తులో తీసుకురానున్న కథల సంకలనాలలోనూ ముద్రించడానికి అంగీకరించేవారు మాత్రమే ఈ పోటీలకు కథలని పంపించాలి.

RNI No. APTEL/2010/32190



# పాలపిట్ట కొత్త పుస్తకాలు




































If undelivered Please return to:
PALAPITTA, 16-11-20/6/1/1 403, Vijayasai Residency, Saleem-nagar, Malakpet, Hyderabad-500036, PH: 9848787284

TO,
Mr/Mrs.................................

Printed, Published and Owned by Gudipati Venkateswarlu and Printed at Karshak Art Printers, Vidyanagar Hyderabad - 500 044 and Published at H.No.16-11-20/6/1/1, 403, Vijaya Sai Residency, Saleem Nagar, Malakpet, Hyderabad - 500 036, Telangana. Editor: Gudipati Venkateswarlu